





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

## తెలుగులో లలిత గీతాలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100061893

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తెలుగులో లలితగీతాలు

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి
డాక్టరేట్ పట్టం పొందిన సిద్ధాంత గ్రంథం


## డా॥ వడ్డేపల్లి కృష్ణ



ప్రచురణ :



మీ హృదయం రాగమయం
నా హృదయం భావమయం!
జతగూడిన మన హృదయం
జగమంతా రసోదయం!

సంగీతం - సాహిత్యం
సరస్వతీ స్తనద్వయం!
కవులు - కళాకారులకు
కలగాలీ దిగ్విజయం!

కడుశ్రమతో పిహెచ్.డి
కవ్వంతో 'లలితగీత'
క్షీరాంబుధి చిలికి, సుధా
సారాంశముగా బడసిన

"తెలుగు లలితగీతాల"ను
తేజరిల్లు ఈ గ్రంథము
అంకితమొనరింతును పుల
కాంకితమవ మనస్స్నేహము!

డా॥ యస్.పి.బాలసుబ్రహ్మణ్యం
ప్లేబ్యాక్ సింగర్ & మ్యూజిక్ డైరెక్టర్

ఫోన్ . 8272757
కామ్‌దార్ నగర్
చెన్నై - 600 034

తేది 04-05-2000

# స్వీకృతి

మిత్రులు శ్రీ వడ్డెపల్లి కృష్ణ గారికి!

నమస్సుమాలు. గతంలో 'పైడిపాల' సినీగీతాల మీద చేసిన పరిశోధనకు పరవశించి, దానికి ముద్రణరూపం కలిగించాను. అదే గీతాభిమానంతో ప్రస్తుతం లలితగీతాల మీద మీరు చేసిన తొలి పరిశోధనకు ముగ్ధుడనై, నాకు చేతనైనంతగా దీని ముద్రణకు కూడా చేయూత నందించదలచాను. అందుకే మీరు కోరగానే కాదనక ఆర్థిక సహాయమందించాను.

సహృదయంతో మీరు మన చిరకాలమైత్రికి చిహ్నంగా యీ సిద్ధాంత గ్రంథం నాకే అంకితమన్నారు. మరేం బదులు చెప్పగలను, మనసు కలుపడం తప్ప.

అందుకే మీ కృతిని ఆనందంతో స్వీకరిస్తూ, మీకు ఉజ్జ్వల భవిష్యత్తు కలగాలని మనస్ఫూర్తిగా ఆశిస్తూ -

సదా మీ

బాలు

# అభివందనం

నా అభిరుచిని మన్నించి లలితగీతాలపై పరిశోధన చేయడానికి అనుమతించిన నాటి ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షురాలైన శ్రీమతి వి. సీతాకల్యాణిగారికి, తదనంతర ప్రోత్సాహ మందించిన తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికి, రఘుమన్న గారికి -

పరిశోధన పూర్తి చేయమంటూ ఎప్పటికప్పుడు కర్తవ్యాన్ని గుర్తుచేస్తూ వెన్ను తట్టడమే గాక 'గీత వివేచన' ద్వారా తమ అమూల్య అభిప్రాయాన్ని అందించిన కవిమిత్రులు ఆచార్య ఎన్.గోపిగారికి -

ఆచార్య స్థానంలో నాకు 'గైడ్'గా వున్నా సన్మిత్రులుగానే మసలి, మార్గోపదేశం చేసిన సౌజన్యమూర్తి, 'ఆముఖం' సమకూర్చిన విద్వ ద్విమర్శకులు ఆచార్య యస్.వి. రామారావు గారికి -

బీజస్థాయినుండి భూజస్థాయివరకు సర్వదా నాపై వాత్సల్యాన్ని వర్షించడమే గాక తమ అమూల్యాభిప్రాయంతో అక్షరాశీస్సుల్ని అందించిన గురువర్యులు, రాజ్యసభ సభ్యులు ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి-

అడిగినంతనే ఇంటర్వ్యూలకు అంగీకరించి అనేక విలువైన విషయాల్ని వివరించిన మాన్యులు శ్రీయుతులు సాలూరు రాజేశ్వరరావు, ఆర్. బాలసరస్వతీ దేవి, వింజమూరి సీత, బాలాంత్రపు రజనీకాంతరావు, పేకేటి, ఆరుద్ర, పాలగుమ్మి విశ్వనాథం, ఎం.చిత్తరంజన్ గార్లకు -

ఆకాశవాణి, దూరదర్శన్ అధికారులైన డా॥పి.యస్. గోపాలకృష్ణ, వి.యస్.నారాయణమూర్తి గార్లకు -

గ్రంథ సేకరణలో సహకరించిన సుందరయ్య విజ్ఞాన కేంద్ర గ్రంధాలయాధికారి రాజు గారికి -

శుద్ధప్రతిని సిద్ధంచేయడంలో తోడ్పడిన డా॥సి.బాలకృష్ణ గారికి -

ఈ గ్రంథాన్ని యిలా అచ్చులోకి తీసుకురావడానికి ప్రథమంగా పాక్షిక ఆర్థిక సహాయాన్ని ప్రకటించిన పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి -

ఆపై ఆత్మీయతతో ఆర్థిక ప్రోత్సాహాన్ని అందించిన పారిశ్రామిక వేత్త, గుప్తదాత శ్రీ దుర్గం నర్సింహులు గారికి -

హార్దికంగానేగాక ఆర్థికంగానూ సహకరించి ఈ సిద్ధాంత గ్రంథానికి అందమైన ఆకృతిని, 'స్వీకృతి'ని కలిగించిన మాన్యమిత్రులు, గాన గంధర్వులు శ్రీ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారికి

ముఖచిత్రాన్ని అర్థవంతంగా మలచిన శ్రీ శీలావీర్రాజు గారికి-

ముచ్చటగా అచ్చువేసిన చరిత గ్రాఫిక్స్ సుబ్బయ్య గారికి

టైప్‌సెటింగ్‌లో సహకరించిన శ్రీ సాయి శామిలి గ్రాఫిక్స్ రవికుమార్ గారికి-

పరీక్షకులుగా వ్యవహరించడమేగాక ప్రతిభను గుర్తించి ప్రశంసల్ని కురిపించిన మద్రాస్, నాగార్జున, కాకతీయ విశ్వవిద్యాలయ ఆచార్యులకు -

ప్రత్యక్షంగానే గాక పరోక్షంగానూ మరెన్నో విధాల సహకరించిన ఎందరో మహానుభావులు - అందరికీ నా కృతజ్ఞతాభివందనాలు.

- డా॥ వడ్డెపల్లి కృష్ణ

# విషయ సూచిక

పుట

Jnanpith Awardee
**Dr. C. Narayana Reddy** MP
MA PhD DLit

CHAIRMAN
**Andhra Pradesh State Cultural Council**
**Government of Andhra Pradesh**
Kalabhavan, Hyderabad - 500 004
Phone (O) 3214603 (R) 3548451
Fax (O) 3214603




జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణరెడ్డి**, ఎం.పి
ఎం.ఏ. పిహెచ్.డి. డి.లిట్

అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాదు - 500 004
ఫోన్ (ఆ) 3214603 (ఇ) 3548451
ఫాక్స్ (ఆ) 3214603

ఆమోదం — 24-5-2000

ఏళ్ళ తరబడిగా విలక్షణ గీతాలను రాస్తూ
హాస్య నిర్మాణాత్మక ప్రతిభామూర్తి డా|| వడ్డేపల్లి కృష్ణ.
అందుకు ప్రథమ సాక్షి ఆకాశవాణి.
అనంతర సాక్షులు సినీ-టీవీ మాధ్యమాలు.
పాటనాడిని క్షుణ్ణంగా తెలుసుకున్న వడ్డేపల్లి
పరిశోధన ప్రమాణాలకు ఈ గ్రంథం నిలువుటద్దం.
లలితగీతాల మూలాల్లోకి దూరి, వివిధ
గాన శాఖలను విపులంగా చర్చించి, సాధించిన సత్ఫలాలను
ఈ గంపకెత్తి చూపుతున్నారు డా|| వడ్డేపల్లి.
లలితగీతాలపైన చేసిన ప్రామాణిక
పరిశోధన ఇది. పరిణత గీతరచయితగా వెలుగొందిన
వడ్డేపల్లి కృష్ణను పరిశోధకుడుగా ఆవిష్కరించిన ఈ
పుస్తకం లలితసంగీత ప్రియులకు విలువైన కానుక.

(signature)



**ఆచార్య ఎన్.గోపి,** ఎమ్.ఏ., పిహెచ్.డి.
ప్రముఖ కవి, పరిశోధకులు
వైస్‌ఛాన్స్‌లర్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్ - 500 001

(O) : 040-234815
(R) · 040-7037585

# గీత వివేచన

"తెలుగులో లలితగీతాల"పైన సాహిత్యదృష్టితో జరిగిన పరిశోధక కృషి యీ గ్రంథం. దీనికి ఉస్మానియా విశ్వవిద్యాలయం పిహెచ్.డి. పట్టా ప్రదానం చేసింది. పరిశోధకుడైన డా॥వడ్డెపల్లి కృష్ణ స్వయంగా కవీ, గీతరచయిత కూడా కాబట్టి యీ కృషికి అతని ప్రత్యేకమైన అభినివేశం కూడా తోడయ్యింది.

'లలితసంగీతమ'నే మాట ఎప్పుడు మొదటిసారిగా వాడబడిందో ఇదమిత్థంగా తెలియదుగాని అది నాలుగవ దశకంలో 'ఆకాశవాణి' ద్వారా ప్రాచుర్యంలోకి వచ్చిందని చెప్పొచ్చు! శాస్త్రీయసంగీతం పక్కన తన ప్రత్యేక వ్యక్తిత్వం నిలుపుకోవడానికే యీ మాట పుట్టివుంటుంది.

ఈ గీతంలో సాహిత్యగుణానికే ప్రాధాన్యత లభించడం విశేషం! భావలాలిత్యం - సంగీత సారళ్యం దీని ప్రధానలక్షణాలు! మలయాళంలో కూడా దీన్ని "లలితగానాలు" అనే అంటున్నారు. కన్నడంలో "భావగీతె" అంటున్నారు. తమిళంలో 'మృదుగీతాలు' (మెల్లిశై) అంటున్నారు. హిందీలో 'సుగమ్‌సంగీత్' అనడం అందరికీ తెలిసిందే! సారాంశమేమిటంటే లలిత గీతం భావప్రధానమైన సరళ సంగీత గీతమన్నమాట!

దాదాపు 90యేళ్ల చరిత్రకలిగిన ఈ ప్రక్రియను పరిశోధనకు ఎన్నుకొని డా॥వడ్డెపల్లి కృష్ణ ఈ కృషినుండి అక్షతంగా బయటపడ్డారు. గురజాడ దేశభక్తిగీతాన్ని తీసుకోవడం అతని పరిశోధనా ప్రవణతకు నిదర్శనం. ఆనాడు లలితగీతమనే మాట లేకపోవచ్చుగాక! 'రవీంద్రసంగీతం' వచ్చిన తర్వాతనే ఇది పుంజుకోవచ్చుగాక! కాని డా॥వడ్డెపల్లికృష్ణ గీతలక్షణాన్ని బట్టి 1910 నుంచి ప్రథమలలితగీతం ఆవిర్భవించినట్లుగా చెప్పడం సబబే! స్థూలంగా చెప్పాలంటే భావగీతమే లలితగీతం! 'లలితసంగీతం' ఎందరో తొలకరి గాయనీగాయకులను వసంతకోకిలలుగా మార్చింది! భావుకలోకానికి అది

చేసినసేవ ఒక మధురమైన, శ్రావ్యమైన చరిత్ర. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవి చేపట్టాక 'లలితసంగీతం' పైన నాకున్న ప్రగాఢఅనుబంధంవల్ల దీనిని ఒక కోర్సుగా పెట్టాలని సంకల్పించడం జరిగింది. దానికి అన్నివైపులనుంచి మంచి స్పందన లభించింది. 2000-2001 అకడమిక్ సంవత్సరం నుండి 2సంవత్సరాల సాయంకాల డిప్లమా కోర్సును ప్రారంభిస్తున్నాం! అర్ధశతాబ్దంగా లలిత సంగీతానికి తన వూపిరిని ప్రసారం చేస్తున్న చిత్తరంజన్‌గారు రూపొందించిన 'సిలబస్'ను కొన్ని మార్పులతో నిపుణుల కమిటీ ఆమోదించింది. పాలగుమ్మి విశ్వనాథంగారు కూడా విద్యార్థులకోసం తమ సుదీర్ఘఅనుభవాన్ని రంగరించి 'లలితసంగీతం'పైన ఒక గ్రంథాన్ని రచించారు.

జీవితాన్ని మరింత అందంగా, మధురంగా, సార్థకంగా తత్త్వ సమన్వితంగా తయారుచేసేవి లలితకళలే. ఎంత కంప్యూటర్ యుగమైనా కళాదృష్టిలేకపోతే ఆ ప్రగతి వాసనలేని పువ్వే! ఆ దృష్టితో ప్రతి పాఠశాలలో, కళాశాలలో ఒక సంగీతం టీచర్ ఉండాల్సిన ఆవశ్యకతను ఈ లలిత సంగీతం తెలియజేస్తుంది. ఈ కోర్సును ప్రవేశపెట్టడంలోగల ఉద్దేశం కూడా ఇదే! ఈ మేరకు ప్రభుత్వానికి కూడా విజ్ఞప్తిని సమర్పించాం!

లలితగీతమనే అంశంపైన పరిశోధనచేసిన డా॥వడ్డేపల్లి కృష్ణ మంచి పండితుడు, కవి. అన్నిటినీమించి సరళహృదయుడు! తొమ్మిది అధ్యాయాలుగా, నాలుగు అనుబంధాలుగా విస్తరించిన యీ సిద్ధాంత వ్యాసంలో లలితగీత వివేచన సాకల్యంగా జరిగింది. ప్రవృత్తికి సంబంధం లేని వృత్తిలో వున్నా, ఈ బృహత్‌వ్యాసంగంతో తన వృత్తిపురోగతికి ఒరిగేది ఏమీలేకున్నా హృదయాన్ని తపింపజేసుకొని వేళ్లనేగాక చేతుల్నీ కాల్చుకున్న యీ వైనాన్ని మనస్ఫూర్తిగా అభినందించకుండా వుండలేను.

డా॥ కృష్ణ గేయరచయితగా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయ సాహిత్య పురస్కారాన్ని అందుకున్నవాడు. అతని కృషికి వచ్చినవీ, రావలసినవీ సత్కారాలు ఎన్నో వున్నాయి. అయితే అతను ఇవేవీ పట్టించుకోడు. అందరికీ తలలోనాలికలాగా, చేతిలోని 'పాళీ'క లాగా భావవీధుల్లో సాగి పోతుండడమే అతని తత్త్వం! వ్యక్తిగతంగా నాకు ఆప్తుడు కూడా కాబట్టి ఇతన్ని గూర్చి ఇంకేమిరాసినా, దానికి మమకారదోషం పట్టడం ఖాయం.

డా॥వడ్డేపల్లిని మరోసారి మనసారా అభినందిస్తూ సెలవు తీసు కుంటున్నాను.

తేది 17-05-2000 -డా॥ ఎన్. గోపి

ఓం శ్రీ సాయిరాం

**ఆచార్య ఎస్వీ రామారావు,** ఎమ్.ఏ., పిహెచ్.డి.
డీన్, ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాద్ - 500 007

# ఆముఖం

"చల్లగాలిలో యమునా తటిపై
శ్యామసుందరుని మురళీ...."

చిన్నతనంలో సాలూరు రాజేశ్వరరావు మధురకంఠం నుంచి వెలువడ్డ ఆ లలితగీతం గ్రామఫోను రికార్డు ద్వారా విని ఎంతో ఆనందించేవాళ్లం. తర్వాత "స్వాతంత్ర్యమె మా జన్మహక్కని చాటండీ", "అమ్మా, సరోజినీదేవి" మున్నగు ఘంటసాల కంచుకంఠం ఆలపించిన పాటలు బహుళ జనాదరణ పొందాయి. రేడియో మీడియా వచ్చాక రావుబాలసరస్వతి, టంగుటూరి సూర్యకుమారి వంటి గాయనీమణుల పాటలు తరుచుగా వినబడేవి. 1953లో మిడిల్‌స్కూలు విద్యార్థిగా వున్నరోజుల్లో ఆంధ్రరాష్ట్రావతరణ ఉత్సవాలు తిలకిద్దామన్న ఉత్సాహంతో కర్నూలు వెళ్లినపుడు సూర్యకుమారి పాడిన "మా తెలుగుతల్లికీ మల్లెపూదండ" గీతంతో ఉత్సవం ప్రారంభం కావటం ఇప్పటికీ గుర్తు.

నాటినుంచి నేటివరకూ ఆబాలగోపాలాన్నీ అలరించిన లలిత గీతాలపై ప్రత్యేకమైన పరిశోధనా గ్రంథం వెలువడుతుందని - అదీ నా పర్యవేక్షణలో కొనసాగుతుందని నేను ఊహించలేదు. విశ్వవిద్యాలయ పరిశోధన మూలంగా ఈ సదవకాశం లభించింది. ముఖ్యంగా ఉస్మానియా తెలుగుశాఖ మొదటినుంచీ ప్రక్రియాపర పరిశోధనకు ఎంతగానో దోహదం చేసింది

జానపదగేయ వాఙ్మయం, ఇతిహాసం, ప్రబంధం, పురాణం, వచనం, శతకం, నాటకం, ఆధునిక కవిత్వం, నవల, కథానిక, విమర్శ మొదలగు పలు ప్రసిద్ధ ప్రక్రియలపై పరిశోధన జరిగి ఉత్తమ సిద్ధాంత వ్యాసాలు వెలువడ్డాయి.

ఆ వారసత్వంనుంచే వెలువడిన మరొక సిద్ధాంత గ్రంథం వడ్డేపల్లి కృష్ణ విరచితమైన "తెలుగులో లలితగీతాలు". ప్రత్యేక ప్రక్రియగా విస్తరిల్లిన లలితగీతం స్వరూప స్వభావాలు, ఆరంభ వికాసాలు, ప్రసార ప్రచారాలు సాకల్యంగా సమాలోచించిన ఉత్తమ పరిశోధనా గ్రంథం ఇది. లాలిత్య పూరితమై, గానయోగ్యమై రసజ్ఞుల హృదయాలను రంజింపచేసే విశిష్ట ప్రక్రియ లలితగేయం. శాస్త్రీయ సంగీతం, జానపదగేయం, సంకీర్తనం వంటి ప్రక్రియలకంటె భిన్నంగా లలితగీతం పంచలక్షణోపేతమైనదిగా పేర్కొని దాని స్వరూపాన్ని సుస్పష్టం చేశారు వడ్డేపల్లి కృష్ణ. "ప్రకృతిని వర్ణిస్తే శృంగారమే పరమార్థం. దేశాన్ని, ప్రజల్ని ప్రబోధిస్తే ఉపదేశమే పరమార్థం" (పు.19) అంటూ దాని తత్త్వాన్ని హృద్యంగా ఉగ్గడించారు.

లలితగీత అవతరణకు దోహదం చేసిన గురజాడ, రాయప్రోలు గీతాలను, వికాసానికి కృషిసల్పిన బసవరాజు, కృష్ణశాస్త్రి గీతాలను ప్రత్యేక ప్రకరణాలలో సవిస్తరంగా పరిశీలించారు రచయిత. లలితగీత ప్రసారంలో ఆకాశవాణి పాత్ర ప్రాముఖ్యాన్ని చక్కగా విశదీకరించారు. తొలి లలితగీత రచన ఎప్పుడు జరిగిందో (1910), మద్రాస్ రేడియో నుంచి (1938), హైదరాబాద్ రేడియో నుంచి (1948) తొలి గీతం ఎప్పుడు ప్రసారమైందో, గ్రామఫోన్ రికార్డు తొలితెలుగు గీతాలాపన ఎప్పుడు చేసిందో (1935) సునిశితమైన పరిశీలనా చక్షువుతో నిగ్గుతేల్చి నిరూపించారు. వివిధ కవుల కలాలలో, గాయకుల గళాలలో వైవిధ్య రూపంతో విస్తరిల్లిన వైనాన్ని విశిష్టంగా వివరించారు.

సరళ స్వభావంతో మృదువుగా మాట్లాడే వడ్డేపల్లి కృష్ణ అవసరమైతే నిజాలను నిర్భయంగా ప్రకటించగలడు కూడా. "నాడే కాదు యీనాడు కూడా సారస్వతలోకంలో యిజాలు - గ్రూపులతో భుజాలు కలుపుకు తిరిగేవారికే భుక్తి-ముక్తి లభిస్తున్న సంగతి అందరికీ తెలిసిందే" (పు.77) మొదలగు వాక్యాలే అందుకు సాక్ష్యం. ఆకాశవాణిద్వారా ప్రసారమైన గీతాలను, క్యాసెట్లు మొదలగు రూపాలలో వెలువడుతున్న ప్రచార గీతాలను

ప్రత్యేక అధ్యయనార్హమైనవిగా పేర్కొంటూ `ముక్తాయింపు'లో భావి పరిశోధకులకు మార్గనిర్దేశం చేయటం గమనార్హం.

లలితగీతాలపై రసవత్తరంగా సాగిన ఈ సమాలోచన గ్రంథం రసహృదయులు, మధుర గాయకులు, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారికి అంకితం కావటం హృద్యమైన సన్నివేశం. ఎంతో సముచితం.

మూడు దశాబ్దాలుగా గీతరచనతో రసజ్ఞులను అలరిస్తూ అంతటితో ఆగకుండా ఆ ప్రక్రియపైగల అభిమానంతో, నిర్ణిద్ర పరిశ్రమతో నూరేళ్ల లలిత గీత చరిత్రకు సౌష్ఠవాకృతిని కల్పించిన వడ్డెపల్లి కృష్ణను మనసారా అభినందిస్తున్నాను.

తేది 09-05-2000 - డా॥ ఎస్వీ రామారావు

# 1. శ్రుతి

ఎంతటి మహానదియైనా ప్రారంభదశలో పాయగానే ఉద్భవిస్తుంది. క్రమక్రమేణ ఉపనదులను చేర్చుకొని ఉరవడి కూర్చుకొని మహానదిగా మారుతుంది అలాగే అటు పండిత పద్య సాహిత్యం ఇటు పామర జానపద సాహిత్యం శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. అనేక పరిశోధనలకు మూలకందంగా విలసిల్లింది. ఈ రెంటికి మధ్యన లలితగీత సాహిత్యం ఇన్నాళ్లు ఎదురుగా అగుపిస్తున్నా ఎదకలిపి పరిశోధనకు ఎవరూ పూనుకోకపోవడం ఆశ్చర్యమే!

ఏ మార్గంలోనైనా ప్రథమంగా పాదం మోపే వరకు ముల్లు, రాళ్లు గుచ్చుకోవడం సహజం! సిద్ధంగా వున్న ప్రసిద్ధ మార్గంలోనే పయనించడం సులభం. 'లలితగీతాలు' అనే అంశం వినగానే ఎంత సులువుగా తోస్తుందో లోనికి దిగగానే అంత కష్టంగా పరిణమిస్తుంది. ఇంతకాలం ఈ అంశాన్ని పరిశోధనకు ఎవరూ ఎంచుకోకపోవడం, ఎంచుకున్నా ఆమోదం లభించకపోవడం వల్లనే లలితగీతాల మీద ప్రామాణిక పరిశోధన జరుగలేదని నేను అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను. ఆకాశవాణిలో ప్రసారమయ్యే 'లలిత సంగీతం' ప్రభావంతో నేను 1969 నుండి అనేక లలితగీతాలు రచిస్తూ 1981లోనే లలితగీతాల మీద అభిమానంతో ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని ఆ అంశాన్ని పరిశోధనకు అనుమతించవలసిందిగా ప్రాధేయపడితే, కొందరు ఆచార్యులు అందులో శోధించ వలసిందేముందంటూ పెదవి విరిచారు.

మళ్లీ చెదరని లక్ష్యంతో చెరగని అభిమానంతో 1993లో 'తెలుగులో లలిత గీతాలు' అనే అంశాన్ని ఎన్నుకొని పరిశోధనకు అనుమతించవలసిందిగా ఉస్మానియా విశ్వవిద్యాలయాన్నే అర్థిస్తే, జానపదగీతాల మీద అనేక పరిశోధనలు సినీ గీతాలమీద ఇటీవలనే మూడు పరిశోధనలు జరుగగా, ఎవరూ స్పృశించని 'లలితగీతాల' మీద ఒక్క పరిశోధనకైనా సామగ్రి లభించకపోదని గుర్తించి నా సామర్థ్యం మీద నమ్మకమున్న ఆచార్య యస్వీరామారావు, ఎల్లూరి శివారెడ్డి, ఎన్. గోపిగార్లు నన్ను సమర్థించి వెన్నుతట్టి అవకాశం లభింపజేశారు. మొదటి నుండీ నా యెడ వాత్సల్యం గల ఆచార్య యస్వీరామారావుగారే 'గైడ్'గా వుండడానికి అంగీకరించారు. సాహిత్య సౌజన్య మూర్తియైన యస్వీరామారావుగారి ప్రోత్సాహంతో నాటి గురజాడ నుండి నేటి అభ్యుదయ కవిత్వపు అడుగుజాడల్లో పయనిస్తున్న అనేక కవుల రచనల్ని పరిశీలించాను. 'లలితగీతం' అనే పదాన్ని సక్రమంగా సహేతుకంగా నిర్వచించడానికి అనేక ప్రయాసలుపడి, చివరకు డా గిడుగు సీతాపతి గారి "తెలుగులో ఛందోరీతులు" (ఆం.ప్ర. సాహిత్య

అకాడమీ అవార్డు పొందిన గ్రంథం) లోని 'తాళగతుల పట్టిక'ను ఆధారంగా చేసుకొని డా.బి.రామరాజుగారు నిర్వచించిన జానపదగేయ లక్షణాల్ని ఆసరాగా మలచుకొని లలితగీత లక్షణాల్ని రూపొందించగలిగాను. నిర్వచనాన్ని నిర్దేశించ గలిగాను గురజాడగారి 'దేశమును ప్రేమించుమన్నా!' అనే దేశభక్తి గీతమే ప్రథమ లలిత గీతమని నిరూపించాను.

తామర తంపరగా విస్తరిల్లిన లలితగీతాల్ని లక్షణం, అవతరణం, వికాసం, విస్తారం, ప్రసారం, ప్రచారం అనే ఆరు విభాగాలుగా చేసుకొని విశ్లేషించాను. కాలాన్ని, కవుల్ని ఆధారంగా చేసుకొని ఒక వరుసలో గీతాల్ని పరిశీలించి పరిశోధించాను. నాటి-నేటి ప్రసిద్ధ కవుల్ని, సంగీత దర్శకుల్ని, గాయనీ గాయకుల్ని సంప్రదించాను. బాలాంత్రపు రజనీ కాంతరావు, ఆరుద్ర, యస్.రాజేశ్వరరావు, రావు బాలసరస్వతీ దేవి, పేకేటి శివరాం, పాలగుమ్మి విశ్వనాథం, వింజమూరిసీత, ఎం. చిత్తరంజన్‌గార్లను ఇంటర్వ్యూ చేసి అనేక అమూల్య విషయాలను సేకరించాను. సుందరయ్య విజ్ఞాన కేంద్ర గ్రంథాలయంలో సులువుగా లభించిన అనేక గ్రంథాల్ని పరిశీలించాను. ఇలా నా పరిశోధనకు ప్రథమంగా శ్రుతి ఏర్పరచుకున్నాను. శ్రుతి చేసిన ఈ 'లలిత గీత పరిశోధనా వీణ' పలువురికి విశేషరాగ ఫలాల్ని అందించగలదని ఆశిస్తున్నాను.



# 2. ప్రవేశిక

"సంగీత మపి సాహిత్యమ్
సరస్వత్యాః స్తనద్వయమ్
ఏకమాపాత మధురమ్
అన్యదాలోచనామృతమ్" -

సంగీతం, సాహిత్యం అనేవి కళారాణి-వాణి స్తనద్వయాలని ప్రాచీనులు సైతం అంగీకరించి రెండింటికీ సమస్థానాల నొసగి గౌరవించారు. అయితే యీ రెండింటిలో ఒకటైన సంగీతం ఆపాతమధురమై పశుపక్ష్యాదుల్ని సైతం పరవశింపజేస్తూ అందరికీ ఆనందాన్ని కలుగజేస్తే, రెండవదైన సాహిత్యం ఆలోచనల్ని రేకెత్తింపజేస్తుంది. లోతుగా పరిశీలించిన కొద్దీ అమృత భావాల్ని స్ఫురింపజేస్తుంది.

సాహిత్యాన్ని వివిధ ప్రక్రియలుగా విభజించుకునే అవకాశమున్నట్లే, సంగీతాన్ని శాస్త్రీయ సంగీతం, లలిత సంగీతం అని విభజించుకునే వీలున్నది. స్వర ప్రస్తారంతో రాగనిబంధనలతో త్యాగరాజాది వాగ్గేయకారుల కృతుల్ని ఆలపించ డానికి ఆధారమైనది శాస్త్రీయసంగీతం.

ఒక విధంగా శాస్త్రీయ సంగీతం పలుకట్టు దిట్టాలతో తీగమీద నడిచే సర్కస్ లాంటిది. తీగమీద నడవడానికి మనిషికెంతటి సాధన కావాలో వీణియతీవియలపై శ్రుతి, గతి తప్పని రాగాలాపనకై అంతే సాధన కావాలి. రాగ, తాళాదుల జ్ఞానం కావాలి. ఇట్టి కట్టు దిట్టాలు అంతగా అవసరం లేకున్నా, రాగయుక్తంగా లయాన్వితంగా సరళంగా స్వరమెత్తేది లలిత సంగీతం. అనగా శాస్త్రీయ సంగీతం కంటె సరళమైనది, లాలిత్యమైనది 'లలిత సంగీతం' అని చెప్పవచ్చు. ఇట్టి లలిత సంగీత సంప్రదాయ సృష్టికి ఏమేమి కావలయునో మంగళంపల్లి బాలమురళీకృష్ణ యిలా వెల్లడించారు.

"భారతదేశమున లలితసంగీతమునకు ఒక ప్రత్యేక స్థానము అనాది నుండియు గలదు. కాని దాని రీతి ఇదమిత్థమని నిరూపించు సంప్రదాయమేర్పడ లేదు.....నిత్యకృత్యములలో వివిధములైన కళానుష్ఠానములు అందనేక రసానుభూతులు అనుభవైక వేద్యములు. సువిదితములైన తదభిరుచులకు తగినట్లు సంగీతము కూడ భిన్నరీతుల రూపొందినది. అందు లలితసంగీత మొక రూపాంతరము....ఇట్టి లలిత సంగీత సంప్రదాయ సృష్టికి కావలసిన విశేషములు ప్రధానముగా

1. శ్రుతి, లయ స్వరజ్ఞానము
2. సాహిత్యజ్ఞానము
3. సంగీత సాహిత్యములు మేళవింపజేయగలిగిన రసజ్ఞత
4. స్వరపరిచేవిజ్ఞత

5. వాద్యసమ్మేళన శక్తి"[1]

ప్రఖ్యాత వైణికులు శ్రీ మంచాళ జగన్నాథరావుగారు 'ఆధునిక సంగీత' మంటే ఆధునికులు అత్యధికంగా ఆదరిస్తున్న లలిత సంగీతమనే భావించారు.

"సంప్రదాయసిద్ధమైన సంగీతమును అభ్యసించుటకు చాలా గ్రంథములు కలవు. కాని లలితసంగీతమను నేటి ఆధునిక సంగీతమునకు ఒక నిర్దిష్టమైన మార్గమును చూపు గ్రంథము లేదు. పూజ్యులు, మిత్రులునగు సుప్రసిద్ధ రచయితల రచనలు అల్ప సంగీత జ్ఞానములతో తామే 'వర్ణమెట్టు' లేర్పరచుకొని అనేకులు పాడుకొనుచున్నారు. ఎక్కడో సకృత్తుగా తప్ప, భావరాగతాళముల మిశ్రమము ఆనందమును, రక్తిని కలిగించుట లేదు....ప్రతివారికీ విద్వాంసులైన వారి సహాయము దుర్లభము కదా! అందుకొరకే యీ గ్రంథమును తగుమాత్రపు సంగీత జ్ఞానము గలవారు నభ్యసించుటకు వీలగు గుర్తులతో రూపొందించితిని-"[2]

పై మాటల్నిబట్టి ఆధునిక సంగీతమంటే లలితసంగీతమని తేటతెల్ల మవుతోంది.

లలితసంగీతం శాస్త్రీయ సంగీతం కంటె సులభంగా ఎలా వ్యాప్తి చెందిందో, ఎందుకు ప్రాచుర్యం పొందిందో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఇలా వివరించారు-

"లలితసంగీతం అనేది ఇటీవల వినబడుతున్న పేరు. శాస్త్రీయ సంగీతం పాడే విద్వాంసుల ప్రదర్శనల్లో సామాన్యజనానికి అంతగా అర్థం కాని పాండిత్య ప్రకర్షవల్ల శాస్త్రీయ సంగీతం పట్ల ఈ శతాబ్దపు తొలిరోజుల్లో జనాదరణ తగ్గింది. రంగస్థల సంగీతంలోను, సినిమా సంగీతంలోను, ఇతర రాష్ట్రాల నుంచి వచ్చిన తేలికబాణీలపైన జనానికి వ్యామోహం పెరగడంతో శాస్త్రీయ సంగీతం కంటె వేరుగా, తేలికగా విని ఆనందించడానికి వీలయ్యే పాటలు కావలసి వచ్చాయి. ఆధునిక కవులు వ్రాసిన దేశభక్తి గీతాలు, ప్రణయ గీతాలు, భక్తిగేయాలు, జానపద సంగీత రీతులలో కూర్చిన పాటలు ఈ కొరతను తీర్చాయి. ఇవే ఈనాటి లలిత సంగీతానికి జీవగర్రలు."[3]

1950 నుండి నేటివరకూ అనేక లలిత గీతాలు పాడడమే గాక స్వరపరచి లలితసంగీత పాఠాల్ని అనేక గాయనీ గాయకులకు బోధిస్తూ 'ఆకాశవాణి' లో లలితసంగీత విభాగాన్ని నిర్వహిస్తున్న శ్రీ ఎం. చిత్తరంజన్‌గారు "మనసున పూచే తీయని ఊహల మాలికయే మృదుగీతం-మధుర మనోహర మంజుల నాద సుధాఝరియే సంగీతం! మృదుగీత రసభావం, గాయనీ గాయక గళజీవం, వాద్య సహకారం, లలిత సంగీత సాకారం!" అని ఇటీవల లలిత సంగీతానికి తానొక లక్షణగీతమల్లినట్లు వివరించారు.[4]

---

1 ఆధునిక సంగీతము (మున్నుడి) ప్రచురణ 1962 -మంచాళ జగన్నాధరావు

2. ఆధునిక సంగీతము (మొదటి భాగం) - మంచాళ జగన్నాధరావు పుట - 9

3 ఆధునిక సంగీతము (ఆశీస్సులు) - మంచాళ జగన్నాధరావు

4 ఎం చిత్తరంజన్‌గారితో ముఖాముఖి 19 1 1997

పై అభిప్రాయాల్ని శ్రద్ధగా పరిశీలిస్తే, శాస్త్రీయ సంగీతం కంటె సరళమైనది, జానపద బాణీలతో మిళితమైనది 'లలితసంగీతం' అని రూఢి అవుతోంది. పాడుకోవడానికి వీలయ్యే భావగీతాలు లేక గేయాలు అన్నీ లలితగీతాలు అనవచ్చునని స్పష్టమవుతోంది. శాస్త్రీయ సంగీతం మొన్నటి అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు మొదలుకొని నిన్నటి త్యాగయ్య కృతులవరకు జీవగర్రగా నిలచింది 15వ శతాబ్దంలోని అన్నమాచార్య కీర్తనలతో అంకురించిన శాస్త్రీయ సంగీతం క్రీ.శ. 18వ శతాబ్దం వరకు త్యాగయ్య కృతుల ద్వారా అనుపల్లవుల్ని చేర్చుకొని విస్తరిల్లి, వివిధ కచేరీల ద్వారా ఎల్లలు దాటి, దేశ విదేశములలో సైతం కీర్తి గడించి తారాస్థాయికి చేరుకున్నది. లలితసంగీతం మాత్రం కేవలం ఆకాశవాణి, ఇటీవల దూరదర్శినిపై ఆధారపడి బహుళ ప్రచారం గాంచింది. శాస్త్రీయ సంగీతమనే తీవియపై పూచిన లతాంతము 'లలితసంగీతము' అని పేర్కొనవచ్చు! ఇట్టి లలితసంగీతంలో పాడుకోవడానికి వీలయ్యే ప్రతి మృదుగీతం లలిత గీతమే అవుతుంది. మున్ముందు దీనికి తగిన నిర్వచన నిరూపణ జరుగుతుంది.

లలిత లలిత పదాలతో రాగలక్షణాలతో అల్లబడిన ఏ గేయమైనా లలితగీతంగా రూపుదిద్దుకుంటుంది. అంటే తాళ-గతి తప్పకుండా తేలికగా పాడుకోవడానికి వీలయ్యే లాలిత్యపు భావగీతము లలితగీతమన్నమాట! గీతం శరీరమైతే దానిని సవ్యంగానే గాక శ్రావ్యంగా పలికించే సంగీతం ప్రాణంతో సమానం!

'లలిత సంగీత' కార్యక్రమాల్లో లయాన్వితంగా గానం చేయబడే ఇట్టి లలిత గీతాలకు మొదట ఆకాశవాణి, గ్రామఫోన్ రికార్డులు మాత్రమే ఆధారమయ్యాయి. తొలినాళ్లలో శ్రీయుతులు సాలూరి రాజేశ్వరరావు, ఎం.ఎస్. రామారావు, బాలాంత్రపు రజనీకాంతరావు, మల్లిక్, పాలగుమ్మి విశ్వనాథం ప్రభృతుల సంగీత దర్శకత్వంలో గానగంధర్వ ఘంటసాల, రావు బాలసరస్వతి, టంగుటూరి సూర్యకుమారి, శ్రీరంగం గోపాలరత్నం, పి.బి.శ్రీనివాస్‌ల గాన మాధుర్యంతో చిగురువేసింది. మలినాళ్లలో శ్రీయుతులు ఎం. చిత్తరంజన్, నిర్మల్ కుమార్, టి.ఆర్. జయదేవ్, పి.వి.సాయిబాబా, వి. బండారు, నల్లూరి సుధీర్ కుమార్ మరియు శ్రీమతి సి. ఇందిరామణిగార్ల సంగీత నిర్దేశకత్వంలో శ్రీకె.బి.కె. మోహన్‌రాజు, ఎం. వెంకటగోపాలం, బి.వసంత, రామలక్ష్మీరంగాచారి, ఎం. నరసింహమూర్తి, షహీద్‌బాబు, రామాచారి మరియు శ్రీమతి ఆర్. వేదవతీ ప్రభాకరరావు, ఏ.వి.సావిత్రి, కృష్ణకుమారి, ఛాయాదేవి, విజయలక్ష్మీశర్మ, సి. పద్మజ, విజయశ్రీ, సురేఖామూర్తి గార్ల మధురగానాలతో మారాకు తొడిగింది.

ఇటీవల వంశీ ఆర్ట్స్, రసమయి, కిన్నెర ఆర్ట్స్, అభినందన, యువ కళావాహిని మొదలగు సాంస్కృతిక సంస్థలు నిర్వహించే ప్రముఖుల సన్మానాల సందర్భాలలో మరియు వివాహ వేదికలపై జరిగే మిత్ర, గంగాధర శాస్త్రి, శశికళ, మణిశర్మ, విజయలక్ష్మిల గాన కచేరీలు కూడ లలిత సంగీత అభ్యున్నతికి దోహదం చేస్తున్నాయి

క్రీ.శ. 16.6.1938 నుండి ఆకాశవాణి మద్రాస్ కేంద్రం ద్వారా, ఆపై 1948 ప్రాంతంనుండి హైదరాబాద్ కేంద్రం ద్వారా 'లలిత సంగీతం' శీర్షికలో ప్రసారమైన లలిత గీతాలు నేటివరకు కొన్నివేల సంఖ్యకు వ్యాపించాయి.

శ్రీయుతులు గురజాడ, రాయప్రోలు, బసవరాజు, కవికొండల, బాపిరాజు, నండూరి, అబ్బూరి, విశ్వనాథల కలాల నుండి జాలువారిన లలిత గీతాలు కృష్ణశాస్త్రి చేతుల్లో కొత్త తళుకుల్ని-కులుకుల్ని సంతరించుకున్నాయి. విశ్వేశ్వరరావు, వింజమూరి శివరామారావు, రజనీకాంతరావు, శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరథి, డా.సి.నారాయణరెడ్డి గార్ల ఒరవడిలో ఒయ్యారాల్ని సమకూర్చుకున్నాయి. బోయిభీమన్న, శశాంక, జె. బాపురెడ్డి మరియు నవతరంలోని కవులు కోపల్లె శివరాం, వడ్డేపల్లికృష్ణ, నెల్లుట్ల, ఆచార్య తిరుమల, ఇంద్రగంటి శ్రీకాంత శర్మ, డా.తిరుమల శ్రీనివాసాచార్య, ఎం.కె. రాము, చైతన్య ప్రసాద్, పులికంటి కృష్ణారెడ్డి, జైహింద్ రెడ్డి, ఓలేటి, కవయిత్రులు శ్రీమతి శారదా అశోక వర్ధన్, జొన్నవాడ రాఘవమ్మ, డా.ఎం. పద్మినీదేవి మొదలగువారి రచనలతో కొత్త మెరుగుల్ని హత్తుకొని లలితగీతాలు సురగంగలా తరగెత్తుతున్నాయి. శ్రుతి పక్వంగా స్వరమెత్తుతున్నాయి.

పదాన్నైనా, జానపదాన్నైనా లలితగీతంగా పలికించే గుణం లలిత సంగీతానికుంది. అందుకే శాస్త్రీయం యెడ పూర్తి అవగాహన లేనివారు సైతం సరళమైన లలిత సంగీతం పట్ల సుముఖులై సాగివస్తున్నారు. సంతోష రాగాలాపన చేస్తున్నారు.

లలితగీతాలలో చాలావరకు పరిసర సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ ప్రభావాలతో దేశకాలానుగుణంగా స్వరమెత్తినవే! భక్తి, రక్తి భావాలతో తరగెత్తినవే! అయితే ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన జాతీయోద్యమంలో, ఆంధ్రోద్యమంలో ఆ తర్వాత చెలరేగిన 'జై తెలంగాణా', 'జై ఆంధ్ర', మరియు నక్సల్‌బరి ఉద్యమాలలో ఉవ్వెత్తున ఎగిసిపడ్డ గీతాలూ ఇంకా అనేకమున్నాయి. కాని నా పరిధి లలితగీతాల వరకే పరిమితమైనందున, పైగా ఉద్యమ గీతాలపై ప్రత్యేక పరిశోధనలు వెలువడినందున వాటిని స్వీకరించలేదు. సాంఘిక ప్రయోజనాలతో అవతరించిన పొదుపు, అక్షరజ్యోతి, కుటుంబ సంక్షేమాది గీతాల్ని మాత్రం గమనించి చేర్చుకోవడమైంది. వేల సంఖ్యలో వున్న ఇట్టి లలితగీతాల్ని భక్తి, దేశభక్తి, ప్రకృతి, ప్రణయం, ప్రబోధ విభాగాలుగా విభజించుకొని పరిశీలిస్తే తులనాత్మక పరిశోధనకు దారితీయడమేగాక అంతులేని 'సాగరమథనం' అవుతుంది. కావున కాలక్రమేణ వర్ధిల్లిన కవుల ఆధారంగానే వారి వారి గీతాల్ని ప్రస్తుత పరిశోధనకు ఎన్నుకోవడమైంది.

మొట్టమొదట పుట్టింది జానపదగీతమే అయినా అది అజ్ఞాత కర్తృత్వంతో ఉమ్మడి వ్యవసాయంలా సామూహిక కర్తృత్వంనకు సంబంధించింది కాగా లలిత గీతమనేది ఏక కర్తృత్వానికి చెందింది. అది గ్రామ్యం, ఇది గ్రాంథికం లేక

వ్యావహారికం. రాను రాను పామరుల జానపదగీతం సంస్కరింపబడి కాలక్రమేణ నాగరకుల లలితగీతానికి దారి చూపింది. జావళీలు, ఎంకి పాటలు, బంగారుమామ పాటలు కూడ లలితగీతాల పాదులో పూచినవే!

అసలు లలితగీతాలు మొదట యక్షగానాలలోనూ తర్వాత నాటకాలలోనూ చోటుచేసుకొని ప్రచారానికి వచ్చాయి. ఆపై ఆకాశవాణి ద్వారా ప్రసారమై విశేష వ్యాప్తికి నోచుకున్నాయి. అటు పిమ్మట సినిమా సంగీత సంపర్కంతో చలన చిత్రగీతాలై ఆబాలవృద్ధుల్ని అలరింపజేస్తున్నాయి. ఉదాహరణకు కృష్ణశాస్త్రి గారు 'మల్లీశ్వరి' చిత్రంకై రాసిన ప్రతిపాట లలితగీతమే! అదే ఒరవడిలో ఆరుద్ర 'ఉయ్యాల జంపాల' చిత్రానికి, ఆ తర్వాత డా.సి.నారాయణరెడ్డి 'ఏకవీర' చిత్రానికి రాసిన సినిమాపాటలన్నీ లలితగీతాలుగా నిలిచేవే! ఇలా సినిమా పాటలు లలితగీతాలైనవి కొన్ని కాగా, లలితగీతాలే సినిమా పాటలైనవి మరికొన్ని! అందుకు ఉదాహరణగా బసవరాజుగారి 'నల్లవాడే-గొల్లపిల్లవాడే', 'కొల్లాయి జుట్టితేనేమి?', 'గుత్తొంకాయ్ కూరోయ్ బావా!' గీతాల్ని, కృష్ణశాస్త్రిగారి 'జయ జయ జయ ప్రియభారత', 'ఆకులో ఆకునై', 'పుట్టకాడ ఎవరో?' గీతాల్ని, డా.సి.నారాయణరెడ్డి గారి 'ఈ నల్లని రాలలో', 'చేనులో ఏముంది?' మొదలగు గీతాల్ని నిదర్శనంగా చూపవచ్చు!

'తెలుగు సినిమా పాట'లపై ఇప్పటికే ముగ్గురు పి.హెచ్‌డి. పట్టాలు సాధించినందున[1] సినిమాలలో సాహిత్యపు విలువలు గల పాటల్ని నేను స్పృశించ లేదు. కాని మొదట లలితగీతాలుగా ప్రసారమై/ప్రచురితమై ఆ తర్వాత వెండి తెరకెక్కిన చలన చిత్ర గీతాల్ని మాత్రం సంబంధిత విభాగంలో చర్చించడమైంది.

సినిమా సంగీతం, లలిత సంగీతాలకు గల తేడాలేమిటో సంగీత కళాప్రపూర్ణ శ్రీసాలూరు రాజేశ్వరరావుగారు ఈ పరిశోధకుని 'ఇంటర్వ్యూ'లో ఇలా తెలియ జేశారు-

"లలిత సంగీతమంటే భావగీతాలకు లలితంగా బాణీలు కూర్చడం, సినిమా సంగీతమంటే సన్నివేశ పాత్రానుగుణంగా రకరకాల బాణీలు కూర్చడమని నా అభిప్రాయం"-[2]

లలిత పదాలతో, భావాలతో తాళగతి తప్పకుండా రాగయుక్తంగా వుండి వినినంతనే మనసుల్ని రంజింపజేయగలిగే గీతాల్ని మాత్రము లలిత గీతాలుగా పరిగణిస్తూ పరిశోధించడమైంది. ఈ పరిశోధనా వ్యాసం లలితగీత లక్షణం, అవతరణం, వికాసం, విస్తారం, ప్రసారం, ప్రచారం విభాగాలుగా విభక్తమైంది.

1. *'తెలుగు సినిమా పాటల్లో సాహితీ మూల్యాలు' - డా టి. గౌరీశంకర్ (ఉస్మానియా), 'సినిమా పాటల్లో సాహిత్యపు విలువలు' డా.సి.హెచ్. కోటేశ్వరరావు (ఆంధ్ర), 'తెలుగు సినిమా పాట' - పైడిపాల (మద్రాస్)*
2 *'మధుర స్వర సాగరం డా.సాలూరు రాజేశ్వరరావు' సితార - 25 7.1993 - వడ్డెపల్లి కృష్ణ*

# 3. లలితగీత లక్షణం

## పదం :

ఏ సాహిత్యంలోనైనా పద్యం కంటె పదమే ముందు పుట్టిందన్నది ఇదివరకే ఎందరో పరిశోధకులు రూఢి చేశారు. పదం అనేది పాటకు పర్యాయపదంగా వాడబడినట్లుగా పాల్కురికి సోమనాథుని 'పండితారాధ్య చరిత్ర' లోని ఈ క్రింది ద్విపద వల్ల తేటతెల్లమవుతుంది.

"పదములు తుమ్మెద పదముల్ ప్రభాత
పదములు పర్వత పదము లానంద
పదములు వెన్నెల పదములు సంజ
వర్ణన మరిగణ వర్ణన పదము
లర్ణవ ఘోష ఘూర్ణిల్లుచునుండ
బాడుచు నాడుచు బరమ హర్షమున..."

తన 'బసవపురాణా'నికి ఆనాటి భక్తులు పాడుకున్న పాటలే మాతృకగా పేర్కొంటూ-

"ఆతత సకల పురాతన భక్త
గీతార్థ సమితియే మాతృకగాగ"[1]

అని తన చిత్తశుద్ధిని ప్రకటించుకున్నాడు.

నన్నెచోడుని 'కుమారసంభవం'లోనూ పదాల, పాటల ప్రస్తావన కనిపిస్తుంది.[2]

పదం పాటకు పర్యాయపదంగా వాడబడిననూ ఈ రెంటికి ఇంచుక భేదముంది. "పాట లేక గీతం గాన ప్రధానమైనది. పదం అభినయ ప్రధానమైనది. క్షేత్రయ్యపదాలు అందుకుదాహరణాలు."[3] అభినయానికి గానానికి అనుకూలమైనవి పదాలని సంగీత విద్వాంసులు పరిమితార్థంలో వ్యవహరించారు.

పదకవితా పితామహుడైన అన్నమయ్య రచనలన్నీ సంకీర్తనలు. అందుకే ఆయన 'సంకీర్తనాచార్యుడు' అయ్యాడు. త్యాగయ్య కృతులకుగల రాగ ప్రస్తారం లాంటి విశిష్ట లక్షణం సంకీర్తనలకు కూడ అన్నమయ్య ఆనాడే నిర్దేశించివుంటాడు. కాని అవి మనకు లభ్యం కాలేదు. కేవలం రచనలు మాత్రమే రాగిరేకులలో మన చేతికందాయి. కావున పలువురు పలురకాలుగా పాడు కుంటున్నారు. అలాగే రామదాసు రచనల్ని భజన కీర్తనలుగా భావించి జనం ఆదరిస్తూ ఆలపిస్తున్నారు నేటికీ. "అన్నమయ్య పదాల్ని కొందరు లలితగీతాలుగా

---

*1. బసవపురాణం - పాల్కురికి సోమనాథుడు పుట : 7*

*2 కుమార సంభవం - నన్నెచోడుడు. పుట · 82*

*3. తెలుగు ఛందోవికాసం - కోవెల సంపత్కుమారాచార్య. పుట 6*

పాడుకుంటున్నా వాటిని ప్రజల భాషలో రచించిన సంకీర్తనలు అనే చెప్పాలి"[1] అని ఈ పరిశోధకుని ఇంటర్వ్యూలో సమగ్రాంధ్ర సాహిత్యకర్త డా. ఆరుద్రగారు నొక్కి చెప్పారు.

కావున వాగ్గేయకారులైన అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య, రామదాసు రచనలు ఆధునిక లలితగీతాల పరిధిలోకి చేరవని నా అభిప్రాయం.

## గేయం - గీతం :

పదము లేక పాట గేయమునకు పర్యాయపదముగా వాడబడినది. 'గాతుం యోగ్యమ్ గేయమ్' పాడుట కనువైనది గేయము. గీత, గానములను అమరకోశము సమానార్థకములుగా పేర్కొన్నది.[2]

మానవుని హృదయం రాగద్వేషములకు నిలయం. అతడు తన కోరిక లీడేరిన సందర్భంలో సంతోషంతో, ఈడేరని సమయంలో సంతాపంతో గొంతెత్తితే అది పాటగానో పదంగానో రూపుదాలుస్తుంది. ఆశువుగా తాళ, గతియను వలువల్ని ధరించి అందంగా అలరారుతుంది. గేయం మాత్రాచ్ఛందస్సుతో కూడుకున్నది. "ఛందస్సుకు నిత్యంగా ఉండవలసిన ధర్మం శ్రావ్యత అని, అన్ని ధర్మాల కంటె అదే గొప్పదని క్షేమేంద్రుడు వక్కాణించాడు. ఛందస్సుకు ఆంగ్లంలో Prosody అని వాడుక. Prosody అంటే (Proto, ode-song, sing) గేయాత్మకత- గాన యోగ్యత అని అర్థం. ఛందస్సులో అక్షర ఛందస్సులని, మాత్రా చ్ఛందస్సులని రెండు ప్రధాన భేదాలు గోచరిస్తాయి. అక్షర ఛందస్సులు (పద్యం) పఠన యోగ్యాలైతే మాత్రాచ్ఛందస్సులు గానయోగ్యాలు. కావున మాత్రాచ్ఛందస్సు రూపంలో నున్న కవిత్వాన్ని గేయకవిత్వమని భావించవచ్చు.[3] 'గేయానికి గీతానికి కొంత భేదముంది. గీతానికి పల్లవి నిత్యమైతే గేయానికి వైకల్పికం"[4]

## గీతం (గేయం) ప్రాచీనత :

అతి ప్రాచీనములైన వేదములలో సామవేదము కూడ గేయమే యనవచ్చును. ఆది వేదమైన ఋగ్వేదములోని కొన్ని మంత్రాలు కూడ గేయముల వంటివనే లాక్షిణకుల అభిప్రాయం. గాన ప్రాశస్త్యం చేతనే నాలుగు వేదాలలోనూ సామవేదమునకు ప్రత్యేక స్థానమున్నది.

"కవిత్వానికి గానగుణం స్వాభావికమైనది. పాట ఆవేశానుభూతుల సమాహారాన్ని వ్యక్తీకరించగల సామర్థ్యం కలది. అది ఒకే ప్రతిలో పాడేది"[5] అని క్రిస్టోఫర్ కాడ్వెల్ భావించాడు.

---

1 అంత్యప్రాసల ముద్ర ఆరుద్ర - వడ్డేపల్లి కృష్ణ సితార - 30 5 1993

2 గీతం గానమిమే సమే - గేయతి ఇతిగీతమ్ గానంచ - ద్వైశబ్దే
లింగభట్టీయ గురుబాల ప్రబోధిక ముద్రణ 1953 పుట 140

3 ఆధునికాంధ్ర గేయకవిత్వం - డా జి చెన్నకేశవరెడ్డి పుట 1

4,5 తెలుగులో ఉద్యమగీతాలు డా ఎస్వీ సత్యనారాయణ పుట 438

లిఖిత వాఙ్మయం కంటె మౌఖిక వాఙ్మయమే ప్రాచీనమైనది. మౌఖిక వాఙ్మయంలో చాలావరకు గేయవాఙ్మయమే చోటు చేసుకుంటుంది. వేదాలు కేవలం వినికిడితో నేర్పబడేవి. కావున 'శ్రుతులు'గా పేరుకెక్కాయి. ఆది కవియైన వాల్మీకి క్రౌంచ మిధునంలో నొక పక్షిని వేటగాడు బాణంతో కొట్టి చంపగానే ఆగ్రహావేశంతో అప్రయత్నంగా పలికిన 'మానిషాదం' కూడ గేయలక్షణంతో కూడుకున్నదే. వాల్మీకి రామాయణ రచన పూర్తిచేసి కుశలవులకు ఉపదేశించే సందర్భంలో "పాఠ్యే గేయేచ మధురం - ప్రమాణైస్త్రిభిరన్వితమ్, జాతిభిస్సప్తభిర్బద్ధం- తంత్రీలయ సమన్వితమ్...కావ్యమే తదగాయతామ్" అన్నట్లు రామాయణంలో ఉన్నది. అనగా రామాయణం గానయోగ్యమని తెలుస్తున్నది. భారత, భాగవతంలోని భగవద్గీత, భ్రమర గీతాదులు కూడ గానయోగ్యతను పేరులోనే చాటుతున్నవి. వాల్మీకి కవి రామాయణంలో 'తంత్రీలయ సమన్వితమ్' అనే మాటను అనేక సందర్భాలలో వాడాడు. ఆంగ్లపదమైన 'Lyre' అనే మాటకు ఇది చక్కగా సరిపోతుంది. 'Lyre' అను U ఆకారపు వాయిద్యం మీద పాడుకోవడానికి వీలైన దానినే Lyric అంటారని నిఘంటువు వివరిస్తోంది.[1] అంటే 'Lyre' అనే జంత్ర వాద్య సహకారంతో పాడే రచనల్ని 'Lyrics' అంటారు.

మన రామాయణ కావ్యంతో పోల్చదగిన ఇలియడ్ (Iliad), ఒడిస్సీ (Odessy) అనే రెండు మహాకావ్యాలను రచించిన గ్రీకుకవి హోమర్ (Homer) కూడా ప్రభువుల ఆస్థానాలలో 'లైరు' అనే వాద్యసహాయంతో కావ్యాలను పాడి వినిపించేవారని ప్రతీతి. సుప్రసిద్ధ విమర్శకుడు సి.ఎమ్.బౌరా (C.M.Boura) 'Primitive Song' అనే గ్రంథంలో ప్రాచీన శిలాయుగం నాటి ఆదిమానవులు, ఆటవికులు పాడుకున్న పాటలెలావుండేవో శాస్త్రీయమైన సమ్యక్ దృష్టితో చక్కని ప్రతిపాదనలు చేయడమేగాక క్రీ.పూ. 2350 ప్రాంతంలో పెపి-I (Pepi-I) ప్రభువు సైనికులు ఈజిప్టుదేశ గీతాన్ని పాడుకున్నారని, అదే అతి ప్రాచీన ఈజిప్ట దేశభాషాగీతమని జె.బి. ప్రిఛార్డ్ (J.B.Pritchard) 'Ancient near Eastern Texts') అనే గ్రంథంలో రాసినట్లుగా తెలిపాడు.

కావున భాష ఎంత ప్రాచీనమైనదో గేయం కూడా అంత ప్రాచీనమైనదేయని చెప్పవచ్చు!

### భావగీతం :

అన్నమాచార్య గేయరచనలను సంకీర్తనలని, క్షేత్రయ్య గేయాల్ని పదాలని, త్యాగయ్య గేయాల్ని కృతులని, రామదాసు రచనల్ని కీర్తనలని పరిమితార్థంలో విమర్శకులు వాడుతున్నా, పదాలన్నిటినీ సమానార్థకాలుగా వ్యవహరించిన సందర్భాలూ వున్నాయి. కాబట్టి గేయం-గీతం, పదం-పాట అనే మాటలను సామాన్యార్థంలో సమానార్థకాలుగానే వాడుతున్నారు.

1 *Oxford Dictionary : పుట 746*

పదం గీతానికి పర్యాయపదంగా వాడబడినట్లు పైన పేర్కొనడం జరిగింది. అయితే భావగీతం అన్న పదం ఎప్పటినుండి వాడుకలోనికి వచ్చిందో పరిశీలిద్దాం!

రాయప్రోలు వారి కావ్యములో 'భావపదము' 'భావగీతము' తొలిసారిగా అగుపించాయి.[1] తరువాత విశ్వనాథ గిరికుమారుని ప్రేమగీతములలో 'ఈ ప్రణయ భావగీతము లివియ' అని, కృష్ణశాస్త్రిగారి 'ఊర్వశి'లో 'అపూర్వ మధుర రక్తి స్ఫురియించుగాని అర్థముగాని భావగీతమ్ములివి'అని 'బావగీతం' పదప్రయోగం జరిగింది.

భావకవిత్వమను పదమును గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఆంధ్రపత్రిక సహాయ సంపాదకులుగా నున్నప్పుడు సృష్టించారని డా.గిడుగు సీతాపతిగారు తమ History of Telugu Literature (Part-II) లో వ్రాశారు. గాడిచర్లవారీ పదమును మాటిమాటికి ఆంధ్రపత్రికలో ప్రయోగింపగా ఇది నాటి కాలంలో నవ్యకవిత్వమునకు పర్యాయపదంగా రూఢి కెక్కింది.

భావకవిత్వమును నిర్వచించినవారిలో పంచాగ్నుల, విశ్వనాథ గణనీయులు. "కవియొక్క ఒక అవిస్పష్ట వాంఛాంకురము ఒక అంతర్నిగూఢ తాపము, ఒక చిన్న కావ్యములో ఊదబడినచో అది భావకవిత్వమని" విశ్వనాథవారన్నారు. ఇది ఆంగ్ల విమర్శకుల 'Lyrical Poetry' కి సమమైన నిర్వచనంగా వుంది. నిర్వచనం "The lyric has the function of revealing, interms of Pure art, the secrets of inner life, its hopes its fantastic Joys, its sorrows, its delirium"[2]

కావున పాడుకోవడానికి వీలైన భావ-రాగ ప్రధానమైన రచననే భావగీతమని పేర్కొనాలి. సాధారణంగా భావము లేనిదే ఏ రచనా సాగదు. ఒకవేళ సాగినా ఏ భావమూ ప్రకటించలేనిది అసలు రచనయే కాదు.

ఇంతవరకు పదం-గీతం స్వరూపం పరిశీలితమైంది. ఇక గీతానికి-జానపద గీతానికి గల సంబంధ బాంధవ్యాల్ని పరిశీలిద్దాం!

## భావగీతం - జానపదగీతం:

సర్వసామాన్యంగా సాహిత్యం గ్రంథాల మూలంగా ప్రచారం పొందితే. జానపద సాహిత్యం మౌఖికంగానే ప్రచారాన్ని పొందుతుంది. ఇటీవల రేడియో, దూరదర్శన్, క్యాసెట్ల ద్వారా విస్తృత ప్రచారాన్ని జానపదసాహిత్యం పొంద గలుగుతోంది.

జానపదగేయ సంగీత రీతుల్ని కూలంకషంగా పరిశోధించి గానకచేరీలు గావించిన వింజమూరి సీత-అనసూయలు జానపదగేయ సాహిత్య ప్రచారవ్యాప్తికై విశేష కృషి సలిపారు. వాఙ్మయంలో జానపదగేయ వాఙ్మయ స్థానమేదో ఇదమిత్థమని శాస్త్రీయ దృక్పథంతో తేల్చి చెప్పగలిగిన రచయిత శ్రీ హరిఆదిశేషువు. ఈయన తెలుగుభాషాసమితి మద్రాస్ వారు 1952-53లో నిర్వహించిన ఉత్తమ

---

1 పాడవమ్మ గీతాసఖీ భావపదము - తెనుగుతోట-రాయప్రోలు పుట 313

2 ఆధునికాంధ్ర కవిత్వం (ప్రథమ ముద్రణ) - డా సి నారాయణరెడ్డి పుట 321

గ్రంథ రచనల పోటీలో 'జానపదగేయ వాఙ్మయ పరిచయం' అనే గ్రంథరచనకు గాను బహుమతి నందుకొన్నారు జానపదగేయాలపై విస్తృతమైన పరిశోధన చేసి డా. బిరుదురాజురామరాజుగారు 1955లో డాక్టరేటు పట్టా పొందారు.

సాహిత్య దృష్టితోనే గాకుండా, సంగీతశాస్త్ర దృష్ట్యానూ జానపద వాఙ్మయం ముఖ్యంగా గేయవాఙ్మయం పరిశీలనార్హమవుతోంది. క్రూరజంతువులను చూసి భయవిహ్వాలుడవడం చేతనో లేక కుందేలు చేజిక్కినప్పుడు ఉత్సాహంచేతనో ఆదిమానవుడు మైమరచి వేసిన కేకల్లోనే ఉదాత్తానుదాత్త స్వరిత ధ్వనులుత్పన్న మవుతాయి. కోయిల కూతకు 'కూ' యని మారుకూసే ఉత్సాహవంతుడైన బాలుని నోట పంచమస్వనం ఉత్పన్న మైందనడం సత్యదూరము కాబోదు. "సహజంగా సృష్టిలో విన్పించిన మధురస్వనాల్ని అనుసరించి మానవులాలపించిన ఆలాపనలతో గేయముత్పన్నమైందనీ, అది అపరిష్కృతమై ప్రజలతో పాటే పెరిగి వారి నిత్యజీవితంతో పెనవేసుకుని వృద్ధి అయినదని విజ్ఞులు భావిస్తున్నారు. అంటే జానపద గేయాల్లో, ప్రజలు పాడే పాటల్లో ఆ దేశ సంస్కృతి నిబిడీకృతమై వుంటుంది.[1]

ప్రతిజాతి కవితాసంపదకు జానపదకవిత మూలకందం. జానపదగీతం శిష్టభావగీతానికి మౌలికస్వరూపం.

తత్త్వమునుసరించి కవిత్వము నంతటిని రెండు బృహత్ విభాగములుగా విడదీయవచ్చును. ఒకటి చేతనాకృతము(Creation of the conscious artist) రెండవది తద్భిన్నము. మొదటిది భావుకుడైన కవి ప్రయత్నమున దిద్ది తీర్చబడునది.[2] అదే భావగీతము. రెండవది పామరుడైన జానపదుని సృష్టి - ఇదే జానపదగీతము. శిష్ట సాహిత్యమునకు, జానపద సాహిత్యమునకు గల లక్షణములు వేరువేరైనను ప్రయోజనము మాత్రమొకటియే. శిష్టసాహిత్యమైన భావగీతాలు పండితులకే పరిమితం. కాని జానపదగీతాలు నూటికి తొంబది వరకుండే పామరులందరికీ ఉపకరించునవి. జానపదగీతాలలో ఆ దేశ సంస్కృతేగాక, ప్రాంతభేదము, ఆచార వ్యవహారము, మాండలిక పదంలో తొంగి చూసే బాసయాస మొదలగునవన్నీ దర్శనమిస్తాయి. ఛందోబందోబస్తులకు లొంగక స్వేచ్ఛగా నర్తిస్తాయి. ఉదాహరణకు-

'చందమామ రావే జాబిల్లి రావే', 'కస్తూరి రంగ రంగా మాయన్న కావేటిరంగ రంగా', మొదలగు బాలలగేయాల్ని

'మల్లెపూలా తెప్పగట్టి, తెప్పమీదా తేలిపోదాం గదరా చల్ మోహనరంగా', 'ఆకులు పోకలియ్యకురా, నా నోరంత ఎర్రగ జెయ్యకురా!' మొదలగు శృంగార పదాల్ని

---

1 జానపదగేయ వాఙ్మయ పరిచయము-హరి ఆదిశేషువు (నవ్య విజ్ఞాన ప్రచురణలు 1967) పుట 4

2 త్రివేణి (ఆంధ్రదేశ జానపదగేయాలు) - తెలుగు విశ్వవిద్యాలయం 1986 ముద్రణ పుట 1

'ఏటికేతం బెట్టి - ఎయిపుట్లు పండించి
ఎన్నడో మెతుకెరుగనన్నా'

మొదలగు కన్నీటి పాటల్ని జానపదగీతాలుగా చూపవచ్చు-

జానపదగీత ముఖ్యలక్షణాలివి - 1. అజ్ఞాత కర్తృత్వం లేక సామూహిక కర్తృత్వం. 2. రచనా కాలం తెలియకపోవటం. 3. మౌఖిక ప్రచారం. 4. గేయత్వం 5. ఆశురచనం 6. జనసామాన్య పరిచితవస్తువు.[1]

ఇందుకు భిన్నంగా ఏకకర్తృత్వంగా, గ్రాంధిక లేక వ్యావహారిక భాషలో మాత్రాచ్ఛందస్సును పాటిస్తూ, రచనా కాలాన్ని తెలియపరుస్తూ, ఆలోచించి శబ్దార్థముల కూర్చుతూ సాగించే గేయసాహితీ ప్రక్రియ భావగీతం. ఉదాహరణకు బసవరాజు అప్పారావుగారి

"కొల్లాయి జుట్టితేనేమి - మా గాంధి
కోమటై పుట్టితేనేమి."

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి

"ఆకులో ఆకునై - పూవులో పూవునై
ఈ అడవి దాగిపోనా? ఎట్లయిన - ఇచటనే ఆగిపోనా?"

అడివి బాపిరాజుగారి

"లేపాక్షి బసవయ్య! లేచిరావయ్య"

మొదలగునవెన్నో భావగీతాలుగా నిరూపించవచ్చు!

ఇలా భావగీతం - జానపదగీతం మధ్యగల వ్యత్యాసాల్ని వివరంగా చూపవచ్చు!

ఇక భావగీతానికి 'లలితగీతం' అనే పేరు ఎలా వచ్చిందో పరిశీలించాల్సి వుంది.

## భావగీతం - లలితగీతం :

క్షేత్రయ్య పదాలు, త్యాగరాజు కృతులు రాగ నిర్దేశంతో సాగే రచనలు. త్యాగరాజస్వామి రచించిన 'ఎందరో మహానుభావులు - అందరికీ వందనాలు' అనే కృతిని ఏ రాగంలో పాడుకోవడానికి నిర్దేశించారో అదే రాగంలో పాడుకోవాలి తప్ప వేరే రాగంలో పాడడానికి వీలులేదు. ఒకవేళపాడే ప్రయత్నం చేసినా ఎవరూ ఒప్పుకోరు ఎందుకంటే ఇది శాస్త్రీయ సంగీత బద్ధమైంది. అంటే త్యాగరాజ కృతులన్నీ సంగీత ప్రధానమైన శాస్త్రీయ గీతము లనదగినవి. కావున ఇవి లలితగీతాల కోవలోకి రావు.

1 త్రివేణి (ఆంధ్రదేశ జానపదగేయాలు) తెలుగు విశ్వవిద్యాలయ ద్వితీయ ముద్రణ పుట ॥

అలా శాస్త్రీయ సంగీతంలో గాక సులువుగా కేవలం శ్రుతి-లయ బద్ధంగా లలితసంగీతంలో పాడుకోగల గీతాలను లలితగీతాలనవచ్చును. ఒక లలితగీతాన్ని ఒక్కో గాయకుడు ఒక్కో రాగంలో పాడుకునే సౌలభ్యమున్నది. ఏ భావగీతమునైనా రాగయుక్తంగా లలితసంగీతంలో పాడుకోవచ్చు! కావున దానిని లలితగీతంగా పేర్కొనవచ్చు! పదలాలిత్యం, స్వరలాలిత్యం కలిగివుండుటచేత కూడ లలితగీతమని సంభావించవచ్చు! సరళమైన బాణీలతో తక్కువ వాయిద్యాలతో సులువుగా పాడుకోవడానికి వీలయ్యేది ఆధునిక సంగీతమని, అదే లలితసంగీతమని ముందే 'ప్రవేశిక'లో ప్రస్తావించడమైంది. Light Music అనే ఆంగ్లపదం కూడా దానినే ధృవీకరిస్తోందిలా-

"Light term applied to music supposedly not requiring the listeners full concentration; light orchestra, orchestra providing this. So also light opera, imprecise non-technical term sometimes used by laymen in opposition to grand opera (also imprecise) and not clearly distinguishable from operetta-"[1]

"లలితగీతమనే పదం లలితసంగీతం ద్వారాను, లలితసంగీతం అనే పదం ఆకాశవాణిద్వారా వ్యాప్తిలోకి వచ్చాయి. 1942లో ఆకాశవాణి మద్రాస్ కేంద్రం నుంచి 'గీతావళి' పేరుతో మొదట లలితగీతాల ప్రసారం ప్రారంభమైంది. 1950 తర్వాత 'గీతావళి' కి హిందీలోని 'సుగమ్ సంగీత్' ప్రభావం వల్ల 'లలిత సంగీతం' పేరు స్థిరపడింది. మద్రాస్ కేంద్రంలో లలితసంగీత కార్యనిర్వాహకునిగా పనిచేసిన బాలాంత్రపు రజనీకాంతరావు నాటి ప్రసిద్ధ కవుల భావగీతికలను స్వరకల్పన చేసి గీతావళి కార్యక్రమంలో ప్రసారం చేసే వారు. టంగుటూరి సూర్యకుమారి, 'మామిడి చెట్టును అల్లుకున్నదీ మాధవీలతొక్కటీ', 'ఒంటిగా నుయ్యాలలూగితివా? నా ముద్దు కృష్ణా' మొదలైన గీతాలను, బందా కనకలింగేశ్వరరావు 'గుత్తొంకాయ కూరోయ్ బావా', 'పన్నెండేళ్ల చిన్నాడే-పైటకొల్ల గొన్నాడే' మొదలైన గీతాలను పాడి బసవరాజు గీతాలకు గ్రామఫోన్ రికార్డుల ద్వారా విశేష ప్రచారాన్ని కల్పించారు. దేవులపల్లి కృష్ణశాస్త్రి గీతాలనేకం లలితగీతాలుగా ప్రసారమైనవే."[2] కాని "సుగమ్ సంగీత్" కంటె ముందే 'లలితసంగీతం' అదే పేరుతో ఆకాశవాణిలో ప్రవేశించినట్లు ఇటీవల శ్రీబాలాంత్రపు రజనీకాంతరావు నాతో చెప్పారు.[3]

"తెలుగు 'లలితసంగీతం' ద్రావిడ భాషా కుటుంబంలోని ఇతర భాషల్లో అనగా కన్నడంలో 'భావగీతె' (భావగీతాలు) అను పేరుతో, తమిళంలో 'మెల్లిశై' ('మెల్ ఇశై' అనగా మృదువైన సంగీతమని తమిళార్థం) అను పేరుతో

1. A new Dictionary of MUSIC (Penguin Books) 1976- Page : 216
2. తెలుగు సినిమా పాట - పైడిపాల : పుట : 2151.
3. బాలాంత్రపు రజనీకాంతరావుతో ముఖాముఖి - 28.12 1996

మలయాళంలో 'లలితగానంగళ్' (లలితగానాలు) అను పేరుతో కర్ణాటక, తమిళనాడు, కేరళ రాష్ట్రాలలో ప్రసారం అవుతోంది"[1] అని నా పరిశోధనలో తేలింది.

## నిర్వచనం :

మొత్తానికి తాళం-లయ తప్పకుండా రాగయుక్తంగా పాడగలిగే లాలిత్యపూరితమైన భావగీతం లలితగీతమని స్థూలంగా నిర్వచించవచ్చు! ఇక లలితగీతంతో పాటు తాళం - లయల గూర్చి కూడ వివరంగా తెలుసుకుందాం-

లలితగీతం యొక్క మొదటి ప్రధాన లక్షణం, గేయంగా వుండడం. గేయమంటే పద్యాల మాదిరి గణాలతోగాక మాత్రాగణనాదులతో నడిచేది. గేయం ద్విపదలా రెండేసి పంక్తులకు యతి లేక ప్రాసయతితో సాగిపోతుంది. 4,6,8,10,12 ఇలా సమసంఖ్యలోనే వుంటుంది. ప్రతి పంక్తిలో ఒకే విధమైన మాత్రాచ్ఛందస్సు పాటింపబడుతుంది.

కాల పరిమాణం మీద ఆధారపడేది మాత్రాచ్ఛందస్సు, లేక మాత్రా సంఖ్య నియతంగా ఉండేది మాత్రాచ్ఛందస్సు అని చెప్పవచ్చు!

## మాత్ర :

మాత్రాశబ్దం మా (మాఙ్, మానే) ధాతువు నుంచి నిష్పన్నమైనది. మాత్ర అంటే రెప్పపాటు కాలమని అర్థం. "నిమేషోన్మేషాభ్యాం అన్యతరేణ తులితః కాలః మాత్రా"[2] అని ఛందశ్శాస్త్రాలలో చెప్పిన నియమం. చిటిక వేయడానికి పట్టేకాలాన్ని ఒక మాత్రాకాలం అంటారు. లఘువులు లేక హ్రస్వఅక్షరాలన్నీ ఏకమాత్రికాలు. గురువులు లేక దీర్ఘాక్షరాలన్నీ ద్విమాత్రికాలు. ప్లుతాక్షరాలు త్రిమాత్రికాలు అంటే దీర్ఘాక్షరాల్ని మరొక మాత్రాకాలం సాగదీస్తే ఏర్పడేవి. వీటినే లఘువు = । ; గురువు = U; ప్లుతము = U। గుర్తులతో చూపవచ్చు!

ఉదాహరణకు గురజాడ దేశభక్తి గీతాన్ని ఇలా చూపవచ్చు-

**దేశమును ప్రేమించుమన్నా = 14**
U । । । U U । U U
**మంచి అన్నది పెంచుమన్నా = 14**
U । U । । U । U U
**వొట్టి మాటలు కట్టి పెట్టోయ్ = 14**
U । U । । U । U U
**గట్టి మేల్ తలపెట్టవోయి = 13+1**
U । U । । U । U। ।

1. డా.పి యస్. గోపాలకృష్ణ (ఆకాశవాణి, హైదరాబాద్)తో ముఖాముఖి. 16.2.1997
2. డా కోవెల సంపత్కుమారాచార్య-ఛందఃపదకోశము పుట 3

పై గీతంలో మొదటి మూడు పంక్తుల్లో 14 మాత్రలుండగా 4వ పంక్తిలో 13 మాత్రలే అగుపిస్తున్నాయి. అయితే తలపెట్టవోయి! లోని చివర్లో వో...యి! అని 'వో' ను 2 మాత్రలకు గాక 3 మాత్రలకు సాగదీస్తే 4వ పంక్తి కూడా 14 మాత్రలతో సమంగా వుంటుంది. అంటే ఇందులో 'వో' అనే దీర్ఘాక్షరం మరో లిప్తకాలం పొడిగించబడి ప్లుతమైనది. మొదటి రెండు పంక్తుల్లో యతి లేదు కాని అంత్య ప్రాసమున్నది. కింది రెండు పంక్తుల్లో ప్రాసపాటింపబడింది (వాట్టి-గట్టి)

లలితగీతంలోని మొదటి ప్రధాన లక్షణమైన గేయగుణం పై గీతంలో రూఢి అవుతోంది. రెండవ లక్షణం లయ-తాళం కలిగివుండడం.

## లయ :

గీతం / గేయం తాళ లయానుగుణంగా నడుస్తుంది. 'లయ' గీతానికి జీవం. లయ తాళాలను గూర్చి సంగీతశాస్త్ర గ్రంథాలలో సూక్ష్మవివేచనం చేయబడింది. "లయ సహజ సిద్ధమైనది. తాళము కళాధర్మముగా లయనుండి వర్ధిల్లినది. తాళము శాస్త్రము తెలిసినవారే సంప్రదాయముననుసరించి చూపగలరు. కాని లయ మాత్రము సాధారణంగా అందరూ చేతులుతట్టిగాని, తప్పెట తట్టిగాని చూపగలరు. తాళమునకు మొదటి మెట్టు లయ. అది త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ గతులలో నుండును"[1] అని డా. గిడుగు సీతాపతిగారు నిర్వచించారు.

## తాళం :

సంగీత రత్నాకరకారుడు తాళాధ్యాయంలో తాళశబ్ద వ్యుత్పత్తిని, అర్థాన్నీ ఈ విధంగా వివరించాడు. "తల ప్రతిష్ఠాం" అనే ధాతువు ప్రయోగం వల్ల తాళశబ్దం పుట్టింది. ఈ తల ధాతువు ప్రతిష్ఠార్థతం కావడంవల్ల నృత్య, గీత వాద్యాలు తాళంలో ప్రతిష్ఠితమై వున్నవి. హస్త ద్వయ సంయోగ వియోగములు కలిగి దశప్రాణాత్మకమైన కాలమే తాళం. కాలం-క్రియ-మానం ఈ మూడూ చేరి ఏకకాలంలో కలుగుతున్నప్పుడు తాళం ఉత్పత్తి అవుతుంది. క్షణాదికము కాలం, కొట్టబడిన రెండు వస్తువుల చేరిక క్రియ, క్రియల మధ్య ఉండే విశ్రాంతి కాలం మానం"[2] తాళం సంగీత కాలాన్ని తెలుసుకోవడానికి ఉపయోగపడే ఒక ప్రమాణం అని చెప్పుకోవచ్చు. సామాన్యంగా రసజ్ఞులు ఏపాటనైనా వింటున్నప్పుడు చేతితో చిటిక వేయడమో, గాయకులు పాడే సమయంలో తొడపై తాళం వేసుకోవడమో చేస్తూండడం మనం చూస్తూనే వుంటాం. అంటే తాళం పాటల గతుల్ని తెలియజేస్తుంది. అట్టి తాళముల పట్టికను డా. గిడుగు సీతాపతిగారిట్లు తమ "తెలుగులో ఛందోరీతులు" లో ప్రకటించారు.

---

1. *తెలుగులో ఛందోరీతులు (విశాలాంధ్ర పబ్లికేషన్స్ : తొలి ముద్రణ. 1961) డా గిడుగు సీతాపతి. పుట : 68*
2. *"తాళస్తల ప్రతిష్ఠాయా మితిధాతో . ప్రయోగతః*
*నృత్తం గీతం తథా వాద్యం యతస్తాలే ప్రతిష్ఠితం"*

| తాళముల పట్టిక | | | | | |
|---|---|---|---|---|---|
| సప్తతాళములు అందలి భాగములు | (5)జాతులు - త్ర్యస్ర (3) మూడుమాత్రలు | చతురస్ర (4) నాలుగు మాత్రలు | ఖండ (5) ఐదు మాత్రలు | మిశ్ర (7) ఏడు మాత్రలు | సంకీర్ణ (9) తొమ్మిది మాత్రలు |
| ఏకతాళము 1 | 3 | 4 | 5 | 7 | 9 |
| రూపకము 01 | 2+3 =5 | 2+4 =6 | 2+5 =7 | 2+7 =9 | 2+9 =11 |
| త్రిపుట 100 | 3+2+2 =7 | 4+2+2 =8 | 5+2+2 =9 | 7+2+2 =11 | 9+2+2 =13 |
| మఠ్య 101 | 3+2+3 =8 | 4+2+4 =10 | 5+2+5 =12 | 7+2+7 =16 | 9+2+9 =20 |
| జంపె 100 | 3+1+2 =6 | 4+1+2 =7 | 5+1+2 =8 | 7+1+2 =10 | 9+1+2 =12 |
| అట 1100 | 3+3+2+2 =10 | 4+4+2+2 =12 | 5+5+2+2 =14 | 7+7+2+2 =18 | 9+9+2+2 =22 |
| ధ్రువ 1011 | 3+2+3+3 =11 | 4+2+4+4 =14 | 5+2+5+5 =17 | 7+2+7+7 =23 | 9+2+9+9 =29 |

పై పట్టికను బట్టి గ్రహించాల్సిన విషయములు:

1. ఏకతాళము గతిని మాత్రమే తెలియజేయును.

2. వెరసి 5 మాత్రల ఖండజాతి ఏకతాళమందు, త్ర్యస్రజాతి రూపకమందు గలవు. 'నినుదలతు' అను పదమును త్ర్యస్రజాతి రూపకమనియు, ఖండజాతి ఏకతాళమనియు చెప్పవచ్చును.

= వెరసి 6 మాత్రలు గలవి చతురస్ర జాతి రూపకమందును, త్ర్యస్రజాతి జంపెయందును, రెండు ఆవృతులు గల త్ర్యస్ర జాతి ఏకతాళమందును గలవు.

ఎట్టి సాహిత్య పదములకు ఏది ఎక్కువ శ్రావ్యముగా నుండునో గ్రహించి తాళగతి నిర్ణయించుకోవలెను.

ఉదా : శ్రీరామా, రఘురామా, రామునితో
చిలుకలతో నీ పలుకులు......

ఈ పల్లవి చతురస్ర జాతి రూపకతాళము (2+4)లో చక్కగా నడుచును. అలాగే

'చిలుక పలుకు, చిల్కలతో, చిలకలతో,
నీవు సదా లేదనియో....'

త్ర్యస్ర జాతి జంపెలోను, ఏకతాళము లోను త్ర్యస్రగతిలో నడచును.

'హరే రామ హరే రామ
రామ రామ హరే హరే...'

ఇది త్ర్యస్రగతి ఏకతాళములోనే చక్కగా నడచును.

3. వెరసి 7 మాత్రలు గలవి మిశ్రజాతి ఏకతాళమందును అనగా మిశ్రగతి (3+4) లోనూ, ఖండజాతి రూపకము (2+5) లోనూ త్ర్యస్ర జాతి త్రిపుట (3+2+2) లోను, చతురస్రజాతి జంపె (4+1+2) లోను వుండును. ఏది ఎక్కువ ఉపయుక్తంగా వుంటే దానినే గ్రహించవలెను.

**ఉదా : 1. కనులు మూసిన కనులు తెరచిన
కానుపించిన దొక్కరూపే....**

ఇది మిశ్రగతి ఏకతాళములోను, త్ర్యస్రజాతి త్రిపుట (3+2+2) లోను నడచును

**2. రావలెనుగా, పోవలదురా
ఎటజూచినా, కనుగొంటివే
కలకాలమును, బ్రదుకేటికే...**

ఇది ఖండజాతి రూపకము (2+5) లోనూ, చతురస్రజాతి జంపె (4+1+2) లోను నడచును.

4. వెరసి 8 మాత్రలు గలవి చతురస్రజాతి ఏకతాళములో రెండు ఆవృతులలోను అనగా చతురస్రగతిలోను, చతురస్రజాతి త్రిపుట లోను అనగా ఆదితాళములోనూ, త్ర్యస్రజాతి మత్యలోను, ఖండజాతి జంపెలోను గలవు.

**ఉదా : 1. చిలుక పలుకులకు వానికే తగును
నీవు నీ పదవి, తాను తనమదిని....**

త్ర్యస్రజాతి మత్య తాళము (3+2+3) ఎక్కువగా అమరును.

**2. రామునికి సదా తన మదికి సదా
శ్యామసుందరా, రాఘవేంద్రునకు**

ఇది ఖండజాతి జంపె తాళము (5+1+2) నకు శ్రావ్యమైనది.

**3. చల్లగాలిలోన తిరుగుచుందువేని జలుబు చేయు**

ఇందులో 24 మాత్రలున్నవి. మూడు ఆవృతులలో ఇది ఆదితాళమున నడువదా? అంటే నడువదు. ఎందుకనగా మొదటి ఆవృతి 8 మాత్రలకు తెగినా రెండవది తెగలేదు.

5. వెరసి 9 మాత్రలు గలవి మిశ్రజాతి రూపకములోను, ఖండజాతి త్రిపుటలోను, సంకీర్ణజాతి ఏకతాళములోను కలవు.

**ఉదా :- నీ చిలుక పలుకులు, శ్రీరామచంద్రుడు
బలవంతమేటికి బలహీనుడయినను-**

మిశ్రజాతి రూపకము (2+7) లోను, ఖండజాతి త్రిపుట (5+2+2) లోను చక్కగా నడచును. సంకీర్ణ జాతి ఏకతాళములో కూడ నడిపించవచ్చును. 3+3+3=9 గనుక త్ర్యస్రగతి గణములు కూడ ఈ సంకీర్ణజాతి ఏకతాళమునకు సరిపోవును.

మిగతావి ఈ రీతిగానే గ్రహింపవచ్చును.

## లలితగీత లక్షణ నిర్దేశము :

పై చర్చను బట్టి లలితగీత ప్రధాన లక్షణాల్ని ఈ విధంగా నిర్దేశించవచ్చు! 1. పల్లవి - చరణాల గేయత్వము. 2. లాలిత్యము 3. ఏకకర్తృత్వము 4. తాళం - లయసమన్వితము 5. పరమార్థలక్ష్యము

ఈ ఐదు ప్రధాన లక్షణాలుంటే ఏ గీతమైనా లలితగీతంగా ఏ గాయకుడైనా రాగయుక్తంగా పాడుకోగలడు. వీలునుబట్టి, విరుచుకునే విధానాన్ని బట్టి రకరకాల గాయనీ గాయకులు వివిధ రాగాలలో పాడుకోవచ్చు! త్యాగరాజాది వాగ్గేయకారుల రచనల్ని వారు నిర్దేశించిన రాగంలోనే పాడాల్సిన నిర్బంధముండగా, లలితగీతాల కట్టి నిర్బంధం లేదు. గీతంలో రచయిత పొందుపరచిన భావాన్ని బట్టి ఒదిగిన రాగాన్ని బట్టి గాయనీగాయకులు ఎలుగెత్తి పాడి రసజ్ఞుల ఎదల్ని రంజింపజేయడమే లలితగీత పరమార్ధ లక్ష్యం! పరమార్థమంటే ప్రకృతినీ, పరమేశ్వరుణ్ణీ స్తుతిస్తే అందులో ఆరాధనయే పరమార్థం. ప్రేయసిని వర్ణిస్తే శృంగారమే పరమార్థం. దేశాన్ని, ప్రజల్ని ప్రబోధిస్తే ఉపదేశమే పరమార్థం!

పదాలు, కీర్తనలు, కృతులలో మాదిరిగా లలితగీతాలలో పల్లవి, అనుపల్లవి విధిగా వుండాల్సిన పనిలేదు. కాని గీతంలోని ప్రథమ పాదాల్నే పల్లవిగా పాడుకోవచ్చు! రెండునుండి ఎన్ని చరణాలనైనా చేర్చుకోవచ్చు! కాని సాధారణంగా ప్రతి గీతానికి రెండు, మూడు చరణాలే వుంటాయి. ప్రతి చరణంలో నాలుగు పంక్తులుగాని లేక అంతకు మించిగాని వుండవచ్చు! పల్లవి ఒక గతిలో చరణాలన్నీ మరొక గతిలో సాగవచ్చు!

పద్యంలో పాదం (చరణం) అంటే ఒక పంక్తి అనే అర్థం వుండగా గీతంలోని చరణానికి మాత్రం నాలుగు పంక్తులనే అర్థం వుంది. ఇది గమనించాల్సిన విషయం! ఈ విధంగా లలితగీతానికి రేఖామాత్రంగా ఒక లక్షణాన్ని ఏర్పరచవచ్చు! "పల్లవి-చరణాల గేయత్వం, లాలిత్యంతో తాళ-లయ సమన్వితమై పరమార్థ లక్ష్యము గలది లలితగీతం'' అని స్థూలంగా నిర్వచించవచ్చు!

ఉదాహరణగా దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ఈ క్రింది గీతాన్ని చూపవచ్చు!

రామచరణం రామచరణం!
రామచరణం మాకు శరణం!
మాకు చాలును మౌని మస్తక

భూషణం శ్రీరామ చరణం!
........................................ ॥ రామ ॥
రాగయై ఈ బ్రతుకు చెడి రా
యైన వేళల రామచరణం!
మూగయై పెను ధూళి పడి మ్రో-
డైన వేళల రామచరణం!
........................................ ॥ రామ ॥
కోతియై ఈ మనసు నిలకడ
కోలుపోతే రామచరణం!
సేతువై భవ జలధి తారణ
హేతువైతే రామచరణం!
........................................ ॥ రామ ॥
నావలో తానుండి మము న-
ట్టేట నడిపే రామచరణం!
త్రోవలో కారడవిలో తో-
డ్తోన నడిచే రామచరణం!
........................................ ॥ రామ ॥
ఆదరించే రామచరణం!
సేద దీర్చే రామచరణం!
మాకు చాలును రామచరణం
నుండి రాలిన మధుకణం....!
........................................ ॥ రామ ॥

లలితగీత లక్షణాలలో మొదటిదైన పల్లవి-చరణాల గేయత్వం ఇందులో అగుపిస్తోంది. రెండవదైన లాలిత్యలక్షణం తెలుస్తోంది. మూడవది రచయిత దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ఏకకర్తృత్వాన్ని చాటుతోంది. నాలుగవది తాళలయ సమన్వితం. ఇది పరిశీలిద్దాం!

'రామచరణం రామచరణం!' అనే మొదటి నాలుగు పంక్తులు పల్లవిగా, మిగతావి చరణాలుగా సాగిపోయినట్లు స్పష్టమవుతోంది. సామాన్యంగా 3,4 చరణాలతో ముగియాల్సిన ఈ గీతం పది చరణాల వరకు విస్తరించింది. రామాయణమంతా రమ్యంగా చెప్పడానికి 3,4 చరణాలు చాలలేదు. అందుకే కవి 10 చరణాల వరకు పారవశ్యంతో రచన చేశాడు. అయినా మనం అవసరం మేరకే పరిగ్రహించే వీలుంది. పల్లవి, చరణాలన్నీ 14 మాత్రల గేయంగా మిశ్రగతి (3+4)లో 'రామ+చరణం' గా విరుగుతూ చక్కగా నడిచింది. పై నుదహరించిన తాళముల పట్టిక ఆధారంగా యీ గీతాన్ని మిశ్రజాతి

ఏకతాళంగా (రామ చరణం) లేక ఖండజాతి రూపకతాళంగా (రా+మచరణం) లేక త్ర్యస్ర జాతి త్రిపుట తాళంగా (రామ+చర+ణం) నూ పాడుకునే వీలుంది. కాని మిశ్రజాతి ఏకతాళంలోనే పైగీతం పాడుకుంటే అర్థవంతంగానే గాక అందంగా వుంటుంది.

ఐదవలక్షణం పరమార్థ లక్ష్యం రామాయణ ముఖ్య ఘట్టాల్ని వర్ణిస్తూ శ్రీరామచరణం మహత్త్వాన్ని కీర్తించడమే దీని పరమార్థ లక్ష్యం. అది ఈ గీతంలో చక్కగా నెరవేరింది కాని చివరి చరణంలోని చివరి పంక్తిలో మాత్రం ......'నుండి రాలిన మధుకణం...'లో 14 మాత్రలకు బదులుగా 12 మాత్రలే వున్నాయి. అయినా '...........ణం....'అంటూ అంతంలో రాగాలాపనతో రెండు మాత్రల పూరణ జరుగుతుంది.

ఇలా ప్రతిపాదించిన లలితగీత లక్షణాలన్నీ పై గీతంలో ప్రతిబింబిస్తున్నాయి. కాబట్టి పైన పేర్కొన్న వాటిని లలితగీతలక్షణాలుగా నిర్దేశించవచ్చు!



# 4. లలితగీత అవతరణం

పూర్వం గేయకవిత్వం జానపదాలలో వాగ్గేయ కారుల పదాలలో విస్తరించి విజృంభించినా దానికి ప్రజాదరణ, పండితాదరణ వుండేదికాదు. పిల్ల వసుచరిత్రలకే తప్ప పల్లెల పైరగాలుల్లాంటి గేయకవితలకు గౌరవం దక్కేదికాదు.

అటు ప్రబంధ కవుల పద్యమార్గంలో పట్టుదలతో గుప్పించే పండిత పాండిత్య యమకాలు, ఇటు క్షేత్రయ్య, త్యాగయ్య మొదలగు వాగ్గేయకారుల ధోరణుల్లో పదకర్తల గమకాలు వేలకు వేలుగా పుట్టుకొస్తున్న రోజుల్లో, సహజ సౌందర్య రాశియైన గేయం విలువ - విశిష్టత అందరికీ బోధపడలేదు. అంధానుకరణమే తప్ప అపూర్వరచనకు శ్రీకారం చుట్టబడలేదు.

అలాంటి సమయంలో గురుతర భావాలతో గురజాడ అవతరించారు. 1910లో సమకాలీన సామాజిక సమస్యలకు అక్షరరూపం కలిగించడానికి వాడుక భాషను ప్రోత్సహించడానికి అనువైనదిగా గేయాన్ని ఎంచుకున్నారు. తనదైన బాణీలో దేశమంటే ఏమిటో, మనుషులంటే ఏమిటో, ఎత్తి చూపుతూ 'దేశభక్తి' గీతాన్ని రచించారు. గురజాడకు ముందు ఎన్నెన్నో గేయరీతులు వచ్చినా అవి శాస్త్రీయ సంగీతాన్ని నిబంధించడానికే పరిమితమైనాయి. అంటే క్షేత్రయ్య, త్యాగయ్య పదకృతుల్ని అనుసరించడం తప్ప కొత్తదారి తొక్కలేదు. రక్తి-భక్తికి తప్ప సమాజ సంస్కరణకు ఉపయోగపడలేదు.

గురజాడకు సమకాలికుడైన కందుకూరి కూడ అనేక సాహిత్య ప్రక్రియల్లో ఆద్యుడుగా నవ్యత సాధించినా, కవితా ప్రక్రియలో మాత్రం పాతదనాన్నే పదిల పరచుకున్నారు. గురజాడలా నవ్యత సాధించలేదు.

## గురజాడకు ముందు గేయరచనలు :

గురజాడకు ముందు సర్వతోముఖమైన సాహిత్య సృజన జరిగిన సందర్భాలు 20వ శతాబ్ది ప్రథమ దశకంలో ఒకటి రెండు లేకపోలేదు. డా.సి.నారాయణరెడ్డి గారు తమ సిద్ధాంత వ్యాసంలో గురజాడకు ముందు కె.వెంకటరత్నం పంతులు (కొక్కొండ వెంకటరత్నం కాబోలు) గారి 'విక్టోరియా మహారాజ్ఞి విజయగీతాన్ని' అజ్ఞాత కవి రచించిన 'మేలుకొలుపు' పాటను, 'మాలవాంద్రపాట'ను పేర్కొన్నారు. అందులో 'విక్టోరియా మహారాజ్ఞి గీతం' ఉత్సాహవృత్తంలో రచింపబడినదైనా గేయరీతిలో ఆధునికత దృష్ట్యా రచనారీతి దృష్ట్యా 'మేలుకొలుపు' పాటను, 'మాలవాంద్ర' పాటను గణనీయంగా పేర్కొనవచ్చు!

డా.సి.నారాయణరెడ్డిగారు 'మేలుకొలుపు' అనే గేయాన్ని మొట్టమొదటి ముత్యాలసరంగా గుర్తించారు. ఈ గేయం గురజాడ 'ముత్యాలసరములు' (తోకచుక్క) కంటె సుమారు ఒక సంవత్సరం ముందుంది. 'ఆంధ్రభారతి' పత్రిక మొట్టమొదటి సంచిక (శా.శ.1831 మాఘసంచిక)లో అచ్చయింది. 1831 శా.శ.

అంటే క్రీ.శ.(1831+78)=1909 అన్నమాట! ఈ సంచికలోనే గురజాడగారి నీలగిరి పాటలోని 'వూటి చోద్యమేమి చెప్తరు' అనే పాట అచ్చయింది. కనుక గురజాడవారీ గేయాన్ని తప్పక చూసే వుంటారు. ఈ గేయం నడకకూ గురజాడ గారి 'తోకచుక్క' నడకకూ భేదమేమీ లేదు. రెండూ మిశ్రగతిలో నడిచేవే! ఉన్న భేదమంతా పాదవిభజనలోనే 'మేలుకొలుపు' గేయాన్ని రెండు పాదాలుగా రచించడం జరిగింది. ప్రాస కూడా రెండు పాదాలకి పాటించడం జరిగింది.

మేలుకొను మీ భరతపుత్రుడ, మేలుకొనుమీ సుజన పుత్రుడ
మేలుకొనుమీ సచ్చరిత్రుడ, మేలుకొనవయ్యా! వత్సా! మేలుకో!
వేడుకను జాతీయతయను-వేగుచుక్క పొడిచెనదుగో
కూడి వందేమాతరమ్మను-కుక్కుటము లరచెన్ ॥వత్సా॥

..........................................................................................

తరలి మూర్ఖాచారములనెడు-తారకంబులు నస్తమించెను
సొరిది తూరుపు దిశను జ్ఞానపు సూర్యుడుదయించెన్ ॥వత్సా॥
అందరును నీకంటె ముందుగ-నడుగువేయుచు మెలగుచుండగ
పందవలెనిటు నిద్రపోవగ-బాడియగునయ్యా! ॥వత్సా॥

మేలుకొలుపు గేయకర్త ఎవరో తెలియదు కాని నవయుగవైతాళికుడైన గురజాడకు ఒక సంవత్సరం ముందుగా 'మేలుకొలుపు' పాడినాడు. ఈ గేయంలో 'వత్సామేలుకో'! అనే పల్లవి తీసివేసి రెండు పాదాల్ని నాలుగు పాదాలుగా రాస్తే అచ్చంగా ముత్యాలసరమే అవుతుంది. గురజాడ కంటె ముందు చిలకమర్తి అల్లిన తేటగీతి, 'భరతఖండంబు చక్కని పాడియావు'కే ప్రేరణగా 15.12.1905 నాటి 'కృష్ణాపత్రిక'లో 'దిక్రై ఆఫ్ మదర్ ఇండియా' శీర్షికన ఒక గొప్ప తొలి ప్రబోధగీతం వెలువడిందని డా.ఎస్వీ సత్యనారాయణ ప్రకటించారు. ఆ గేయం-

"హిందువులారా! ఎన్నాళ్ళీగతి
మందమతులరై మాటికి స్రుక్కగ
యెందుకు నా బ్రతకితరుల కోసము!

..........................................................

దూడ నోరు గొట్టి ద్రోహంబు గొల్లలు
పాడి సమస్తము పరులకమ్ముగతి
కూడులేని నా కొడుకుల గాదని
యేడకో నా ధన మెల్లను బోయెడి
చీమునెత్తురు చిక్కెనోలేదో
ఏమెయిబ్రతుకుదు నీ దుర్దశతో

..........................................................

ఇకనైనను మీరెల్లరు సోదరులై
ప్రకటింపుడు నాపై ప్రేమమ్మును"[1]

1 తెలుగులో ఉద్యమ గీతాలు - డా. ఎస్వీ సత్యనారాయణ. పుట 45, 47

అని సాగుతుందిలా. 'మూతులు బిగియబట్టి', 'పాడియావు', 'గడసరి గొల్లవారు' వంటి పదప్రయోగాల్ని చిలకమర్తి పై గీతంలోని మధ్య పంక్తుల ప్రేరణతోటే రచించినట్లు స్పష్టమవుతోంది.

మందమతులుగా వున్న భారతీయుల్ని మేల్కొనమని తనపై ప్రేమజూపుమని దేశమాత గావించిన 'ఆక్రందన' 'ది క్రై ఆఫ్ మదర్ ఇండియా' గీతం. కాని పత్రికలో ఆనాడు ఈ గీతం రాసిన కవి ఎవరో ప్రకటించక పోవడంతో తొలి గీతం రాసిన కవి అజ్ఞాతంగానే వుండిపోయాడు.[1] కావున ఈ విధంగా కూడా గురజాడ ముత్యాలసరమే మనకు మొదటిగేయమైంది.

## ముత్యాలసరం లక్షణం :

"(3+4) మిశ్రగతిలో మొదటి మూడు పంక్తులూ 14 మాత్రలతో సాగి నాలుగవ పంక్తిలో 7 నుండి 14 వరకు మాత్రలు కలిగి వుండడం ముత్యాలసరం లక్షణం. ఇది గురజాడ చేసుకొన్న నియమం"[2] కాని గురజాడ ఆ నియమాన్ని పాటించక చాలాచోట్ల స్వేచ్ఛగా రచన చేశారు. గురజాడ మొదటి ముత్యాలసరంగా 'ఆంధ్రభారతి'లో 1910 జూలైలో అచ్చయిన రచన పరిశీలిద్దాం!

గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్త పాతల మేలుకలయిక
క్రొమ్మెరుంగులు చిమ్మగా...

..............................................

తూర్పు బల బల తెల్లవారెను
తోక చుక్కయు వేగుచుక్కయు
ఒడయుడౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరసిరి మిన్ను వీధిని

... . .. ..........................................

మేలు కొలుపులు కోడికూసెను
విరులు కన్నులు విచ్చి చూసెను
ఉండి ఉడిగియు ఆకులాడగ
కొసరెనోయన గాలివీచెను

..............................................

మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గ సుఖంబులన్నవి
యవని విలసిల్లున్[3]

..............................................

1 తెలుగులో ఉద్యమ గీతాలు - డా. ఎస్వీ సత్యనారాయణ పుట 45, 47.
2 ఆధునికాంధ్ర కవిత్వం డా సి. నారాయణరెడ్డి (ప్రథమ ముద్రణ 1967) పుట. 226.
3 ముత్యాలసరాలు-గురజాడ (విశాలాంధ్ర ఏడవ ముద్రణ - 1975) పుట 1

గురజాడ పై గీతాన్ని పరిశీలించి చూస్తే, 'మేలుకొలుపు' గీతాన్ని ఒంట బట్టించుకొని అదే మార్గంలో అల్లిన రచనగా తోస్తుంది. యతి, ప్రాస నియమము ఛేదించి, నవ్యత సాధించినట్లు అగుపించినా వస్తువు, శైలి, నడక అన్నీ ప్రతి బింబాలుగానే తోస్తాయి. 'మేలుకొలుపు' లోని 'జాతీయతయను వేగుచుక్క పొడుచుట', 'విజ్ఞానమనియెడు యరుణోదయమగుట', 'చెల్లెనంతఃకలహములనెడు చీకటుల వెల్లన్' అనుట, 'పందవలెనిటు నిద్రపోవగ పాడియగునయ్యా' అని హెచ్చరించుట, గురజాడవారి 'తూర్పు బలబల తెల్లవారెను', 'మందగించక ముందు అడుగెయ్' వంటి పంక్తులలో ప్రతిఫలించాయి. అలాగే 'తరలి మూర్ఖాచారములనెడు తారకంబులు నస్తమించెను.....జ్ఞాన సూర్యుడుదయించెన్' అను పాదములు కూడ గురజాడగారి మూఢాచార కులమతాల్ని పెల్లగించే ప్రయత్నంగా రచించిన 'మతము లన్నియు మాసిపోవును-జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును' పాదాలలో యథాతథంగా చోటుచేసుకోవడం గమనించాల్సిన విషయం. కావున గురజాడ కంటె ముందుగా నవ్యసాహిత్యంలో మొదటి ముత్యాల సరగేయంగా 'మేలుకొలుపు పాట'నే చెప్పాలి. కాని దీని కర్తృత్వమెవరిదో తెలియదు. పైగా సర్వాంగీణత లేదు. అందుచేత సాహిత్య చరిత్రలో గురజాడ రచించిన ముత్యాలసరాలే మొదటి గేయాలుగా నిలిచాయి. గురజాడను నవ్యకవితాయుగకర్తగా నిలిపాయి. పద్యం రాజ్యమేలుతున్న తరుణంలో దేశీయ చ్ఛందస్సును చేపట్టి గేయంలో-అందులో వ్యావహారిక భాషలో సామాజికస్పృహతో సాహసంతో రచన చేసినట్లుగా ముందు గురజాడే అగుపిస్తారు. ముత్యాలసరంగా గురజాడ ముద్దుగా పెరుపెట్టినప్పటికీ ఇది మిశ్రగతిలో 14 మాత్రల పంక్తులతో నడిచే గేయరచనయే!

మొదటి చరణమైన 'గుత్తునా ముత్యాల సరములు...'లోని చివరి పంక్తిలో 'క్రొమ్మెరుంగులు చిమ్మగా' అని 12 మాత్రల్నే పలికించారు. అయితే చివరలో దీర్ఘాక్షరమున్నందున దానిని పాడుకోవడంలో మరి రెండు మాత్రలు సాగదీసే వీలుంది. తర్వాతి చరణాలైన 'తూర్పు బల బల తెల్లవారెను', 'మేలుకొలుపులు కోడికూసెను'......మొదలగు వాటిలో అన్ని పంక్తులూ 14 మాత్రలుగా సాగితే, 'మతములన్నియు మాసి పోవును' అనే చరణం 4వ పంక్తిలో 'యవని విలసిల్లున్' అని 9 మాత్రలతో విరిగిపోతోంది. కాని అలా 9 మాత్రలతో విరిగి పోవడం వల్ల విలువేదో పెరిగినట్లు గాని, సరికొత్త ప్రయోజనమేదో సాధించబడి నట్లుగాని తోచదు.

మతము లన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గ సుఖంబులన్నవి
యవని లోపల ప్రకాశించును
('యవని విలసిల్లున్'కు బదులుగా)

అని చివరి పంక్తిని 14 మాత్రలుగా ఒకవేళ గురజాడ వ్రాసినా అర్థభేదం లేక సవ్యంగానే వుండేది. పైగా పద్యాలలోని వ్యర్థ'న'కారపొల్లు(న్) పదాల్ని త్యజించే ఉద్దేశంతో గేయరచనకు శ్రీకారం చుట్టిన గురజాడ మళ్లీ అదే వ్యర్థ పొల్లు హల్లుల్ని స్వీకరించాల్సిన ఆవశ్యకత అగుపించదు. నవ్యత పేరుతో పాదాన్ని 9 మాత్రలకు త్రుంచినా పొల్లు హల్లును పద్యంలో మాదిరి ఉపయోగించుటలో ప్రయోజనం కనిపించదు. పైగా గీతాలాపనకు అది అవరోధంగా నిలుస్తుంది.

అయితే ఇలాంటి పొల్లు హల్లులు లేక సక్రమంగా సమంగా సాగిన గేయంగా 'దేశభక్తి' గీతం అగుపిస్తుంది. ఇది ఎప్పుడు ప్రచురితమైనదీ తెలుపలేదు, మిగతా వాటిలా. కాని 'దేశభక్తి' గీతం 1910లో రచింపబడినట్లుగా 'ముత్యాల సరాల'కు పరిచయ వాక్యాలు వ్రాసిన వాసిరెడ్డి భాస్కరరావుగారు పేర్కొన్నారు.[1]

'దేశభక్తి' గీతానికి ముందు దానికి సాటివచ్చే మరే గీతమూ అగుపడదు.

భారత జాతీయోద్యమం 1905లో వంగదేశ (బెంగాలు) విభజన ఆంగ్లేయులు గావించాకనే తీవ్రరూపం దాల్చింది. ఆ సందర్భంలో ప్రత్యక్షంగా, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా రాజమండ్రిలో బిపిన్‌చంద్ర పాల్‌గారి ఉపన్యాసము విని ఉద్రిక్తులై చిలకమర్తి లక్ష్మీనరసింహంగారొకటి మాత్రం వ్రాసి చదివారు.[2]

"భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియబట్టి"

ఆ సభనెంతో ఉత్సాహ పరిచిన యీ రచన తేటగీతి యని తేటతెల్లమవుతోంది. ఆ తర్వాత కూడ 1910 వరకు ఎలాంటి ప్రతిభాగీతం వెలువడలేదు. అనగా 1910కి పూర్వం తేటగీతుల్లాంటి పద్యాలే తప్ప అసలు గీతాలు అవతరించలేదు. కాని శా.శ. 1832 (1910) భాద్రపదమాస 'ఆంధ్రభారతి' సంచికలో గురజాడ 'డామన్ పిథియస్'తో పాటు ఈ క్రింది 'మాలవాండ్రపాట' అనే గేయం అచ్చయింది.[3]

అందారు పుట్టీరి హిందమ్మతల్లీకి
అందారు ఒక్కటై ఉండాలి సక్కంగ
కష్టమ్ములొచ్చీన నిష్టూర మొచ్చీన
ఇష్టమ్ముగా నుండి - కట్టూగనుందాము
..............................................................॥అందా॥
వర్ణాల మెక్కువ పుట్టంగ లేదయ్య
మమ్మేల క్రిందీకి క్రుమ్మేరు, మా నోరు
..............................................................॥అందా॥

1. ముత్యాల సరాలు - గురజాడ (విశాలాంధ్ర ఏడవ ముద్రణ'75) పుట VIII
2. ఆధునికాంధ్ర కవిత్వం - డా సి నారె. (1967 ముద్రణ) పుట . 166
3. ఆధునికాంధ్ర కవిత్వం - డా సి నారె (1967 ముద్రణ) పుట 166

తమ్మోల మని మీరు మమ్మోల జూడండి
అమ్మోరు దీవించి అయిశ్వర్యమిచ్చును
.... .................... .... . ....... .................... ....॥అందా॥

ఇది గ్రామ్యంలో అల్లబడిన గేయంగా మాలవారి గోడుగా అగుపడుతోంది. ఇదే గ్రామ్యభాషకు పట్టం గట్టిన 'ప్రథమ గేయం' అస్పృశ్యతకు వ్యతిరేకంగా గొంతెత్తిన ఆనాటి అతి నవ్యగేయం. అయితే ఇంతటి నవ్యత్వమున్నప్పటికీ పామరుల గ్రామ్యంలో రాయబడినందున, అంతగా కవితాగంధం లేనందున గణుతికెక్కలేదు. పైగా ఎవరు రాశారో కూడా తెలియదు. గురజాడ చేత 'లవణ రాజుకల'లో '.....మంచి యన్నది మాలయైతే-మాల నే నగుదున్' అని రాయడానికి కూడా ప్రేరణగా నిలిచిన పైనపేర్కొన్న మొదటిగీత రచయిత పేరు తెలుసుకునే అవకాశం లేకపోవడం విచారించాల్సిన విషయమే! అయినా కవితా గుణంలోనూ-మాత్రాగణంలోనూ మిన్నగా నిలిచే 'దేశభక్తి' నే ప్రథమ గీతంగా అంగీకరించాలి.

"గురజాడ రచనలన్నీ నష్టమైపోయి ఒక్క 'దేశభక్తి' గీతం మిగిలినా చాలు, అతడు ప్రపంచకవులలో ఒక్కడుగా లెక్కించదగిన మహాకవి అని ఋజువు కావడానికి. ఎందువల్లనంటే 'దేశభక్తి' గీతం సమస్త ప్రపంచ మానవుల జాతీయ గీతం"[1]-అని శ్రీశ్రీ తన అభిప్రాయాన్ని ముత్యాలసరాల పరిచయవాక్యాలలో ప్రకటించడాన్ని గమనించినా 'దేశభక్తి' ముత్యాలసరం నడకలో సాగిన ఉత్తమోత్తమ గీతంగా రూఢి అవుతోంది. లలితగీత సాహిత్య చరిత్రలోనూ మొట్టమొదటి గీతంగా నిలబడుతోంది. ఆ గీతాన్నిక పరిశీలిద్దాం!

**దేశభక్తి**

**దేశమును ప్రేమించుమన్నా**
**మంచి అన్నది పెంచుమన్నా**
**వొట్టి మాటలు కట్టిపెట్టోయి**
**గట్టి మేల్ తలపెట్టవోయి!**[2]

మూడవ పంక్తిలో '.......కట్టిపెట్టోయి' అని ప్రచురించబడింది. కాని ముత్యాల సరంకు 14 మాత్రలే వుండాలి. ఇలాగైతే 15 మాత్రలవుతాయి. అనగా ముత్యాలసరం లక్షణానికే ముప్పు వస్తుంది. అందుచేత దానిని 'వొట్టి మాటలు కట్టిపెట్టోయ్'గా పరిష్కరించుకుంటే 14 మాత్రలకు సరిపోతుంది. 4వ పంక్తిలోని 'గట్టిమేల్ తలపెట్టవోయి' 13 మాత్రలే వున్నందున 'వో....దీర్ఘాక్షరంను ప్లుతంగా పలికితే సమంగా 14 మాత్రలవుతుంది. లేదా అలాకాక 'గట్టిమేల్ తలపెట్టవోయి'ని గట్టిమేల్ తలపెట్టవోయ్'గా మలచుకుంటే 12 మాత్రలవుతుంది. 14 చరణాలున్న యీ గీతంలో ప్రతి చరణంలోని నాలుగవ పంక్తిని పై చరణం మాదిరి 12

1 ముత్యాలసరాలు - గురజాడ పుట IX
2 ముత్యాల సరాలు - గురజాడ పుట 59

మాత్రలుగా మలచుకుంటే అన్నీ ఒకే మాదిరి నడకలో పాడుకోవచ్చు! ఇదే గానానికి అనుగుణంగా వుంటుంది.

5వ చరణమైన 'వెనుక చూసిన కార్యమేమోయ్....'లో 4వ పంక్తిలో 'వెనక పడితే వెనకేనోయి' అని వుంది. మిగతా వాటిలా 12 మాత్రలే వుండాలంటే 'వెనక పడితే వెనకెనోయ్!'గా సరిచేసుకోవాలి. అలాగే 8వ చరణమైన 'ఓర్వలేమి పిశాచి దేశం'లో రెండవ పంక్తిలో 'మూలుగులు పీల్చేసెనోయి' అనివుంది. ఇది 13 మాత్రలే వుంది. కావున 'మూలుగులు పీల్చేసెనోయీ' అని 'యి'ని 'యీ' అని దీర్ఘాక్షరంగా సవరించుకోవాలి.

అలాగే 9వ చరణంలోని (పరుల కలిమికి....) రెండవ పంక్తిలోని 'పాపికెక్కడ సుఖం కద్దోయి' అనే 15 మాత్రల దాన్ని 'పాపి కెక్కడ సుఖం కద్దోయ్? గా పరిష్కరించుకుంటే 14 మాత్రలదవుతుంది.

ఇలా అన్ని చరణాలలో అగుపించే చిన్న చిన్న హెచ్చుతగ్గుల్ని తొలగించి సవరించుకుంటే సరిపోతుంది. అప్పుడు యీ గీతం ప్రతి చరణంలోని మొదటి 3 పంక్తులు 14 మాత్రలుగా 4వ పంక్తి 12 మాత్రలుగా మొత్తం ఒకే తూగులో సాగిపోతుందిలా-

(పల్లవి)

1. దేశమును ప్రేమించుమన్నా - 14 మాత్రలు
మంచి అన్నది పెంచుమన్నా - 14 మాత్రలు
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్ - 14 మాత్రలు
గట్టి మేల్ తలపెట్టవోయ్ - 12 మాత్రలు

2. పాడి పంటలు పొంగిపొర్లే - 14 మాత్రలు
దారిలో నువు పాటుపడవోయ్ - 14 మాత్రలు
తిండి కలిగితె కండ కలదోయ్ - 14 మాత్రలు
కండ కలవాడేను మనిషోయ్ - 14 మాత్రలు
(ఈ ఒక్క చరణంలో మాత్రం అన్ని పంక్తులు సమమాత్రల్లో సాగాయి)

3. ఈసురోమని మనుషులుంటే - 14 మాత్రలు
దేశమేగతి బాగుపడునోయ్? - 14 మాత్రలు
జల్దుకొని కళలెల్ల నేర్చుకు - 14 మాత్రలు
దేశి సరుకులు నించవోయ్! - 12 మాత్రలు

4. అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్ - 14 మాత్రలు
దేశ సరుకుల నమ్మ వలెనోయ్ - 14 మాత్రలు
డబ్బుతేలేనట్టి నరులకు - 14 మాత్రలు
కీర్తి సంపద లబ్బవోయ్ - 12 మాత్రలు

5. వెనుక చూసిన కార్యమేమోయ్? - 14 మాత్రలు
మంచి గతమున కొంచెమేనోయ్! - 14 మాత్రలు

మందగించక ముందు అడుగేయ్! - 14 మాత్రలు
వెనుక పడితే వెనకెనోయ్! - 12 మాత్రలు

..........................................

10. సొంతలాభం కొంతమానుకు - 14 మాత్రలు
పొరుగు వాడికి తోడు పడవోయ్! - 14 మాత్రలు
దేశమంటే మట్టికాదోయ్! - 14 మాత్రలు
దేశమంటే మనుషులోయ్! - 12 మాత్రలు

ఈ దేశభక్తి గీతం 'కృష్ణా పత్రిక'లో 9.8.1913లో ప్రచురితమైనా 1910 లోనే రచించబడింది. ఈ గీతాన్ని లలితగీతానికి నిర్దేశించిన లక్షణాలతో పోల్చుకుంటే వానిలో ప్రథమ లక్షణమైన పల్లవి-చరణాల గేయత్వము, లాలిత్యము ప్రస్ఫుటంగా కనిపిస్తున్నవి. గురజాడ కర్తృత్వంగా రూఢియైనది. ఇక తర్వాత లక్షణం, తాళ-లయ సమన్వితం. అదీ పరిశీలిద్దాం!

దేశమునుప్రే మించు మన్నా
(3+4) (3+4)
మంచి అన్నది పెంచు మన్నా
(3+4) (3+4)

ఇది మిశ్రగతి ఏకతాళంలో లయాన్వితంగా సాగిపోతుంది. మరియు త్ర్యస్రజాతి త్రిపుట తాళంలోనూ సాగిపోతుంది.

దేశ + మును + ప్రే మించు+మ+న్నా
(3 + 2 + 2) (3 + 2 + 2)

ఖండజాతి రూపక తాళంలో పరిశీలిస్తే
దే + శమునుప్రే మిం + చుమన్నా
2 + 5 2 + 5

ఖండజాతి అటతాళంలో చూస్తే
దేశమును ప్రేమించు మ న్నా
5 + 5 + 2 + 2

అని విరుచుకొని పాడాల్సి వస్తుంది.

పై విరుపుల్ని పరిశీలిస్తే ఈ గీతం మిశ్రజాతి (3+4) ఏకతాళానికే సవ్యంగా వుంటుంది. కావున ఇది తాళలయ సమన్వితంగా ఒప్పుతున్నది. ఇక అయిదవ లక్షణం పరమార్థ లక్ష్యము.

దేశమును ప్రేమించడమే గాక మంచిని పెంచాలంటూ మనిషిగా బ్రతకాలంటూ, దేశమంటే కేవలం మట్టికాదు మనుషులేనంటూ జాతిని ఉత్తేజ పరచడమే గాక మార్గోపదేశం చేయడం ఈ గీత పరమార్థ లక్ష్యం. అనగా గేయత్వం, లాలిత్యం, ఏకకర్తృత్వం, తాళ లయ సమన్వితం, పరమార్థ లక్ష్యం అనే ప్రతిపాదిత పంచలక్షణాలన్నీ కలిగివున్న కారణాన యీ 'దేశభక్తి' గీతాన్ని మొదటి అచ్చమైన లలితగీతంగా అంగీకరించవచ్చు! అయితే రాయప్రోలువారి

'ఏ దేశమేగినా'....అనే గీతం కూడ మొదటిదే యన్న వాదం ఒకటి లేకపోలేదు. అది కూడా పరిశీలిద్దాం!

1910లో ప్రచురితమైన గురజాడ ముత్యాలసరముల ప్రభావం తన మీద వున్నట్లుగా, ఆ ప్రభావంతో 'చిల్క' అన్న గేయము రచించినట్లుగా రాయప్రోలుగారే చెప్పినట్లుగా సి.నా.రె. గారు తమ ఆధునికాంధ్ర కవిత్వంలో వివరించారు.[1] రాయప్రోలు తొలి కృతి 'లలిత' 1909లో, మలికృతి 'తృణకంకణం' 1913లో వెలువడ్డాయి. ఈ రెండూ పద్య కావ్యాలే. ఆ తర్వాతనే 'ఆంధ్రావళి' 1916లో వెలువడింది. 'ఆంధ్రావళి'లోని 'జన్మభూమి'ని పరిశీలిద్దాం!

1. ఏ దేశమేగినా ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

2. ఏ పూర్వ పుణ్యమో ఏ యోగ బలమో
జనియించినాడ నీ స్వర్గఖండమున
ఏ మంచి పూవులన్ ప్రేమించినావో
నిను మోచె ఈ తల్లి కనక గర్భమున

3. లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరులింకెందు
సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక

4. అందాక గల ఈ యనంత భూతలిని
మనభూమి వంటి చల్లని తల్లి లేదు
పాడరా నీ తెన్గు బాల గీతములు
పాడరా నీ వీర భావ భారతము

5. తమ తపసులు ఋషుల్ ధారపోయంగ
.............................................................
వెలిగిన దీ దివ్య విశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్య దేశంబు పుత్ర"[2]

ఏదేశ + మేగినా + ఎందుకా + లిడిన పాదంలో తగణం, రగణం, రగణం, నగణం గణాలుండడం గమనార్హం. దీనిని అనేకులు గేయంగా పేర్కొన్నను ఇది గేయము అసలే కాదు. ప్రతి పాదంలో 3 ఇంద్రగణాలు ఆపై 1 సూర్యగణము కలిగివున్న అచ్చమైన మంజరీ ద్విపద. పది పంక్తులు కలిగిన

1. ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు - డా సి నా.రె. ప్రచురణ . 1967, పుట 192
2. ఆంధ్రావళి - రాయప్రోలు - 1994 ముద్రణ పుట 17

చివరి పద్యంతో పాటు 'జన్మభూమి' శీర్షికతో రచించబడిన మొత్తం రచనలోనూ మంజరీ ద్విపద లక్షణాలే వున్నాయి తప్ప గేయలక్షణాలు లేవు. ద్విపద, మంజరీ ద్విపద కూడా పాడుకోవడానికి వీలయివున్నందున 'జన్మభూమి'ని గేయంగా పాడుకొని వుంటారే తప్ప ఇది గేయం మాత్రం కాదని స్పష్టంగా తెలుస్తోంది. గురజాడ వారి 'దేశభక్తి' గేయము రాయప్రోలు, బసవరాజు, బాపిరాజు మొదలగు తర్వాతి కవులలో జాతీయాభిమానము రేకెత్తించింది. రాయప్రోలు 'జన్మభూమి'పై వర్డ్సువర్తు, టెన్నిసన్ మరియు రవీంద్రుని ప్రభావమున్నట్లు యీ క్రింది పంక్తులనుబట్టి తేటతెల్లమవుతోంది.[1]

'సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక
అందాక గల యీ యనంత భూతలిని
మనభూమి వంటి చల్లని తల్లిలేదు'

అను చరణములోని భావము 'National Song' (Tennyson) లోని

'There is no land like England
where'er the light of day be.

అను పంక్తులతో, వర్డ్సువర్తు దేశభక్తిగీతంలోని

'I travelled among the unknown men
In lands beyond the sea
Nor, England did I know till then
what love I bore to thee'

అను చరణముతో చక్కగా సరిపోతుంది.

'లేరురా మనవంటి పౌరులింకెందు'

అన్న పాదము Tennyson పలికిన

'There are no men like Englishmen'

అన్న దానికి ప్రతిబింబంగా వున్నది.

ఏ పూర్వ పుణ్యమో ఏ యోగ బలమో
జనియించినాడ నీ స్వర్గ ఖండమున

అన్న పంక్తులు రవీంద్రుని

"Blessed am I that I am born to this land and that I had the luck to love her" పంక్తులతో సరిపోతాయి.

రవీంద్రుడు 1912లో 'ధర్మసంగీత్' అను శీర్షికతో రాసిన జనగణమన అధి నాయక జయహే' అన్న గేయములో భారతదేశము యొక్క అఖండ వైభవాన్ని కీర్తించారు. నదులను, పర్వతములను స్మరించారు

---

1 ఆధునికాంధ్ర కవిత్వం - డా సి.నా.రె. (1967 ముద్రణ) పుట 383

"Touched by golden rays of thy love
India awakes up and bends her
head at thy feet"[1]

రాయప్రోలు 'జన్మభూమి' గేయం కానే కాదు. మంజరీ ద్విపద మాత్రమే. పైగా రవీంద్రుని 'గీతాంజలి' రాయప్రోలు 'జన్మభూమి' పై అధిక ప్రభావాన్ని చూపింది. అంతేగాక 1916లో రాయప్రోలును రవీంద్రుని 'శాంతినికేతన్'లో చేరేలా చేసింది. గురజాడ 'దేశభక్తి' గీతం రవీంద్రుని 'జనగణమన' గీతం (1912) కంటె ముందే 1910లోనే అవతరించింది.

కావున గురజాడ గారి 'దేశభక్తి' గీతాన్నే మొట్టమొదటి లలిత గీతంగా పేర్కొనవచ్చు! అప్పుడే లలితగీత అవతరణం జరిగినట్లు భావించవచ్చు!

గురజాడ రచనలు పరిశీలిస్తే 'ముత్యాలసరములు' శీర్షికతో దేశిఛందంలో 1910 జూలై 'ఆంధ్ర భారతి'లో ప్రచురింపబడినవే ప్రథమ గేయాలుగా పరిగణనలోకి వస్తాయి. అయితే 'ముత్యాల సరములు' అన్నిటికీ మొదటి 3 పాదాలు 14 మాత్రలతో నాలుగవ పాదం 9, 12, 14 మాత్రలతో విలక్షణంగా విరిగే గుణముందని ముందే వివరించడం జరిగింది.

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా...
మెచ్చనంటా వీవు, నీవిక
మెచ్చకుంటే మించి పాయెను.
కొయ్య బొమ్మలె మెచ్చుకళ్లకు
కోమలుల సౌరెక్కునా?
.. . . .. ..........................................
వెలుగు నీటను గ్రుంకె చుక్కలు
చదల చీకటి కదల బారెను
యెక్కడనొ వొక చెట్టు మాటున
నొక్క కోకిల పలుక సాగెను
..................................................
ధూమకేతువు కేతువనియో
మోము చందురు డలిగి చూడడు?
కేతువాయది? వేల్పులలనల
కేలి వెలితొగ కాంచుమా!"
.. ... ..........................................

1 ఆధునికాంధ్ర కవిత్వం - డా.సి.నా.రె (ముద్రణ 1967) పుట 381

ఇందులో కవి కొత్తపాతల మేలుకలయికగా తేటతెనుగు పదాల్ని ఏర్చికూర్చి ముత్యాల సరాల్ని గుచ్చుతున్నట్లు ప్రకటించాడు. పాత పదాలను కొయ్యబొమ్మల్ని మెచ్చేకళ్లకు కొత్త పదాలను కోమలాంగుల అందం నచ్చుతుందా? అని సందేహాన్ని వ్యక్తపరిచాడు. నీకు నచ్చినా నచ్చకపోయినా నేను నవ్యతనే ఆహ్వానిస్తానంటూ ముందుకు సాగిపోయాడు. కార్యార్థియై పట్నంలో కవి పదిరోజులుండి నాటి వేకువ జాముననే తిరిగి వచ్చి తన ప్రేయసిని తట్టిలేపుతూ. అరిష్టంగా భావించే తొకచుక్కను దేవతాంగన చేతి కలువతో పోల్చిచూపడం మనోహరంగా వుంది. అంతేగాక

దూరబంధువు యితడు భూమికి
దారిబోవుచు చూడ వచ్చెను
డెబ్బదెనుబది యేండ్ల కొకతరి
నరుల కన్నుల పండువై

..............................................

తలతు నేనిది సంఘసంస్కర
ణ ప్రయాణ పతాకగాన్!

ఆ తోకచుక్క భూమికి దూరబంధువు కాబట్టి దారి వెంబడి పోతూ చూడవచ్చినట్టుగా చెబుతూ దానిని సంఘసంస్కరణ ప్రయాణమునకు పతాకగా భావిస్తున్నట్లు చెప్పాడు. మూఢ విశ్వాసాల్ని ఎగతాళి చేశాడు.

యెల్ల లోకము ఒక్కయిల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
వేళ నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ

మతము లన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గ సుఖంబులన్నియు
యవని విలసిల్లున్ -

అని వసుధైక కుటుంబాన్ని ఆశించాడు. కుల, మత వర్ణ వ్యవస్థ తొలగి జ్ఞానమొక్కటే నిలిచి అవని స్వర్గంగా అలరారుతుందని భవిష్యత్తును సూచించాడు. ఇలా సాగిపోయే గీతంలో పట్నంలో హరిజనులతో కవి సహపంక్తి భోజనం చేసినట్లు చెప్పగా అర్ధాంగి అలిగి, అక్కడనే మాల మాదిగ కన్నెనెవతెనో చూసుకోకపోయారా? అని ఎత్తిపొడవడం చక్కగా వర్ణింపబడింది. అంటే ఆత్మాశ్రయ కవిత్వరీతి ప్రవేశపెట్టబడింది.

తూర్పు బల్లున తెల్లవారెను
తోకచుక్క అదృశ్యమాయెను
లోక మందలి మంచి చెడ్డలు
లోకు లెరుగుదురా?

అని ముగించబడిన యీ 'ముత్యాల సరాల్ని' గేయంగా ఎలుగెత్తవచ్చు! ఆత్మాశ్రయ ధోరణిలో సాగిన కథాగేయమిది. అలాగే 'కాసులు', 'లవణ రాజుకల', 'కన్యక', 'పూర్ణమ్మ' ఇత్యాదులన్నీ కథాగేయాలే కావున లలితగీతాలుగా విడిగా పాడుకోవడానికి వీలుకాదు. లలితగీత లక్షణాలు పూర్తిగా వీనిలో గోచరించవు ఇక 'మిణుగురులు'లో -

మల్లెలు మొల్లలు పూచేవేళ
చల్లని గాలులు వీచేవేళ
..............................................
మన్మథ బాణము మోగేవేళ
మగువల మనసులు క్రాగే వేళ
బూరుగు చెట్టు చిలకలతోను
ఏమని పలికింది?
పండిన పండు ఎండిన దూదై
పక పక నవ్వింది!
..............................................
అరటి కాయబజ్జీ
మినపప్పు సొజ్జీ
కలిసి మెలిసి తిందాం!
కథలు విథలు విందాం!
ఏనుగు ఎక్కి మనం
ఏ వూరెళదాం?
ఏనుగు ఎక్కి మనం
ఏలూరెళదాం!

రచనా ధోరణి గేయంగానే వున్నా పిల్లల కోసం అల్లిన ప్రశ్న-జవాబుల పాటగా తోస్తుంది.

'సుభద్ర', 'మెరుపులు', 'పుష్పలావికలు', 'మాటల మబ్బులు' పద్యాలు కాగా, 'నీలగిరి పాటలు', 'ఊటి చోద్యమేమి చెపుదు', 'ఉమాపతి యర్చన' రచనలు సంప్రదాయ కీర్తనల కోవలోనివి. కావున గురజాడ రచనలలో ప్రధానంగా లలితగీత అవతరణంగా పేర్కొనదగినది 'దేశభక్తి' గీతం మాత్రమే అనడంలో సందేహం లేదు.

ఇక రాయప్రోలుగారి 'జన్మభూమి' శీర్షికతో వెలువడిన 'ఏ దేశమేగినా ఎందుకాలిడిన' రచనను మంజరీ ద్విపదగానే రూఢి చేయడమైనది. ఒకవేళ గేయంగా పాడుకోవాలంటే

| | | |
|---|---|---|
| ఏ దేశమేగినా | - | 10 మాత్రలు |
| ఎందుకాలిడినా | - | 9 మాత్రలు |

ఏ పీఠ మెక్కినా - 10 మాత్రలు
ఎవ్వరే మనినా - 9 మాత్రలు
పొగడరా నీ తల్లి - 10 మాత్రలు
భూమి భారతినీ! - 9 మాత్రలు
నిలపరా! నీజాతి - 10 మాత్రలు
నిండు గౌరవమూ - 9 మాత్రలు
ఏ పూర్వ పుణ్యమో - 10 మాత్రలు
ఏ యోగ బలమో? - 9 మాత్రలు
జనియించి నాడవీ - 10 మాత్రలు
స్వర్గ ఖండమునా! - 9 మాత్రలు
ఏ మంచి పూవులన్ - 10 మాత్రలు
ప్రేమించి నావో! - 9 మాత్రలు
నిను మోచె యీ తల్లి - 10 మాత్రలు
కనక గర్భమునా!.... - 9 మాత్రలు

..............................................................

అని మలచుకోవాలి. అప్పుడు 10 మాత్రలతో సాగే ఖండగతి గేయంగా అవతరిస్తుంది. యతి గాని ప్రాసయతిగాని సరిపోతుంది. కాని 2, 4, 6, 8, 10, 12, 14, 16వ పంక్తులలోని చివరి అక్షరాల్ని మంజరీ ద్విపద పాదంలో హ్రస్వంగా వున్న వాటిని దీర్ఘాక్షరాలుగా చేసుకోవాలి. అయినా ఒక మాత్ర తక్కువగానే వుంటుంది, పై పంక్తికంటే. దీర్ఘంగా మలచుకున్న అక్షరాల్ని ప్లుతం (3 మాత్రల వ్యవధి)గా పలికితే ఆ వెలితి కూడ తొలగిపోతుంది. అప్పుడు ఇది గేయంగా ఖండజాతి ఏకతాళంలో

ఏదేశ + మేగినా

ఎందుకా + లిడినా.....అను విరుపులతో చక్కగా సాగిపోతుంది. దీనినే త్ర్యస్ర జాతి రూపకతాళంలోనూ

ఏ + దేశ + మే + గినా

ఎం + దుకా + లిడి + నా .....

అను విరుపులతో ఎలుగెత్తవచ్చు. కాని పదాల విరుపు ఏకతాళం (ఖండజాతి) లోనే కమనీయంగా వుంటుంది.

రాయప్రోలు సుబ్బారావుగారి 'ఆంధ్రావళి' లోని ఇతర రచనల్ని పరిశీలిస్తే అన్నీ ద్విపదలాంటి పద్యసమూహాలే ప్రత్యక్షమవుతాయి. 'మాతృగీతా', 'తమ్ముడా' తప్ప.

మాతృగీతా

నమో మంగళశ్రీ మహా మాతృభూమే!
నమో భారతాఖ్యా సవిత్రీ లలామే!
నమో గర్భ సంపన్న నిక్షేప సకలే!

నమో్బ్రహ్మ విద్యా సహస్రార ముకుళే!
నమస్తే హిమా హార్య ధమ్మిల్ల తారా!
నమస్తే త్రివేణీ భర క్షీరధారా!
అలందీప్యతే తావకీనా పతాకా!
త్రివర్ణాయితా కూత చక్రప్రతీకా!
..........................................................
అశోకం భవే దార్తి జుష్టం ప్రపంచమ్!
చిరం వర్ధతాం భారతీయం చరిత్రమ్![1]

ఈ గేయం 20 మాత్రల పాదాలతో అంత్యప్రాస నియతితో అందంగా అల్లబడినా, మాతృభూమి స్తుతి మాత్రం సంస్కృతంలోనే సాగిపోయింది. తత్సమంగా మలచినచో మరింత సులువుగా శ్రుతి పక్వంగా వుండేది.

'ఆంధ్రావళి' లో అగుపించే మరోగీతం, 'తమ్ముడా!' అనేది.

1. శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలు పారిన భాగ్యసీమయి
వ్రాలినది ఈ భరతఖండము
భక్తి పాడర తమ్ముడా!.......

2. వేదశాఖలు పెరిగె నిచ్చట
ఆదికావ్యం బందె నిచ్చట
బాదరాయణ పరమ ఋషులకు
పాదు సుమ్మిది చెల్లెలా!

..................................... . .. ..

5. మేలి కిన్నెర మేళవించి
రాలుకరుగగ రాగమెత్తి
పాల తీయని భార భారత
పదము పాడర తమ్ముడా! ...

.......... ...... ........... ............. .......

8. పాండవేయుల పదును కత్తుల
మండి మెరసిన మహిత రణకథ
కండగల చిక్కని తెనుంగుల
కలిసి పాడవె చెల్లెలా!...

9 లోక మంతట కాక పెట్టిన
కాకతీయుల కదన పాండితి
చీకిపోవని చేవ పదముల
చేర్చి పాడర తమ్ముడా! .

1 ఆంధ్రావళి రాయప్రోలు (ముద్రణ 1994) పుట 7

10 తుంగభద్రా భంగములతో
పొంగి నింగిన పొడిచి త్రుళ్లీ
భంగ పడని తెనుంగు నాథుల
పాట పాడవె చెల్లెలా!...[1]

భారతదేశ ప్రశస్తిని ప్రస్తుతించే ఈ గేయంలోని ప్రతి చరణంలో మొదటి మూడు పంక్తులు 14 మాత్రలతో చివరి 4వ పంక్తి 12 మాత్రలతో విరిగి ముత్యాల సరాన్ని పోలియున్నవి. గురజాడ 'దేశభక్తి' గీతంలోని 'పాడి పంటలు పొంగి పొర్లే' అనే చరణం ఇక్కడ 'శ్రీలు పొంగిన జీవగడ్డయి' పలికింది. గురజాడ మీది అభిమానంతో రాయప్రోలుగారు యీ గేయాన్ని ముత్యాలసరంలో రచించినట్లు స్పష్టమవుతోంది. ఈ గేయంలో ప్రతి చరణంలోని నాల్గవ పంక్తి చివరి అక్షరాన్ని ఫ్లుతంగా మరి రెండు మాత్రల పాటు సాగదీసి పలికితే 14 మాత్రల పంక్తులుగా మారతాయి. అలా కాకున్నా పాడుకోవడానికి వీలుగానే వుంటుంది

మిశ్రగతి ఏకతాళంలో సవ్యంగా సాగే ఈ గేయాన్ని రాయప్రోలు రచనలలో అచ్చుమైన తొలి లలితగీతంగా పేర్కొనవచ్చు!

ఇలా లలితగీత అవతరణానికి శ్రీకారం చుట్టిన గురజాడ, రాయప్రోలు ఇద్దరూ ఆధునికాంధ్ర కవిత్వ యుగకర్తలు కావడం విశేషం!

లలితగీత అవతరణం తర్వాత దాని వికాసంకై కృషి చేసిన కవుల గూర్చి, వారి రచనల గూర్చి పరిశీలిద్దాం!

---

*1 ఆంధ్రావళి - రాయప్రోలు (ముద్రణ 1994) పుట . 24*

# 5. లలితగీత వికాసం

ఆధునికాంధ్రకవిత్వ యుగకర్తయైన గురజాడ 'దేశభక్తి' గేయం లలితగీత అవతరణకు ఆయువు పట్టుగా నిలువగా, ఆ తర్వాత రాయప్రోలు, అబ్బూరి, విశ్వనాధ నండూరి, బాపిరాజు, బసవరాజు, కృష్ణశాస్త్రి మొదలగు కవుల గేయాలు లలితగీత క్రమవికాసానికి దోహదమయ్యాయి. అలా పాయగా ప్రారంభమైన లలితగీతం అలల సెలయేరుగా, ఆపై మహానదిగా మారి సాహితీ సాగరంలో మహోత్తుంగ తరంగంలా భాసిల్లింది దువ్వూరి, కవికొండల, తల్లావఝుల కూడ లలితగీత వికాసానికి తమ వంతు కృషి సలిపిన వారే. కాని దువ్వూరి, కవికొండల గోపగేయాలే ఎక్కువ రాయగా తల్లావఝుల నాటికా గేయాలే ప్రధానంగా రచించారు రాయప్రోలు రచనల్ని అవతరణలోనే చర్చించడం జరిగింది కావున ఈ వికాసంలో మళ్లీ ప్రస్తావించడం లేదు.

తేటగీతి పద్యాలతో పాటు తేటతెనుగు లలితగీతాలు సమంగా సమర్ధ వంతంగా రచించిన కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి కాగా, గీతాలే ప్రధానంగా అల్లినకవి బసవరాజు అప్పారావు. వీరిద్దరి గీతాలు లలితగీత పరిపూర్ణ వికాసానికి పట్టుకొమ్మలై నిలిచాయి. కావున వీరి సమకాలికులైన నండూరి, అబ్బూరి విశ్వనాథ, కవికొండల, బాపిరాజు మొదలగువారి రచనల్ని ముందు స్పృశించి ఆ తర్వాత బసవరాజు, కృష్ణశాస్త్రుల రచనల్ని విపులంగా పరిశీలిద్దాం! లలిత గీత క్రమవికాసాన్ని వివిధ కవుల రచనలతో వినూత్న పోకడలతో వికసించి పరిమళించిన తీరు తెన్నుల్ని పరామర్శిద్దాం!

## అబ్బూరి (1896)

1935లో ముద్దుకృష్ణ సంకలనం చేసి ప్రచురించిన "వైతాళికులు" గ్రంథం ద్వారా ఈ శతాబ్ది ప్రధమార్థంలో వర్దిల్లిన కవుల రచనల్ని పరిశీలించవచ్చు! అబ్బూరి గీతంగా అచ్చయిన 'పృధివీ ప్రశంస' -

ఓ విశాలావనీ! ....
శోభాతి పావనీ!......
ఆరంభ పుణ్యక్షణముల నీశుడు విసిరిన నాటి
నీయాది సౌభాగ్య మెటుల వెల్గెనో? భవదీయశాటి
ఆకుపచ్చని యాకులో
పండు వెల్తురు రేకులో
నిన్ను ప్రశ్నింపగా జాల నీనాటి ప్రొద్దుటి పూట
గంభీరమై ప్రవహించె నీదు సౌందర్యంపు పాట
ఓ విశాలావనీ!
శోభాతి పావనీ!

కాంతి కల్లోలినీ!
వైభవశాలినీ!

..............................

ఏవి సుందర తరమ్ములౌకొ? యెట్టి గీతా పరీమళము
ఆనంద వీధి నాడించు నీ హృదయ సరోజ దళము
కాంతి కల్లోలినీ!
వైభవ శాలినీ!
ధవళ యశోవతీ!
స్నిగ్ధ తేజోవతీ!

..............................

దవ్వుల నున్న వెదుళ్ళు కలిసి కంఠములెత్తి పాడె
తల్లి నీ యొడిలోన నడగి యల్లరి లేక విన్నాడ
ధవళయశోవతీ!
స్నిగ్ధతేజోవతీ!
హే నవ మోహినీ!
హే దయా వాహినీ!"[1]

..............................

మాతృభూమిని మనసారా స్తుతించిన యీ రచనలో 'ఓ విశాలావనీ-శోభాతి పావనీ' అన్న రెండు పంక్తుల్ని పల్లవిగా చదువగానే గేయంలా అనిపిస్తుంది. కాని ఇది గేయం కాదు పూర్తిగా. అబ్బూరి ఇందులో అబ్బురమైన చమత్కార ధోరణి పాటించాడు. పాడవు పంక్తులన్నీ 'మధ్యాక్కర'లో నడిపి, చరణాంతంలో చిన్న పంక్తుల 'ఓ విశాలావనీ-శోభాతి పావనీ' పల్లవిని చేర్చి ఒక నూతనత్వాన్ని ఆవిష్కరించారు. ఒక పాదంలో వరుసగా 2 ఇంద్రగణాలు 1 సూర్యగణం మరియు 2 ఇంద్రగణాలు 1 సూర్యగణం కలిగి వుండి 1వ గణంలోని మొదటి అక్షరానికి 4వ గణంలోని మొదటి అక్షరానికి యతి చెల్లుట, మధ్యాక్కర ప్రధాన లక్షణం.[2] ఇందులో ప్రాస పాటించక కేవలం అంత్యాను ప్రాస మాత్రం పాటించ బడింది.

ఉదా : ఆరంభ|పుణ్య క్ష|ణముల|నీశుడు|విసరిన|నాటి
నీయాది|సౌభాగ్య|మెటుల|వెల్గెనో?|భవదీయ|శాటి
నిన్నుప్ర|శ్నింపగ|జాల|నీనాటి|ప్రొద్దుటి|పూట
గంభీర|మై ప్రవ|హించె|నీదు సౌం|దర్యంపు|పాట

పై పంక్తుల్ని పరిశీలిస్తే ప్రతి పంక్తిలో వరుసగా 2 ఇంద్రగణాలు 1 సూర్యగణం మళ్లీ 2 ఇంద్రగణాలు 1 సూర్యగణం చక్కగా అమరి వున్నాయి. 3వ పంక్తిలో మాత్రమే 1వ గణంలో'ని'కి 4వ గణంలోని 'నీ'కి యతి పాటించ

1 వైతాళికులు - ముద్దుకృష్ణ - పుట 25, 26.
2 సులభ వ్యాకరణం (తిరుమల పబ్లికేషన్స్) డా పి వి చలపతిరావు. పుట 109

బడినట్లు స్పష్టంగా తెలుస్తోంది. రెండవ పంక్తిలో స్వరయతి మాత్రం పాటించ బడగా మిగతా 1, 4వ పంక్తుల్లో యతి పాటించినట్లు లేదు. దీనిని బట్టి చరణాలన్నీ అబ్బూరి మధ్యాక్కరలోనే రచించి పల్లవిని మాత్రం గేయంలో నడిపినట్లు తెలుస్తోంది.

'ఓ విశాలావనీ-శోభాతి పావనీ! కాంతి కల్లోలినీ వైభవశాలినీ' అని రెండవ చరణాంతంలో స్తుతించి, మూడవ చరణాంతంలో 'కాంతి కల్లోలినీ-వైభవశాలినీ! ధవళ యశోవతీ-స్నిగ్ధ తేజోవతీ' అని స్తుతించే విధానం చూస్తే ముక్తపదగ్రస్తంలా తోస్తుంది. ప్రొద్దుటి పూట అవని అందాల్ని గంభీరంగా ప్రవహించే సౌందర్యపు పాటగా, ప్రభాత కిరణాలలో అగుపించే ఆ స్రవంతిని కాంతి కల్లోలినిగా అభివర్ణించడం అబ్బూరి చమత్కార ధోరణులకు అద్దం పడుతుంది. అలాగే 'తిక్కన సోమయాజి'ని ప్రస్తుతిస్తూ అల్లిన గీతంలో ఎత్తుగడ అంతా మంజరీ ద్విపదలో నడుస్తుంది. మధ్య మధ్య గీతంలా నర్తిస్తుంది.

పూజాతి।సాంద్ర క।ర్పూరమ్ము।లందు
ప్రాజ్ఞదీ।పాథోల।వమ్ముల ।యందు
మడుగు సన్నని పాట
పాడుచు వెన్నెల తేట
కలవుతి।క్కన పల్కు।తెలుగు ప।ల్కులకు
. . . .

లజ్జా మ।నోహర।లావణ్యమూర్తి
తేజోరు।ణాక్షి సం।దీప్త పాం।చాలి
కనుల క్రొమ్మెరుపులు
కనుబొమ విరుపులు
కలవు తి।క్కన పల్కు। తెలుగు ప।ల్కులకు[1]

పై గీతమంతా మంజరీ ద్విపద లక్షణమే నిండివుండగా, మధ్య మధ్య అగుపించే

మడుగు సన్నని పాట
పాడుచు వెన్నెల తేట
..........................................
అలరు మల్లియ పువ్వు
నందు పిన్నని నవ్వు
..........................................
కనుల క్రొమ్మెరుపులు
కనుబొమ. విరుపులు

---

1 వైతాళికులు - ముద్దుకృష్ణ - పుట 172

మొదలగు పంక్తులు మాత్రం గేయలక్షణాలతో నర్తిస్తాయి. అంటే మంజరీ ద్విపద గేయమంజీరాలతో నాట్యం చేసినట్లుంది, ఈ అబ్బూరి రచనలో. కాని ఇది పూర్తిగా గేయం కాదు. 'వర్షాగమనము' అనే రచన మాత్రం 14 మాత్రల మిశ్రగతిలో అచ్చమైన గేయంగా అగుపిస్తుంది.

రసిక హృదయము లోలలాడే
మనుపు దినములు మరలి వచ్చెను
మిసిమి మబ్బులు వ్రేలు మేలిమి
ముసుగుతో నాకసము విచ్చెను

..................................................

మంగళ స్నానమ్ములారించి
చెంగలించెడు నీటి కాలువ
పొంగిపోయె, నొసంగు పృధివీ
ప్రాంగణములకు పచ్చశాలువ!

..................................................

ఉరుము లురిమెడు గర్జనమ్ముల
మెరుపు తీవల మేలవింపుము!
మురిసి యాడెడు వానచినుకుల
సరసగానము లాలకింపుము![1]

వర్షాలధికంగా కురిసే ఆషాఢంలో అగుపించే మిసిమి మబ్బుల్ని ఆకాశపు మేలి ముసుగుగా అభివర్ణించడం, ఆషాఢ లక్ష్మిని మేఘాల పథంలో మెరుపు తీగల రథంలో తరలి రమ్మనడం, మంగళస్నానమాచరించి చెంగలించే నీటి కాలువను ప్రకృతి ప్రాంగణములకు పచ్చదనాన్ని అందించే పచ్చశాలువగా, చిటపటరాలే చినుకుల శబ్దాల్ని సరసగానంగా ఉపమించడం మనోహరంగా వుంది. ఏడు చరణాల ఈ గీతం ఏడురంగుల ఇంద్రధనుస్సులా మనోహరంగా వుంది. ఏడు చరణాల ఈ గీతం 14 మాత్రలతో సమంగా సాగి, అబ్బూరి రచనా నైపుణ్యాన్ని ఎత్తి చూపిస్తుంది. అబ్బూరి పై రచనలన్నింటిలో ఇది మాత్రమే అచ్చమైన గీతంగా నిలుస్తుంది.

'ఊహాగానము'లో 'పూవుల్ల పాట' అనే పాట ఒకటుంది. ఇది 'కృష్ణాపత్రిక' సంక్రాంతి సంచికలో 1926లో ప్రచురించబడినట్లుగా వుంది.

"పాడవే! పాడవే! బంగారు తల్లి
భూమిపై రాలేటి పూవుల్ల పాట
రాలిపోయిన పూలు నేలపాలాయె
చిగురు పరుపుల మీద సొగసు లేదాయె
తీవతల్లీనేడు పూవులూలేవు

1 వైతాళికులు (ముద్దుకృష్ణ) పుట 218

దిగులొందకోయమ్మ తీవెల్లతల్లి

..........................................................

పడకింటి శయ్యలో పవళింపు పూలు
గౌరి పూజలలోన కరిగేటి పూలు
పందిళ్ల పూసినా పారిజాతాలు
రాసులై మళ్లలో రాలేటి చోట
కావెళ్ల తెచ్చేటి కనకరత్నాలు
గాలిలో దండలై తేలేటి చోట

..........................................................

పాడవే పాడవే బంగారు తల్లి
భూమిపై రాలేటి పూవుల్ల పాట"[1]

నేలపై రాలిపోయే పూలను జాలితో చూస్తూ అబ్బూరి అల్లిన ఈ పాటకు బహుశ ఆయన గురుదేవులైన రవీంద్రుని 'గీతాంజలి'లోని సుమరోదన ప్రేరణ కావచ్చు! అయితే ఇది పాటగా పేర్కొనబడినా మొత్తం మంజరీ ద్విపదలోనే సాగింది. 3 ఇంద్రగణాలు 1 సూర్యగణంగానే ప్రతి పంక్తి విరిగి, గేయం కాదని రూఢి అవుతోంది.

## దువ్వూరి (1895-1947)

'కవికోకిల'గా గణుతికెక్కిన దువ్వూరి రామిరెడ్డిగారు 'పానశాల' మొదలగు కావ్యాలన్నిట్లో ప్రధానంగా పద్యాలనే హృద్యంగా పలికించారు, అక్కడక్కడ గేయంగా స్వరమెత్తినా అలా స్వరమెత్తిన గేయాలలో 'ఆమని నిషా' ఒకటి!

జాగ్రత్త! జాగ్రత్త! మాయజగత్తని
శాస్త్రము లెల్లను విప్పెదవు!
భాగ్యము భోగము చంచల మంచును
బైరాగి ధర్మము జెప్పెదవు!
ఎవ్వారు విందురీ పిచ్చిబోధనము
లీ మధుమాస నిశీథమున?
ద్రాక్షరసాయన పాత్రిక పెదవుల
దవుల దలంతురె చేదనుచు?

..................... ..................................

ఆమని మత్తున చైతన్యలోకము
ఆనంద పరవశమై సొగియు
సరిచేయుమో సఖి! భగ్న విపంచిక
సంధ్యలు పాటల బుచ్చెదము!

---

1 ఊహాగానము - అబ్బూరి ట్రస్ట్ ప్రచురణ 1994 పుట . 108

సౌఖ్యనదీరస పూరమునందంచ
జంట విధంబున నీదుదము![1]

మనిషి అనుభవించే భోగభాగ్యాలన్ని క్షణభంగురాలని శాస్త్రాలన్ని విప్పుచెప్పే యతీశ్వరా! వసంత సంధ్యలో ఆనంద పారవశ్యంలో నీ పిచ్చి బోధనము ఎవరు వింటారు? పెదవులకు తీపినందించే ద్రాక్షారస మధుపాత్ర నెవరు చేదుగా వుందంటారు? భగ్న విపంచికను సరిచేసి సౌఖ్యనదీరసతరంగాలలో హంసలజంటగా సాగిపోదామంటూ ప్రియసఖిని ఉత్తేజ పరుస్తూ రచించిన యీ గేయం రమణీయం.

దువ్వూరి రామిరెడ్డి కలం నుండి జాలువారినట్లు చెప్పబడే మరొకగేయం అముద్రిత గేయంగా కవికోకిల గ్రంథమాల ప్రచురణ 1965లో ముద్రితమైంది

లేవవోయీ నిద్ర - లేవరో రన్నా!
లేచి నీ తమ్ముణ్ణి - లేపరో రన్నా!
కొంపంటుకున్నదీ - కునుకేలరన్నా!
నమ్మించి మన గొంతు - నరికినారన్నా!

..........................................................

ఓరి క్రూరాత్ముడా! ఓరి కుల్నాసి
మా పాల నీ వేడ దాపరిస్తివిరా?

..........................................................

దొంగవై ఆడాడ-దోచుకున్నావు
తొత్తువై అందందు - ఒత్తిగిల్లావు

..........................................................

పాలతో పొంగేటి భరత వరషమ్ము
భాగ్యరాసులు గల్గు భరత వరషమ్ము

..........................................................

కళ్లెర్రగా నీకు కానుపించినది
కడుపు మంటగ నీకు కానుపించినది

..........................................................

పీష్వాల జంపించి బేగముల నీడ్చి
పూర్ణమౌ బొక్కసంబుల కొల్లగొట్టి
ద్రోహమే కూడుగా దొంగనాకొడుకా!
తల్లిపై మగని చందము సలిపినావు![2]

ఈ పాట పైకి 19 మాత్రల గేయంగా సాగినట్లు అగుపించినా

లేవరోయీ నిద్ర - లేవరో రన్న!
లేచి నీతమ్ముణ్ణి - లేపరో రన్న!

1 వైతాళికులు - ముద్దుకృష్ణ - పుట 67
2 కవికోకిల కె వి రమణారెడ్డి - కవికోకిల గ్రంథమాల ప్రచురణ - 1965 పుట 131

కొంపంటుకున్నదీ - కునుకేల రన్న!
నమ్మించి మనగొంతు - నరికినారన్న!

అని విరిచి చూస్తే సరిగ్గా మంజరీ ద్విపదగానే మారుతుంది. పాటగా స్వరమెత్తడం వల్ల రన్న-రన్నా (అన్నా)గా మారినట్లు అగుపిస్తోంది. అలాగే చివరి పంక్తులు కూడ

ద్రోహమే కూడుగా - దొంగ నా కొడుక!
తల్లిపై మగని చం-దముసల్పినావు!

అని స్వల్ప మార్పుతో చూస్తే మొత్తం మంజరీ ద్విపదగానే రూఢి అవుతోంది.

అంటే గేయరచన చేయబూనినా దువ్వూరిని మంజరీ ద్విపద గణమే మకరం పట్టులా వెంటాడింది.

పాలు పొంగే భరతఖండాన్ని తెల్లదొరలు ఎలా కొల్లగొట్టారో ఎత్తి చూపుతూ నిద్రాణమై యున్న జాతిని తట్టిలేపే సందర్భంలో అల్లిన రచనగా ఇది తేట తెల్లమవుతోంది. దువ్వూరి మరొక గేయమైన 'అభిసారిక' మనోహరమైన నడకతో ముత్యాల సరము తరహా విరుపుతో సాగిందిలా

గాలియడుగుల నెవరి కోసరము
ఓ మోహశీలా!
కదలి వచ్చితివీ నిశీథమున
కాలియందెలు ఘల్లు మను ననియొ
ఓ వలపురాణీ!
కేలగైకొని మెల్లనడచెదవు!
.................................................
తెల్ల వెన్నెల నీదు కూలంబు
మై పూత నిగ్గులు
తెలియరావని యూహ సల్పెదవు
.................................................
నీవు నడిచెడు బాట యెల్లెడల
వ్యాపించు గంధపు
తావులెట్టుల కప్పి పుచ్చెదవు?[1]
.................................................

రహస్య స్థావరంలో మోహశీలయైన యువతి తన ప్రియ సమాగమంకై వెన్నెల వేళ తెల్లని వస్త్రాలతో జ్యోత్స్నాభిసారికగా సాగిపోతున్న వైనాన్ని ఈ గీతంలో చక్కగా అభివర్ణించారు. ఘల్లుమని అలికిడి కాకుండా కాలి అందెల్ని చేతపట్టుకొని మెల్లమెల్లగా సాగిపోతున్నది ఆ అభిసారిక. అయితే ఆమె మేని

1 వైతాళికులు - ప్రచురణ - 1978 - పుట - 86

గంధపు సువాసనల్ని మాత్రం ఎలా కప్పిపుచ్చగలదంటూ చమత్కారంగా ముగించారీ గీతాన్ని. ముత్యాల సరంలో నాలుగవ పంక్తి 9 మాత్రలతో విరిగిపోతే ఈ గీతం ప్రతి చరణంలో రెండవ పంక్తి 'ఓ మోహశీలా!' 'ఓ వలపురాణీ!' అనే సంబోధన 9 మాత్రలతో విరిగి ఒక వింత నడకను సంతరించుకున్నది. 1, 3 వ పంక్తులు మాత్రం 15 మాత్రలతో ఖండగతిలో సాగిపోయినవి

దువ్వూరి కలం నుండి జాలువారిన ఒక జాలి గీతము 'బాష్పదౌత్యము'

జీవనగంగా హరిత తటంబున
జింతాపటతరు మూలమునన్
ఏల యధోముఖివై గడతెంచెద
విప్విధి యౌవన నిశలన్

.................... ...........................

ఆవలి గట్టున స్వప్న పురంబున
నవ్యయ నిర్వృతి వనులన్
డోలా ఖేలన రతుడౌ ప్రియుని గ
డుంగడు భావన సల్పెదవో?

...................................................

నీ వయసెల్ల హృదీశుని చింతన
నిర్మల ధూపము పగిదిన్
గాలెడి నబలా రేయింబవళులు
గంధము జిమ్ముచు నల్గడలన్

...................................................

చాలు నిరీక్షణ చాలిక చింతన
చాలు రహస్య వియోగ హతుల్!

...................................................

బాల తపస్విని! యెపుడే వేళనొ
వల్లభుడొసగును దర్శనమున్[1]

ప్రియునికై నిరీక్షించే ప్రేయసి జీవన గంగకు ఇవతలి తీరంలో నిలిచి. స్వప్నపురమనే అవతలి తీరంలోని ప్రియుని చేరాలనే తపనతో తల్లడిల్లే విరహస్థితి చక్కగా వర్ణించబడిందీగేయంలో.

జీవన సంధ్యా పరిణత బాష్ప స
చేతన నీరవ దూతికలన్
గాల పయోనిధి బర్ణపుటంబుల
గదలింపుము ప్రియుకడకున్!

1. వైతాళికులు - పుట 120 నుండియు 121

అని ఎంతకూ ప్రియుని కానలేక జీవన సంధ్యలో కారే తన కంటి బాష్పాలను దూతికలుగా మార్చి కాలజలధిలో ఆకుల్లా కదిలించి, ప్రియుని సన్నిధికి చేర్చాలనే ప్రేయసి తపన బాష్పదౌత్యంగా మనోహరంగా రచించబడింది. కాని ఈ రచన గీతంగా తోచదు. పద్యం ఫక్కీలో సాగిన గేయంగానే అగుపిస్తుంది. పలు ద్రుతాంతములతో (మూలమునన్, నల్గడలన్, దూతికలన్, కడకున్ ఇత్యాదులన్నీ) పద్యాలే తప్ప దువ్వూరి రచనల్లో అచ్చమైన గీతాలు ఎక్కువగా అగుపించవు.

## విశ్వనాథ (1893-1976) :

ఇదే దారిలో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ అగుపిస్తారు. విశ్వనాథ 'కిన్నెరసాని పాటలు' గేయకథా కావ్యమే కాని విడిగా లలితగీతాలు కావు. కాని 'వైతాళికులు' లో ఒక గేయం చక్కటి గీతంలా చోటుచేసుకున్నది.

కన్నెకాటుక కళ్లు
చిన్న నాథుని చూచి
కదలులాడిన వేళ
కందలించిన వేళ
ఆకాశ మధ్యాన
అటనొక్క తెలిమబ్బు
మెరుపులా మెరిసిందిలే!
వెలుగులో వొరిసిందిలే!

.........................................

తొలికాన్పు పసిపాప
సాకనేరని బాల
తెలవోయి పతిజూచి
కళవళించిన వేళ
తూరుపు కోనలో
తొంగిలించిన మబ్బు
తెగపరుగులెత్తిందిలే
సొగసులు పోయిందిలే[1]

'చిన్ని మబ్బులు' అనే మూడు చరణాల ఈ చిన్నిగీతంలో ముక్తసరిగా మూడు మబ్బుల్ని ప్రవేశపెట్టి ప్రణయకథను నడిపించారు విశ్వనాథ. మొదట కన్నె తన కాటుక కళ్లనెత్తి ప్రియుణ్ణి చూచినప్పుడు ఆకాశం మధ్యలో ఒక తెలిమబ్బు వలపు మెరుపులా మెరిసిందన్నారు. రాగోదయం అయ్యాక తొలిచూలు నిలిచాక సిగ్గుతో ఆ కన్నె విభుణ్ణి చూడగానే పశ్చిమాద్రిలో నీలిమబ్బు జాలుగా మారిందన్నారు. కాన్పు అయ్యాక తన పసిపాపను ఎలా సాకడమో ఎరుగని ఆ

1. వైతాళికులు . పుట - 144 మరియు 145

బాల తన పతిని తెల్లబోయి చూడగా, తూర్పుకోనలోంచి తొంగి చూస్తున్న మబ్బు సొగుసులొలుకుతూ తెగ పరుగులెత్తిందన్నారు.

అనేక నవలల్ని రచించిన విశ్వనాథగారు ఇలా ఈ చిన్న గీతంలోనూ కథా కథనాన్ని కదను దొక్కించారు. ఖండగతిలో సాగిన ఈ గేయం పది మాత్రలతో సాగినా ప్రతి చరణాంతంలో

మెరుపులా మెరిసిందిలే = 5+5+2 = 12 మాత్రలు
వెలుగులో వొరిసిందిలే = 5+5+2 = 12 మాత్రలు

అని 12 పంక్తులతో విరిగింది.

తూరుపు కోనలో = 4+5 = 9 మాత్రలు
తొంగిలిం చినమబ్బు = 5+5 = 10 మాత్రలు

అనే పంక్తుల్లో మీది పంక్తిలో 9 మాత్రలే వుండిపోయాయి. అలా కాక 'తూరుపుకోనలో' 'తూరుపు'ను తూరుపూ అని దీర్ఘాంతం చేస్తే 10 మాత్రలకు సరిపోవడమే గాక ఖండగతికి సవ్యంగా వుంటుంది.

ఇలా ఒకటి రెండు గీతాలే తప్ప విడిగా విశ్వనాథ గీత రచన చేసినట్లు అగుపించదు.

'కిన్నెరసాని పాటలు' కావ్యం పేరులో 'పాటలు' అని పెట్టినా ఇవి విడివిడిగా పాడుకునే పాటలు కావని, కేవలం కథా కావ్యపు బాటలు అని ఎవరు పరిశీలించినా తేటతెల్లమవుతుంది. 'కిన్నెర' అందరు తెలుగు పడుచుల్లాంటిదే! అత్త పెట్టిన బాధలకు, వేసిన నిందలకు కుమిలి శోక సముద్రమైంది అటు తల్లిని కాదనలేని, ఇటు భార్యను ఓదార్చలేని నాథుని వదలి ఆవేశంతో కిన్నెర అడవుల దారి పట్టింది. భర్త వెంటనే వెనుకే పరుగెత్తి పట్టుకున్నాడు. కన్నీరు తుడిచి కౌగిలించుకున్నాడు. కాని శోకమూర్తియైన ఆమె అతని కౌగిట్లోనే కరిగి నీరై కిన్నెరసాని వాగై ప్రవహించిందని, అతడేమో శోకించి శోకించి శిలగా మారాడని, కరిగి నీరైన ఆ కిన్నెర వనాలు దాటి - వెన్నెల బయలు దాటి, కడకు కడలిరేడు తనను కబళించనెంచాడని గ్రహించి దుఃఖించగా, గోదావరి తల్లి తన గుండెలో చేర్చుకొని ఓదార్చిందన్నది ఈ కావ్య యితివృత్తం! ఈ యితివృత్తాన్ని 'వసుచరిత్ర' లోని 'శుక్తిమతీ-కోలాహలు'ల కథా వస్తువు ప్రేరణతో కల్పించినట్లు అగుపించినా, వర్ణనలో రచనా వైవిధ్యంలో విశ్వనాథ విశిష్టత అడుగడుగునా అగుపిస్తుంది. అయితే 'కిన్నెర పుట్టుక' అనే మొదటి శీర్షిక మాత్రమే పల్లవి-చరణాలతో విడిగా కూడ పాడుకోవడానికి వీలై లలితగీతంగా తోస్తుంది. కిన్నెర కరిగి నీరై వాగుగా మారగా, భర్త దుఃఖభారంతో పాడిన పాటయిది -

పల్లవి :

ఓహో కిన్నెర సానీ! 4+4+4=12 మాత్రలు
ఓహో కిన్నెర సానీ! 4+4+4=12 మాత్రలు
ఊహా మాత్రము లోపల 4+4+4=12 మాత్రలు
నేల నిలువ వే జవరాలా ! 3+3+4+4=14 మాత్రలు

1. కరిగి పోతి నిలువెల్లను = 3+3+6=12 మాత్రలు
తరలించితి నా జీవము = 6+6 = 12 మాత్రలు
మరిగిపోయి నా గుండియ = 3+3=12 మాత్రలు
సురిగి పోయెనే ప్రియురాలా! = 3+3+4+4=14మాత్రలు

2. ఇంత కోపమేమిటికే = 3+3+3+3=12 మాత్రలు
ఇంత పంతమేమిటికే = 3+3+3+3=12 మాత్రలు
ఇంతలు జగమున పతులకు = 4+4+4=12 మాత్రలు
నింతులు సేయుదురటవే! = 4+4+4=12 మాత్రలు

.................................................................................................

13.పరుగెత్తెడు నీ వేణీ = 4+4+4=12 మాత్రలు
బంధము పూనితి చేతను = 4+4+4 = 12 మాత్రలు
కరమున వేణికి బదులుగ = 4+4+4 = 12 మాత్రలు
కాల్వ గట్టె నీటి పొరలు = 3+3+3+3 = 12 మాత్రలు

.................................................................................................

24.నా కన్నులు మందగించె = 6+3+3 = 12 మాత్రలు
నా కాయము కొయ్యబారె! = 6+3+3 = 12 మాత్రలు

.... .............................. ..................................................

25.నాయీ దేహమదేమో = 4+4+4 = 12 మాత్రలు
రాయివోలెనగుచున్నది = 3+3+6 = 12 మాత్రలు ॥ఓహో॥[1]

ఒక పల్లవి, 25 చరణాలు గల యీ గీతమంతా 12 మాత్రల పంక్తులతో సాగింది. కాని పై విధంగా 25 చరణాల్ని నాలుగుకే పరిమితం చేసుకున్నా భావం సరిపోతుంది. కొన్ని పంక్తులు చతురస్రంలో కొన్ని త్రిశ్రంలో మరికొన్ని పంక్తులు త్రిశ్ర-చతురస్ర మిశ్రమంలో సాగాయి. ఈ త్రిశ్ర-చతురస్ర పంక్తులు-

నేల నిలువ వే జవ రాలా! = 3+3+4+4=14 మాత్రలు

.............................. ..................................................

సురిగి పోయె నే ప్రియు రాలా! = 3+3+4+4=14 మాత్రలు

అని స్పష్టమవుతోంది. అయితే గీతమంతా 12 మాత్రల పంక్తులతో సాగితే ఈ రెండు పంక్తులు మాత్రమే కొట్టొచ్చినట్లు 14 మాత్రలతో విరిగాయి. వీటిలో

1 కిన్నెరసాని పాటలు పుట 3, 5, 6, 7, 8

రెండేసి మాత్రల్ని పెంచడంలో ప్రత్యేక ప్రయోజనమేదీ అగుపించదు. మొదటి చరణంలోని 'సురిగి పోయెనే...'పంక్తికి పై పంక్తిలోని 'మరిగిపోయి....'తో ప్రాసయతి సరిపోయింది. కాని పల్లవి లోని 'ఊహా మాత్రము...' మూడవ పంక్తికి, 'నేల నిలువవే....' నాలుగవ పంక్తికి యతిగాని, ప్రాస యతిగాని పొసగదు. కావున అర్థం చెడకుండానే, వ్యర్థంగా పెరిగిన రెండు మాత్రల్ని తగ్గిస్తూ పై రెండు పంక్తుల్ని ఇలా సవరించవచ్చు!

ఊహా మాత్రము లోపల = 12 మాత్రలు
ఉరకలేయు జవరాలా! = 12 మాత్రలు
(నేల నిలువవే జవరాలా = 14 మాత్రలుకు బదులుగా)
మరిగి పోయినా గుండియ = 12 మాత్రలు
సురిగిపోయె ప్రియురాలా = 12 మాత్రలు
(సురిగిపోయెనే ప్రియురాలా = 14మాత్రలుకు బదులుగా)

ఇలా 'కిన్నెరసాని పాటలు' లోంచి యీ మొదటి శీర్షికను మాత్రం గీతంగా మలచుకోవచ్చు! మిగతావన్నీ కథగా కదలిపోయేవే! కావున వాటిని ప్రస్తావించడం లేదు.

'కిన్నెరసాని పాటలు'కు అనుబంధంగా వేసిన 'కోకిలమ్మ పెండ్లి' కూడ చిన్న కథా కావ్యమే. కాని గీతాలు కావు.

ఒక అడవి దొరకు 'చిలకతల్లి' 'కోకిలమ్మ' ఇద్దరు కూతుళ్లు. పచ్చని చిలకంటే తండ్రికి ఎంతోప్రేమ! కాని నల్లని కోకిల మీద ఆ ప్రేమ ఏ మాత్రం లేదు. కావున కోకిల కుమిలిపోయి ఏ మూలకో చేరుకున్నది. ఇంటికి రాని కోకిల కోసం తల్లి కోనంతా వెదకుతుంటే, గమనించిన కోకిల ఆర్ద్రతతో పెల్లుబికిన అనురాగంతో తల్లి ఒడిలో ఒదుగుతుంది. కడకు తన నల్లటి బాహ్యారూపాన్ని గాక కమ్మటి గాన మాధుర్యాన్ని మెచ్చి వచ్చిన వసంతున్నే పెళ్లాడుతుంది. ఈ చిన్న కథను విశ్వనాథ ఎంతో మనోహరంగా రసవత్తరంగా రచించారు.

కోకిలమ్మా నల్లనీదీ = 3+4+3+4 = 14 మాత్రలు
చిలకతల్లీ పచ్చనీదీ = 3+4+3+4 = 14 మాత్రలు
చిలకతల్లికి కోకిలమ్మకు = 3+4+3+4 = 14 మాత్రలు
ఎప్పుడూ పడదూ! = 5+4 = 9 మాత్రలు

..........................................................................

చిలుక తల్లికి రంగు రంగుల
చీరలూ తెస్తాడు తండ్రీ!
కోకిలమ్మను ఊరికేనే
కోప పడతాడూ!

........ .......... ... ..................... .............. .......

చిలక తల్లీ వెక్కిరిస్తే
తండ్రి వచ్చి కసురుకుంటే
తల్లి వెనకా దాగిపోతూ
తల్లడిలుతుందీ!............ (కోకిలమ్మ పెండ్లి : పుటలు 66 : 67)

అని ఆర్ద్రంగా సాగిపోయే యీ 'కోకిలమ్మ పెండ్లి' కథా గేయమంతా 'ముత్యాల సరం'లా మొదటి మూడు పంక్తులు 14 మాత్రలతో నాలుగవ పంక్తి 9 మాత్రలతో నడిచింది. ఇది విడివిడిగా లలితగీతంగా పాడుకునే అవకాశం లేకపోయినా ఇందలి పై చరణాల్ని మాత్రం శ్రావ్యంగా మిశ్రగతిలో స్వరమెత్తవచ్చు! ఈ 'కోకిలమ్మ పెండ్లి' ప్రేరణతో డా.సి.నారాయణరెడ్డిగారు 'బాలమిత్రుల కథ' చిత్రంలో

"గున్న మామిడీ కొమ్మ మీదా
గూళ్లు రెండున్నాయీ!
.......................................................
చిలకేమో పచ్చనిదీ
కోకిలేమో నల్లనిదీ-"

అని రచించినట్లు అనిపిస్తుంది. అలాగే వేటూరిగారు 'అడవి రాముడు' చిత్రంలో

"కోకిలమ్మ పెళ్లికీ
కోనంతా పందిరీ!
...................................
వసంతుడే పెళ్లి కొడుకు
పూలన్నీ తలంబ్రాలు!"

అని రాసిన పాటకు ప్రేరణ కూడా ఈ 'కోకిలమ్మ పెండ్లి' లోని చివరి చరణాలే ఆధారమైనట్లు అగుపిస్తాయిలా-

రావయ్యో ఓ పూలరాజా!
రావయ్యో ఓ అందగాడా!
కోకిలమ్మకు నీవు, నీకూ
కోకిలా తగునూ.....
కోకిలా తగునూ.....
వారి పెళ్లికి అడవి అంతా
తోరణాలైనాయి చివురులు
కాపలా కాసినై పులులూ
గండ శిలలందూ......
సన్నాయి పాడింది తెల్లని
సన్ననీ సెలవూట పూలా

వెన్నెలై ప్రకృతి తల్లేమో
కన్ను తెరిచిందీ.........('కోకిలమ్మ పెండ్లి' పుటలు : 80, 81.)

గురజాడ మీది అభిమానంతో విశ్వనాథ 'కోకిలమ్మ పెండ్లి'ని ముత్యాల సరాలలో రచించారు. గేయ వికాసానికి తనవంతు కృషిగా 'కిన్నెరసాని పాటల్ని' అందించారు.

## తల్లావఝుల : (1892)

శ్రీ శివశంకర శాస్త్రిగారు పద్య, గేయ నాటికలే తప్ప ప్రత్యేకంగా లలిత గీతాలేవీ రాసినట్లు అగుపించరు. "గేయనాటికలు" మీద డా. తిరుమల శ్రీనివాసాచార్యగారు ప్రత్యేక పరిశోధననే వెలువరించినందున వాటిని నేను పరిశీలించడం లేదు.

అయితే తల్లా వఝుల 'అపుడు' అనే శీర్షికతో రాయగా 'వైతాళికులు' లో అచ్చయిన గీతమొకటి వుంది. దానిని పరిశీలిద్దాం!

అపుడు నిల్చితి నోయి నా ప్రియు
రాలి శాంత మనోజ్ఞ రూపము
తనివి దీరగ జూచు తలపున
స్తంభన విధమునన్
అహహ వికసన మొందెనోయీ
అపుడు నాకనుదోయి లక్ష్మీ
తిలక పాటల ఫాలమండల
దీప్తి జాలమునన్!
.................................
గాఢరాగోద్రిక్త మతినై
కన్నుగవతో ముద్దులాడితి
కటక కంకణ రుచిరలక్ష్మీ
కర సరోజములన్!
ఏమి చెప్పుదు సఖుడ, నా హృద
యేశ్వరీ మృదు పాదయుగళికి
సాటి వచ్చునొ రావొ యించుక
స్థల జలేజములే!
తన్మయంబై మామకాక్షి
ద్వయము బంగరు బొమ్మతొడిగిన
పట్టు రైకను విడువ దాయెను
ప్రాణమిత్రంబా![1]

---

1 వైతాళికులు - పుటలు 62 మరియు 63

ఒక ప్రియుడు తన ప్రియురాలిని కాంచినప్పుడు కలిగిన అనుభూతుల్ని మిత్రుడితో వెల్లడించినట్లు ఈ గీతంలోని సంభాషణయే చాటుతున్నది. మొదట ఆ ప్రియుడు తన చూపును ఎరుపు తిలకంతో మిసమిసలాడే ప్రియలక్ష్మీ ఫాలభాగంలో నిలిపాడు. తర్వాత చెవుల కమ్మలతో ప్రకాశించే చెక్కిళ్ళపై చూపు విసిరాడు. ఆ తర్వాత కాంచనమాలతో దీప్తిల్లే కంఠాన్ని చూశాడు. గాఢ రాగో ద్రిక్తుడై తన ప్రేయసి కరకమలాల్ని చూపులతోటే ముద్దాడాడు. చివరకు తన్మయత్వంతో తన ప్రేయసి ధరించిన పట్టురైక పైనుండి చూపు మరలకున్న దంటూ ప్రాణమిత్రునితో వాపోతున్నాడు.

ఈ గీతంలో గేయనాటిక ధోరణియే కనిపిస్తోంది, సంభాషణా చమత్కృతితో పైగా ఈ గీతం 'ముత్యాల సరం' మూసలో గురజాడ ఒరవడిలో మొదటి 3 పంక్తులు 14 మాత్రలతో 4వ పంక్తి 9 మాత్రలతో నడిచింది.

తల్లావఝుల శివశంకరశాస్త్రి రచించిన మరొక గీతం, వకుళ మాలిక -

ఎంత చక్కని వెలుతురెంత చక్కని వెలుతు
రెంత చక్కని గాలి, యెంత చల్లని గాలి!
ఎంత కాలంబాయె ఈ సౌఖ్యమును గాంచి
మైమరచి పోవలయు మంద మారుతములో
చొక్కి పోవలె నేడు సూర్యకిరణాలలో
పండు వెన్నెలలోన పరవశము కావలయు!

..................................................................

ఎంత చక్కని వాడొ ఎంత చల్లని వాడొ
ఎవ్వరో మీరు నా కెరుగ రాకున్నారు
తీసి వేయకుడు నన్ తీసి వేయకుడయ్య
నాస్వామి కోసమై నన్నుండ నిండిచట!
ఎంత చక్కని చేయి, ఎంత చల్లని చేయి!
చిగురుటాకును బోలు చేయి నా నాధునిది!
అతని హస్తము సోకినంతనే నా మేన
అంకురించును పులకలానంద గరిమాన
వాడిపోయిన జీర్ణ వకుళ మాలగనెంచి
తీసి వేయకుడు నన్ తీసివేయకుడయ్య![1]

పదేసి మాత్రల చొప్పున ఖండగతిలో సాగిన ఈ గేయంలో ఒక పేటికలోని వకుళ మాలికా స్వగతం చెప్పబడింది. మూసివున్న పేటిక ద్వారాన్ని తెరువగానే వెలుతుర్ని, గాలిని, వెన్నెలను దర్శించిన వకుళ మాలిక మలయమారుతంతో పరవశించి పోవలయునని ఆశించింది. ఆ పేటిక ద్వారాన్ని తెరిచిన వాడు ఎంత చల్లని, చక్కని వాడో ఎరుగను కాని నన్ను మాత్రం ఆ పేటికలోంచి తీసి పారేయక తన స్వామి వచ్చేంతవరకు - చిగురుటాకు వంటి తన నాథుని కరస్పర్శ సోకేంత వరకు అక్కడే వుండనిమ్మంటూ ప్రాధేయపడిన వైనం మనోజ్ఞంగా వుంది.

1. వైతాళికులు - పుట : 111

వాడిపోయిన జీర్ణ
వకుళ మాలగ నెంచి
తీసి వేయకుడు నన్
తీసి వేయకుడయ్య!

అని చివరలో పొరపాటుగానైనా తనను వాడిన వకుళ మాలికగా భావించి బయట పారవేయవలదని బ్రతిమిలాడడం బాగా రాణించింది.

## చింతాదీక్షితులు (1891 - 1960) :

భావ కవిత్వపు యుగంలో గేయరచన చేసిన ఎందరెందరో ప్రముఖ కవులకు మంచి మార్గదర్శకులుగా నిలిచి, వారి కవితల్ని పరిష్కరించిన పండిత కవి, శ్రీతల్లావఝుల శివశంకరశాస్త్రిగారు. వారి కోవలోకి చెందిన వారే శ్రీ చింతాదీక్షితులుగారు. వీరి గేయాలలోనూ మొదట ముత్యాలసరమే గోచరిస్తుంది. ముత్యాల సరంగా అవతరించిన వీరి 'వ్యర్థయత్నములు' పరిశీలిద్దాం!

ప్రేమతో నా తులసి మొక్కను
పెంచితిని గంగోదకంబుల
పసుపుకుంకుమతోడ భక్తిని
పూజలొనరిస్తి!
ఉదయ సాయంకాలముల క
ర్పూర దీపం బారతిచ్చితి.
హృదయతాపము తీర లక్ష్మీ
స్తవమొనర్చితిని!
పక్కనే పొంచున్న లోకపు
మానిసొక్కడు పెదవి విరిచెను
'ఎందుకో యీ వ్యర్థ యత్నము
లెందుకో?' అనియెన్-[1]

విగ్రహారాధనను వ్యంగ్యంగా నిరసిస్తూ సాగిన రచన యిది.

మంచినగలూ, మంచి గంధము
మంచి మంచి రకాల పువ్వులు
ప్రతిమ కుంచితి, హృదిని నిల్పితి
తపము చేసితిని!
.....................................................
శిరము వంచితి, కనులు మూసితి
మౌన ముద్ర వహించి యుంటిని
పక్క మానిసి పలికె మళ్లీ

1 వైతాళికులు (1978 పునర్ముద్రణ) పుట 195

ప్రస్ఫుటముగాగన్!
ఎందుకోయీ మౌన మూనుట
ఎందుకోయీ మాంద్యమంతా
పోయి సాంఘిక సేవచేస్తే
పుణ్యముండునుగా!

ఈ విధంగా రకరకాల పూజలతో - విగ్రహారాధనలతో, జపతపాదులతో గడిపే వాళ్లను ఉద్దేశిసస్తూ పక్క మనిషి చేత 'పనికిరాని పూజలతో, ముక్కుమూసుకుని చేసే తపస్సుతో కాలాన్ని వృధాగా వెచ్చించే కన్నా, వ్యర్థ యత్నాలతో పొద్దుగడిపేకన్నా సాంఘిక సేవచేస్తే అధిక పుణ్యం దక్కుతుందని' చెప్పించడం యీ గీతపు కొసమెరుపు. ఆ పక్క మనిషి మరెవరోకాదు కవియే. కవి మూఢ ఛాందసభావాల్ని వ్యంగ్యంగా ఎత్తిచూపి, హితబోధ చేశాడీగీతంలో.

గీతమంతా ముత్యాలసరంగానే నడిచింది. అయితే మొదటి 3 పంక్తులు 14 మాత్రలతో సాగినా 4వ పంక్తులు మాత్రం కొన్ని 8 మాత్రల తోటే విరిగాయి.

పూజలొనరిస్తి - 8 మాత్రలు
స్తవమొనర్చితిని - 8 మాత్రలు
తపము చేసితిని - 8 మాత్రలు
తల్లినేర్పినది - 8 మాత్రలు
అరుత దాల్చితిని - 8 మాత్రలు
తిరుగ జొచ్చితిని - 8 మాత్రలు

మిగతా పంక్తులు 9 మాత్రలతోనే సాగాయి. పై వాటిని కూడ చివరలో ఒక మాత్రకాలం సాగదీస్తే 9 మాత్రలుగా మారతాయి. వీరిదే మరో గీతం 'నెమలి కన్ను'

ధగధగమెరిసే కాంతిని చల్లే
కళ్లు నెమలి కెవరిచ్చారో,
పురివిప్పుతు అది నాట్యమాడగా
తాండవకృష్ణుడు జ్ఞప్తికిరాడా?
మేఘాలందం నీలాలందం
కాంతల కాటుక కన్నుల కందం
అందాలన్నీ జీవం దాలిచి
నీలో నాట్యం చేసేనే!
జ్ఞాపకముంటే చెప్పరాదటే
కృష్ణుని బాల్యక్రీడలు మాతో

కృష్ణుని వేణికి నీవా అందం,
నీకే అందం ఆ వేణా?[1]

..........................................

ఇలా సాగిపోయే 'నెమలికన్ను' గీతం 16 మాత్రల పంక్తులతో చతురస్ర గతిలో నడిచింది. కాని అక్కడక్కడ 14 మాత్రల పంక్తులే గోచరిస్తాయి.

కళ్లు నెమలికెవరిచ్చారో - 14 మాత్రలు

....................................

నీలో నాట్యం చేసేనే - 14 మాత్రలు

....................................

నీకే అందం ఆ వేణా? -14 మాత్రలు

ఈ గేయం స్వేచ్ఛగా సాగిపోయింది. యతి, ప్రాస నియమాలు కూడ పాటించినట్లు కనబడదు. కవి కావాలనే స్వేచ్ఛను ప్రదర్శించాడు.

కృష్ణుని కొప్పులో తురాయిగా నిలిచిన నెమలికన్నునుద్దేశిస్తూ, ఆనాటి బాలకృష్ణుని లీలల్ని జ్ఞాపకముంటే చెప్పమని అడగడం ఒక విశిష్ట భావన! కృష్ణుని కొప్పుకున్న అందం నీవల్ల వచ్చిందా? లేక నీకే ఆ అందాల కృష్ణుని కొప్పువల్ల అందం అమరిందా? అని ప్రశ్నించడంలో చక్కని చమత్కారముంది. అలాగే 'మనవి' అనే మరోగేయంలోనూ మంచి రచన అగుపిస్తుంది. దాస్యంలో మగ్గుతున్న భారతజాతి ఆవేదన ఆవిష్కృతమవుతుంది.

చుక్కలు తిరిగే హిమాద్రిపై ఆ
వాసము చేసేగౌరీశా!
విన్నావయ్యా, నా మనవొక్కటి
విన్నవించనా గౌరీశా!
త్వచ్ఛిరగంగా శీకరసేచిత
పుణ్యభూమిలో పుట్టాను.
త్వత్పాదారుణ కమల మరందము
తనివి తీరగా తాగాను!

..........................................

ఉన్నత హిమాలయాలపైనే కైలాస శిఖరముంది. కాబట్టి చుక్కలు తిరిగే హిమాద్రిపై నివసించే గౌరీశా! అని కవి సంబోధించాడు. తన మనవి విన్నవించనా? అని ప్రశ్నించాడు. శివుని జటాజూటం నుండి ప్రవహించే గంగాతరంగాలతో పునీతమైన భూమిలో పుట్టిన తాను కళ్లుదెరిచి చూసేసరికి కాళ్లు చేతులకు సంకెళ్లు - నోటికి తాళం పడ్డట్లు గ్రహించి ఆ దాస్యం నుండి విముక్తి పొందనెంచి ఆర్తిగా ఎలుగెత్తాడు యిలా -

1. వైతాళికులు - ప్రచురణ 1978 పుట . 207

నీ పాదాలకు నిత్యసేవనే
నెట్లు చేతునో సెలవిమ్మా?
నీ నామాంకింత దివ్య గీతములు
ఎట్లు పాడుదును సెలవిమ్మా?

కవి తన మనోమథనాన్ని మహేశునికి మనవిగా నివేదించాడు.

## కవికొండల (1892 - 1966) :

ప్రకృతి (కొండల) కవిగా ప్రసిద్ధికెక్కిన మరో మంచి రచయిత, శ్రీ కవి కొండల వెంకటరావుగారు. భావావేశంతో పద్యాన్నే గాక గేయాన్నీ యధేచ్ఛగా కదను దొక్కించే సాహసికుడితడు. 'ఎందుకు?' అనే గేయంలో -

నిన్ను దలపోయుచునె నే జిదుము కొనిపోతి
పచ్చికాయలు వట్టి పూవుల్లు రేకుల్లు' !
ఫలమెంచనైతి
లోపలితేనె గొననైతి
అలసముద్రపుటోర తెలి నురుగు కెరటాలు
ఇసుకలో జిరు బుడగలెత్తించుటలుగంటి
మునిగి ముత్తెపు మూట ముల్లె మోయగనైతి-[1] ॥నిన్ను॥

ఈ రచన వచన కవితలా అగుపిస్తున్నా పది మాత్రల పంక్తులతో సాగే గేయంగా చూపవచ్చునిలా-

నిన్ను దలపోయుచునె
నేజిదుము కొనిపోతి!
పచ్చికాయలు వట్టి
పూవుల్లు రేకుల్లు!
ఫలమెంచనైతి, లో
పలితేనె గొననైతి!
అలసముద్రపు టోర
తెలినురుగు కెరటాలు
ఇసుకలో జిరుబుడగ
లెత్తించుటలుగంటి
మునిగి ముత్తెపు మూట
ముల్లె మోయగనైతి!

తన ప్రేయసిని కాబోలు తలపోస్తూ, ఫలమెంచకనే పచ్చికాయలను, తేనె గొనలేకున్ననూ పూవులనూ చిదుముకొని పోయిన వైనాన్ని సముద్రపు టోర ఇసుకలో చిరుబుడగ లెత్తించిన తీరును ఎందుకు చేశానా? అని ఆలోచిస్తూ సాగిపోతుందీ గీతం

1 వైతాళికులు : పుట - 98

'కూలి యన్నల కుతుకము' అనే గీతం జానపదాల్ని స్ఫురింపజేసే రచనగా తోస్తుంది.

మొగములను ముచ్చెమట లూడ్చుచు
మూపులను పెను మోకులీడ్చుచు
మడమలెత్తున మన్నురేచుచు
గుండ్ల పేరూ కులకు పాటేమో!
ఏమో!
పాలిండ్ల బగడపు గుండ్ల పేరేమో!
ఇనుప బరువుల 'నిస్సి' యనుచును
వెచ్చనన్నపు వేళ గనుచును
మెట్టనడకుట్టు సురుగొనుచును
కాళ్ల కడియాల్ కలికి నుడియేమో
ఏమో!
కడియముల సడి బిడియ పడుటేమో!
సడలు నడికట్టొడియ నెట్టుచు
వీడు సిగముడి వ్రేళ్ల బెనుచును
అలసటలు వో నడుగు నాపుచు
వలపు జిమ్మెడు పదము గలుపేమో!
ఏమో!
పదమొకడ పొదరింటి నిలుపేమో!
ఎదుట కుఱ్ఱది యేది లేదు
మోహపడుటకు ప్రొద్దుకాదు
మరుగు వెట్టగ మరపురాదు
కూలి యన్నల కుతుకమది యేమో!
ఏమో!
బాళి తలపని పెరిమయది యేమో![1]

కూలి జనులు తమ కాయకష్టాన్ని మరిచిపోవడానికి వలపు పాటల్ని ఎలుగెత్తే సన్నివేశాన్ని, కట్టుబొట్టు వైనాన్ని సహజంగా చక్కగా వివరించారీ గీతంలో.

ప్రతి పంక్తి 14 మాత్రలతో సాగిన ఈ గీతంలో పల్లవి తప్ప చరణాలలో 5 పంక్తులు అగుపిస్తాయి. బహుశ 5వపంక్తి తోటి జనం కలిసి పాడేందుకు చేర్చినదై వుంటుంది. అప్పుడు పై గీతాన్ని ఇలా 'కోరస్'గా పాడుకోవచ్చు.

మొగములను ముచ్చెమటలూడ్చుచు
మూపులను పెనుమోకులీడ్చుచు
మడమలెత్తున మన్ను రేచుచు
గుండ్లపేరూ కులుకు పాటేమో!

1 వైతాళికులు - పుట 143

కోరస్ : ఏమో?
పాలిండ్ల బగడపు గుండ్ల పేరేమో!

ఇలా విరుచుకుంటే ప్రతి చరణం 4 పంక్తులతో సాగిపోతుంది. కోరస్ గొంతు చేరికతో కొత్త వూపు వస్తుంది. మొదటి మూడు పంక్తులు 14 మాత్రలతో సాగగా 4వ పంక్తి మాత్రం రాగదృష్టితో కాబోలు 16 మాత్రలతో నడిచింది.

'పాలిండ్ల పగడపు గుండ్ల పేరేమో' అన్న పంక్తి మాత్రం 18 మాత్రలకు సాగింది. బరువైన తాళ్లను లాగుతుంటే పడుచు కూలీల పాలిండ్లపై గుండ్ల పేరు కులికిందనే భావన హృద్యంగా వుంది. అలాగే సడలిపోతున్న నడికట్టును పైకి నెట్టుకోవడం, జారిపోతున్న సిగముడిని వేళ్లతో చుట్టుకోవడం, అలసట కలిగినప్పుడల్లా ఒక అడుగు నాపడం చాలా సహజంగా వుంది.

'కూలియన్నల కుతుకము' అంటే కూలియన్నల తీరని కోరిక యందలి ఆసక్తి! అందుకే అది శ్రమించే సమయమే కాని సుఖించే పొద్దుకాదని.

ఎదుట కుర్రది యేది లేదు
మోహపడుటకు ప్రొద్దుకాదు
..................................................
బాళితలపని పెరిమయదియేమో!

అని చమత్కారంగా ముగించారు. కాంక్షకు 'బాళి' అనేది తెలుగు అర్థం. పెరిమ ప్రేమకు వికృతి. పల్లె పదంగా అల్లిన యీ గీతంలో తెలుగు నుడికారాన్ని చక్కని శృంగార భావాన్ని కవికొండల కనబరిచారు.

'ఆశయము' అను మరొక గేయంలో కడలి నడుమనున్న ముత్యాలకై మునిగి వలపన్నే కన్నా, తీరంలో నిలిచి నత్తగుల్లల్ని ఏరుకోవడం మేలని, ఆకాశంలోని చుక్కల్ని అందుకోవడానికి పైకి ఎగిరేకన్నా తన పొలంలోనే నిలిచి, అవి నేలకు రాలినప్పుడు ఏరుకుంటే చాలుననే భావాన్ని చక్కగా చెప్పారు.

కడలి నట్టడగు పొడము
ముత్తియమ! నీదుకాంతిన్
బడియగను మునుగ వలెనా?
వలలెన్నొ పన్న వలెనా?
ఈనాడు తీరమందే
భంగముల వెలికి బడెడు
గుల్లలను గూర్చుకొనుచు
నేనేల యాడరాదో?.........
ఆకసము నట్టె పొడుచు
చుక్కరో! నీదు కాంతిన్
............... ......................

క్రిందికీ వెపుడు పడెదో
యపుడె నిన్నరసి కొనుచు[1]

11, 12 మాత్రల పంక్తులతో సాగిన యీ గేయం సమమాత్రాబద్ధం కాలేదు. కవికొండల యథేచ్ఛగా రచించారు.

కడలి నట్టడుగు పొడము = 3+5+3 = 11
ముత్తియమ! నీదు కాంతిన్ = 5+3+4 = 12

'శివరాత్రి ప్రభ'లో కవికొండల గేయాన్ని వచనగేయంగా అనేక రకాల మాత్రలతో నడిపించారు.

కాలకంఠుని నాగసర్పము = 3+4+3+4 = 14
కుబుసమూడ్చీ పడగబుస్సంది = 3+4+3+5 = 15
రెండు నాల్కలు = 3+4 = 7
గండు మీసాలట్లు దూసింది[2] = 3+4+3+5 = 15

బుస్సంది, దూసింది అనే పాదాంతంలో క్రియాపదాలలో ఒక అధిక మాత్ర వేయడం వల్ల నిండుదనం, కొత్తదనం కనబడుతున్నాయి. 3+4 మాత్రలుగా కాక 4+3 మాత్రలుగా కూడా విరుపులున్నాయి

నొసట కొసరిన మూడోకన్ను = 3+4+4+3
నివురు బాదిన కొలిమి దెగడి = 3+4+3+3
నెగడి ద్రిప్పింది = 3+5
పొగలు గప్పింది = 3+5

అక్కడక్కడ పాదాల్ని పెంచుతూ, తగ్గించుతూ వింతనడకను సృష్టించారీ గేయంలో. ఇదే శ్రీశ్రీ 'బాటసారి' గేయానికి రాచబాటగా నిలిచింది.

మబ్బు పట్టీ, గాలి కొట్టీ = 3+4+3+4 = 14
వానవస్తే, వరదవస్తే = 3+4+3+4 = 14
దారితప్పిన బాటసారికి = 3+4+3+4 = 14
ఎంత కష్టం? = 3+4 = 7

'శివరాత్రి ప్రభ'లో మాదిరి సగం పాదాలు (రెండు నాల్కలు) సాక్షాత్కరిస్తాయి, 'ఎంత కష్టం?' అంటూ

వాడి ముమ్మొనవాలు
హుతభుక్
అజ కపాలం
ఢక్క డుబడుక్

---

*1 వైతాళికులు పుట 202*
*2 వైతాళికులు పుట . 259*

అనే విరుపుల్ని అలా కాక రెండు పాదాలుగా రాస్తే 14 మాత్రల పంక్తులవుతాయి.

| | | |
|---|---|---|
| వాడి ముమ్మొన వాలు హుతభుక్ | = | 3+4+3+4 = 14 |
| అజకపాలం, ఢక్కడుబడుక్ | = | 3+4+3+4 = 14 |
| నాల్గు సేతుల నాడులౌతున్నాయ్ | = | 3+4+3+4+2=16 |
| అశ్శరభ! శరభ! | = | 5+3 = 8 |

16 మాత్రల మూడవ పంక్తిలో రెండు మాత్రలు పెరుగకుండా వుంటే ముత్యాలసరమయ్యేది. శివుని నాల్గు చేతుల్లో కనబడే త్రిశూలం, అగ్ని, బ్రహ్మకపాలం, డమరుకాలను తమాషా పదాలతో నాల్గు నాడులౌతున్నట్లు చెప్పడం సవ్యంగా వుంది. అలాగే

| | | |
|---|---|---|
| చంద్ర మకుటము | = | 3+4 = 7 |
| జటా జూటము | = | 3+4 = 7 |
| సాంద్రనీలపు చదల పాపట | = | 3+4+3+4 = 14 |
| సురిగి పోతున్నాయ్! | = | 3+4+2 = 9 |

మొదటి రెండు పంక్తుల్ని ఒక్కటిగా చేస్తే ముత్యాల సరంగా మారుతుంది. ఇలా అనేక గతులలో కవి కొండల 'శివరాత్రి ప్రభ' గేయగమనం సాగి ఒక వింత ఒరవడి సృష్టించింది. తర్వాత కాలంలో శ్రీశ్రీకి నవ్యస్ఫూర్తిని కలిగించింది.

రాయప్రోలు తర్వాత భావకవిత్వ యుగంలో గోపకవిత్వాన్ని రచించిన వారిలో, దువ్వూరి, కవికొండల, బాపిరాజు మాత్రమే ప్రముఖంగా కనిపిస్తారు. దువ్వూరి పద్యకవిత్వానికి ప్రాతినిధ్యం వహిస్తే, కవికొండల గేయకవితా రథసారథిగా నిలుస్తారు. బాపిరాజు విజయుడిగా విజృంభిస్తారు. వీరి గేయాలలో వున్నంత వైవిధ్యం, విస్తృతి మరే కవి రచనల్లోనూ అగుపించదు. పల్లీయుల జీవన విధానాన్ని ముఖ్యంగా గొల్ల, కాపు మొదలగు వృత్తి కార్మికుల బ్రతుకు తెరువుల్ని చిత్రించే గేయాల్ని గోపగీతికలుగా పేర్కొంటారు. ఆంగ్లంలో వీటిని Pastoral Poetry అంటారు.

కవికొండల గేయాలలో జానపదుల మనస్తత్వాన్ని సహజ రమ్యంగా చిత్రించారు. 'నావపై పిల్ల' అనే గేయంలో పడుచుపిల్ల పరువాన్ని పూదేనెగా - కవటాకు ఈనెగా, పున్నమి నెలబరణిగా మనోహరంగా వర్ణించారు.

| | | |
|---|---|---|
| నది నిండ నీరున్నదీ | = | 5+5+2 = 12 |
| నావపై పిల్లున్నదీ | = | 5+5+2 = 12 |
| పిల్లాకు ఒళ్లున్నదీ | = | 5+5+2 = 12 |
| వొళ్లెల్ల వయసున్నదీ | = | 5+5+2 = 12 |
| చిన్నది పూదేనిరా | = | 4+5+2 = 11 |
| కవటాకులో ఈనెరా | = | 5+5+2 = 12 |
| పున్నమి నెలబరణిరా | = | 4+5+2 = 11 |
| ముమ్మొదట నారాణిరా | = | 5+5+2 = 12 |

ఇందులో 5, 7ల పంక్తుల్లో మాత్రం ఒక్కొక్క మాత్ర లోపించింది. అయితే 'చిన్నదీ పూదేనెరా' 'పున్నమీ నెలబరణిరా' అని చిన్నది, పున్నమి పదాలను దీర్ఘంగా చేస్తే, చక్కగా ఖండగతిలో పాడుకోవడానికి వీలవుతుంది.

కవికొండల గేయాలలో వాడుక భాషా పదాలు, గ్రాంధిక భాషా పదాలు పడుగు పేకల్లో అల్లుకుపోతాయి. భావం, భాష గుండెలలో నుంచి ఉప్పొంగి వస్తాయి. కాని మెరుగులు సంతరించుకోవు.

బాపిరాజు మాత్రం ఏ బాణీలో ఏ సన్నివేశంలో గేయం రాస్తే, దానికి తగినట్లే భాషనుపయోగిస్తారు. డిసెంబర్, 1960లో కాళహస్తి తమ్మారావు సన్స్, రాజమంద్రి ప్రచురించిన 'కవికొండల వేంకటరావు గేయాలు'లో కూడ మరికొన్ని మధురగీతాలున్నాయి. వాటిలో 'కోకిల మొగడు' (పుట:19) ఒకటి.

ఈ గీతం ప్రశ్న - సమాధానంతో ప్రణయస్పర్శతో సాగిందిలా -

తురాయి పువ్వ తురిమితి కొప్పులో
సరాగ మాడిన సరసుండెవడే?

అని జానపద ప్రియుడడిగితే

తురాయి పువ్వుత్రోవలొ దొరికెను
సరాగ మాడెను చల్లనిగాలి

అని ప్రేయసి సమాధానం చెప్తుంది సరసంగా

కదంబపుష్ప పరాగంబేమే?
నితంబ మొత్తిన పరాగంబేమే?

అని మళ్లీ ప్రియుడు ప్రశ్నిస్తే

కదంబ పుష్పం కాలువ గట్టుది
నితంబ మొత్తెను నే గూర్చుంటే

అని సమాధానమిస్తుందా ప్రేయసి. నితంబమంటే 'పిరుదు' అని అర్థం. గట్టుమీద కూర్చుంటే సుకుమారమైన ఆ పిరుదు నది ఒత్తినట్లయినదని కవి చేసిన చమత్కారం. చివరకు ఆమె ఒడిలోని తీయని మామిడిపండ్లను బహూకరించిన వాడెవడే? అని ఆ జానపద ప్రియుడు అడిగితే,

మకాం కాడ మామయతోట
కుహూ కుహూ మనె కోకిల మగడు

అని పల్లె పడుచు సమాధానమిస్తుంది. చతురస్రగతిలో విలోమపు నడకతో సరసపు సంభాషణను జోడించి రచించిన కవికొండల విశిష్టగీతమిది. అదే విధంగా బావకు, మరదలుపిల్లకు,'కారెంపాట' (పుట : 21)లో మంచి సంభాషణ ఇమిడించారు.

కమ్మనీ పాటలకు - కాటుకా చూపులకు
కారెంపు గుల్లపై - కాలణచలేకుంటి - ఓ పిల్ల!

అని బావ తన అసహాయతను కాటుక చూపులకు చిక్కిన బలహీనతను పల్లవిగా పలుకగానే

కమ్మనీ పాటలూ - కమ్మనా సామివి
కాటుక చూపులు - కడచెరుకు తోటలవి
ఆకు మళ్లూ తడుప అణచి పెట్టర కాలు - ఓ బావ

అని మరదలు పిల్ల హితవు చెప్పింది. ఎలాగైనా చివరలో నున్న చెరకు తోటలకు నీరు పారించాలనే మనసు విప్పింది.

తడబడూ గడనడలు - ఎడబడూ పయ్యెటకు
కారెంపుగోతిలో - నీరెత్తలేకుంటి - ఓ పిల్ల!

అని బావ తన మనోభావాల్ని మళ్లీ చెప్పగానే

తడబడూ గడనడలు - వడగొన్న దూడలవి
ఎడబడూ పయ్యెటలు - ఈ వేయుగోపడివి
బోదె పొర్లెత్తంగ - ముంచెత్తరా నీరు - ఓ బావ!

అని మర్మంగా చెప్తూ మరదలు పిల్ల మళ్లీ బావను కార్యోన్ముఖుణ్ని చేసింది. ఈ గీతమంతా ఖండగతిలో వలపుల ఏతాం ఎత్తినట్లుగా సాగింది. కాని 'చుక్కల్లచూపులా' అనే గేయంలో (పుట : 33) పాటంతా పల్లె పదంలా సాగగా పదబంధాలు ప్రబంధాల నుంచి పుట్టుకొచ్చినట్లు అగుపిస్తాయిలా -

చుక్కల్ల చూపులా - చూపు చూచేను
వెన్నెల్ల నవ్వుతో - నవ్వు నవ్వేను
ఎవతె నా ప్రియురాలు? ఎవతె నాదయిత?
దక్షిణా నిలముతో - నిట్టూర్పు విడిచేను
మంచుబిందువులతో - నించేను కన్నీళ్లు
ఎవతె నా ప్రియురాలు? ఎవతె నాదయిత?
భానూదయపు టెర్రగానంబు సేసేను
నిశ్శబ్ద గర్భాన నిదురపోయేను
నిబిడాంధకారాన నేను దెలిసేను

ఇందలి 'దక్షిణా నిలము', 'భానూదయము', 'నిశ్శబ్ద గర్భం', 'నిబిడాంధ కారం', పదాలన్నీ ప్రబంధాలలోనివే! పల్లవిలో పల్లె పదాలు పల్లవించినా చరణాలలో ప్రబంధ పదాలే నర్తించాయి. కవికొండల వెంకట్రావు కవితావేశంలో పాత్రౌచిత్యం మరచిపోతాడనడానికిదో నిదర్శనం!

| | | |
|---|---|---|
| ఎగుడూ దిగుడూ కొండల నడుమ | = | 4+4+4+3=15 |
| వంకరటింకర మేఘంతగిలి | = | 4+4+4+3=15 |
| మాటాడక తెలినిదిరిస్తూంటే | = | 4+4+4+4=16 |
| నాలోపల నీ కల యెందుకురా? | = | 4+4+4+4=16 |

నాలోనాకీ కలతెందుకురా? = 4+4+4+4=16

............................................

గోపకు డెరుగని కొనకొమ్మలలో = 4+4+4+4=16
కాపడకుండా పికంబు గూస్తూ = 4+4+4+4=16
మాయంబింకా అయిపోనెగిరితె = 4+4+4+4=16
నాలోపల నీ దుముకు డెందుకుర? = 4+4+3+5=16
నాలోపల నీ నెమకుడెందుకుర? = 4+4+3+5=16

'ఎగుడూ దిగుడూ' అనే గేయం (పుట : 39)లో మొదటి రెండు పంక్తుల్లో ఒక మాత్ర లోపించింది. కావున 'కొండల నడుమా', 'మేఘం తగిలీ' అని చివరలో దీర్ఘంగా పాడుకుంటే సరిపోయి, చక్కటి చతురస్రగతి ఏర్పడుతుంది. కాని చివరి పంక్తియైన 'నా లోపల నీదుముకు డెందుకుర? లో మొత్తం మాత్రలు 16 సరిపోయినా చివరలోని 'దుముకుడెందుకుర' (3+5) లో గతి మారిపోతోంది. కావున దాన్ని స్వల్ప మార్పుతో 'దుముకుడు ఏలర?' అని మార్చుకుంటే గతిలో భేదం రాదు. నాల్గవ పంక్తిని 'రిపీట్' చేస్తూ స్వల్ప మార్పులతో అయిదవ పంక్తిని ప్రవేశపెట్టి కవికొండలవారు కొత్త తోవ తొక్కారీ గేయంలో

ఎవరు రమ్మన్నారు? ఎవరు పొమ్మన్నారు?
వచ్చిపోయినదారి విప్పుచ్చునకునైన
విశదంబు గాదరే!
తలతోన్ సర్వంబు వెలుగు మయమై యొప్ప
ఏ కబురు చెప్పు?

అని 'తోక చుక్క' గేయంలో (పుట : 44) తోకచుక్కనుద్దేశిస్తూ,

నీ త్రోవలో దేవుడున్నాడటే?
పాతప్రశ్నగ దీని తీసి పారేయకుము
నీ త్రోవలో దేవుజూచావుటే?
ఎవని కుశలముసెప్పనేతెంచినావో
అతని మాటే చెప్పు ఆలకిస్తాను
అతిథి నీవంటూను ఆదరిస్తాను

అని గురజాడ అడుగు జాడల్లోనే తోక చుక్కను అతిథిలా ఆదరిస్తానన్నారు, కవికొండల.

'తువ్వ' అనే గేయంలో (పుట : 108) తెల్లని తువ్వాయిని మల్లెపూవుతో పోల్చుతూ దాని గంతుల్ని - చేష్టల్ని వర్ణిస్తూ గీతం మొత్తం అంత్యప్రాసలతో ఆడుకున్నారిలా-

ఎల్లెపూ వన్నెయల మంచి తువ్వ!
ఎందాక గంతు మ్రోగింతు మువ్వ!

చిగురు కొమ్మల నీడ చిన్ని తువ్వా!
బడలి నిలబడిపోతి వొడలి చివ్వా!
.......................................................
సారువా దాళువా నందు తువ్వా!
కన్నె త్రాడిదె నిన్ను గదలనివ్వ!

రాజు-రయితు' అనే గేయంలో (పుట.150) రాజుకు రైతుకు గల తేడాను మనోహరంగా వర్ణించారు.

...................................................................
ముతక పంచెను గట్టి - ముసురులో ముదముగా=20మాత్రలు
నీరాల జేలకిడు రయితు! = 13 మాత్రలు
ఉక్కపోతను చొక్క -నుస్సుస్సురనుకొంచు
నేరాల దర్కించు రాజు!
మిర్రు పల్లములలో - కిర్రు చెప్పులు మ్రోయ
పంట బండించుకొను రయితు!
కర్రియేనుగునంటి-కడుపు కక్కురితిగా
పన్ను గట్టు కొనెడు రాజు!

నేరాలను తర్కించే రాజు, అన్యాయంగా కష్టించి పంట పండించే రైతు నుండి పన్ను వసూలు చేస్తున్నాడని చివరలో వ్యంగ్యంగా చెప్పడం చాలా బాగుంది ఖండగతిలో ఒక పంక్తి 20 మాత్రలతో మరొక పంక్తి 13 మాత్రలతో యీ గేయం సాగినా, చివరి పంక్తి పన్ను + గట్టు + కొనెడు రాజు = 3+3+3÷3=12 మాత్రలతో ఒక మాత్ర తగ్గి త్రిశ్రంలోకి మారి గతి తప్పుతోంది. కావున 'పన్నులను + గట్టించు + రాజు' = 5+5+3=13 మాత్రలుగా సవరించుకుంటే సరిపోతుంది, 'నేరాల దర్కించురాజు' కు దీటుగా

## అడివి బాపిరాజు (1895-1952) :

కవికొండల తర్వాత గోపగేయాలు అధికంగా రచించిన కవి అడివి బాపిరాజు వీరి 'తొలకరి', 'గోధూళి', సంపుటాలు అందుకు నిదర్శనాలు. బాపిరాజు చిత్రకారుడు కూడ కావడం వల్ల పల్లీయుల సహజ సౌందర్యాల్ని, ఆచారాల్ని మాటలతోటే చక్కగా చిత్రీకరిస్తారు

వీరి మొదటి కవితా సంపుటి 1922లో 'తొలకరి'గా అచ్చయింది. ఇటీవల వీరి శతజయంత్యుత్సవం సందర్భంగా సమగ్ర కవితా సంకలనంలో మళ్లీ ముద్రితమైంది.

ఇందులో మొదటి పాటగా 'అశోక వృక్ష చ్ఛాయ' శీర్షికతో హనుమంతుడు రాముడికి సీత జాడ నెరిగిస్తున్నట్లుగా రచించబడింది అశోక వనంలోని సీతామాత మోకాలి మీద చేయి మోము ఆనంచి, వీడిన కచభారంపై వేడి కన్నీరు చిందిస్తూ, విధిని దూషిస్తూ, పచ్చని చెట్టు మీద వాడిన పూవులాగుందని చిత్రం గీసినట్లు చెప్పబడింది.

మోకాలు మీద జేయి మోము గూర్చి యుండ
అశోకవృక్ష చ్ఛాయ నామెజూచితి నేను!
రామా వినుమనీవూ! జగదభి
రామా వినుమనీవూ!..........
పచ్చని చెట్టుపయిని వడలినట్టి పూవు
వలె వనమందున్న మహిజను జూచితి
రామా వినుమ నీవూ! జగదభి
రామా వినుమనీవూ!
రామా వినుమ నీవూ!
జగదభి
రామా వినుమ నీవూ!

అనే పల్లవితో హరిదాసుల పదంలా సాగిపోయిందీ పాట. ఆ తర్వాత 'వాన దేవుడు' అనే పాట పిల్లల కోసం అల్లినట్లుగా తోస్తుంది. 'పడవ వాని కథ' ను ఏలపాటగా ఎంతో చక్కగా రచించారు. పాటలోనే కథను జొప్పించారు.

ఏలేయాల, ఏలేయాల = 4+3+4+3=14
వేపచెట్టు, పూత జూడు = 3+3+3+3=12
వెల్లే పిల్ల సొగసుచూడు = 4+3+3+3=13
రావి చెట్టు రంగు చూడు = 3+3+3+3=12
పోవు వాని పొగరు చూడు[1] = 3+3+3+3=12

త్రిశ్రగతిలో సాగే యీ గేయంలో 'ఏలేయాల' అనే పల్లె పదం పల్లవిగా నిలిచింది.

బొమ్మలూరు వెళ్తున్న ఆ గుమ్మను ఒక గొల్లడు వెంబడించి దారినడుమ కలిశాడు. వలపు తెలిపాడు.

కనులు గంటి - చనులు గంటి!
వనిత నేను వలపు గంటి!

అని అతడంటే,

ఒక్కదాన నొంటిబోవ
చిక్కు బెట్ట జేరినావు!
...............................
దూరముగను బోర బోర
దూరు దాన దుష్టువాడ!

అని ఆమె సమాధానమిస్తుంది. పాటల్లో సంభాషణల్ని కూడ సమర్థవంతంగా పలికించిన ఘనత బాపిరాజుది. అంతేగాక పాత్రోచితంగా భాషను ప్రయోగిస్తాడన డానికి 'గంగిరెద్దు' గేయాన్ని చూపవచ్చు

1 అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II (1996) పుట 18

డూడూ డూడూ యెంకన్నా!
పెబువు గారికీ దణ్ణం పెట్టూ!
పాదం వంచీ భక్తితొ పెట్టూ!
కాసులు మువ్వలు కడతారంటా!
పట్టుశాలువలు పెడతారంటా![1] ॥డూ డూ॥

ఈ పల్లవి అనాదిగా జానపదులదే! అయితే అదే ధోరణిలో అందులో యిమిడేట్లుగా తర్వాత చరణాలు బాపిరాజు ఎంత చక్కగా రాశారో చూద్దాం!

మోసం చేసును మునసబుగారూ!
కక్షలు గట్టూ కరణంగారూ!
................................................
గుడి పాడైనా గూబ వదలదూ
గుడి మాన్నెం పూజారి వదలడూ ॥డూ డూ॥

సామాన్య భాషలోనే సంఘ వ్యవహారాల్ని వ్యంగ్యంగా ఎత్తి చూపారు, యీ గేయంలో 16 మాత్రల పంక్తులతో చతురస్రగతిలో సులువుగా పాడుకోగలగీతమిది. ఒక చిన్నదాని గూర్చి అల్లిన గీతం, 'మనసేల లేదు' అనేది

జాజి మొగ్గ పన్నుదాన - చామంతి పూలదాన
చామంతి పూల మీద మనసేల లేదే?
ఓ చిన్నరాధా! ఓ చిన్నదానా!
అద్దము మొగము దాన - ముద్దుల మూటదాన
ముద్దుల మీద నీకు మనసేల లేదే?........ ॥ఓ చిన్న॥
కనుల కాటుక దాన కౌగిలింతల దాన
కౌగిలింతల మీద మనసేల లేదే?[2] ॥ఓ చిన్న॥

జానపద బాణీలో సాగిన యీ గీతంలో చిన్నదాని పళ్లను జాజి మొగ్గలతో మొగమును అద్దముతో పోల్చడం మనోహరంగా వుంది. అద్దంలాంటి మోమున్నా ముద్దుల్ని కోరవెందుకని, కళ్లకు కాటుకలున్నా కౌగిలింతల్ని కాంక్షించవేలనని - చిలిపిగా ప్రశ్నించడంలో జానపద హృదయం వెల్లడైంది. చిన్న పిల్లకై అల్లిన చిన్ని గీతం 'తొలకరి'.

చిన్నా పిల్లలు వానాలప్పలు తిరుగూచుండగా
ఎండా వానా కుక్కలు నక్కలు పెండ్లీ యనంగా
..........................................................................
తాటీయాకుల గొడుగుల తోడా బయలూదేరంగా
తక్షణంబునా యెగిరీ పోవూ మబ్బూలందుండీ
..........................................................................

1. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట · 23
2 అడవి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట 24

బాల కవీశుడు రచియించీనా పాటల రీతీనీ

.....................................................................................

తొలకరి చినుకులు ముత్యంబుల వలె కురియుచునుండెనుగా
టప్పూ టప్పని తొలకరి చినుకులు కురియుచునుండెనుగా[1]

ఏకధారగా కాక టప్పు టప్పని అప్పుడప్పుడు రాలే తొలకరి చినుకుల్ని బాలకవి రచించిన పాటలతో, వచ్చీరాని మాటలతో పోల్చడం చాలా ఔచిత్యంగా వుంది.

బాపిరాజుగారు వేసుకున్న ముఖచిత్రం మీద గేయంలో మాదిరిగానే తాటియాకు గొడుగు పట్టుకుపోతున్నట్లు బొమ్మ వుండడం గమనార్హం! అలాగే 'గోధూళి' అనే మలికృతి ముఖచిత్రంగా ఆలమందను అర్థవంతంగా వేసుకున్నారు బాపిరాజుగారు. 'గోధూళి'లో మొదటి పాటగా అగుపించే 'పిలుపు'లో ఒక చిన్నది తన చిన్నవాడిని మనసున్న వాడిని ఎలుగెత్తి పిలచే తీరు హృద్యంగా వుంది.

రావోయి సిన్నవాడా!
మావాడ
రావోయి సిన్నవాడా!
పోటూ పోటూల యేరు
పొంగీ పొర్లే సోట ॥రావోయి॥
యెన్నెల యెలుగుల్లోన
యేటీ నురగల్లోన
తెల్లని తెరసాపెత్తి
తియ్యని గొంతూ కెత్తి ॥రావోయి॥

.........................................

ఉబికే వాగుల్లోకి
ఉయ్యాల లూగుతు పోయి
సందరాన పుడుతూన్న
సెందురూని సేరు కొందము[2] ॥రావోయి॥

పోటు వేళల్లో పొంగే యేరులో నావతెరచాపెత్తి, వెన్నెల వెలుగుల్లో చేపల్ని పడదామంటూ, సంద్రంలోంచి ఉదయిస్తున్న చంద్రుణ్ణి చేరుకుందాం రమ్మంటూ పిలుస్తున్న ప్రియురాలి మనోభావాల్ని మనోహరంగా రచించిన వైనం ఈ గీతంలో సుస్పష్టం! అందుకే బాపిరాజు గారు గ్రాంథికం వ్రాసినా, గ్రామ్యం వ్రాసినా సమంగా సవ్యంగా వ్రాస్తారన్నది అక్షరసత్యం!

జానపదుల మనస్తత్వాన్ని ప్రతిబింబించే మరొక గీతం, 'గొల్ల సెల్లాయి కూతురు'.

---

1. అడవి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట : 36
2. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం : పుట : 40

గొల్ల సెల్లాయి కూతురు = 3+5+4 = 12
బలె సక్కందని సూతురు = 2+6+4 = 12
దాని కళ్లు నీలి పూలు = 3+3+3+3 = 12
దాని పళ్లు జాజి పూలు = 3+3+3+3 = 12
దాన్ని పలకరిస్తే ఒళ్లు = 3+3+4+3 = 13
మోహాన గగురు పొళ్లు = 5+3+3 = 11 ॥గొల్ల॥[1]

ఒక గౌండ్ల చెల్లాయి కూతురు అందాన్ని అంతా చూసి ఎంత వింతగ చెప్పుకుంటారో చక్కగా వివరించారు. చెల్లాయి కూతురు కోడలు వరుసవుతుంది. అంటే మామ కోడలుకు శృంగార భావన సవ్యంగానే సరిపోతుంది. నల్లని కళ్లను నీలి పూలని, తెల్లని పళ్లని జాజి పూలని చెప్పడం మనోహరంగా వుంది. దాన్ని పలకరిస్తే ఒళ్లు మోహంతో గగుర్పాటు కలుగుతుందనడానికి 'గగురుపొళ్లు' అని చక్కని గ్రామ్యం ప్రయోగించారు. ఆ గగురుపాటుకు గుర్తుగా 5వ పంక్తిలో 1 మాత్ర పెంచి 6వ పంక్తిలో 1 మాత్ర తగ్గించారు.

ఆ చిన్నదాని కెంపు పెదవులు కల్లు కన్నా రుచి అని, దాని చేయి నేలుకొంటే స్వర్గ సౌఖ్యమని చెప్పడమే గాక చివరకు తాగిన కల్లుకు డబ్బులిస్తున్న వేళ దాన్ని చూసి

**గట్టి మనిషి అయిన తాళ = 3+3+3+3 = 12**
**లేక దాగి డబ్బు బదులు = 3+3+3+3 = 12**
**యెండీ బిళ్లాలిచ్చి కదులు = 4+4+3+3 = 14**

అని చమత్కరించారు. గొప్పగా చెప్పడానికి పాడుకోవడానికి చివరి పంక్తిలో 2 మాత్రల్ని కూడ పెంచారు.

వయసులో వున్న పడుచునేగాక వరదగోదావరిని కూడా చాలా సహజంగా కళ్లకు కట్టినట్లుగా వర్ణించారు.

**ఉప్పొంగి పోయింది గోదావరి, తాను**
**తెప్పున్న యెగిసింది గోదావరి**
**కొండల్లో ఉరికింది**
**కోనల్లు నిండింది**
**ఆకాశ గంగతో**
**హస్తాలు కలిపింది[2] ॥ఉప్పొంగి॥**

గోదావరి వరద తీవ్ర స్థాయిని సూచించడానికి ఆకాశగంగతో హస్తాలు కలిపిందన్నారు. ఆకాశ గంగతో హస్తాలు కలిపేంత ఎత్తులో ఉప్పొంగి వచ్చింది కాబట్టే

---

1. *అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట : 48.*
2. *అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట 54*

అడవి చెట్లన్నీని - జడలలో తురిమింది
ఊళ్లు దండలు గుచ్చి - మెళ్లోన తాల్చింది
.................................................................

మొదటి తీవ్రస్థాయిలో కాళికలా ఊళ్లను ఊడ్చిపెట్టినా, ఆ తర్వాత వరద తగ్గుముఖం పట్టాక అంబికలా అనురాగంతో

శంఖాలు పూరించి - కిన్నెర్లు మీటించి
శంకరాభరణ రాగాలాప కంఠియై
.......................................................
కరమెత్తి దీవించి కడలికే నడిచింది

అని సాగర సంగమస్థితిని సాక్షాత్కరింపజేశారు.

బాపిరాజు గ్రామ్యంలో జానపదబాణీల్లో 'తొలకరి', 'గోధూళి' కృతుల్ని రచించినట్లే గ్రాంథికంలో 'శశికళ' ను రూపొందించారు

కృష్ణశాస్త్రి 'ఊర్వశి'లా, నండూరి 'ఎంకి' లా, బాపిరాజు వలపుకల 'శశికళ' అని చెప్పవచ్చు! ఆమె సూర్యసుత -చంద్రబాల, గాన శిల్పాది చిత్రకళామూర్తి! ఎంకి పాటలలాగే 'శశికళ'లో ఏ గీతానికాగీతం స్వతంత్రంగా నడిచినా ఒకే పాత్ర చుట్టూ అల్లుకున్నవి. ప్రణయ గంధాల్ని చల్లుకున్నవి!

బాపిరాజు తమ విద్యాగురువైన 'కూల్డ్రే' దొరతో కలిసి తీర్థయాత్రలు చేస్తూ ఒకసారి అజంతా లోయలో వెన్నెలలో బండరాయిపై బడలిక తీర్చుకుంటున్న సమయంలో అతని మీద ఒక వెలుగురేఖ వాలింది దానినే కూల్డ్రే దొర 'అజంతా లోయలో బాపిరాజు' అనే పేరుతో చిత్రం గీసి 'ఎండిమియాన్' అని నామకరణం చేశాడు.

'ఎండిమియాన్' గ్రీకు దేశపు గోపబాలుడు. అతడు ఆలమందను మేపుతూ ఒకరోజు గండశిలపై నిదురపోగా ఒక దివ్యాంగన అతని మీద వాలిందట! ఆ తర్వాత ఇద్దరూ ప్రణయ రాజ్యాలు ఏలారట! ఈ కథను 'కీట్స్' మొదలగు రొమాంటిక్ కవులు కావ్యాలుగా రచించారు. బాపిరాజుకు అజంతా లోయలో జరిగిన సంఘటన ఈ 'ఎండిమియాన్'కు జరిగిన సంఘటనతో సరిగ్గా పోలి వున్నందున మూడు వేల యేళ్ల నాటి ఆ అప్సరసయే మళ్లీ బాపిరాజును శశికళగా అనుగ్రహించిందని భావించబడింది. అందుకే ఆ శశికళ అన్వేషణలో బాపిరాజు అనేక భావగీతాల్ని అల్లారు. 'ఎండిమియాన్' అనే దీర్ఘగీతంలో ఇదంతా వెల్లడించారు.

'నిరీక్షణ', 'నగ్న', 'ఒఖ్ఖణ్ణే' మొదలగు గేయాలు త్రిశ్రగతిలో 'ప్రత్యక్షము', 'ఆశయదేవి' మొదలైనవి చతురస్రగతిలో, 'నువ్వటే' 'పువ్వటే' 'అమరత్వము' మొదలైనవి ఖండగతిలో, 'సూర్యసుత', 'అతిథి', 'శశికళ' మొదలైన గీతాలు మిశ్రగతిలో నడిచాయి పాటల ధోరణిలో రాసినవి కాబట్టి కొన్నిచోట్ల తక్కువ, కొన్ని చోట్ల ఎక్కువ మాత్రలతో వున్నాయి. ఒకవైపు 'ఓ చెలీ నీవెవరు?' అని

ప్రశ్నిస్తూనే మరొకవైపు మనోహరంగా తాను దర్శించిన శశికళ ఎలా వుందో వర్ణిస్తూ 'ప్రత్యక్షము' అనే గీతం రచించారిలా -

ఎవరో ఒక దివ్యరూప
ఎవరో ఒక తళుకు చాన
కిరణంలా - కరణంలా
సురచాపం వర్ణంలా
మెరిసిందహో మిరిమిట్లయి
దరిసిందహో దరిసెనమై!

.........................................

నిరతిశయానందమ్మై
పరిమళాంగి, ప్రవిమలాంగి
పారిభద్ర ప్రసూనాంగి
విరిసిందహో విధురేఖై!

.........................................

అవతరించె నా ప్రణయిని
దిశామూర్తి శశికళాఖ్య
నిశామూర్తి శశికళాఖ్య[1]

శశికళ సొగసును - దరహాసమును వర్ణించే గీతం 'పువ్వటే' !

పువ్వటే నీ సొగసు
వేలుపుల - బువ్వటే నీనవ్వు

.........................................

కనులు మూసితినేమి
కాంతులాపుట ఎట్లు?
నాలోన నాపైన
నానార్థముల కాంతి![2]

సొగసును పువ్వుతో పోల్చడం సహజం. కాని చెలినవ్వును వేలుపుల బువ్వతో పోల్చడం పవిత్ర స్మరణం! బాపిరాజు తేట తెలుగు పదాల్ని ఎంత తేలికగా అల్లుతారో తత్సమ పదాల్ని అంత అవలీలగా గుప్పిస్తారనడానికి 'శశికళ', 'నగ్న' గీతాదుల్ని గమనించవచ్చు!

దివ్యభాసితరూప శశికళ!
నవ్య సుందరమూర్తి శశికళ!
నిత్య యౌవన స్నిగ్ధ శశికళ!
ప్రత్యయిత నా దేవి శశికళయే!

1. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట : 66
2. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట . 65

..................................................
కావ్యనాయిక నాకు శశికళ!
కావ్యరసమున స్థాయి శశికళ!
కావ్య వ్యంగ్యము రీతి శశికళ!
కావ్యమే నాగీతి శశికళ![1]

శశికళ తన కావ్య నాయికయే గాక, కావ్య రసమునకె స్థాయి అనడం, శశికళ గీతియే కావ్యమనడం నవ్యంగా వుంది.

వెన్నెలలో వెలుగు ధార
వన్నెలలో స్నానమాడ
ధవళ కాంత తరళమూర్తి
భువన సకల మోహమూర్తి
ప్రణయ దేవి నా శశికళ
మృణాళాంగి నా శశికళ
పూర్ణనగ్నయై నిలిచెను
పూర్ణకుంతలా లాడగ[2]

'నగ్న' గీతంలో తన శశికళను భువనైక మోహన మూర్తిగా, మృణాళాంగిగా, విరబోసుకున్న శిరోజాలు వెన్నెల వెలుగుల్లో కదలాడగా పూర్ణనగ్నగా అగుపించినట్లు భావించారు.

తన శశికళ ఎలుగెత్తి పాడితే ఆ పాట మాధుర్యాలలో ప్రాణాలు మరుగునని ఎనలేని అనురాగంతో రాగాలాపన గావించారు, 'శ్రుతిలేని' గీతంలో

పాడకే నా రాణి
పాడకే పాట
పాట మాధుర్యాల
ప్రాణాలు మరిగెనే! ॥పా॥
రాగమాలాపించి
వాగులా ప్రవహించి
సుడిచుట్టు గీతాల
సురిగి పోనీయకే ॥పా॥
కల్హార ముకుళములు
కదిలినవి పెదవులూ
ప్రణయపద మంత్రాల
బంధించె జీవనము ॥పా॥
శ్రుతిలేని నా మదికి

---
1 అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట : 71
2 అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట 72

చతుర గీతాలేల?
గతిరాని పాదాల
కతుల నృత్యమ్మటే![1] ॥పా॥

ముకుళిత చెంగలువలుగా తోచే పెదవుల్ని కదలిస్తూ, ప్రణయ పద మంత్రాలతో జీవనాన్ని బంధిస్తూ తన శశికళ రాగమాలాపిస్తే, ఆ రాగప్రవాహంలో తాను కొట్టుకు పోతాననడం ప్రణయగీతాలతో సుడిచుట్టుకు పోతాననడం ఇందలి ప్రణయభావనకు పరాకాష్ఠగా భావించవచ్చు!

10 మాత్రల ఖండగతిలో సాగిన యీ గీతంలో ఒక్క రెండవ పంక్తిలోనే రెండు మాత్రలు లోపించాయి.

పాడకే నా రాణీ = 5+5 = 10
పాడకే పాట = 5+3 = 8

'పాడకే పాట'ను 'పాడకే పాటా....' గా మార్చి 'ట'ను ప్లుతంగా పలికితే 10 మాత్రల పరిధి ఏర్పడుతుంది. గ్రామఫోను రికార్డు, ఆకాశవాణి ద్వారా ఘంటసాల మధురగానంలో యీ గీతం ఇలాగే బహుళ ప్రాచుర్యం పొందింది.

అతివలంతా అధరాలతో నవ్వితే తన చెలియగు శశికళ కంటితోనే కమనీయ హాసాల్ని రువ్వుతుందని, అష్టనాయికల భావాల్ని అభినయిస్తుందని, ఆమె వెలుగు నవ్వులే తన తలపై వాలే పువ్వులని మనోహరంగా అల్లిన మరో మధురగీతం, 'కంటినవ్వు'.

లోచనాల హాసలీల
లోలాక్షీ ప్రియబాలా!
కనుకొలుకుల కాంతి కళలు
కను మూతలపైన కలలు ॥లోచ॥

..........................................

అష్టనాయికల భావము
లభినయించె కంటినవ్వు

..........................................

వెలుగుల వెనకైె నవ్వులు
తలపై వాలిన పువ్వులు[2]

12 మాత్రల పంక్తులతో ప్రసన్నంగా సాగిన రచనగా యీ గీతం అగుపిస్తుంది.

బాపిరాజు తన భావనా ప్రేయసి యగు శశికళతో యుగళగీతం కూడ ఆలపించారు. అంతవరకూ లేని కొత్తబాటలో వలపు పాటను నడిపించారు. 'కళా పరిమళము' ఇలా చిలకరించారు.

---

1 అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట : 75
2 అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట : 83

నేను : నన్నటే ప్రేమింతు ఓ రాణీ!
నన్నటే పాలింతు ఓ దేవీ!
ఆమె : నిన్నెరా ప్రేమింతు
వెన్నెలల బాలరా!

..........................................

నేను : అర్ధచంద్రుడు నుదురు
అమృత రసమే పెదవి .
ఆకాశగంగ నీ
అంగవిన్యాసాలు
నీవు సొబగుల రాణివే దేవి!
నేను కర్కశమూర్తినే చెలీ
ఆమె : నీ వదన ముషసురా!
నీ చూపు కాంతిరా!
నీ పెదవిలో పాట
నృత్యాలు సలుపురా!
అందమే నీదిరా!

..........................................

నేను : ఇరువురము లోకాన
పరిమళింతము కళల[1]

తన సన్నిహిత కవులు ఇష్టదేవతల్ని సృష్టించుకుంటే, తాను మాత్రం శ్రుతి కలిపి వలపించే సతి చతురగా శశికళను భావించినట్లుగా బాపిరాజుగారు 'ఇష్టదేవత' శీర్షికతో ఒక గీతాన్నే అల్లారిలా-

హితులందరికి వారి
ఇష్టదేవులు కలరు
నా బ్రతుకు శ్రుతి కలిపి
వలపించు సతి చతురవు దేవీ! ॥హితు॥
యెంకొక్క దేవతై
యెలిసెనట ఒక్కరికి

..................................

వకుళ మాలిక వైచి
వరియించె సఖుడొకడు

..................................

కిన్నెరీ బాలా ప్రసన్నా విలసితుడు
రసవాహినీ స్నాత రమ్యవాఙ్మయొకండు

..................................................................

1. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట 87

ఊర్వశీ దేవి ప్రేమోల్లాసి చెలి యొకడు[1]

.....................................................

నండూరి యెంకిని, తల్లావఝుల వకుళ మాలికను, విశ్వనాథ కిన్నెరసానిని, కృష్ణశాస్త్రి ఊర్వశిని సృష్టించుకున్న వైనం ఈ గీతంలో సుస్పష్టం.

చివరగా బాపిరాజు శశికళను తన ఆత్మానందంకై సృష్టించుకున్నట్లుగా వెల్లడిస్తూ ఆమెకు దండకం మాదిరిగా 'దీపావళి' గీతం రచించారు.

తగణములతో సాగేది దండక రచన. రెండు గురువులు ఒక లఘువు గల అంత్యలఘు గణము తగణము.

దీపావళీ! విశ్వ
రూపావళీ! నిత్య
జ్యోత్స్నావళీ! వృక్ష
శోభావళీ! దేవి
నా లక్ష్మి, నా వాణి
నా శక్తి నా ప్రతిభయే!

.....................................

దీపావళీ! రాగ
వ్యాప్తావళీ! గతుల
తాళావళీ! కరణ
చారావళీ! దేవి
నా నృత్యగీతాభి
నయనృత్త వృత్తావళీ!

.....................................

మూర్తి స్మృత్యాపళీ! దేవి
నా ఆశ ఆశయము
నా అవధి ఆనందమే![2]

దీపావళి, విశ్వరూపావళి, నిత్య జ్యోత్స్నావళియగు శశికళయే తన వాణి, శక్తి, ప్రతిభ, ఆశ-ఆశయం అన్నీ అయినట్లుగా చెప్పారు. పరమావధి ఆనందమే అని వివరించారు. దండకం బాటలో గీత రచన చేసిన మొదటి కవి బహుశ బాపిరాజే కావచ్చు! ఈ గీతాన్ని తేలికగా దండకంగా చదువుకోవచ్చునిలా.

UUI U UI
దీపావ। ళీ విశ్వ
రూపావ। ళీ నిత్య
జ్యోత్స్నావ। ళీ వృక్ష

1. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట . 92
2. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - II పుట . 109

శోభావ! శ్రీ దేవి
నాలక్ష్మి! నా వాణి.....

పై విరుపుల్లో అన్నీ తగణాలే అగుపించడం, దండక రచనని తలపింప జేయడం ఈ గీత ప్రత్యేకత. మరో ప్రత్యేకత ఏమిటంటే దండక స్తుతి చివరలో చేస్తారెవరైనా ఈ గీతం కూడ 'శశికళ' చివరలోనే వుండడం గమనార్హం!

వేయి సంవత్సరాల కవితాకృతి తానేనంటూ వేదాల్ని, వాల్మీకి, వ్యాస, కాళిదాసుల కవితాస్వరూపాన్ని ఈనాటి పాటలో ఇమిడ్చినానంటూ తెలిపే గీతంగా వీరి 'కవితా స్రవంతి'ని పేర్కొనవచ్చు!

వేయి సంవత్సరాల్ వెనకాల కవినోయ్
వేయి సంవత్సరాల్ వెడుతూనే కవినోయ్
..........................................................................
వ్యాసర్షిగీతిలో ప్రజ్వరిల్లానోయ్
..........................................................................
కాళిదాసానంద కంపిత స్వరమునోయ్
..........................................................................
నన్నయ్య తిక్కన్న వెన్నెల కవిత్వాన్ని
ఈనాటి పాటలో ఇమిడి పోయానోయ్ ॥ వేయి॥[1]

అలాగే

పలికిస్తివయ్యా నీ బంగారు వీణా
ఒలికిస్తివయ్యా మా కమృతంపు వానా

అని మహావైణికులైన తుమరాడ సంగమేశ్వర శాస్త్రిని,

అజంతా లోయలో - సృజించాడానాడు
గుహావిహార చైత్యాలలో - మహాతూలికా గతి ద్యుతుల

అని అజంతా గుహల్లోని అందాల చిత్రాల్ని వేసిన దామెర్ల రామారావు గారిని, 'మాటనైనా కలుష మెరుగవురా అందాల కాడా!' అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని మనస్ఫూర్తిగా ప్రశంసిస్తూ గీతాలనల్లారు.

ఆంధ్రుల ప్రతిభా
ఆంధ్రుల కీర్తీ
ఆఖరు కాదని
ఆరిపోవవనీ
ఆంధ్ర కవిత్వము
ఆంధ్ర శిల్పమూ
ఆంధ్ర నృత్యమూ

1. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - I పుట 69

ఆంధ్ర గానమూ
రూపం చెడవని
రుచులు తగ్గవని
మోగింపమ్మా జయజయఢంకా![1]

అని ఆంధ్రమాతను ప్రస్తుతించారు. ఆంధ్రత్వపు విజయఢంకా మోగించారు. అంతేగాక 'లేపాక్షి' లోని మహోన్నతమైనట్టి బసవయ్యను చైతన్యంతో లేచి రమ్మంటూ అల్లిన ప్రబోధ గీతం అద్భుతంగా అగుపిస్తుంది.

లేపాక్షి బసవయ్యా లేచి రావయ్యా!
కైలాస శిఖరిలా కదలి రావయ్యా!
హుంకరించిన దెసలు ఊగిపోయేనూ
ఖురముతో దువ్వితే కులగిరులు వణికేను
............................................................ ॥లే॥
నువ్వు నడచిన భూమి నూరు పంటల చేలు
ముట్టె ముట్టిన పొదలు మొలకెత్తు ఓషధులు
పెనుగొండ సీమలో వంగోలు భూమిలో
నీ వంశమీనాడు నిలిచింది గర్వాన ॥లే॥[2]

కైలాస శిఖరంలా కదలి రమ్మంటూ, నంది నడచిన చోటంతా పంటసిరులే నంటూ ఖండగతిలో బసవయ్య అఖండ కీర్తిని పొగడినారీ గీతంలో. ఎత్తైన బలిష్టమైన గిత్తలకు ఒంగోలు ప్రసిద్ధిగా వున్నందున, ఆఖరు పంక్తుల్లో ఆ ప్రస్తావన తెచ్చారీ గీతంలో. అయితే అడివి బాపిరాజుగారి గీతాలలో పల్లవులే తప్ప చరణాలు ప్రతిభావంతంగా అగుపించవని, నవల - కథలలోని సంపూర్ణ శిల్పం గీతాల్లో పాక్షికంగానే గోచరిస్తుందని డా॥ శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారు అభిప్రాయపడ్డారు - "బాపిరాజు కవులలో చిత్రకారుడు. చిత్రకారులలో కవీని. కనుకనే గొప్ప చిత్రాలు రానట్టే గొప్ప గేయాలూ రాలేదు. ఈయన నుంచి 'లేపాక్షి బసవయ్య లేచిరావయ్య' వంటి పల్లవులు లాగినంతగా తక్కిన చరణాలు లాగవనిపిస్తుంది. కథలలో చేసినంతపని, కుంచెపని గేయాల్లో చెయ్యరు."[3]

నిశితంగా పరిశీలించి చూస్తే బాపిరాజుగారి గీతాల్లో పల్లవులే మనను ప్రధానంగా ఆకర్షిస్తాయి. చరణాల్లో అంతశక్తివున్నట్లు తోచదు. అందుకు ఉదాహరణగా 'లేపాక్షి బసవయ్య' గీతాన్నే చూపవచ్చు! మొదటి పంక్తుల్లో వున్న (పల్లవి) శిల్పం, జిగి తదుపరి పంక్తుల్లో (చరణాలు) అగుపించవు.

అలాగే కవికొండలకు ఒక ఎడిటరు అత్యవసరమంటారు శ్రీశ్రీ. లేకుంటే తోచిందంతా వ్రాయడమే! వ్రాసిందంతా ప్రచురించడమే! ఆయన పని. భావాల్లో మాటల పోహళింపును సర్దుకోనట్లే భావాల గమనాన్నీ సర్దుకోరు వీరని తేల్చి చెప్పారు.[4]

1. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - I పుట 89
2. అడివి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం - I పుట · 94
3,4 'భారతి' ఫిబ్రవరి 1963 పుటలు 4 మరియు 5

వీరికి విలక్షణంగా ప్రతి పంక్తిని భావగర్భితంగా సుకుమార పదశిల్పంగా గీతాన్ని అల్లిన వారిలో దేవులపల్లి నిలుస్తారు. అందుకే వారి గీతాలన్నీ అత్యంత సుందరంగా రసబంధురంగా అగుపిస్తాయన్న సత్యాన్ని వారి గీతాల తీరు తెన్నుల పరిశీలనలో ఆవిష్కరించవచ్చు! ముందుగా దేవులపల్లికి కాస్త ముందు వాడైన బసవరాజు గీతాల్ని పరిశీలిద్దాం!

## బసవరాజు అప్పారావు : (1894-1933)

మేటి పాటల మేలుబంతి, పాటల పూదోటలో విరిసిన ముద్దబంతి శ్రీ బసవరాజు. బసవరాజు లలితగీతాల భావరాజు అన్న సత్యం ఆయన అనేక గీతాలు నిరూపిస్తాయి.

అందరూ దేవులపల్లిని 'ఆంధ్రాషెల్లీ' గా అభివర్ణిస్తే, బసవరాజును ఆనాడే 'ఆంధ్రాకీట్సు'గా అభిమానించారు. వారి అకాలమరణాన్ని, గీతాల ధోరణిని బట్టి Keats & Shelly rolled into one అని బసవరాజు గూర్చి "Times of India' '"Indian Express" పత్రికల సంపాదక వర్గంలో పనిచేసిన దువ్వూరి సాంబమూర్తిగారు వ్యాఖ్యానించారు. దేవులపల్లి కూడ ఆయననే మొట్టమొదటి భావకవి అన్నారు. అయినా ఆయనకు రావలసినంత పేరు రాలేదనే చెప్పాలి. కారణం? ఆయన ఏ యిజాలతోనూ-వర్గాలతోనూ కలువక పోవడమే కావచ్చు! నాడే కాదు యీనాడు కూడ సారస్వతలోకంలో యిజాలు - గ్రూపులతో భుజాలు కలుపుకు తిరిగే వారికే భుక్తి-ముక్తి లభిస్తున్న సంగతి అందరికీ తెలిసిందే!

బసవరాజు స్వేచ్ఛను ప్రేమించే, అనుభూతిని ఆశ్రయించే అచ్చమైన కవి! సూటిగా కవిత చెప్పడమే గాక కల్మషం లేక అందరినీ మిత్రులుగానే భావించి ఆదరించే స్వచ్ఛమైన మనిషి! "ఎక్కడ కవితల్లో మెరుపులు కనిపించినా మైమరుపుతో అభిమానించి గుండెకు హత్తుకునే వారని, లౌక్యంగా మసలే చాలా మంది బసవరాజు పసి హృదయాన్ని చూసి. ఒక పిచ్చివానిగా జమకట్టే వారని ఆయన మిత్రులు కురుగంటి సీతారామయ్యగారే 'బసవరాజు అప్పారావు గేయాలు'కు అనుబంధంగా ముద్రితమైన అభిప్రాయాలలో పేర్కొన్నారు.

13.12.1894లో జన్మించిన బసవరాజు సరిగ్గా 38½ సంవత్సరాలు మాత్రమే జీవించి 19.6.1933లో పరమపదించారు. నవ్య కవిత్వానికి గురజాడ వేగుచుక్క అయితే, భావకవితా జగత్తులో బసవరాజు పగటి చుక్క, దేవులపల్లి రేచుక్క. బసవరాజు పగటి చుక్క కాబట్టే కాలమనే దినంలో మిట్టమధ్యాహ్నంలోనే అర్థాంతరంగా తనువు చాలించి మింటి కెగిశారు. దేవులపల్లి కృష్ణరజనిగా పగలంతా మథనపడి రేయంతా కూనిరాగాలు తీస్తూనే గడిపారు.

లలితగీత వికాసానికి ప్రధానంగా పరిశ్రమించిన బసవరాజుగారి కవిత్వాన్నే గాక జీవితాన్ని గూడ సంక్షిప్తంగా అవలోకించాల్సిన అవసరముందిక్కడ

చిన్ననాటనే తల్లిని కోల్పోయిన కారణాన బసవరాజు బాల్యమంతా మాతామహుల యింటనే గడిచింది. విజయవాడ శివారులో నున్న పటమట గ్రామమే విద్యాబుద్ధుల్ని నేర్పింది. 1912లో విజయవాడలో హైస్కూలు చదువు పూర్తికాగానే మద్రాస్ ప్రెసిడెన్సీ కళాశాలలో చేరి 1916లో బి.ఏ. పట్టా పొందారు. బి.ఏ. చదువుతూండగానే మేనమామ కూతురైన రాజ్యలక్ష్మమ్మను వివాహమాడారు. వీరి సతీమణి బసవరాజు రాజ్యలక్ష్మమ్మ 'సౌదామిని' పేరుతో గీతాలు కూడా రచించడం విశేషం!

బి.ఏ. పూర్తికాగానే బసవరాజుగారు 'ఆంధ్రపత్రిక', 'భారతి' సంపాదక వర్గంలో చేరి మద్రాస్‌లో పనిచేయడం ప్రారంభించారు. మద్రాస్ మాంబళం (ఇప్పటి త్యాగరాయ నగర్) లోని అప్పటి బసవరాజుగారి మకాం మహాకవులైన రాయప్రోలు, దేవులపల్లి, బాపిరాజు, నండూరి, అబ్బూరిలాంటి వారికెందరికో 'మజిలీ'గా - మంచి కవిత్వపు 'బిజిలీ'గా వుండేది.

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య బసవరాజుకు ఆప్తమిత్రులు కావడం చేత అనేకసార్లు మద్రాసుకు వచ్చి బసవరాజు యింటనే బసచేసేవారు. ఆంధ్రరత్న అస్తమయం వార్త మైసూరు యాత్రలో వున్న బసవరాజుకు తెలియగానే చలించిపోయి, యమునా కల్యాణి రాగ ప్రియులైన గోపాల కృష్ణయ్య మీద అల్లిన 'ఎలిజీ' గేయము -

ఏలా పాడే నింక యమునా కల్యాణి! నే
లీలా మానవుడు గోపాలుడు లేడాయె
బంగారు గనులలో చెంగలించే వేళ
పిడుగు బోలిన వార్త వినిపించినారయ్యో!

అని రచించి విలపించారు. ఇలా బసవరాజు తన ప్రతి అనుభూతిని ఒక నవగీతిగా మలచుకున్నారు. స్వరమెత్తి పాడుకున్నారు. తనకు కలిగిన పాప "మంగళ ప్రద" చిన్న నాటనే కన్ను మూస్తే-

| | | |
|---|---|---|
| "కోయిలా కోయిలా కూయబోకే | = 5+5+5+2 | = 17 |
| గుండెలూ బద్ధలూ చేయబోకే | = 5+5+5+2 | = 17 |
| తీయనీ రాగాలు తీయబోకే | = 5+5+5+2 | = 17 |
| తీపితో నా మనసు కోయబోకే | = 5+5+5+2 | = 17 |
| చిట్టినీ జ్ఞాపకం చేయబోకే | = 5+5+5+2 | = 17 |
| చింతలో ప్రాణాలు తీయబోకే"[1] | = 5+5+5+2 | = 17 |

అని ఖండగతిలో అఖండ పరితాపాన్ని వినిపించారు. కొన్నాళ్లకు కొడుకు పుట్టగానే, ఆ దీపావళి వేళ ఆనందంగా -

"లోకాని కుత్తుత్త దీపావళీ
నాకు మాత్రము దివ్య దీపావళీ

1 బసవరాజు అప్పారావు గేయాలు (ప్రచురణ 1991) పుట : 123

**వేదాల నాథుడౌ వేదాద్రి నరసింహ**
**దేవుడే నాయింట దీపమైనాడు**

**...............................................**

**ఉయ్యాల తొట్టెలో వూగుతున్నాడు"[1]**

అని ఎలుగెత్తారు. కాని ఆ ఆనందం కూడ బసవరాజుకు కొన్నాళ్లే మిగిలింది. క్షణ భంగురమైన జీవితానందం క్షణంలోనే "జీర్ణం! జీర్ణం!" అయిపోయిందని మళ్లీ విలపించారు. ఆ విలాపాన్ని చలనచిత్రంలోని విషాద గీతంలా (అప్పటికింకా చలన చిత్రాలు రాలేదు) మనకు కళ్లకు కట్టారిలా-

| | | | | |
|---|---|---|---|---|
| **"వేదాద్రి శిఖరాన వెలిగున్న జ్యోతి** | = | **5+5+5+3** | = | **18** |
| **మినుకుమని కాసేపు కునికి పోయింది** | = | **5+5+5+3** | = | **18** |
| **దేవలోకము నుండి దిగినట్టిగంగ** | = | **5+5+5+3** | = | **18** |
| **వచ్చిన్న దారినే పట్టి మళ్లింది** | = | **5+5+5+3** | = | **18** |
| **కాపుర మ్మొచ్చిన కన్నిపాపాయి** | = | **5+5+5+3** | = | **18** |
| **ఇల్లు ఖాళీ చేసి వెళ్లి పోయాడు"[2]** | = | **5+5+5+3** | = | **18** |

ప్రతి పంక్తి 18 మాత్రల్లో ఖండగతి ఏకతాళంలో సాగిన చక్కటి గీతమిది. కొద్దికాలం మాత్రమే జీవించి కన్ను మూసిన తన పాపాయిని ఈ లోకమనే యిల్లును ఖాళీ చేసి వెళ్లిపోయాడని భారమైన భావాన్ని తేలిక పదాల్లో తేల్చి చెప్పగలగడం బసవరాజుకు మాత్రమే సాధ్యమైనట్లు అగుపిస్తుంది. ప్రతి పాఠకుని హృదయాన్ని పట్టేస్తుంది. అందుకే కృష్ణశాస్త్రిగారు బసవరాజు గురజాడ అడుగుజాడల్లో నడిచిన అనుచరుడని అన్నారు. అలా అనుసరించడమే గాక కొన్ని కొన్ని చోట్ల అధిగమించాడని కూడ చెప్పారు. ఎందుకంటే ఇంతటి ఆర్ద్రత-ఆప్తత గురజాడలోనూ అంతగా లేదని ఆయన అభిప్రాయం. అందుకే బసవరాజు అప్పారావే మొట్టమొదటి భావకవి అని దేవులపల్లి నొక్కి చెప్పారు.[3]

బసవరాజు మిక్కిలి సౌందర్యోపాసకుడు. సౌందర్యారాధనను ఈశ్వరార్చనకు సాధన మార్గంగా భావించి ఆనందించేవాడు. 'ఆనందోబ్రహ్మ' యని విశ్వసించేవాడు. ఈయన మీద గురజాడ, వర్డ్సువర్తు ప్రభావాలు ప్రధానంగా కనిపిస్తాయి. జానపదుల బాణీలు ఈయన కలాన్ని కదను దొక్కిస్తాయి.

బసవరాజుకు ఎంకి పాటల నండూరి అత్యంత సన్నిహితుడు.

నండూరికి కృష్ణశాస్త్రి సన్మిత్రుడు. కృష్ణశాస్త్రి, నండూరి సాహిత్య లోకంలో స్వరమెత్తుటకు ముందే బసవరాజు ప్రవేశం జరిగిపోయింది. అందుకు సాక్ష్యంగా

---

*1 బసవరాజు అప్పారావు గేయాలు (ప్రచురణ 1991) పుట . 144*
*2. బసవరాజు అప్పారావు గేయాలు (ప్రచురణ 1991) పుట . 147*
*3 బసవరాజు అప్పారావు గేయాలు (ప్రచురణ 1991) పుట* xxxvii

"నన్నంతకు మునుపే సారస్వత విషయాల్లో అంతో యింతో తరిఫీదు చేయుచున్న మా బసవరాజు అప్పారావు కూడా మాతో పాటు మద్రాస్‌లో వుండేవాడు"[1] అన్న నండూరి 'ఎంకి పాటల' పీఠికల మాటల్నే చూపవచ్చు!

జానపద బాణీల్లో పాటలల్లడంలో బసవరాజు ఆద్యుడైనా, ఆ బాటనే యెంచుకున్న నండూరికే ఎంకి పాటల ద్వారా అమిత ఖ్యాతి, ప్రచారం లభించిందన్న వాస్తవం ఆనాటి పెద్దలతో జరిపిన నా సంభాషణలోనూ వెల్లడైంది. రాయప్రోలు 'తృణ కంకణం' రచించునాటికే బసవరాజు 'సెలయేటి గానం' వావిళ్ల ప్రచురణలో వెలువడింది. కావున బసవరాజు కృష్ణశాస్త్రి, నండూరి కంటె కొస్త ముందుగానే కలం పట్టినట్లు రూఢి అవుతోంది.

నండూరి-బసవరాజు యిద్దరూ పాడుతూ రచన చేసినవారే! 'బసవరాజు అక్కడక్కడ తుంచుతూ ఎలుగెత్తితే నండూరి తారాజువ్వలా స్వరమెత్తేవాడని, నండూరి పాట నిభృత సుందరమైతే బసవరాజు పాట నిసర్గ మనోహరమని" కృష్ణశాస్త్రి బసవరాజు అప్పారావు మధురస్మృతిలో వివరించాడు.

బసవరాజుది ఆత్మాశ్రయ ధోరణిలోనే గాక అన్యవిషయ వివరణలోనూ అందెవేసిన చేయి అనడానికి అనేక గీతాలు నిదర్శనంగా నిలుస్తాయి. అందులో కొన్ని పరిశీలిద్దాం!

సిద్ధార్థుడు తనను అర్ధరాత్రి వదలి వెళ్లాడని తెలిసిన యశోధర అంతరంగంలో ఎగిసిపడే ఆవేదనను 'యశోధరా విలాపము' గీతంగా నిలిపారు మన హృదయాల్ని కదిపారు.

| | | | | |
|---|---|---|---|---|
| "లేపనైనా లేపలేదే! | = | 3+4+3+4 | = | 14 |
| మోము | = | 3 | = | 3 |
| చూపనైనా చూపలేదే! | = | 3+4+3+4 | = | 14 |
| కోపకారణమేమొ | = | 5+5 | = | 10 |
| ఏ పాప మెరుగనే! | = | 5+5 | = | 10 |
| ................................॥లేప॥ | | | | |
| హృదయ తల్పము పైన | = | 5+5 | = | 10 |
| సొదమరచి హాయిగా | | | | |
| నిదురదోగే నన్ను | = | 5+5 | = | 10 |
| వదలి పోయే వేళ | = | 5+5 | = | 10 |
| ................................॥లేప॥ | | | | |
| ద్వారమా! నాథుడే | = | 5+5 | = | 10 |
| దారిబడి పోయెనే! | = | 5+5 | = | 10 |
| కన్నిబాబా! నీకు | = | 3+4+3 | = | 10 |
| కలనైన రాలేద? | = | 5+5 | = | 10 |
| ..............................॥లేప॥[2] | | | | |

1. ఎంకిపాటలు - నండూరి పుట : ix
2. బసవరాజు అప్పారావు గేయాలు (ప్రచురణ-1991) పుట 18

బసవరాజు గేయాలకు ప్రత్యేక వివరణ అక్కర్లేదు. అవి సూటిగా విల్లు విడిచిన బాణంలా మన గుండెల్లో నాటుకుంటాయి. చివరలో 'ద్వారమా! నా నాధుడే దారి బడిపోయాడో చెప్పవే!' అని ఆర్తిగా ద్వారాల్ని, 'కన్నతండ్రీ! నీకు కలనైనా రాలేదా?' అని జాలిగా కన్నకొడుకును ప్రశ్నించడం ఆమె ఆవేదనకు పరాకాష్ఠగా చూపడమైనది అందుకే భావానికనుగుణంగా పల్లవిలో మొదటి రెండు పంక్తుల్ని 14 మాత్రల్లో నడిపి ఆ తర్వాత చరణాలతో సహా అన్ని పంక్తుల్నీ ఖండగతిలో సాగించి, పదేసి మాత్రల్లో రచన చేశారు. పల్లవిలోని మొదటి పంక్తికాగానే 'మోము'ను విడదీసి పలికి తర్వాత పంక్తియైన 'చూపనైనా చూపలేదే!' అనడంతో దానికో వింత తూగు ఏర్పడింది. దీనిని Before Beat అంటారు.

ఇది యశోధరా విలాపమయితే, ఇక బాలకృష్ణుని కొంటె పనులకు కోపించిన గోపికలు యశోదతో చెప్పే ఫిర్యాదులు ఎలాంటివో పరిశీలిద్దాం!

| | | |
|---|---|---|
| "పన్నెండేళ్ల చిన్నాడే! | 4+3+6 = 13 | |
| పైట కొల్ల గొన్నాడే | 3+3+6 = 12 | |
| అడుగవమ్మ! అడుగవమ్మ! | 3+3+3+3 = 12 | |
| అమ్మ! యశోదమ్మా! | 3+3+4 = 10 | ॥ప॥ |
| చీకటైన కాలేదే | 3+3+6 = 12 | |
| రాకపోక లాగ లేదె | 3+3+3+3 = 12 | |
| లోకానికి జడవొద్దా? | 6+6 = 12 | |
| పోకిళ్లకి అదుపొద్దా?"[1] | 6+6 = 12 | |

పన్నెండేళ్ల చిన్నవాడైనా పడతుల పైటలాగి అల్లరి చేశాడు! కావున గట్టిగా మందలించమని చెప్పడాన్ని 'అడుగవమ్మ! అడుగవమ్మా అమ్మయశోదమ్మా' అని గుచ్చి గుచ్చి సంబోధించడంతో వారి ఆవేదన-ఆవేశం ద్విగుణీకృతంగా వెల్లడైంది. త్రిశ్రగతిలో 12 మాత్రలతో నడిచిన ఈ గేయంలో మొదటి పంక్తిలో ఒక మాత్ర ఎక్కువై నాల్గవ పంక్తిలో 2 మాత్రలు తగ్గాయి. అయినా భావతీవ్రత వ్యక్తీకరించడానికి అనువుగా మారాయి.

శ్రీకృష్ణుని రాసలీలల్ని, దొంగ చేష్టల్ని 'దొంగకృష్ణుడు' గీతంలో చక్కగా వివరించడమైంది.

A. నల్లవాడే! గొల్లపిల్లవాడే! చెలియ
B. కల్లగాడే! వాని వల్లో చిక్కితినే! ॥న॥
A. వచ్చినాడే! తోట చొచ్చినాడే! సకియ
B. చొచ్చినాడొ మనసు ముచ్చిలించాడే! ॥న॥
A. ఆగినాడే! పొదల దాగినాడే! మనసు
B. రాగబంధము వేసిలాగుకొన్నాడే ॥న॥[2]

1 బసవరాజు అప్పారావు గేయాలు · పుట 14
2 బసవరాజు అప్పారావు గేయాలు పుట 108 మరియు 109

"నల్లవాడే! గొల్లపిల్లవాడే" అని ఇందులో 7 మాత్రల శబ్దాల్ని 3 మాత్రల విరామంతో ప్రయోగించడంతో ఎడనెడ అనుప్రాస దొర్లించడంతో వింత సొగసు, విలక్షణమైన తూగు ఏర్పడింది. ఇలా మనోహరంగా రచన చేయడం బసవరాజు ప్రత్యేకత కాబట్టే ఆయన మరణించినా యీ గీతాన్ని మరువలేక 'మాలపిల్ల' చిత్రంలో 1938లోనే గూడవల్లి రామబ్రహ్మంగారు వెండితెరకెక్కించారు. ఆ తర్వాత కూడా ఈ 'నల్లవాడే! గొల్లపిల్లవాడే'! గీత ప్రభావంతోనే ఆత్రేయ 'దసరాబుల్లోడు' చిత్రంలో 'నల్లవాడే! అమ్మమ్మొ అల్లరి పిల్లవాడే!' అన్న పాటను రచించి వుంటారనుకుంటాను.

పై గీతంలో 1, 3, 5 - A పంక్తులు ఒక నడకలో 2, 4, 6 - B పంక్తులు మరొక నడకలో సాగినట్లు స్పష్టమవుతోంది. కొత్తదారిలో గీతాన్ని నడిపినట్లు తెలుస్తోంది.

ఇదే ధోరణిలో యుగళగీతంగా పాడుకునేందుకు వీలుగా మరొక మంచి గీతం (ఐక్యమౌదామె) రాశారు. ఇది 1939లో విడుదలైన 'రైతుబిడ్డ' చిత్రంలో ప్రణయగీతంగా మ్రోగింది.

| | |
|---|---|
| A ఆ మబ్బు యీమబ్బు ఆకాశ మధ్యాన | 5+5+5+5=20 |
| B. అద్దుకున్నట్లు మనమైక్యమౌదామె | 5+5+5+3=18 |
| A ఆ తీగ ఈ తీగ అడివి పొదరింటిలో | 5+5+5+5=20 |
| B. అల్లుకున్నట్లు మనమైక్యమౌదామె | 5+5+5+3=18 |
| A ఆమాట యీ మాట అర్థాంతరములోన | 5+5+5+5=20 |
| B. వాక్యమైనట్లు మనమైక్య మౌదామె![1] | 5+5+5+3=18 |

ఇలా A పంక్తులన్నీ 20 మాత్రల్లో B పంక్తులన్నీ 18 మాత్రల్లో సమంగా నడిపించి, మంచి విరుపుల్ని తెచ్చి ఖండగతికి కమనీయాకృతి కలిగించారు. అంతేగాక భావం కూడా బాగా ఒదిగిందీ గీతంలో ఆ మాట యీ మాట కలిసి అర్థవంతంగా వాక్యమైనట్లు ఐక్యమవుదాం అని ప్రేయసీ ప్రియులు భావించడంలోనే కవిత్వపు కొసమెరుపు కొట్టొచ్చినట్లు తళుక్కుమంటోంది. ఇలా మెరుపుల్నేగాక నాట్యసుందరి మెయివిరుపుల్ని కూడ అందంగా వర్ణిస్తారు అప్పారావు గారు.

| | |
|---|---|
| ఆడవె! ఆడవె! అన్నుల మిన్నా! | = 4+4+4+4=16 |
| ఆడవె! లేనడుమల్లల్లాడన్! | = 4+4+4+4=16 |
| ఆడెడు నీ నడుమందం గాంచిన | = 4+4+4+4=16 |
| అల్లాడవె ప్రేమను లోకంబుల్[2] | = 4+4+4+4=16 |

చతురస్ర గతిలో 16 మాత్రల్లో చతురోక్తిగా పల్లవి సాగినా రెండవ పంక్తి, నాల్గవ పంక్తిలో పొల్లు హల్లులు వుండి పద్య ఛాయల్ని పట్టుకొస్తున్నాయి. కావున రాగయుక్తంగా సవ్యంగా పాడుకునేందుకు వీలుగా ఆ పంక్తుల్నే ఇలా సవరించుకుంటే సరి-

1. బసవరాజు అప్పారావు గేయాలు · పుట 132
2 బసవరాజు అప్పారావు గేయాలు పుట 79

ఆడవె ఆడవె అన్నుల మిన్నా! = 16
ఆడవె లేనడుమల్లల్లాడా! = 16
ఆడెడు నీ నడుమందంగాంచిన = 16
అల్లాడవె ప్రేమను లోకములే = 16

ఇలాగే చరణాలలోనూ స్వల్ప మార్పుల్ని చేసుకుంటే మనోహరంగా పాడుకునే వీలుంది. యవ్వన భారంతో జవ్వని లేత నడుము అల్లల్లాడడం సహజమే గాని యిక్కడ ఆ సుందరి నడుము అందం చూస్తే ప్రేమతో లోకములే అల్లాడిపోగలవని కవి చేసిన చమత్కారం బాగుంది.

అలాగే ఒక వెర్రిబాగుల మరదలు పిల్ల తన ప్రియమైన బావను చేరి, తనవైపు అతన్ని తిప్పుకొనడానికి పడిన తిప్పల్ని ఎంతో తీయగా చెప్పారు. 'వెర్రిపిల్ల' అనే గేయంలో

"గుత్తింకాయ కూరోయ్ బావా!
కోరి వండినానోయ్ బావా!
కూరలోపలా నా వలపంతా
కూరి పెట్టినానోయ్ బావా!
కోరికతో తినవోయ్ బావా"[1]

జానపద ధోరణిలో సాగిన ఈ గీతంలో మనసులోని భావ వ్యక్తీకరణకు అయిదవ పంక్తిని అదనంగా వాడడం ప్రత్యేకతగా చెప్పవచ్చు! సామాన్యంగా అంతా వంకాయల్లో మసాలాల్ని కూరితే, పాపమా పడుచుపిల్ల మనసులోని వలపుల్నే కుక్కినట్లు వెల్లడించింది. ఇంకా ఎన్నెన్నో చేసినట్లు ఊరించిందిలా-

తియ్యని పాయసమోయ్ బావా!
తీరుగా వండానోయ్ బావా!
పాయసమ్ములో నా ప్రేమనెడు
పాలు పోసినానోయ్ బావా!
బాగని మెచ్చాలోయ్ బావా!

..............................................

కర కర వేగిన పూరీలలోనా
కాంక్ష వేపి నానోయ్ బావా!
కనికరించి తినవోయ్ బావా!

..............................................

వెన్నెలలోనా కన్నెవలపనే
వెన్న కలిపినానోయ్ బావా!
వేగముగా రావోయి బావా!

పాయసంలో 'ప్రేమ' అనే పాలు పోయడం, పూరీలలో కాంక్షల్ని కలిపి వేపడం వెన్నెలలో కన్నె వలపనే వెన్న కలిపి పిలువడం, బావ బాహుబంధాల్లో

1 బసవరాజు అప్పారావు గేయాలు పుట 98

ఒదిగి పోవాలనుకునే మరదలు తపనలుగా మనోహరంగా రచించారు బసవరాజు. అందుకే యీ పాట ముందుగా గ్రామఫోను రికార్డు ద్వారా బందా కనకలింగేశ్వర రావు గాత్రంలో ప్రజాదరణ పొందింది. ఇలా భావ ప్రధానమైన లలితగీతాలు సినీగీతాలుగా రాణించిన కవులలో కూడ బసవరాజే మొట్ట మొదటి కవిగా నిలుస్తారు. తర్వాత 1951లో విడుదలైన 'మల్లీశ్వరి' చిత్రం ద్వారా దేవులపల్లి, ఆ తర్వాత శ్రీశ్రీ, సి. నారాయణరెడ్డిగార్లు దృష్టికి వస్తారు.

బసవరాజు ప్రణయగీతాన్ని ఎంత పసందుగా రాస్తారో జాతీయభావాలు గల గీతాల్నీ అంత ప్రబోధంగా అల్లుతారు. 'జాతీయ పతాకం' గూర్చి రాస్తూ (పుట : 197)

పతాకోత్సవము చేయండీ!
స్వతంత్ర భారత జాతి చిహ్నమౌ ॥ప॥
వీర కేసరుల ఎర్రని రంగూ
దేశసేవకుల తెల్లని రంగూ
భక్తుల పాలిటి పచ్చని రంగూ
బీదల పెన్నిధి రాటపు మెరుపే ॥ప॥

అని ఎరుపు, తెలుపు, పచ్చరంగులు మన జెండా కెలా ఏర్పడ్డాయో వర్ణించారు. ఆ తర్వాత సీమగుడ్డల్ని వ్యతిరేకిస్తూ, ఖద్దరును ప్రతిపాదిస్తూ అల్లిన గీతంలోనూ ఆవేశం పెల్లుబికినట్లు అగుపిస్తుందిలా.

సిగ్గులేదా? నీకు శెరములేదా? ॥సి॥
అన్నమైనా లేక బీదలల్లాడు తుంటేను
సీతాకోక చిలుకలాగ-సీమగుడ్డ కట్టి తిరుగ ॥సి॥
పూట కూడులేని ప్రజకు-రాట్నె మొకటే పెన్నిధుండ
మోటంచు పవిత్రమైన - రాటంఖద్దరు వెక్కిరింప ॥సి॥

అక్కడక్కడ మాత్రల్లో హెచ్చుతగ్గులున్నా, భావావేశంతో సాగిపోతుందీ గీతం.

గాంధీగారంటే బసవరాజుగారికి అమిత భక్తి! అప్పటికి ఉప్పు సత్యాగ్రహం మాత్రమే ముగిసింది. స్వాతంత్ర్యలక్ష్యసాధనకై ప్రతి భారతీయుడి ఉక్కు పిడికిలి బిగిసింది. ఆ స్వప్న సౌధాన్ని చూడకుండానే 1933లోనే ఈ కవి ప్రాణం ఎగిసింది. అప్పటికే ఆయన హృదయంలో గాంధీ గారంటే ఎంతటి భక్తి భావముందో యీ గీతం ద్వారా తెలుస్తుంది.

కొల్లాయి గట్టితే నేమి?
మా గాంధి
కోమటై పుట్టితే నేమి?
వెన్న పూసా మనసు - కన్న తల్లీ ప్రేమ
పండంటి మోము పై బ్రహ్మతేజస్సూ.... ॥కొ॥
బోసి నోర్విప్పితే ముత్యాల తొలకరే!
చిరునవ్వు నవ్వితే - వరహాల వర్షమే!

చక చక నడిస్తేను-జగతి కంపించేను
పలుకు పలికితేను - బ్రహ్మవాక్కేను ॥కొ॥

ఖండగతిలో సాగిన ఈ గేయంలో ప్రతిపాదం అర్థవంతంగానే తోస్తుంది. కాని పళ్లులేని గాంధి బోసి నోటితో చిరునవ్వు నవ్వినా వరహాల వర్షం కురుస్తుందనడం అతిశయోక్తియే! సామాన్యంగా తళతళ మెరిసే పలువరస గలవారు నవ్వితే వరహాలు దొర్లినట్లుగా వర్ణిస్తారు కాని గాంధీగారి మీదున్న అమితాభిమానం బసవరాజు నా విషయం ఆలోచింపజేయలేదనుకుంటాను.

గ్రహసంచారంలో గ్రహణాలు ఏర్పడడం సహజమే! అయినా చంద్రుణ్ని రాహువు బారినుండి రక్షించాలన్న తపనతో బసవరాజు 'చంద్రగ్రహణము' (పుట 13) అనే గేయంలో

| | |
|---|---|
| రాబోకు రాబోకురా చందమామ! | 5+5+5+3=18 |
| రాహువొంచున్నాడురా తోవలోన | 5+5+5+3=18 |
| తెల్లన్ని నీ కాంతి - నల్లనయ్యేనురా! | 5+5+5+5=20 |
| చల్లన్ని నీ మోము- సన్నగిల్లేనురా! | 5+5+5+5=20 |

అని హెచ్చరించారు. ఈ గీతమంతా ఖండగతిలో సవ్యంగానే సాగినా మొదటి రెండు పంక్తులైన పల్లవిలో రెండేసి మాత్రలు లోపించాయి. హెచ్చరికగా పాడేటప్పుడు చివరలోని హ్రస్వ అక్షరాల్ని దీర్ఘాలుగా పలికే అవకాశమున్నందున 'చందమామా....' 'తోవలోనా.....' అని రాగం లాగితే సరిపోయే వీలుంది. క్రింది పంక్తుల్ని 'తెల్లనీ నీ కాంతి నల్లనయ్యేనురా! చల్లనీ నీ మోము సన్నగిల్లేనురా' అని కూడా ఖండగతి చెడకుండా రాయవచ్చు! కాని అది తేలిపోతుంది. అక్కడ ప్రమాదం ముంచుకొస్తుంది. కాబట్టి అది నొక్కి చెప్పడానికే 'తెల్లన్ని' 'చల్లన్ని' అని ద్విత్వాక్షరాల్ని వాడారు.

అలాగే ఆగ్రా 'తాజ్‌మహల్' ను చూస్తూ (పుట : 73) అకాల మరణం చెందిన ముంతాజ్‌ను తలపోస్తూ ఒక గీతం అల్లారు ఆవేదనగా. అయితే లోతుగా శోధిస్తే ఇందులో బుర్రకథ దరువులు దొర్లినట్లుగా మన బుర్రలకు తట్టక పోదు ఇలా-

మామిడి చెట్టును అల్లుకున్నదీ!
మాధవీ లతొకటీ!
ఏమా రెండిటి ప్రేమ సంపదా
యింతింతనలేమూ!
చూడలేక పాపిష్టి తుపాను-ఊడబీకెలతనూ....
మోడయి పోయీ మామిడి చెట్టూ- మొగము తేలవేసీ....
ముచ్చటైన ఆకులు కాయలనే - వెచ్చని కన్నీళ్లోడ్చీ
పచ్చనాకులా బొమ్మరింటిలో - పండొక్కటి రాల్చీ
మామిడి చెట్టూ మాధవి లతతో - మాయలొ గలిసింది...
కామిత మిచ్చే మామిడి పండూ - కవులకు మిగిలింది.

పై పంక్తుల చివర్లో 'తందాన తాన' అని చేర్చి పాడితే అచ్చం బుర్ర కథలాగే మారుతుందిది.

'షాజహాను'ను మామిడి చెట్టుతో, ముంతాజ్‌ను మాధవీలతతో పోల్చి, వారి ప్రణయ చిహ్నంగా నిలిచిపోయిన 'తాజ్‌మహల్'ను కవులకు కామితమిచ్చే మామిడి పండుగా వుందనడం, కవి కల్పనా చమత్కృతికో చక్కటి ఉదాహరణ!

బసవరాజు ఇలా ఎంత భావగాంభీర్యం పలికిస్తారో అంత హాస్యాన్నీ ఒలికిస్తారనడానికో ఉదాహరణగా 'కయ్యాల విందు' (పుట : 22) గేయాన్ని చూపవచ్చు!

గయ్యాళి పెళ్లాన్ని కట్టుకుంటేను
కయ్యాల కెన్నటికి కరువులేదండీ!
కయ్యాలతో మేడ కట్టించుతాము
వియ్యాల వారికది విడిది కిస్తాము!

............................................................

కయ్యాలె అల్లుడికి కట్నమిస్తాము
చుట్ట పాతల కవే చుట్ట పెడతాము

ఇలా హాస్యరసం ఒలికించినట్లే, వీరరసం కూడా విధిగా కనబరుస్తారు.

| | |
|---|---|
| వీరుడెవడురా?............ | 3+3+2=8 |
| శూరుడెవడురా?............. | 3+3+2=8 |
| ఘోరమైన యుద్ధభూమి.......... | 3+3+3+3=12 |
| మారుమ్రోగు ఫిరంగీల | 3+3+3+3=12 |
| బారులకును వెరువకుండ | 3+3+3+3=12 |
| బోరు సైనికుండేనా? | 3+3+6=12 |

.......................................................................॥వీ॥

| | |
|---|---|
| కొండలన్ని పిండి గొట్టి | 3+3+3+3=12 |
| మండు మహాగ్నుల జొరబడి | 3+3+3+3=12 |
| దండిశక్తి జూపి వెలుగు | 3+3+3+3=12 |
| గండర గండగుటేనా? | 3+3+6=12 |

.......................................................................॥వీ॥

త్రిశ్రగతిలో సాగిన యీ గేయంలో పల్లవిలోని మొదటిరెండు పంక్తుల్లో 8 మాత్రలే వుండి చరణాల్లో 12 మాత్రలున్నాయి. చివరి దీర్ఘాక్షరాల్ని రాగంతో సాగదీస్తే పల్లవి పంక్తులు సమమాత్రలతో సరిపోతాయి. లేదా వైవిధ్యంకై, వీరోద్ధతికై అలాగైనా పాడుకోవచ్చు!

మనకున్న పంచ భూతాలలో (గాలి, నీరు, నిప్పు, భూమి, ఆకాశం) భూమిని మాత్రమే నమ్ముకుంటామంటూ, అట్టి భూమాతను తప్ప మిగతా వాటిని విశ్వసించలేమంటూ అల్లిన గేయం, 'భూదేవి' (పుట : 20)

అమ్మా! వో భూదేవీ! 4+4+4=12
నమ్మితిమమ్మా నిన్నే! 4+4+4=12
నీరు పేరు చెపితె గుండె 3+3+3+3=12
నీరయి పోయేనమ్మా 3+3+6=12
నిప్పు పేరు చెపితె ప్రాణి 3+3+3+3=12
గుప్పు నెగిరి పోవమ్మా 3+3+6=12 ॥అ॥
గాలిపేరు చెపితె మాకు
కాలుసేతులాడవమ్మ
ఆకాశమ్మంటే మా
కసలే భయమౌనమ్మా!

నీరు, నిప్పు పేరు చెప్పినా, గాలి ఆకాశం గూర్చి చెప్పినా భయమే! కాని ఘోరారణ్యాలున్నా, కొండకోనలున్నా భూమి అంటే ఎలాంటి మాతృప్రేమ వుందో చివరి చరణంలో

తల్లిపక్కలోన చిన్న
పిల్లలు బజ్జున్నలాగు
నిన్ను నమ్మి నిబ్బరముగ
నిద్దుర బోయే మమ్మా!

అని వివరించారు. త్రిశ్రగతిలో చరణాల్ని కదను దొక్కించినా, పల్లవిని చతురస్రగతిలో నడిపించారు.

బసవరాజు గీతాల్లో ప్రేమతో పాటు వేదాంత ధోరణి కూడ వెల్లడయ్యే గీతం, 'ప్రేమ ప్రయాణము' (పుట : 65)

1. దీపము చుట్టును మిడుతవోలె నే 4+4+3+3+2=16
2. తిరుగు చుంటి నోదేవా! 3+3+6=12
1. ఏ పగిదిని నా పాపము బాపెదొ 4+4+4+4=16
2. నీయదె భారము దేవా! 4+4+4=12

.........................................................

1. నీటి బుగ్గపై మహాసముద్రము 3+5+3+5=16
2. నీదు చుంటి నో దేవా! 3+3+6=12
1. నీట ముంచినను తేల వేసినను 3+5+3+5=16
2. నీదే భారము దేవా! 4+4+4=12

నీట బుడగ మీది మహాసముద్రము లాంటి బ్రతుకును ఈదుచున్నానని, అది ఎప్పుడు పేలిపోతుందో తెలియదని, జీవన సాగరంలో నీట ముంచినా, తేల్చినా ఇక నీదే భారమని చెలితో కలిసి చీకటి ప్రేమ ప్రయాణం చేస్తున్నానని, వలపు దీపికలతో తమ బ్రతుకు బాటల్ని ప్రకాశింపజేయుమని భగవంతున్ని ప్రార్థించారీగీతంలో. ఒక పంక్తి 16 మాత్రలతో రెండవపంక్తి 12 మాత్రలతో, చతురస్ర-త్రిశ్రగతుల్లో పంక్తులు పరుగెత్తాయీ గీతంలో.

బసవరాజుగారికి భావావేశమెక్కువ. ఆ ఆవేశంలోనే 'నా కవిత్వధాటి' గేయంలో (పుట-1)

నన్నెవ్వ రాపలేరీవేళా!
నాధాటి కోపలేరీవేళా!
నోట పలికేదంత - పాటగా మోగేను
కోటి వరహాకెత్తు - కెత్తుగా తూగేను ॥న॥
గుండు రారామంటు - కొట్టినట్టుగ నేటి
పండితులు రారెత్తి - పరుగుచ్చుకోవాలి ॥న॥
పట్టు పట్టితి నంటె
వాగీశుడే వచ్చి
దాసోహమని పాట
వ్రాసి వల్లించాలి ॥న॥

అని ఖండగతిలో పాట వ్రాయుటలో తనకు గల అఖండ విశ్వాసాన్ని, విలువల్ని విప్పి చెప్పారు. ఆనాడు భావకవిత్వమన్నా, పద్యం ముందు గేయమన్నా పండితులకు చిన్న చూపే వుండేది. అందుకే బసవరాజు అంత ఆవేశంగా చెప్పారు. 'వాణి నారాణి' అని పిల్లల మర్రి పినవీరభద్రుడు సాధికారికంగా ప్రకటించినట్లే, బసవరాజు కూడ ఆ వాణీ పతియైన వాగీశుడే వచ్చి తనకు దాసోహమని పాట వ్రాసి వల్లించాలి అని చెప్పడం చూస్తే అతని మీద అతనికి ఎంతటి ఆత్మవిశ్వాసముందో తేటతెల్లమవుతోంది. పద్యం కంటె ముందు పాటనే పుట్టిందన్న సత్యాన్ని గుర్తెరిగి, ప్రజల వద్దకు పాట వెళ్లినంత దగ్గరగా పద్యం వెళ్లలేదనుకున్నారేమో! అందుకే తొలినాళ్లలో పద్యాలు అల్లినా మలినాళ్లలో పాటల నారుమళ్లే పండించారు. పండితుల్ని సవాలు చేస్తూ బతికినంతకాలం పాటనే పలికించారు. మామూలు పదాల్లోనే మహత్తర భావాల్ని ప్రకటించారు.

గ్రీకు కవయిత్రి క్రిస్టోఫరు శాఫో ప్రేమగీతాల్ని పారశీక కవయిత్రి జేబున్నీసా గీతాల్ని అనువదించారు. రవీంద్రుని తోటమాలినుంచి, రామకర్ణామృతం నుంచి, శంకరుని శివానందలహరినుంచి, భవభూతి ఉత్తర రామ చరితం నుంచి పొందిన ప్రేరణతో కూడ కొన్ని గీతాల్ని రచించారు.

పాట పాడుతుండగ నా
ప్రాణి దాటియేగేనా?
ప్రాణి దాటియేగుచుండ
పాటనోట మ్రోగేనా?

అని తాను తలచుకున్నట్లు గానే, ఆఖరు క్షణాల్లో బసవరాజు పాడుతూనే కన్ను మూశారు. కడవరకూ లలితగీత వికాసంకై విశేషంగా కృషి చేశారు. వీరి తర్వాత లలితగీత పరిపూర్ణ వికాసంకై పరిశ్రమించినవారు దేవులపల్లి కృష్ణశాస్త్రి.

## దేవులపల్లి కృష్ణశాస్త్రి : (1897-1980)

తెలుగు సాహితీ నందనంలో పారిజాత కుసుమంలా పల్లవించి, వికసించి భావకవితా పరిమళాల్ని నలుదెసలా వెదజల్లిన మృదుపదాల మేస్త్రి. శ్రీ దేవుల పల్లి కృష్ణశాస్త్రి. 1897లో నాటి పీఠకాపుర సంస్థానానికి అతి సమీపంలోని రామచంద్ర పాలెంలో జన్మించిన కృష్ణశాస్త్రి గారిది తరతరాలుగా గొప్ప పండిత వంశం కావడం విశేషం. సెలయేరు, పచ్చని .చేలు, మామిడి తోపుల మధ్యలో స్వరమెత్తే కోకిలల కూజితాలు కృష్ణశాస్త్రిగారికి చిన్ననాటినుండే చిరపరిచితాలు. అందుకేనేమో ఆయనకు గీతమంటే ప్రాణం. గానమంటే ప్రాణం కన్నా మిన్నగా తోచింది.

చిన్ననాటనే తల్లిదండ్రుల్ని, యౌవనావస్థలోనే అర్ధాంగిని కోల్పోవడం వల్లనేమో ఆయన కవితల్లో అంతర్లీనంగా కదిలే ఆవేదన ఉవ్వెత్తు తరంగాలుగా ఉబికి వచ్చింది. 'ప్రపంచం బాధ - శ్రీశ్రీ బాధ' అయితే 'కృష్ణశాస్త్రి బాధ- ప్రపంచం బాధ'[1] అని చలంగారిచే చెప్పించింది.

బ్రహ్మసమాజ ప్రభావంతో మానవతా వాదాన్ని జీర్ణించుకొని అనేక గీతాలనల్లి ఆంధ్రదేశమంతా తిరిగి ప్రచారం గావించారు. కులాస్థులు వెలివేసినా లక్ష్యపెట్టక పిఠాపురంలో బ్రాహ్మణ్యాన్ని త్యజించి, హరిజనోద్ధరణకు పూనుకున్నారు. సహపంక్తి భోజనాలు గావించారు. ఛాందసత్వపు కులమతాల్ని ఖండించారు. ఆయన 1920లో బళ్లారికి వెళ్తూ తోవలో నల్లమల అడవుల అందాల్ని ఆస్వాదిస్తూ అల్లిన 'ఆకులో ఆకునై' అనే గేయం కృష్ణపక్షం కావ్యానికి నాందిగా నిలిచింది.[2]

| | |
|---|---|
| **ఆకులో ఆకునై** | **5+5=10** |
| **పూవులో పూవునై** | **5+5=10** |
| **కొమ్మలో కొమ్మనై** | **5+5=10** |
| **నునులేత రెమ్మనై** | **5+5=10** |
| **ఈయడవి దాగిపోనా?** | **5+5+2=12** |
| **ఎట్లయిన** | **5 = 5** |
| **ఇచటనే ఆగిపోనా?** | **5+5+2=12** |

గలగలని వీచు చిరు-గాలిలో కెరటమై
జలజలని పారుసెల-యేటిలో తేటనై
ఈయడవి దాగిపోనా?
ఎట్లయినా
ఇచటనే ఆగిపోనా?[3]

---

1 మహాప్రస్థానం శ్రీశ్రీ పుట 10
2 కృష్ణశాస్త్రి సాహిత్యావలోకనం - డా ఎన్.నిర్మాలా దేవి పుట 9
3 కృష్ణపక్షం దేవేం కృష్ణశాస్త్రి పుట 1

ఇది 'కృష్ణ పక్షం'లో శారద చంద్రికలా ఆకర్షించే అద్భుత గీతం. ప్రకృతితో తాదాత్మ్యం పొందాలన్న తపన ప్రతిఫలించే కవి హృదయానికి కమనీయ దర్పణం. 5 మాత్రల నియతితో ఖండగతిలో సాగే యీ గీతం శాస్త్రిగారికి అఖండకీర్తిని ఆర్జించి పెట్టింది. ప్రకృతి మీద కృష్ణశాస్త్రిగారికి గల ప్రగాఢ ప్రేమను వ్యక్తపరిచే ఈ గీతంలో

పగడాల చిగురాకు తెరచాటు తేటినై
పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గునై

అంటూ పగడాల వంటి పదాల్ని కూర్చారు. ముత్యాల వంటి తేట తెల్లమయ్యే భావాల్ని పేర్చారు. అక్షర రమ్యత భావసామ్యత భద్రంగా ఒదిగిన భావగీతమిది. పరువంలో వున్న పూల కన్నె సిగ్గును 'పరువంపు విరిచేడె...సిగ్గునై' అనడం, 'విరిచేడె' లాంటి తేటతెనుగు పద ప్రయోగం చేయడం కృష్ణశాస్త్రి ప్రత్యేకత. 'ఈయడవి దాగిపోనా...' అనే పంక్తుల్లో 12 మాత్రలు పైకి కనిపించినా పాడే విధంలో 15 మాత్రల వరకు దీర్ఘమయ్యే వీలుంది. జానపద రచనలలో అయిదు మాత్రల ఛందాన్ని విరివిగా వాడడం సంప్రదాయం. అయిదు మాత్రల నడక ఒక విధంగా చెప్పాలంటే తేట తెనుగుకు విరిసెజ్జ అనవచ్చు! 3, 4, 6, 7 మాత్రల ఛందాలు అక్కడక్కడ వాడినా కృష్ణశాస్త్రి తొలిగేయాల్లో ఎక్కువ భాగం (''కన్నీటి కెరటాల...'' 'శిథిలాలయమ్ములో...' మొదలైన వన్నీ) ఖండ గతిలోనివే.

''అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్య వంటి వాగ్గేయకారుల గీతాల్లో కవితా శిల్పం కన్న గాన శిల్పానికి ప్రాధాన్యం ఎక్కువ. ఎందుకంటే వారి కృతులలో కొన్ని చదువుతున్నప్పుడు పేలవంగా కనిపించవచ్చు. కాని కృష్ణశాస్త్రి గేయాలు అలా కాక తీర్చిదిద్దిన ఖండకావ్యాలుగా తోస్తాయి. కృష్ణశాస్త్రిగాయకు.ఏ కాదు. కాని గొప్ప వాగ్గేయకారుల లక్షణం ఒకటి ఆయనలో వుంది. రేడియో, చలన చిత్ర రంగాలతో సన్నిహిత సంబంధాలు పెరిగాక శాస్త్రిగారిలో కవితో పాటు గాయకుడు కూడా ఎంతగానో ఎదిగాడు. జానపదగేయాలు, కీర్తనలు, పదాలలో రచన అయిదు మాత్రలదైనా దాన్ని 6,7 మాత్రల తాళాలకు పెంచి పాడడం వల్ల ఆ పాటలకు చిత్రమైన కొత్తదనం రావడం కృష్ణశాస్త్రికి కనువిప్పు కలిగించింది. అందుకే ప్రముఖ గాయకులైన రజనినో, విశ్వనాథంనో, పి.బి.శ్రీనివాస్‌నో ఎదురుగా కూర్చోబెట్టుకొని తాను రాసిన పదానికి తగిన అజ్ఞాతపు ట్యూన్ తగిలే వరకు వారిచేత పాడించి, ఆ తర్వాత పాటలకు వరుసలు నిర్ణయించేవారు. ఆ తర్వాత మిగిలిన పాదాలు మెల్లమెల్లగా పూర్తి అయ్యేవి. అందుకే ఆయన గేయాలలో ఎక్కడా వెలితి కనపడదు'' అని పద్మరాజు గారు 'అమృతవీణ'కు అందించిన 'మున్నుడి' లో వివరించారు. ఇక

శ్రీశ్రీగారు 'ఆస్వాదానికి ఆహ్వానం' అనే పీఠిక రాస్తూ "ఇక్షు సముద్రం ఎక్కడుందో నాకు తెలియదు. కాని ఆపాత మధురమైన కృష్ణశాస్త్రి సాహిత్యం సమస్తమూ ఇక్షురసార్ణవమే!" అనడం గమనార్హం...భావకవిత్వపు యుగకర్తగా కీర్తిపతాక నెగురవేసిన కృష్ణశాస్త్రి భావ కవిత్వంపై తిరుగుబాటుగా వచ్చిన అభ్యుదయ కవిత్వాన్నీ ఆదరించారు. 1945లో అభ్యుదయ రచయితల సంఘ తృతీయ వార్షికోత్సవానికి అధ్యక్షుడిగా ఎన్నుకోబడి[1] అమూల్య ప్రసంగం చేశారు. కాలంతో పాటు ఎదిగిన మహాకవి కృష్ణశాస్త్రి.

లలితగీత రచనకు శ్రీకారం చుట్టింది బసవరాజు అయితే దానికి అందమైన ఆకారం ఏర్పరచింది కృష్ణశాస్త్రి. కృష్ణశాస్త్రే లలితగీత రచనకు ఆద్యుడనే అవకాశమూ లేకపోలేదు. కాని బసవరాజు రెండు మూడేళ్లు ముందుగా పుట్టడమే గాక ఆంధ్రపత్రికలో పనిచేస్తూ కృష్ణశాస్త్రి కంటె ముందు నుంచే గీత రచన చేశారు. 1914-16 సంవత్సరాలలో నండూరి, కృష్ణశాస్త్రిగార్లు బసవరాజు ద్వారానే గురజాడ వారి కావ్యాలు, సెలయేటి గానములను వినడం జరిగింది.[2] కావున బసవరాజు కృష్ణశాస్త్రి కంటె ముందే సాహిత్యరంగంలో వున్నాడని చెప్పాల్సి వస్తోంది. పైగా కృష్ణశాస్త్రిగారు 'అమృతవీణ'లోని 65వ గీతం-

'వాడిన తీగకె గడియ గడియ కొక
వసంతకాలము దేవా!

బసవరాజు గీతం ప్రేరణతో రాసినట్లు ప్రకటించారు. కావున లలితగీత రచనకు తొలినాళ్లలో సమగ్ర స్వరూపం కల్పించింది కృష్ణశాస్త్రి అయినప్పటికీ ఆద్యుడు బసవరాజేయని చెప్పవచ్చు!

కృష్ణశాస్త్రి కలం నుండి జాలువారిన అనేక గీతాలు 'అమృతవీణ', 'మంగళకాహళి' సంపుటాలుగా ఇటీవల రాజహంస పబ్లికేషన్స్ ద్వారా వెలువడ్డాయి. ముందుగా 'అమృతవీణ'ను మీటి చూద్దాం-

'అమృతవీణ'లో ఏడు అధ్యాయాలు సప్త స్వరాలుగా అగుపిస్తాయి. అందులో మొదటి అధ్యాయం - కృష్ణరజని. కృష్ణ రజని అంటే చీకటి రాత్రి అని అర్థం. కాని ఇక్కడ రజనీకాంతరావు స్వరాలకు కృష్ణశాస్త్రి అల్లిన పదాలు అనే అర్థం వచ్చేలా 'కృష్ణ రజని' అని పేరు పెట్టారు. అయితే అన్ని పాటలూ రజనితో కూర్చుని వ్రాయడం పడలేదు అని కృష్ణశాస్త్రిగారు వ్రాసుకున్నారు. శాస్త్రిగారికి మూగతనం వచ్చాక, హైదరాబాద్‌లో రచించిన గీతాలు 'కృష్ణరజని'లో చోటు చేసుకున్నాయి.

ఎవరది?
ఎందుకు తీరిచికట్టారు
ఈ నక్షత్ర తోరణాలను

---

1 కృష్ణశాస్త్రి గేయాలు - కవితాతత్త్వం - డి కామేశ్వర రావు పుట 18

2 కృష్ణశాస్త్రి సాహిత్యావలోకనం డా ఎన్ నిర్మాలాదేవి పుట 8

ఈ కృష్ణ రజనీ మార్గంలో?
ఎవరది?
ఎందుకింత దయ
ఈ కృష్ణరజనీ మందిరానకు
ఎందుకు పంపుతున్నారు
మంగళ వార్తలను
ముదపవన పర్ణాలపై? (పాట : 1)

'అమృతవీణ'లో ఎదురయ్యే యీ మొదటి గీతం నడకలో మాత్రం గీతంలా గాక నేటి వచన కవితలా తోస్తుంది. గొంతు మూగవోగా తన బ్రతుకు నొక చీకటి రాత్రిగా భావిస్తూ, చీకటిలోనూ ఆశల నక్షత్రాల తోరణాల్ని ఎవరు కట్టారని ప్రశ్నించుకునే తీరు అగుపిస్తుంది.

ఎందుకొరకు - ఎవరికెరుక?
ఎగుడు దిగుడుల బ్రతుకు
ఎందుకొరకు?
తెగదా సమస్య?
ఈనాటి వరకు
చిగురు పెడితే వసంతమ్మని
ఎగిసిపడి
మొగులుపడితే వానకారని
దిగులుపడి
ఎగిసిపడి - దిగులుపడి
సొగసి పోవుటెగాని ॥ఎందు॥
వెలుగు నీడల పడుగుపేకలా - ఎవరు
కలిపినేసిరొ బ్రతుకు కోకలా
ఆసల నిరాశలను తొరపి- ఎవరు
పోసిరో ఈ బ్రతుకు మూసలా
....................................॥ఎందు॥ (పాట : 3)

సామాన్యంగా గేయం సమమాత్రల్లో సాగుతుంది. కాని యీ గేయం రజని రాగానికి అల్లినది కాబట్టి అనేక విరుపులతో అవసరమైన చేర్పులతో సరికొత్త ఒరవడితో సాగినట్లు స్ఫురిస్తుంది.

మన బ్రతుకు చిగురు పెడితే వసంతమ్మని, ఎగిసిపడి మొగులు పడితే వానకారని దిగులు పడుతుందని, ఎగిసిపడినా-దిగులుపడినా చివరకు సొగసిపోవుటే అను భావాన్ని ప్రథమ చరణంలో పసందుగా చెప్పారు.

వెలుగునీడల్లాంటి పడుగుపేకల్ని కలిపి ఎవరు ఈ బ్రతుకు కోకను నేసినారో? ఆశ-నిరాశల్ని కలగలిపి ఎవరు ఈ బ్రతుకు మూసలో పోసినారో? అని వెలుగులో నీడల్ని, ఆశలో నిరాశల్ని కలిపిన యీ బ్రతుకు వ్యర్ధమేనా దేవా? కాదు, లోతుగా పరికిస్తే ఏదో అర్ధమున్నది కావున నిరాశ పడకూడదు. అనే భావం ద్వితీయ చరణంలో అద్వితీయంగా భాసిస్తుంది మన బ్రతుకు కొక మంచి అర్ధముందని ఆసరా లభిస్తుందని తృతీయ చరణం బోధిస్తుంది. ఇది పద్మరాజుగారి 'వెలుగు నీడలు' నాటకానికి వ్రాసిన అందరికీ అన్వయించే గీతం.

ప్రతి కోవెలకూ పరుగిడకు!
ప్రతి బొమ్మకు కై మోడ్చకు!
..............................................
తీరని దాహము దేనికై? వే
సారని మోహము దేనిపై?
క్షీరజలధి నీలోనే నిండగ
ఆరని దీపము లోలో ఉండగ
ప్రతి కోవెలకూ పరుగిడకు (పాట : 5)

బ్రహ్మ సమాజ ప్రభావం ప్రస్ఫుటమయ్యేట్లుగా వున్న ఈ గీతంలో కనిపించే ప్రతిరాతి బొమ్మకు మొక్కుతూ ప్రతి కోవెలకై పరుగులెత్తకు మంటూ మూఢ విగ్రహారాధన పనికి రాదంటాడు. పాలవంటి మనసు దీపం వంటి మానవతా రూపం నీలోనే వుండగా వెర్రిగా దానికై పరుగుదీయకు మన్నది యీ గీత సారాంశం.

ప్రభు! ప్రభు! ప్రభు! దీనబంధు! 6+3+3=12
ప్రాణేశ్వర దయాసింధు! 6+3+3=12
..............................................
ఇపుడు సుధాపూరమిడి 3+3+3+2=11
అపుడు విషాహారమిడి 3+3+3+2=11
ఎపుడు పట్టిదండింతువో? 3+3+6=12
ఎపుడు సుఖము పండింతువో? 3+3+6=12
ఎపుడే యదిగానీ, నీ 6+6=12
కృపయే అని ఎంతుగాని ॥ప్రభు॥ 6+3+3=12 (పాట:9)

దీనబంధుగా దయాసింధుగా అగుపించే పరమేశ్వరుడు ఒకసారి అమృతాన్ని మరోసారి విషాహారాన్ని అందజేస్తాడు. ఎపుడు దండిస్తాడో ఎపుడు సుఖం పండిస్తాడో తెలియదు. మొత్తానికి ఎపుడేది జరిగినా అదంతా దైవకృపగానే భావిస్తానని కృష్ణశాస్త్రి తన దైన్యాన్ని యీ త్రిశ్రగతి గీతంలో పలికించారు.

మధ్యలోని రెండు పంక్తుల్లో ఒక్కొక్కమాత్ర లోపించినా, పాడడంలో పూరణమయ్యే వీలుంది.

ఖుదా! నీదే అదే పిలుపు
ఖుదా! నీదే సదా గెలుపు
లోకలోకములు నుండి, నా
లోననిండి లోలోన నుండి

........................................ ॥ఖుదా॥ (పాట : 11)

హైదరాబాదులో ఒక సాయంత్రం మసీదు నుండి నమాజు పిలుపు విని యీ గీతాన్ని రాసినట్లు శాస్త్రిగారు వ్రాసుకున్నారు. శాస్త్రిగారికి ఈశ్వరుడన్నా అల్లా అన్నా ఒకే విధమైన భక్తి. దేవుడు కూడ ఏ పాపినీ - సంతాపినీ వదలిపెట్టక శిక్షిస్తాడు. అనంతమైన ప్రేమతోనూ చూస్తాడు అన్నది యీ గీతంలోని అంతరార్థం.

ముందు తెలిసెనా, ప్రభు! ఈ
మందిరమిటులుంచేనా?
మందమతిని నీవు వచ్చు
మధుర క్షణమేదో కాస్త ॥ముందు॥
అందముగా నీ కనులకు
విందులుగా వాకిటనే
సుందర మందార కుంద
సుమదళములు పరువనా? ॥ముందు॥ (పాట:18)

ముందేమనవి చేసినట్లు కృష్ణశాస్త్రి - మృదుపదాల మేస్త్రి అన్నదానికి ఋజువుగా ఈ పాటకు మెరుగులు దిద్ది పాఠాంతరంగా ప్రకటించిన దాన్ని పరిశీలిస్తే అర్థమవుతుంది.

(మార్చి వ్రాసుకున్న పాట)
ముందు తెలిసెనా, ప్రభు! ఈ
మందిరమిటులుంచేనా?

........................................

అందచందముల ముగ్గులు తీర్చనా?
మందార సరాలనెన్నో కూర్చనా?
సుందరముగ చేయనా? ఇటు
తొందరలై పోయెగాని ॥ముందు॥

ప్రభువు వస్తున్నాడని ముందే తెలిస్తే భక్తుడు అందముగా ముంగిలిని ఎలా తీర్చిదిద్దగలడో యీ గీతంలో చెప్తున్నాడు పై దానితో తృప్తిపడక మళ్లీ పాఠాంతరంగా మార్చి చెప్పిన శాస్త్రిగారు అక్షరశిల్పి అనడానికి ఇది చక్కటి ఉదాహరణ.

ప్రతిక్షణము నీ గుణ కీర్తనము
పారవశ్యమున చేయుదును!
పదములు నీవే యిమ్ము! నీవే
పాడే సుస్వర మిమ్ము! (పాట:19)

ప్రభువును ప్రతిక్షణము కీర్తిస్తానంటూ ఆ కీర్తనకు పదములనే కాక మూగవోయిన తన గొంతుకు సుస్వరాన్ని యిమ్మంటూ కృష్ణశాస్త్రి అర్థించే గీతమిది.

ఈ విధంగా "కృష్ణరజని" గీతాల్లో ఎక్కువ భాగం ఆర్తి, ఏదో అన్వేషణ, తపన, విశ్వవిధాత ప్రార్థన ప్రధానంగా కనిపిస్తుంది.

ఈ గీతాలు 1964లో కృష్ణశాస్త్రి స్వరపేటికను క్యాన్సర్ మూలంగా తొలగించాక వ్రాసినవి. 'కృష్ణరజని' తదుపరి అధ్యాయంగా అగుపించే 'కన్నీరు' 1923లో ప్రచురితమైంది. ఇది ప్రస్తుతం అలభ్యం. కాబట్టి ఇందులో చేర్చడమైందని 'అమృతవీణ' సంపాదకులు వివరించారు. ఇందులో షలుపద్యాలతో పాటు 20 కీర్తనలు వున్నాయి. 1918-1923 మధ్య వ్రాసినవి. అయితే ఏ కాలంలో వ్రాసినా కృష్ణశాస్త్రిముద్ర ప్రతి గేయం మీదా వుంటుంది.

కన్నతండ్రీ! వేచి యుంటి
కరుణా వృష్టికి వేచియుంటి!
నిన్నుగన నా వన్నుడనై
ఎన్నినాళ్లో వేచి యుంటి
హృదయమున నానందమెరుగ
నెరుగ చిత్తశాంతము
నిదుర నెరుగ, సుఖము నెరుగ (పాట:21)

ఇందులో భక్తుడు భగవంతుణ్ని ఆవేదనగా అన్వేషించడం అగుపిస్తుంది. భూరి దుఃఖపు బ్రతుకుటడవిలో ఘోర చీకటిలో దారిగానక అనురాగగీతంతో సంతాపగానంతో వెదకే తనకు తక్షణం అగుపించమంటూ ఆలపించిన గీతమిది. ఇదే కోవలోనిదే మరో పాట!

కనికర ముంచరా! కరుణాకర తండ్రి!
..........................................................
కలగు హృదయములతో, కన్నీటి కాల్వలతో
పిలువలేకున్నాము విలపించుచున్నాము
..........................................................

మలిన పంకము నుండి నలినము వలె నా
కలుష హృదయమున వెలిగింపు భక్తిని ॥కనికర॥ (పాట:24)

తనయులమైన తాము చేసిన తప్పులన్నీ మన్నించి, పంకములో విరిసే పద్మంలా మలిన హృదయంలో భక్తి కమలం వికసింపజేయుమనే ప్రార్థన యీ గీతంలో సుస్పష్టం.

ఏ ప్రభువు కోసం ప్రాణేశుని కోసం ఎదురు చూస్తున్నారో ఆ ప్రాణేశుడు ఒక రోజు వచ్చాడనే విషయం తెలియగానే తలయెత్తినగీతం-

| | |
|---|---|
| రండు రండు ప్రాణేశుడు | 3+3+6=12 |
| రాక రాక వచ్చెనేడు | 3+3+3+3=12 |
| తెండుతెండు విలువలేని | 3+3+3+3=12 |
| వలపు కాన్కలన్! | 3+5=8 |
| అడుగుదమ్ములెంతవాడి | |
| బడలెనో! మెలమెల్లవాని | |
| కడుగుదమా చల్లని క | |
| న్నీటి చినుకులన్! | (పాట:35) |

తరలివచ్చిన తమ ప్రభువుకు ప్రేమనే కానుకలుగా తెమ్మంటూ నడచి నడచి అలసిన అరవిందాల్లాంటి పాదాలను కడుగుటకు చల్లని కన్నీళ్ల చినుకులతో రమ్మంటూ పిలిచేగీతమిది.

ఈ గీతం నడక గురజాడ ముత్యాల సరాల్ని బోలివుంది. ముత్యాలసరాలు. మొదటి 3 పాదాలు 14 మాత్రలతో నాల్గవ పాదం 9 మాత్రలతో ముగుస్తుంది. పై గీతంలో మొదటి 3 పాదాలు 12 మాత్రలతో, నాల్గవ పాదం 8 మాత్రలతో ముగుస్తుంది. అంతే తేడా!

ఆ తర్వాత ప్రభువును కీర్తించే కమనీయ గీతం-

| | |
|---|---|
| జయము జ్ఞాన ప్రభాకరా! | 3+3+3+3=12 |
| జయము శాంతి సుధాకరా! | 3+3+3+3=12 |
| జయము మోహతమోహరా! | 3+3+3+3=12 |
| జయ జయ కరుణాకరా! | 4+4+3=11 |
| శ్రిత జనగణ మందారమ | 6+6=12 |
| సేవిత ముని హృద్భృంగమ | 6+6=12 |

బ్రహ్మసమాజ ఉపాసనలో మంగళ హారతిగా వినిపించిన ఈ పాట విని చలంగారు ముగ్ధులైనట్లుగా 'ముందు మాట'లో చెప్పారు. చాలా వరకు ఇందలి కీర్తనలు ఆనాటి బ్రహ్మసమాజ ప్రచారానికి పనికి వచ్చేలా అల్లినవి. "పాటల అందం అంతా శాస్త్రిదే, ఉద్రేకమంతా చలానిదే" అని 'ధర్మసాధని' 15.5.1974 సంచికలో వెల్లడించింది.

వారి ప్రభువు జ్ఞాన ప్రభాకరుడు, శాంతి సుధాకరుడే గాక మోహాంధకారాన్ని అణచే కరుణా సముద్రుడు. దీనజనుల కాచే, బ్రాహ్మధర్మాన్ని బ్రోచే మానవభాగ్య విధాత అని కొలిచే యీ గీతంలో చక్కటి పదబంధాలతో పాటు భావగంధాలూ పరిమళిస్తాయి. ప్రధానంగా త్రిశ్రగతిలోనే పాదాలన్నీ నడుస్తాయి.

"అమృతవీణ"లో మూడవ అధ్యాయ తంత్రిగా అగుపించే 'మహతి' కూడ బ్రహ్మసమాజ ప్రభావంతో రచించబడినదే. 'కన్నీరు' గీతాలలో ఆర్తి, ఆవేదన భక్తి భావనగా వ్యక్తమైతే, స్థిర నిర్మలమైన భక్తి 'మహతి'లో ద్యోతకమవుతుంది.

'నవభారత జన్మదాత' బిరుదాంచితుడుగా విశ్వవిఖ్యాతి గాంచిన రాజా రామమోహన రాయలు 19వ శతాబ్దిలో ప్రారంభించిన మహోన్నత మానవోద్యమమే ఈ బ్రహ్మ సమాజం. ఈశ్వరుడొక్కడే అని, అతనిని మనసులో మాత్రమే ఆరాధింపవలెనని ఇందలి మూల సూత్రం. "ఏకేశ్వరోపాసనం. విగ్రహారాధనా నిరసనం. బాల్య వివాహ ఖండనం, వితంతు వివాహ కరణం, పరిపూర్ణ వ్యక్తిస్వేచ్ఛాభిలాషణం....వంటివెన్నో ఈ సమాజ సూత్రాలు. బ్రహ్మ సమాజ ప్రభావితులైన కందుకూరి వారు 1870లో ఒక ప్రార్థనా సమాజాన్ని స్థాపించగా 1882లో బందరులో బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు బ్రహ్మ సమాజాన్ని స్థాపన చేసి విశేష ప్రచారం చేశారు. వీరిరువురి ప్రభావం ఆంధ్రదేశం అంతటా ప్రసరించింది. బ్రహ్మర్షికి ప్రత్యక్ష విద్యార్థియైన కృష్ణశాస్త్రి పై ఈ ప్రభావం బాగా పడింది. ఈ ప్రభావంతో కృష్ణశాస్త్రి బ్రహ్మసమాజ ప్రచారానికి విశ్వమానవ కల్యాణాభిలాషియై ఆలపించిన అనేక గీతాలే 'మహతి' గేయాలు."[1]

**ఎటుల నేనీ లీల కీర్తింతు!**
**ఓ దేవ దేవా!**
**ఎటుల నేనీ మ్రోల నర్తింతు!**

**..............................................**

**కోటి సూర్యుల కాంతిలో ఆ**
**రాట మెరుగని శాంతిలో**
**మాటి మాటికి మసలిమను ఆ**
**మహతినా? భారతీసతినా?**

**..............................................** ॥ఎటుల॥

**ఉపశమింపని తపనయే నా**
**కున్న భాగ్యము కన్నతండ్రీ......** (పాట : 45)

దేవదేవుని లీలల్ని కీర్తించడానికి, అతని మ్రోల నర్తించడానికి తాను మహతినా? భారతీ సతినా? కేవలం అణగారని తపనను మాత్రమే! అనెడు

---

*1, కృష్ణశాస్త్రి గేయాలు - కవితా తత్త్వం - డి కామేశ్వర రావు పుట 72*

భావంతో అల్లిన యీ గేయం అత్యంత రమణీయం. ఈ ఆరాటమే మహతి గీతాలన్నిటికీ అంతసూత్రం. ఆధ్యాత్మిక భావనకు ప్రాణభూతం.

కృష్ణశాస్త్రి భావనలో దీనజన హృదీశ్వరుడైన ఈశ్వరుడు కొలువుదీరు సుధర్మ భువనమే బ్రహ్మ సమాజ భవనం. అందుకే ఈ సుధర్మ భవనంలో

లేవు కుటిల శృంఖలములు - లేవు కఠిన కుడ్యములు
చెరలు లేవు ఇరులు లేవు - కరుణాలయమిందు
అమృత కౌముదీ మధు మిళితానందమె ఆనందమె (పాట : 46)

అని కఠినమైన కులమతాల అడ్డుగోడలకు, కుటిల క్రౌర్య సంప్రదాయ సంకెళ్లకు తావులేదంటూ, అమృత మిళితమైన మేడగా బ్రహ్మ సమాజాన్ని అభివర్ణించారు.

లేదోయి నిదురలో లేదోయి సుగతి!
చూడవా కనువిచ్చి చూడవా జగతి?
సద్దు సేయకరేయి సాగిపోయినది......॥లే॥
ఏడు కడలులు వెల్గుటేటిలో కలిసె
............................................................
ఏడేడు లోకమ్ములేకమై వెలసె
............................................................ ॥లే॥
ప్రాణులందరు గూడ పథికులైనారు
............................................................
మింటిపై బురుజు పై గంట మ్రోగినది
కొండపై కోనపై జెండా ఊగినది
............................................................ (పాట : 49)

ఈ గీతం వేంకటపార్వతీశ్వర కవుల 'ఉదయగానం' చదివాక వ్రాసినట్లుగా కృష్ణశాస్త్రి వ్రాసుకున్నారు. పై గీతంలో ప్రభాత వర్ణన ప్రస్ఫుటంగా అగుపిస్తున్నది. నిద్రలో సుగతి లేదంటూ, కనువిచ్చి జగతిని చూడమంటూ తట్టిలేపే ఖండగతి గీతమిది.

'ఏడుకడలులు వెల్గుటేటిలో కలిసె' - అనగా మనకున్న సప్త సముద్రాలు ప్రభాకరుని కాంతి ప్రవాహంలో కలిసిపోగా ఏడేడు లోకాలు ఏకమై పోయాయనే భావం అత్యంత మనోహరం. ఆలుబిడ్డలు, అన్నదమ్ములు మొదలగు ప్రాణులంతా బ్రతుకు తెరువుకై పథికులైనారని చెప్పడంలో నీవు కూడా చైతన్యంతో ముందుకు సాగాలన్న ప్రబోధం ధ్వనిస్తోంది. కోటలో వేయి చేతులు సాచి వెలుగుతున్నది

సహస్ర కిరణుడైన ఆదిత్యుడు కాబట్టి అతడే బ్రహ్మ సమాజ భానుడైన దేవదేవుడు కాబట్టి వెంటనే సుగతిలేని నిద్రావస్థను వదలి ప్రగతి గాంచడానికి జగతిలో కార్యోన్ముఖుడవు కావాలంటూ పేరు పేరున పిలుస్తున్నాడంటూ అల్లిన యీ గీతంలోని భావం సుప్రభాత మలయానిలంలా మనోహరంగా వుంది

తొలి ప్రొద్దు కొండపై మొలిచెనొక దేవళము
వెలుగుగుడి మొగసాల నిలిచె యాత్రా జనము
.........................................................................
గుడిని శంఖము మొరసె విడెను వాకిట ద్వారము
ఎడద ఎడదను నిండె గుడి నుండి మా దైవము (పాట : 50)

అన్న గీతంలోనూ తమ దైవం గుడిలోని నాలుగు గోడల మధ్య కాక ప్రతి గుండె గుండెలో నిండి వున్నాడని చెప్పడం మంచి భావన.

కదలి నడువగలము మేము
బెదరి తిరిగి రాము మేము
చదలు కడలి కలయుకడ - నీ
పదములు వినిపించుప్రొద్దు
పదములు వాసించు ప్రొద్దు
............................................
కాలమే ఉన్నంత వరకు
గానమే ఉన్నంత వరకు
అడుగులు నీవంటు వరకు
తడయబోము నిదురబోము
అడలిపోము అలసిపోము (పాట : 56)

ఇందులో మేము అన్నది సామూహికాధ్యాత్మిక ధ్యానమనే బ్రహ్మసూత్రం భగవంతుని పాదస్పర్శకై ఆరాటపడే తీవ్ర ప్రయత్నం ఇందులో అయిదవ పంక్తిగా అవతరించింది. సామాన్యంగా చరణాలకు నాలుగు పంక్తులు మాత్రమే వుంటాయి. కాని అందుకు భిన్నంగా ఇందులో అయిదన పంక్తి కూడా శాస్త్రిగారు ప్రవేశపెట్టి తన అకుంఠిత భక్తిభావాన్ని బలపరుస్తూ, అచంచల ఆత్మ విశ్వాసాన్ని ప్రకటించారు.

నా నోట నీ మాట గానమయ్యేవేళ 5+5+5+5=20
నా గుండె నీ వుండి మ్రోగింపవా వీణ? 5+5+5+5=20
............................................................
అంతరాంతరము నీ అమృత వీణేయైన 5+5+5+5=20
మాట కీర్తన మౌను. మనికి నర్తనమౌను 5+5+5+5=20

'అమృత వీణ' అని సంపుటికి నామకరణం చేయడం 'మహతి' లోని ఈ ఖండగతి గీతం వల్లనే కావచ్చు! "శ్రీ కృష్ణశాస్త్రి వ్యక్తిత్వం అంతరాంతరాలలో

నిండి ఆయన ప్రతి మాటనీ కీర్తనగా, మనికిని (జీవనము) నర్తన గా తీర్చిన అమృతవీణ ఇది. భౌతికంగా కృష్ణశాస్త్రి గొంతు మూగవోయినా జీవితాంతం పలుకుతూ వచ్చిన వీణ! ఎంత వైయక్తికమో అంత విశ్వజనీనం" అన్న సంపాదకుల 'భూమిక' లోని వాక్యాలు గమనార్హం.

నాకేల ఒక జోలె
నాలో అమృత వీణ
ఉంచి నన్ను లెమ్మందువా?
దేవ
ఊరకే పొమ్మందువా?
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గమ్ములో
ప్రతియింట మొగసాల ఆగనా?
.........................................? (పాట : 59)

ప్రతియింటి ముంగిలిలో, గుండెలోగిలిలో నిలిచి గీతంగా మ్రోగుతాను అంటూ భగవంతునితో మొరపెట్టుకుంటున్న వైనమిది.

వాడిన తీగకె గడియ గడియకొక
వసంతకాలము దేవ!
.....................................................
దారిగాని దారిని అడుగున కొక
తారాదీపము దేవా!
.....................................................
ఈ విశ్వాసము వీడని వారికి
భావిస్వర్గమో దేవా! (పాట : 65)

ఈ గీతాన్ని బసవరాజు పాట చదివి వ్రాసినట్లుగా చెప్పారు. కాని ఏ పాటనో వివరించలేదు. బహుశ 'ఆశాభంగము' అను శీర్షికతో బసవరాజు రచించిన 'పానకమ్ములో పుడకనేటికిటు పడవేసితివో దేవా?' అనే గీతం ప్రేరణ కావచ్చు. ఆశ మనిషి జీవితానికి మరింత కృషి సలుపడానికి దోహదం చేస్తుంది. అట్టి ఆశను విడనాడక గట్టి ప్రయత్నం చేసేవారికి భావి స్వర్గతుల్యమౌతుందన్న భావన యీ గీతంలో అగుపిస్తుంది.

ఈ గడ్డి పూవులే ఈ దారి పొంతనే
అలసి పోనీవోయిదేవా! దేవా!
నీ ఇష్టమైనచో నీ పూల దండలో
మెరిసి పోనీవోయి దేవా! దేవా!
..................................................... (పాట : 72)

భక్తుడు తననో గడ్డి పూవుగా పోల్చుకొని అల్పత్వాన్ని చాటుకుంటున్నాడు. దైవానుగ్రహముంటే గడ్డిపూవైనా పూల దండలో చేరి దేవుని మెడలో మెరిసిపోతుందనే భావం ఇందులో సుస్పష్టం.

శిథిలాలయమ్ములో శివుడు లేడోయి
ప్రాంగణమ్మున గంట పలుకలేదోయి
..............................................................
వాడ వాడల వాడె! జాడలన్నిట వాడె
ఇంటి ముంగిట వాడె! ఇంటింటిలో వాడె! (పాట : 82)

ఈ గీతం బ్రహ్మ సమాజ వ్యాప్తికి ఎంతో ఉత్తేజాన్ని కలిగించింది. భగవంతుడు సర్వాంతర్యామి. కావున శిథిలాలయాలలోనే శిలా విగ్రహ రూపాలలోనే వున్నాడనుకోవడం ఉత్త్రభ్రమమాత్రమే అని విగ్రహారాధనను నిశితంగా విమర్శించే గీతమిది.

తెగదెంచండయ్యా! ఏ
ద్వేషపు సంకెళ్లని
తెగనివి కాదయ్యా యుగ
యుగముల వైనా కానీ!
...............................................
గుణములేని వాని దే
కులమైతేనేమి!
తృణమైతేనేమి శ్రీ
చరణమంటునేని!
...............................................
శ్రీలలితేశ్వర గళ నవ
మాలా కుసుమాలమేమొ! (పాట : 84)

మూఢాచార కుటిల కులతత్వాన్ని చెండాడే గీతమిది. మాలల్ని అంటరాని వారిగా చేసేవారిని తూర్పార బట్టే తత్వమిది. గుణము లేని వానిదే కులమైతేనేం? శ్రీదేవి చరణమంటితే తృణమైనా చందనంగా భాసిస్తుందని, హీనంగా చూసే మాలలు మరెవరో కాదు శ్రీ లలితాగళ సీమలో వేలాడే పుష్పమాలలని సంభావించడం చూస్తే కృష్ణశాస్త్రి పై గాంధీగారి హరిజనోద్ధరణ ప్రభావం ప్రగాఢంగా ప్రసరించిందనిపిస్తుంది. కేవలం రాతల్లోనే గాక కృష్ణశాస్త్రిగారు పిఠాపురంలో హరిజన సహపంక్తి భోజనాలతో చేతల్లోనూ ముందున్న వారే. సర్వ మానవ సమానత్వాన్ని సంఘ సంస్కరణాభిలాషను చాటే ఈ గీతం కృష్ణశాస్త్రి భావౌన్నత్యానికి ప్రతిబింబంగా నిలుస్తుంది.

మనసులోన కారుమబ్బొ, మలిన మలిన తిమిరమ్మో
మరి మరి మరి ముసురుకొన్న మనసారా పాడు మోయి
బ్రహ్మ కృపాహి కేవలమని - బ్రహ్మ కృపాహి కేవలమని
.............................................................................. (పాట : 86)

బ్రతుకు ఎడారిగా మారినా, నందనంగా తేలినా అన్నీ భగవదనుగ్రహంగానే భావించాలన్న సారాంశం యీ గీతంలో అగుపిస్తుంది. బ్రహ్మ సమాజ తత్త్వాన్ని వివరిస్తుంది. ఇదే గీతాన్ని పాఠాంతరంగా మళ్ళీ ఈ విధంగా వ్రాశారు.

నీ కృపయే నీ కృపయే అని
మనసారా అనరాదా?
మదిలో మబ్బో చీకటియో
పొదివే వేళల అనరాదా?
నీ కృప ఒకటే నీ కృపయే
నీ కృపయే ప్రభు, నీ కృపయే

..............................................

ఇలా వ్రాసిన గీతాలకే మళ్ళీ మళ్ళీ మెరుగులు దిద్దడమనేది బహుశ తెలుగు కవులలో కృష్ణశాస్త్రిగారొక్కరే చేశారేమో! అందుకే వారిని అక్షర శిల్పి అంటారు.

ఇలా మహతి లోని గేయాలన్నీ బ్రహ్మసమాజ మహత్వాన్ని మానవతా దృక్పథాన్ని చాటడానికి ఉపయుక్తమైనాయి. 'మహతి' అంటే నారదుని వీణ అనే అర్థం. నారదుడు లోక సంచారం చేసినట్లే నాటి రోజుల్లో కృష్ణశాస్త్రి 'మహతి' దేశసంచారం చేస్తూ విస్తృత ప్రచారం గావించింది.

'అమృతవీణ' సంపుటిలో అగుపించే చతుర్థ తంత్రీ అధ్యాయం 'మధు మురళి!' "ఇందులో చాలా వరకు రేడియో ద్వారా గాయనీగాయకుల ద్వారా ప్రజల రసనల కెక్కిన మధురభక్తి గీతాలే తారసపడతాయి. 'యమునా విహారి', 'శ్రీ ఆండాళ్లు', 'కృష్ణాష్టమి' వంటి శ్రవ్యనాటికల నుంచి కొన్ని, ఇతరములు కొన్ని ఇందులో చేరాయి."[1]

'మధు మురళి' అన్న పేరు వినగానే ఇది మధురభక్తికి సంబంధించినదని తోస్తుంది.

"రాధాకృష్ణుల ప్రణయం ఆధారంగా 'మధురభక్తి' అనే భక్తి మార్గాన్ని చైతన్యుడు ప్రచారం చేశాడు: ఈ తత్త్వంలో భక్తుడు ప్రేయసిగా భగవంతుడు ప్రియుడుగా భావించి చేసే ప్రణయోపాసన ప్రధానం. చైతన్యుని భావనలో శ్రీకృష్ణ పరమాత్మ ఒక్కడే పురుషుడు. జీవాత్మలన్నీ స్త్రీలే! భక్తుడు గోపికగా భావించుకొని కృష్ణప్రేమలో తరించడాన్ని ఆయన ప్రతిపాదించాడు."[2]

ఇందులో కవి గోపికగా దర్శనమిస్తాడు. వివిధ గేయాలలో వ్రేపల్లె గురించి, గోపికల అంతరంగాలలో చెలరేగే కృష్ణలీలా విలాసాలగూర్చి విదితమవుతుంది.

మురళీ! మధు మురళీ!
మురళీ! మృదు మురళీ!

---

1. అమృత వీణ . పుట . 109
2 దేవులపల్లి కృష్ణశాస్త్రి సాహితీ సౌరభం డా ఎన్ నిర్మలాదేవి. పుట : 128

కడిమి తరువుల నడిమి తెరువుల
నడిచివచ్చే దెవరు మురళీ?
..............................................
నెమలి పింఛపు నీడనోరగ
నిలిచి నిక్కుచు పిలుచు మురళీ!
.............................................. (పాట:87)

మురళిని సంబోధిస్తూ ముగ్ధ మోహనుడైన మురళీధరుణ్ని అన్వేషిస్తూ ప్రతి అలికిడిలోనూ కృష్ణాగమనాన్ని తలపోసే గోపికల హృదయం ఇందులో అగుపిస్తుంది. మామూలుగా శ్రావ్య సంగీతం వింటేనే పశువులు ఎక్కువ పాలిస్తాయని ప్రతీతి. అందులో గోపాలుని మురళీగానం వింటే ఆలపాదుగుల్లో అమృతం వంటి పాలకడవలే దొర్లుతాయని కవి మనోహరంగా చెప్పిన వైనమిది. "అంటీ అంటని అంగుళుల కొనలందుకొని ఎలుగెత్తు మురళీ" అనడంలో వేలికొసల్ని వేణువు రంధ్రాలకు అంటీ అంటించక వాయించే కృష్ణుని మురళీ రవాన్ని చెవులకు వినిపించడమే గాక కళ్లకు కనిపించేలాగుంది.

కార్తీక రాత్రుళ్లూ........ఊఁ
కరి మబ్బుంటుందా? ఆఁ
కాలమేఘమాకాశం వదలి
నేలనడుస్తుందా?
నడిచే మబ్బునకూ - ఊఁ
నవ్వే పెదవుందా?
.......................................
నవ్వే పెదవులకూ మువ్వల వేణువులూ (పాట : 89)

ఈ గీతం 'డా॥ ఆనంద్' లో సినీ గీతంగానూ వెండితెరపై వెలుగొందింది. గోపికలు కృష్ణుని గూర్చి అదే పనిగా ఆలోచిస్తూ అల్లిన చమత్కారమిది. సామాన్యంగా కార్తీకంలో కాలమేఘాలు కనిపించవు. తెల్లని వెన్నెల్లో తేలియాడే తెలిమబ్బులే తప్ప. అందులో నీలిమేఘం నింగిని వదలి నేలపై నడిచిరావడం అసలే జరుగదు. ఒకవేళ నడచి వచ్చినా నల్లని ఆ మబ్బుకు నవ్వే పెదవి వుంటుందా? పెదవులపై మువ్వల మురళి వుంటుందా? అని గోపికలు నీలమేఘ శ్యాముడైన గోపాలుడి ఉనికిని ఈ విధంగా భావించడం అత్యంత రమణీయంగా వుంది.

ఈ దారి నా స్వామి నడచేనా?
పాదాల జాడలివి విడిచేనా?
ఎవరైన నా విభుని చూచేరా?.......స్వామి
....................................................
శిఖపైని శిఖిపింఛ మూగేనా?.........స్వామి
ఒకసారి నవవేణువూదేనా?

..............................................
రాధా మనోవీధి విడిచేనా?............స్వామి
ఈ దారినా కొరకు నడిచేనా
.............................................. (పాట : 93)

కృష్ణాన్వేషణలో గోపిక చెట్టునూ, పుట్టనూ ప్రశ్నిస్తూ, కొమ్మనూరెమ్మనూ గాలిస్తూ జీవాత్మ పరమాత్మలో లీనం కావడానికి పొందే ఆరాటం వ్యక్తపరుస్తుంది. బహుశ బమ్మెర పోతన పద్యం ఈ పాటకు ప్రేరణ కావచ్చు! సిగలో నెమిలి పింఛం, అధరాన వూదే వేణువు గల నా మనోహరుడు ఈ దారి వెంటగాని వచ్చాడా? నా గూర్చి ఏమైనా అడిగాడా? అయినా రాధా మానసచోరుడు కాబట్టి ఆమెను వదలి తనకై- నడిచి వచ్చేనా? అని గోపిక తపించడం ఖండగతిలో కమనీయంగా వర్ణించబడింది.

రాధ విరహబాధ - అనురాగ మధురగాథ
జాలి మాలి వనమాలి చనియె నొక్కనాడు
..............................................................
దొల దొల మురళి చల్లగాలి తేలి మ్రోగె
తాళలేక రాధ మనసు తల్లడిల్లి ఊగె!
నిబిడతరుణ నీ పవనచ్ఛాయ రాధనిలిచె
కృష్ణ కృష్ణ కృష్ణా అని కేరి కేరి పిలిచె! (పాట : 94)

పై గీతంలో గోపిక విరహంతో కూడిన అన్వేషణ విశదం కాగా యీ గీతంలో రాధ విరహబాధ ప్రస్ఫుటమవుతోంది. దూర దూరంగా మురళీరవం గాలితో పాటు వచ్చి వినబడుతుంటే తాళలేక రాధ తల్లడిల్లిపోతూ కృష్ణ కృష్ణ కృష్ణా! అని దీర్ఘాంతం చేస్తూ పిలువడంలో తాళలేని విరహార్తి ధ్వనిస్తోంది.

మరుజన్మ మెత్తెదను మాధవుడనైనేను
చిరునగవుతో చెదరు కురులతో మురళితో
...........................................................(పాట : 97)

ఈ గీతంలో విసుగెత్తిన గోపిక తాను మరుజన్మలో మాధవుడనై గోపికగా జన్మించే గోపాలుడిని ఉడికిస్తానంటూ, తాననుభవించిన విరహావస్థను మురళీధరుడి కర్థమయ్యేలా చేస్తానంటూ భావించడం వినూత్నంగా వుంది.

| | |
|---|---|
| మ్రోయింపకోయ్ మురళి | 5+5=10 |
| మ్రోయింపకోయ్ కృష్ణ! | 5+5=10 |
| తీయతేనియ బరువు | 5+5=10 |
| మోయలేదీ బ్రతుకు | 5+5=10 |

॥మ్రో॥

మురళి పాటకు రగిలి
మరుగు నీ వెన్నెలలు
........................................

కాలు చల్లదనాలో!
కనలు తీయదనాలో!

........................................

భరమోయి! నీ ప్రేమ
వరమే నేటి రేయి - ॥మై॥

వెన్నెల మరగడం, చల్లదనం కాలడం, తీయనం మరగడం ప్రకృతి విరుద్ధాలు. అయితే విరహావస్థలో వెన్నెలను సహించలేకపోవడం, మలయానిలాన్ని ఓర్వలేక పోవడం సహజం కాబట్టి, విరుద్ధ భావాల్ని కలిపి విశిష్ట అర్థాన్ని ఆవిష్కరించారు, కృష్ణశాస్త్రి యీ గీతంలో. అనిర్వచనీయమైన ఆవేదన, ఆనంద మాధుర్యం కలగలిసిందీ గీతంలో

ఎడబాసి పోకోయి
నీదాసి నీరేయి
ఈ ఎదకు నిముసమే
నెడబాటు విసమే! (పాట : 103)

తారాస్థాయికి చేరుకున్న విరహావస్థలో వున్న గోపిక గోపాలునితో దాసినైన తనను ఎడబాసి పోవలదంటూ ఆ ఎడబాటు తన ఎదకు నిమిషమైనా విషమే! అని చెప్పడం ఈ గీతంలో అగుపిస్తుంది.

విరహం ఎంత తీయగా బాధగా వుంటుందో, మురళీ రవం అంత మాధుర్యంగా వుంటుందని విప్పిచెప్పే భావాలు 'మధుమురళి'లో కోకొల్లలు.

"అమృతవీణ"లో అయిదవ తంత్రీ అధ్యాయంగా అగుపించేది 'గుడిగంటలు' ఇందులో భగవంతుడు హరి, రాముడు, కృష్ణుడు, శివుడు మొదలగు రూపాల్లో దర్శనమిస్తాడు.

నవతులసీ దళదామా!
నవ కువలయాభి రామా!

........................................

కోరి కోరి రమ్మనిన
తీరా నీవేతెంచిన
ధారలైన అశ్రులనే
రూపుతోచదేమో? స్వామీ............ ॥నవ॥ (పాట : 105)

ఈ గీతంలో భగవంతుణ్ని భక్తుడు ప్రార్థించగా, ఆ ప్రార్థన నాలకించి అరుదెంచినా, ఆనందాశ్రువుల ధారలో స్వామి రూపమైనను తోచదేమో? అని స్వభావోక్తి అలంకారాన్ని, అందమైన భావాన్ని ఆవిష్కరించారు. దీనినే తర్వాత శబరికై 'సంపూర్ణ రామాయణం' చిత్రంలో ఉపయోగించారు

పూవులేరి తేవే చెలి
పోవలె కోవెలకు!
నీ వలె సుకుమారములు

నీ వలెనే సుందరములు

..............................................

తుమ్మెద కాలూననివీ
దుమ్ము ధూళి అంటనివీ

..............................................

పూలే పోయాలి తల
బ్రాలల్లే స్వామి పైన ॥పూవు॥ (పాట : 106)

ఇందులో తుమ్మెద అంటనివి, ధూళి సోకనివి సుందర సుకుమారములైన పూలన్నీ తెచ్చి స్వామి తలపై తలబ్రాలల్లే పోయాలని విమల భక్తితో ఆరాటపడడం అగుపిస్తుంది.

రామ చరణం రామ చరణం!
రామ చరణం మాకు శరణం!

..............................................

రాగమై ఈ బ్రతుకుచెడి ˊరా-
యైన వేళల రామ చరణం !
కోతియై ఈ మనసు నిలకడ
కోలుపోతే రామ చరణం!
నావలో తానుండి మము న
ట్టేట నడిపే రామ చరణం! (పాట : 115)

ఈ గీతంలో శ్రీరామపాదానికున్న ప్రభావాన్ని రమ్యంగా రచించారు. శీలం చెడిన అహల్య గౌతముని శాపంతో రాయిగా మారగా మళ్లీ రామచరణ మంటగానే రమ్యంగా రూపుదాల్చడం, కోతి (హనుమంతుడు) రామనామం వినినంతనే స్థిర మనస్సుతో కుప్పిగంతుల్ని మాని కుదురుగా నిలువడం, గుహుడి నావలో గోదావరి దాటడం, అభయ మిచ్చిన సుగ్రీవునికి, విభీషణునికి పట్టం కట్టడం, ఎదురు చూచే ముదుసలి శబరి కడకు తానే ఎదురు వచ్చి మోక్ష మీయడం మొదలైన రామాయణ ఘట్టాలన్నీ కళ్లకు కట్టినట్లుగా చెబుత ౼ భవసాగరాన్ని దాటించే మహిమలున్న రామచరణం నుండి రాలిపడే ఒక మధుకణమైనా మాకు చాలునని భక్తుడు తృప్తిగా కొలువడం మహత్తరంగా వుంది. 14 మాత్రలతో ఈ గీతం మొత్తం 3+4 మిశ్రగతిలో సాగింది. ఈ గీతంతో తృప్తి పడక మళ్లీ మరో గీతంలోనూ రామచరణాల్నే ప్రస్తుతించారిలా-

నీ పదములె చాలు రామా!
నీ పద ధూళులె పదివేలూ!

..............................................

నీదయ గౌతమి గంగ-రామయ
నీ దాసులుమునుగంగ
నా బ్రతుకొక నావ- దానిని
నడిపే తండ్రివి నీవ! (పాట : 116)

ఈ గీతం రేడియో ద్వారా బహుళ ప్రాచుర్యం పొందింది. దాస్య భక్తిని చాటే ఈ గీతంలో గంగ-మునుగంగ, నావ-నీవ అనే అంత్యాను ప్రాసలతో అరుదైన అందాన్ని తీసుకువచ్చారు శాస్త్రిగారు. ఇలా రాముడిని కృష్ణుడినే గాక కృష్ణశాస్త్రిగారు తనివిదీర శివుడినీ కీర్తించారు.

శివశివశివ అనరాదా? 6+6=12
శివనామము చేదా? 6+4=10
శివపాదము మీదా-నీ 6+6=12
శిరసునుంచ రాదా? 6+4=10

.......................................

హర హర హర అంటే - మన
కరువు తీరిపోదా?

.......................................

కరి, పురుగూ, పాము, బోయ
మొరలిడగా వినలేదా?
కైలాసము దిగివచ్చి
కైవల్యము ఇడలేదా ॥శివ॥ (పాట : 119)

ఈ గీతం కూడ రేడియో లలితగీతంగా విశేష ప్రచారం గాంచింది. ఇందులో భక్తుడు మనసారా శివనామము తలచినా, శివపాదము కొలిచినా ఎలా తరిస్తాడో చెప్పాడు. ఏనుగు, సాలీడు, పాము, కన్నప్పను కనికరించిన శ్రీకాళహస్తీశ్వరుణ్ని స్తుతిస్తే మనల్నీ కనికరిస్తాడు అనే భావం ఇందులో ఇమిడి వుంది. ఇందులోని 10 మాత్రల సమసంఖ్యల్లోని పాదాల్ని చివరలో రాగయుక్తంగా సాగదీస్తే సమమవుతాయి.

కైలాస గిరి నుండి కాశికై
కాశికాపురి నుండి దాసికై
దాసికై, యీ దక్షవాటికై
దయచేసినావయా! హరహరా! హరహరా!

.......................................................

విరిసి జాబిలి మల్లిరేకగా...
కురిసి తేనియల మువ్వాకగా....
దరిసి నీ దయ నిండు గోదావరీ నదీ...
ఝురులాయెరా! హరా! హరహరా! హరహరా! (పాట : 122)

కృష్ణశాస్త్రి శివక్షేత్రాల్ని స్తుతిస్తూ గానం చేసిన గీతమిది. కృష్ణశాస్త్రి స్వస్థలమైన తూర్పు గోదావరి జిల్లాలోని దాక్షారామం ప్రసిద్ధ శివక్షేత్రంగా అందరూ ఎరిగినదే!

కైలాస గిరి నుండి కాశికి, కాశి నుండి ద్రాక్షారామ వాటికి దయచేసిన శంకరుడే దయతో గంగను వదలగా, ఆ గంగ గౌతమి - వశిష్ఠాది మూడు పాయలైన గోదావరిగా ప్రవహించిందని ఇందలి భావం. అందుకే 'ముప్వాక' పద ప్రయోగం చేశారు. ముక్కోటి దేవతల ప్రార్థనల్ని మన్నించి గరళాన్ని గళంలో నిలుపుకున్న నేత, ముల్లోకములకు ఏది అడిగినా అనుగ్రహించే దాత ఏకైక ప్రభువైన పరమేశ్వరుడే అని కమనీయంగా ప్రస్తుతించిన గీతమిది.

**నటేశ్వరున కివె నమస్సులు, కర**
**పుటాల నిటలమ్ముల కీలించి**
**జటావాటి మినువాక నెలరేక**
**ఘటించేటి భువన మోహనునకును**

**॥నటే॥**

**శౌరి మృదంగము మ్రోయింప**

**..........................................................**

**సురాళి పొగడ తాండవమ్ము నెరపే.... ॥నటే॥ (పాట : 123)**

భారతి వీణను, శౌరి మృదంగం వాయించగా, పాకారి అంటే ఇంద్రుడు వేణువు నూదగా, బ్రహ్మతాళం వేయగా, దేవతలంతా పొగడగా పార్వతితో నేత్ర పర్వంగా తాండవమాడే నటరాజుకు, తన జటాజూటంలో గంగను, నెలవంకను కలిగున్న కైలాసనాథునకు కైమోడ్పులు చేస్తున్నట్లుగా యీ గీతం అంతరార్థం. సురగంగను 'మినువాక', నెలవంకను 'నెలరేక' అను పదప్రయోగం బాగుంది.

**నమో నమస్తే నారాయణ! నవ**
**జీవనిధానా! నమో నమో!**
**అంధకారవారణ దారణ చణ**
**కిరణ కృపాణా! నమో నమో!**

**........................................ (పాట : 124)**

సప్తాశ్వ రథారూఢుడై, సుషుప్త జగతిని మేల్కొలిపే, కిరణాల ఖడ్గాలతో అంధకారాన్ని చెండాడే ఆదిత్యుడి వర్ణన - కీర్తన ఈ గీతంలో అగుపిస్తుంది.

'గుడి గంటలు' శీర్షికలోని ఈ గీతాలన్నీ శివ, రామ, కృష్ణాది దేవతల్ని మనసారా కీర్తించే వైతే 'మహతి' లో అగుపించే గీతాలు నిరాకార, నిర్గుణోపాసాలు. అంటే తొలినాళ్లలో బ్రహ్మసమాజ వ్యాప్తికై రచన చేసిన రోజుల్లోని కృష్ణశాస్త్రి గీతాలు నిరాకారుడైన పరబ్రహ్మను ప్రస్తుతించగా, మలినాళ్లలో రచించిన 'గుడి గంటలు' గీతాలు హరి, రామ, కృష్ణ, శివాది సాకార మూర్తుల్ని కీర్తించాయి. కావున ఈ మార్పు గమనార్హం.

'అమృతవీణ'లో ఆరవ తంత్రిగా 'ఋతుఖేల' అగుపిస్తుంది. ఈ శీర్షికలోని గీతాలన్నీ ప్రధానంగా ప్రకృతి విలాసాన్నీ, ఋతుచక్రభ్రమణాన్నీ అల్లుకొన్నవే! చాలా వరకు శ్రవ్యనాటికలుగా ప్రసారమైనవే!

ఎవరు నాటిరో ఎవరు పెంచిరో
వివిధ సుందర తరువుల
మివుల చల్లని దయాధారల
తవిలి కురిపించి వానికి
వందనమ్ము! చరాచరాత్మక
జగత్కర్తకు, విశ్వభర్తకు
వందనమ్ము! వందనమ్ము! (పాట : 125)

ఈ గీతం పోతన్నగారి 'ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై' అను ఉత్పలమాల పద్యానికి అనుసృజనగా అనిపిస్తుంది.

అనేక సుందర తరువుల్ని ఎవరు నాటిరో? చల్లని దయాధారల్ని కురిపించే మబ్బుల్ని ఎవరు పెంచిరో? అని ప్రశ్నిస్తూనే వాటినన్నీ సృష్టించిన జగత్కర్తకు-విశ్వభర్తకు వందనం అంటున్నాడు కవి.

నిలిచిన ప్రతిగిరిని ధ్యానించే ఒక మునిగా, ప్రవహించే ఝరిని కీర్తించే భక్తురాలిగా భావిస్తూ, ఎవని చరణములపై పొదరింటి లతలపై విరిసిన పూలన్నీ ఎల్లప్పుడు వాలునో వానికి వందనం అంటూ స్తుతించే ఈ గీతం విలక్షణంగా వుంది.

కడచినదీ రేయి
నడచెనెటో పోయి

.........................................

వెలుగు ఉషస్స్పర్శనమున
అల్లన నిట్టూరిచె పృథివి
చెలగు విశ్వమున కణ కణమ్మున
నవ చైతన్యము పొదివి (పాట : 126)

రేయి గడచి పోగానే ఉషస్సుతో పృథ్విపై కదలాడే నవచైతన్యాన్ని చూసి కవి పొంగిపోతూ రచించిన గీతమిది. అందుకే మిణుకు మిణుకుమను గతరాత్రి దీపాల్ని వెంటనే ఆర్పేయమంటూ, కొత్త కాంతి చైతన్యానికి సరికొత్త స్వాగతంగా పలికిన గీతం-

ఆర్పుము ఆర్పుము దీపములు
రజనీ దీపములు

.......................................................

ఎరుగవా వీటి కెపుడు వచ్చెనో
అరుణ కిరణముల ప్రభాతము
కొరమాలినవా మట్టి ప్రమిదలు
తెరువుము తెరువుము ద్వారములు ॥ఆర్పుము॥ (పాట:127)

కొరమాలిన మట్టి ప్రమిదల్ని పాత ఛాందసత్వానికి, ప్రభాత అరుణకిరణ రేఖల్ని నూతన అభ్యుదయ తత్వానికి సంకేతంగా పదప్రయోగం చేసినట్లు అనిపిస్తుందీ గీతంలో

**తెరవండీ తలుపులు! వీధి తలుపులు!**
**పురాణ మీ దివాణం, చెడి బూజు పట్టకుండ!**

**...........................................................................**

**బూజు దుమ్ము ధూళి, మూసెను తిమిరాళి!**
**మూసె ఈ హవేలీ!**
**ఊర్చెను సరికొత్త కొత్త వార్తలెవో గాలి!**
**తీర్చెను ద్వారముల స్వర్ణతోరణముల హేళి!**
**బిరానతెరవరేం?**

**.................................... ॥ పురాణ మీ దివాణం॥ (పాట:129)**

కవి ఈ గీతంలో కూడ పాతదనాన్ని పురాతనమైన దివాణంతో పోల్చి, వెంటనే తలుపులు తెరిచి కొత్త కాంతుల్ని ఆహ్వానించకుంటే అది బూజు పట్టి చెడిపోతుందని చెప్తున్నాడు. వెలుగుల్ని నింపే ఉదయ అభ్యుదయానికి స్వాగతం పలుకుమంటున్నాడు. కొత్త వార్తల్ని మోసుకొచ్చే గాలికి, స్వర్ణతోరణాల్ని వేలాడదీసే పసిడి కిరణాలకు ద్వారాలు తెరిచి ఆహ్వానించమంటున్నాడు. నూతన వసంతాన్ని చేతులు సాచి పిలుస్తున్నాడు. అందుకే వసంత సంకేతాలైన గున్నమావి, కోయిల, మల్లెలు వాడబడ్డాయి.

**"ఎవరు వారు వచ్చేరు? పువుల తేరుపై"**
**"క్రొత్త కారు! క్రొత్త కారు!"**
**"చైత్రరథంలోన, శ్యామ పత్రపథంపైన**
**ఎవరా వచ్చేది?"**
**"అది ఉగాది! అది ఉగాది"**
**కుసుమలతా పతాక**
**కోయిల బాకా!**
**వహవ్వా! ఎన్నాళ్లకు రాక!" (పాట : 131)**

ఈ పాట మొత్తం ప్రశ్న-జవాబుల మాదిరిగా విశిష్టమైన పంథాలో నడచింది. చైత్రరథంలో - ఆకుపచ్చ పథంలో సాగివచ్చే ఉగాదిని, కోయిల బాకా - విరిసిన ప్రసూనాల పతాకతో ఏడాది గడిచాక వచ్చిందనడానికి ఎన్నాళ్లకు రాక! అని చెప్పడం నవ్యంగా దివ్యంగా వుంది. వసంతమంటే కృష్ణశాస్త్రిగారికి ఎంత ఆనందమో ఈ గీతమే చెప్తుంది.

మధూదయంలో మంచి ముహూర్తం
మాధవీలతకు పెళ్లి!
మాధవి పెళ్లికి మల్లీ, మాలతి,
మందారం పేరంటాళ్లు!

కొమ్మ కొమ్మ కొక సన్నాయి!
రెమ్మ రెమ్మ కొక గవాయి!
కొమ్మా రెమ్మా కలిసి మామిడి
గుబురంతా ఒకటే హాయి!

............................................. (పాట : 137)

మధుమాసం మాధవీలతకు గున్నమావితో పెళ్లి చేయడానికి మంచి ముహూర్తం అంటూ ఆ పెళ్లికి మల్లె, మాలతి, మందారం, మొదలగు పూలన్నీ పేరంటాళ్లు అని చెప్పడంలో ఎంతో ఔచిత్యముంది. మల్లె, మాలతి వసంతంలోనే విరివిగా వికసిస్తాయి. కోయిలల కూతల్ని కొమ్మ కొమ్మ కొక సన్నాయిగా రెమ్మ రెమ్మకొక గవాయిగా అభివర్ణించడం ఈ గీతంలో అగుపిస్తుంది. ఈ పంక్తులు మనోహరంగా వుండడంచేత ఒక చలన చిత్రంలోనూ చోటు చేసుకున్నాయి.

| | |
|---|---|
| మల్లెనమ్మా, మల్లెనే! నా | 3+4+3+4=14 |
| ఒళ్లు సందెల జల్లనే! | 3+4+5=12 |
| పెళ్లి కూతురు మగనికై కొస | 3+4+3+4=14 |
| వేళ్ల మాలికలల్లెనే! | 3+4+5=12 |

......................................

దారి పజ్జను, గడ్డిసెజ్జను
దాగివుండే బీదను-నిరుపేదను

.............................................

ప్రభువు కొలువున దాసిని, శ్రీ
పదములకును తివాసిని ॥మ॥ (పాట : 138)

ఈ గీతంలో వివిధ పూల మనోభావాల్ని వివరించారు. మగనికోసం పెళ్లి కూతురు సందెవేళలో తనను మాలగా అల్లుతుందేమోనని మల్లెఒళ్లు ఝుళ్లు మంటోందట! పసిడి బాకుల్లాంటి తన రేకుల్ని మగువలు సిగలో దాలిస్తే మబ్బులో మెరుపులాగుంటానని మొగలిపువ్వు అనుకుంటోందట! కలువనేమో తనను తల్లి కొలను అలల చేతుల్తో ఊపుతుందని, స్త్రీల చెవులకు సింగారంగా జూకాలుగా వేలాడతానని రేరాజుకు బాకానూదగల ననుకుంటోందట.

మందారమేమో తోటకంతటికీ తానే దొరసానినని, వీరుల మెడలో వేలాడే జయహారాన్ని అని మురిసిపోతోందట! సంపంగియేమో తాను రాణివాసపు దానిగా భావిస్తూ సరసులను - సామంతులను నా మధురపు తావులతో అలరిస్తానని తలపోస్తోందట! కడకు గడ్డిపువ్వు మాత్రం తాను దారిపక్కన పడివుండే బీదనంటూ ఏ మోజులు-అలంకారాలు లేక పూజకు పనికిరాకపోయినా ప్రభువు కొలువులో పడివుండేదాసిని-కలవారి పదములకు పనికి వచ్చే తివాసిని అని భావిస్తోందట!

గడ్డిపువ్వు పేదరికాన్ని-దాస్యభావాన్ని కళ్లు చెమ్మగిల్లేలా మిశ్రగతిలో కడు మనోహరంగా వర్ణించారు కృష్ణశాస్త్రిగారు.

ఏ ఊహ వేసిన బొమ్మలో
ఏ చేయి పూసిన వన్నెలో
సంజలో మబ్బు పింజలో అప
రంజికుంకుమ చిన్నెలో.....
............................................॥ ఏ ఊహ॥ (పాట : 139)

అరుణోదయ దృశ్యాన్ని యీ గీతంలో అభివర్ణించడమైంది. తొలి సంజలో మబ్బులు దూది పింజల్లా తేలాడుతూ పసిడి కుంకుమలో ముంచి తీసినట్లున్నాయని, వెలుగు రేకలు క్రమక్రమంగా కొండలపై నుండి దిగివచ్చి, పొదరిళ్లలో చొచ్చి, వాగులో చెలరేగు అలల నురుగులో అంతటా వ్యాపిస్తూ ఒక రేయిని తుడిచివేస్తున్నాయనడం; ప్రతిరోజూ ఏనాటికీ మారక, అసలే మాయక రేయితుడవలేని ఉదయ పటము అని చెప్పడం మనోహర రూపకల్పన. పదములతో వేసిన తైలవర్ణ చిత్రంగా మనసుకు తోస్తుందది.

శీతవేళ రానీయకు - రానీయకు
శిశిరానికి చోటీయకు - చోటీయకు!
ఎదలోపల పూలకారు
ఏనాటికి పోనీయకు!
.................................... ॥శీత॥
చైత్రంలో తొగరెక్కిన కొత్తకోర్కెలు
శరత్తులో కైపెక్కే తీయని కలలు
మనసారా తీర్చుకో - మనుగడ పండించుకో!
..............................................................
ముసలితనపుటడుగుల సడి ముంగిట వినబడెనా
వీటలేదనీ చెప్పించు - వీలు కాదనీ పంపించు ॥శీత॥

ముసలితనాన్ని శిశిరంతో పోల్చుతూ, శిశిరాన్ని-శీతలాన్ని ఇంట్లోకి రానీయకు! ఎదలోపల కదలాడే కోర్కెల వసంతాన్ని వాడిపోనీయకు! శరత్తులో కైపెక్కేతీయని కలల్ని మనసారా తీర్చుకో! మనుగడ పండించుకో! ఉగ్రగ్రీష్మం ఆగ్రహించినా-వర్షామేఘం అదే పనిగా ఏడ్చినా లెక్కచేయకు! ముసలితనం ఆవహించడానికి గాని వస్తే ఇంట్లో లేదని చెప్పించు. ఇక దానికి లొంగడం వీలుకాదని పంపించుమని చెప్పడం ఈ గీతార్థం. వన్నెల వసంతాన్ని - తొలి వెన్నెల శరత్కాలాన్ని, కోర్కెల యౌవనాన్ని ఆహ్వానించడం, ముదిమితనాన్ని, శిశిరాన్ని తరిమివేయాలను కోవడం మానవ సహజం. అదే విషయాన్ని హాయిగా పాడుకోవడానికి వీలుగా యీ గీతం వ్రాయబడింది.

పడమటి వాకిటి తలుపులను
గడియ తీసి తెరిచారా?......ఆ

దుడుకు గాలి గుఱ్రాలను
విడిచి బయట తోలారా?..........ఆ
బయలుదేరెనదె మొయిలు తేరుపై
వానకారు దొరగారు......... ॥ పడమటి ॥ (పాట : 146)

సాధారణంగా పడమటి దిక్కునుండి గాలి-వాన అధికంగా వస్తుంది. కావున పడమటి వాకిటి తలుపులు తెరిస్తే గాలి రేసుగుఱ్రాల్లా దూసుకు వస్తుందని, గాలి గుఱ్రాల మబ్బుల తేరుపై వానకారు దొరగారు తరలి వచ్చారంటూ వర్షాగమనం సూచించే, విరహిణుల మనోభావాల్ని వివరించే యీ గీతం చక్కగా సాగింది.

నదీసుందరి - సుధాస్యందిని 3+4+3+4=14
నగాధీశ్వర నందినీ! 3+4+5=12
నడచికోనా, నడుమ కానా 3+4+3+4=14
కడచి వచ్చిన నవఝరీ!... 3+4+5=12 ॥నదీ॥

.............................................

అందెలా కడియాల గలగల
అందమౌ చిరునవ్వు తళతళ
మందముగనిట, తొందరగనట
మలుపు మలుపూ మధుర భంగిమ ॥నదీ॥ (పాట : 148)

వర్షానంతరం వేగంగా పరుగెత్తే నదీ సుందరి గమనాన్ని యీ గీతంలో కళ్లకు కట్టినట్లు చిత్రీకరించారు కృష్ణశాస్త్రిగారు. గీతం ఎత్తుకోవడంలోనే జగణాలను గుప్పిస్తూ (నదీ సుందరి - సుధాస్యందిని - నగాధీశ్వర నందినీ) ఒక కొత్తదనం-పరుగెత్తుదనం చొప్పించడం కనిపిస్తుంది. కొండ-కోన దాటి అమృతం లాంటి జలాలతో సాగిపోతున్న నదీ సుందరి దరులనున్న కొమ్మ-రెమ్మలతో సయ్యాటలాడుతూ అలలగలగలల్ని అందెలరవళులుగా మోగిస్తూ, నురగల్ని చిరునవ్వులుగా చిందిస్తూ మలుపు మలుపుకో మధుర భంగిమను ఒలికిస్తున్నదని చాలా మనోహరంగా అభివర్ణించిన మిశ్రగతి గీతమిది. లలిత సంగీతంలో అనేకసార్లు అత్యంత శ్రావ్యంగా ప్రసారమైందీ గీతం.

"అమృతవీణ"లో సప్తమ తంత్రిగా సాక్షాత్కరించేది 'విరితూపు'. ఇందులో చాలా వరకు సంప్రదాయ ధోరణిలో సాగిన అనేక శ్రవ్యనాటికల నుంచి చేర్చినవి, గాయనీ గాయకుల కొరకు ప్రత్యేకంగా వ్రాసినవే అగుపిస్తాయి. ఇవి చాలావరకు శృంగారాత్మకాలు కాబట్టి 'విరితూపు' పేరు ఈ శీర్షికకు సవ్యంగా వుంది. అందుకే ముందుగా విరితూపులు విసిరే మన్మథుని మీదనే గీతం అల్లబడింది.

హరినందనునకు జోహారో
ఆమని సఖునకు జోహారో

.............................................

చెరుకు విలుతునకు జోహారో...
చిలుక రౌతునకు జోహారో...
విరితూపుల వలపులు రేపే
చిలిపి జోదుకే జోహారో... (పాట : 154)

రతీసతి కౌగిలిలో మునిగితేలే ఆమని దొరకు, చెరకు వింటితో చిలుక తేరుపైనుండి విరితూపులు విసురుతూ చిలిపి వలపుల్ని రేకెత్తించే మదనుని గూర్చి వ్రాసిన గీతమిది.

సుందరా! పురందరా! శచీమానస మందిరా! ఏ
మందురా! మదిలోన వలపులు మరిగి తొందరలాయెరా
అందె రవళులు విందువా? నా
అందచందాల్ కందువా?...ఓ సుందరా!

.......................................

ఓరచూపులు తరలు నెవ్వనికై?
దోర పెదవులు విరియు నెవ్వనికై?
జారు పయ్యెదలోని ఎదలో
ఊరు రాగము లెవనికై?......... ॥ఓ సుందరా॥ (పాట : 156)

మదనుడు, ఇంద్రుడు, చంద్రుడు శృంగార పర్వంలో విహరించే వారు. కాబట్టి మదనుని తదుపరి పురందరుడగు ఇంద్రుని గూర్చి అల్లిన గీతమిది. సుందరా! పురందరా! శచీ మానసమందిరా! ఏ మందురా!...అనడంలోనే ఎదురుచూసే జవ్వని పదప్రయోగంలాగే అందంగా అలంకరించుకొని ఓర్వలేని విరహాన్ని ఒలికిస్తున్నట్లు తోస్తుంది. వృత్త్యను ప్రాస హృద్యంగా దొర్లి ఒక విధమైన ఊపు, కైపు కలిగిస్తున్నట్లు అనిపిస్తుంది. "ఓర చూపులు - దోర పెదవుల మధువులు, జారు పయ్యెదలోని పొంగులు అన్నీ నీకై నిరీక్షిస్తున్నాయి. రారా! ఓ సుందరా" అంటూ జవ్వని తొందర పడడం తోస్తుంది.

చెలీ నన్ను లేపకే
కలలు కనే వేళ!
కలలోనైనా వానిని
కనగలనేమోనే - ॥చెలీ॥ (పాట : 162)

నిరీక్షించి నిరీక్షించి, ఎంతకూ ప్రియుడు రాకపోయేసరికి నిట్టూరుస్తూ కలలోనైనా వాన్ని కంటానేమోనని, ఆ కల చెదరిపోయేలా మాత్రం తనను లేపకే చెలీ! అనే ఒక అభిసారిక మనోభావానికిది అద్దం పడుతుంది.

ఏనాటికీ రాడు - ఏలాటి ప్రియుడే!
ఈ లాగువేచి ఎన్నాళ్లు సైచేనే?

.......................................

ఎన్నాళ్లు నా కళ్లు ఎదురు చూసేనే?
ఏలాగు ఈ విరహ బాధమోసేనే? ॥ ఏ ॥ (పాట : 167)

ఇందులోనూ విరహావస్థయే వివరించబడింది. వలపురేపి, ఉండుండి మనసును ఊయలగా ఊపి ఎంతకూ రాని వానికై 'ఎన్నాళ్లు కళ్లు ఎదురుచూసేనే? ఏలాగు యీ విరహబాధ మోసేనే? అనడంలో దీర్ఘకాలిక నిరీక్షణ, విసిగి వేసారే విరహ భావన అగుపిస్తుంది.

ఏలాగీ వియోగాన వేగేనో నా ప్రియా!
ఏలాగీ మేఘమాస మేగేనో ప్రియా! ప్రియా!
గడియ గడియ ఒక శిలయై
కదలదు సుమ్మా ప్రియా!
ఎడదలోన నీ రూపము
చెదరదు సుమ్మా ప్రియా!
పడిరావాలంటే వీలు
పడదు కదా నా ప్రియా! (పాట : 169)

కాళిదాస 'మేఘసందేశం' ఇతివృత్తంగా యక్షుని విరహావస్థను వివరించే గీతమిది. కుబేరుని శాపంతో ఏడాదిపాటు ఏకాకిగా మసలాల్సిరావడం, తన ప్రియను అదేపనిగా తలపోయడం వల్ల ఆ వియోగాన్ని - అందులో మేఘమాసాన్ని ఎలా సహించడమోనని యక్షుడు ఆర్తిగా పలుకుతున్నాడు. సహజంగానే వర్షామేఘం విరహావస్థను పెంచి బాధిస్తుంది. అందులో అనుదినం క్షణక్షణం మేఘాలు దూసుకువచ్చే వర్షాకాలం ఎలాగడపాలోనని యక్షుడు వాపోతున్నాడు. 'మేఘసందేశం'ను గుర్తుకు తెచ్చేలే మధుమాసంలా వర్షాకాలంను 'మేఘమాసం' అనడం ఔచిత్యంగా వుంది.

ఏడాది గడిపేద్దామంటే గడియ గడియ ఒక శిలగా కదలడం లేదని ఎదలోన ప్రేయసిరూపం ఎంతకూ చెదరడం లేదని...పరుగెత్తుకు వద్దామంటే శాపం కొరణాన వీలుపడడం లేదని యక్షుడు వాపోవడాన్ని కృష్ణశాస్త్రిగారు చక్కగా చిక్కగా చెప్పారు.

తోట పిలిచె తోపు పిలిచె!
ఏటి తరగల పాట పిలిచె!
ఏటి మొగనో తోట కడనో
ఎదురుపడితే పడుచులు
చెదిరి లోబడవా మనసులు? ॥తోట పిలిచె॥
కళ్లు కళ్లూ కలిపి నడుమను
నల్ల కలువల దండలల్లు
అల్లి అల్లి మొగ్గ దొడిగి
ఝల్లుమని ఊగే నొడళ్లు! ॥ తోట పిలిచె ॥ (పాట : 173)

రేడియో లలితగీతం గానే కాక సినీగీతంగానూ రాణించిందీ గీతం. తోట-తోపు, గల గల పారే ఏటి తరగల పాట పిలిచిందంటూ, అక్కడ గాని జవ్వనులు అగుపడితే అంతరంగాలు కైవసం కావా? చూపులు కలిసి కళ్లకు-కళ్లకు

మధ్య నల్లకలువల దండలల్లుకోవా! అనడం - తొలి చూపుల ప్రేయసీ ప్రియుల మనోభావాల్ని వెల్లడి చేయడమే! కాటుక దిద్దిన కళ్లు కాబట్టి కళ్లను నల్లకలువలతో ఉపమించడం బాగుంది. అలా చూపులు కలిసి మనసులు తెలిసి ఒకటైపోగానే ఒళ్లు ఝుళ్లు మంటుందని ప్రణయంలోని ప్రథమావస్థ వివరించబడింది.

పెరటిలోన గన్నేర! పెదమివిరిచి నవ్వేవు!
కోరడిలో గోరింట! కోపగించి చూసేవు!
తెలుసా నా గుట్టు!
నలుగురికీ చెప్పేస్తే నా మీదే ఒట్టు!
నా లోపల పచ్చనాకుల గూడుంది-తెలుసా?
..............................................................
పంచ వన్నెల చిలకపైనా ప్రాణమంతా తెలుసా?
తెలుసా నా గుట్టు? (పాట:175)

ఈ గీతం 'వేణుకుంజం' లోనిది కావున ఆ పడుచును గోపికగా భావించాలి. పెరటిలోనవ్వే గన్నేరుతో కోపగించే గోరింటతో ఆ గోపిక తన ప్రణయ వృత్తాంతాన్ని వెల్లడిస్తోంది. తెల్లగా పూచే గన్నేరు నవ్వుతూ, ఎర్రగా పండే గోరింట కోపంగా అగుపడడం అర్థమెరిగి చేసిన రచనగా అగుపిస్తుంది. సామాన్యంగా స్త్రీకి సిగ్గు సహజం. కావున అందరితో తన అనురాగాన్ని విప్పి చెప్పలేదు. అందుకే యీ గోపిక తన వలపును తోటలోని పూలకూ, చెట్లకూ చెప్తోంది. కాని చెప్పినదంతా నలుగురికీ తెలిసేలా చేయొద్దని ఒట్టు పెడుతోంది. తనలోని పచ్చనాకుల గూడు అంటే ప్రణయం చిగురుతొడిగిన గుండె అని, ఆ గుండె గూటిలో కదలాడే చెలికాడే పంచవన్నెల చిలక అని, ఆ చిలకనే తన ప్రాణమని అల్లిన యీ గీతం కథ చెప్పినట్లుగా, మనసు విప్పినట్లుగా సాగింది.

జయ జయా! జయ జయ జయా!
జయ రతీ రమణీ ప్రియా!...
..................................................
అరుణ పల్లవ కేతనా!
తరుణ హృదయ నికేతనా!...
జయ రసాల శరాసనా! శుక
వాహనా! నవ మోహనా!... ॥ జయ ॥

లేత ఎరుపు చిగుళ్లను కేతనంగా, తరుణ వయసులోని ప్రేయసీ ప్రియుల హృదయాలే నికేతనంగా, చిలుక వాహనంపై వచ్చి వలపుల బాణాల్ని సంధించే రతీ ప్రియుడైన మన్మథుణ్ని సంబోధిస్తూ - సంభావిస్తూ అల్లిన గీతమిది. 'విరితూపు' శీర్షికను హరినందనునకు జోహారు పలుకుతూ ఆరంభించడమేగాక రతీ రమణీ ప్రియునికి జయము కలుగు గాక అని ముగించడంలో సంప్రదాయబద్ధంగా మంగళం పలకడమైంది.

కృష్ణశాస్త్రి గారు ఏ గీతమల్లినా అందులో తన శైలి, శిల్పం అనల్పంగా ప్రదర్శిస్తారు. రచనా చమత్కారంతో పరవశింపజేస్తారు.

ఆయన కలం నుండి రెండవ గేయ సంహితగా జాలువారిన 'మంగళ కాహళి'ని పరిశీలిద్దాం-

'మంగళకాహళి' లోని గీతాలు చాలావరకు దేశభక్తికి సంబంధించినవి. సాధారణంగా దేశభక్తి గీతాలలో ప్రజలను ఉత్తేజపరిచి ఉద్యమానికి పుష్టిచేకూర్చే లక్షణాలువున్నా కృష్ణశాస్త్రిగారి దేశభక్తి గేయాలు మరొక కోవకు చెందినవి. వీటిలో ఉదాత్త కవితా లక్షణాలు మెండుగా మెరుపుల్లా దర్శనమిస్తాయి.

మనిషిలాగే కవి కూడ సంఘజీవి. కావున సంఘంలోని దురాగతాల్ని చెండాడుతూ, సన్మార్గాన్ని ప్రబోధిస్తూ రచన చేస్తాడు. మనదేశానికి స్వాతంత్ర్యం అవసరమని గుర్తించి శ్వేతజాతి చెరనుండి దేశమాతను విడిపించుకోవాలని మంగళం కలిగించగ ఎలుగెత్తిన కృష్ణశాస్త్రి బాకా యీ సంపుటి. అందుకేనేమో దీనికి 'మంగళ కాహళి' అను నామకరణం చేశారు. 'మంగళ కాహళి'లో 'విజయభారతి' 'ఆంధ్రగేహళి' అనే రెండు శీర్షికలు వున్నాయి. కేవలం కృష్ణశాస్త్రిని భావకవి చంద్రునిగానే భావించి పెదవి విరిచే వారికి 'మంగళకాహళి' మండే మార్తాండునిగానూ రూపుగట్టి రూఢి చేస్తుంది.

'విజయ భారతి' లో భారతమాతకు నివాళులెత్తుతూ, స్వాతంత్ర్యోద్యమాన్ని శాంతి సమర విజయాన్ని అభివర్ణిస్తూ సాగిన గీతాలనేకం దర్శనమిస్తాయి. అందులో మొదటి గీతంగా -

| | |
|---|---|
| జయ జయ జయ ప్రియ భారత | 6+6=12 |
| జనయిత్రీ దివ్యధాత్రి! | 6+3+3=12 |
| జయ జయ జయ శత సహస్ర | 6+6=12 |
| నరనారీ హృదయనేత్రి! | 6+3+3=12 (పాట:1) |

అగుపిస్తుంది. పల్లవి చూడగానే బంకించంద్రుని వందేమాతరగీతం ప్రేరణతో రాసినట్లు తోస్తుంది. అంతేగాక రవీంద్రుని 'జనగణమన' గీతమూ స్ఫురణకు వస్తుంది. అయితే రవీంద్రుడు భారతావనిని అధినాయకునిగా కీర్తిస్తే, కృష్ణశాస్త్రిగారు అధినాయికగా - జనయిత్రిగా అభివర్ణించారు. దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించబడగానే మద్రాసు ఆలిండియా రేడియో ద్వారా పై గీతం ప్రసారమైందని ప్రతీతి. అయితే "ఈ గీతం 1933లో కృష్ణశాస్త్రి కాకినాడ పి.ఆర్. కళాశాలలో తెలుగు అధ్యాపకునిగా పనిచేస్తున్న రోజుల్లో విద్యార్థుల కోసం రాయగా సీత, అనసూయ ఆకాశవాణిలో పాడగా విస్తృత ప్రచారం పొందింది."[1]

| | |
|---|---|
| జయ జయ సస్యామల సు | 6+6=12 |
| శ్యామ చలచ్చేలాంచల! | 3+3+6=12 |
| జయ వసంత కుసుమలతా | 6+6=12 |

1 తెలుగు సినిమా పాట పైడి పాల పుట 217

చలిత లలిత చూర్ణ కుంతల! 3+3+3+4=13
జయ మదీయ హృదయాశయ 3+3+6=12
లాక్షారుణ పదయుగళా! 6+6=12 ॥ జయ ॥
జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ!
జయగాయక వైతాళిక
గళ విశాల పథ విహరణ!
జయ మదీయ మధురగేయ
చుంబిత సుందర చరణా! ॥ జయ ॥ (పాట:1)

మొదటి చరణంలో 'సస్యామల సుశ్యామ చలచ్చేలాంచల...' అంటూ భరతమాతను దివ్యధాత్రిగా-సకల జనుల హృదయ నేత్రిగా అభివర్ణిస్తూనే ఆకు పచ్చని పంట పొలాల్ని గాలికి ఎగిరిపడే పయ్యెదగా సంభావించడం సముచితంగా వుంది. చలత్+చేలాంచలమును 'చలచ్చేలాంచలం' అన్నప్పుడు ఆ విరుపులో పైట ఎగిసిపడే తీరుకూడ ద్యోతకమవుతుంది. వసంతపు పూలతీగల్ని గాలికి వూగే భారతి ముంగురులుగా అభివర్ణిస్తూ 'చూర్ణకుంతల' అని సంబోధించడం జరిగింది. సిగలో పూలు ధరించే యువతి సౌభాగ్యవతికి సాదృశ్యం. కావున వసంత లతల్నే కురులుగా పోల్చడమైనది. తమ హృదయాలలోని అరుణారుణ ఆశయమే భారతి పదయుగళానికి అద్దిన లక్షారసం (పారాణి)లా భాసిస్తోందని భావించడం ఉత్కృష్టంగా వుంది. హృదయంలోని రక్తం ఎరుపుగా వుంటుంది. కావున హృదయాశయాన్ని ఎర్రని లాక్షారసంతో పోల్చారు.

ఇక రెండవ చరణంలో 'గతవైభవాన్ని దిశాంతములదాక పక్షులెల్ల మధురంగా గానం చేస్తుంటే ఆనందించేదానా! గాయక వైతాళికుల గళ విశాలసీమలో విహరించేదానా! నాయీ మధురగేయంతో ముద్దాడబడిన సుందర చరణాలను కలిగివున్న దానా!' అని కవి వర్ణించడం జరిగింది. చరణం చివరలో 'జయ మదీయ గేయ చుంబిత సుందర చరణా!' అని సంబోధించడం శాస్త్రిగారికి భరతమాత పట్లగల భక్తి, అపార గౌరవాలను చాటుతున్నాయి. మధురంగా అల్లిన శైలిని తేటతెల్లం చేస్తున్నాయి. మొత్తం గీతం త్రిశ్రంలో సంస్కృతపదాలతో సాగడం ఈ గీతంలోని మరో విశేషం...'చలిత లలిత...' పంక్తిలో ఒక్క మాత్ర పెంచి వింత విరుపు తీసుకొచ్చారు.

ఆకాశము నొసట పొడుచు అరుణారుణ తార!
ఏకాకి నిశీధి నొడుచు తరుణ కాంతిధార

..........................................................

ముందు గలదు మనజాతికి ముక్తి, అమరజీవరక్తి!
క్రిందు వెనుక గనుక నడువుడందరు, అభ్యుదయ విభా
తాకాశము నొసట పొడుచు అరుణారుణ తార (పాట : 5)

నిరాశతో నిట్టూర్పుతో చతికిలబడక, నిశీధిని చీల్చుకుని ప్రవహించే కాంతి ధారగా- అరుణారుణ తారగా సాగిపొమ్మంటూ తనవారికి ధైర్యాన్ని నూరి పోసే గీతమిది. యుగయుగాల పీడకలల్ని - దాస్య శృంఖలాల్ని ఛేదించుకొని స్వాతంత్ర్యముక్తి మున్ముందు తప్పక సిద్ధిస్తుందంటూ ముందు వెనుక లాలోచిస్తూ వెనుకడుగేయక ముందుకే పదండంటూ ప్రబోధించే గీతమిది. శ్రీశ్రీ ఛాయలకు మాతృకలా కనిపించే అభ్యుదయ గేయమిది.

ప్రాభాత ప్రాంగణాన మ్రోగేను నగారా!
ఈ భారత భువి పొంగెను ముక్త జీవధార!
లేవోయ్! లేలే లేలే
మ్రోగేను నగారా! పొంగె జీవధార!

..............................................

నీ శీర్షం హిమ శృంగం
నీ ఎద గంగా భంగం
నీ దేశం, నీదే, నీ
భారత దేశం, మన
భారతదేశం, ప్రజ
లందరి కోసం!
నైరాశ్యం పెనురోగం
వైరాగ్యం జడభోగం
లేవోయ్! లేలే లేలే
మ్రోగేను నగారా!.... ( పాట : 10)

మనదేశ చిరకాల దాస్యాన్ని చిత్తు జేసి కలిసికట్టుగా ముందుకు కదలండని గుండెలపై మోగించే నవ్యనగారా యీ గీతం. "నీ శిరసే హిమ శిఖరం. ఎదయే గంగా తరంగం! మనసే మంచి ప్రభాతం. ఉరకలెత్తే రక్తమే జలపాతం! ఇంకా నిరాశ, నిస్పృహలకు అవకాశమివ్వక మతభేదాలకు చోటీయక, మగతనిద్రను వదలి లేచి ముందుకు సాగిపో!" అని ప్రబోధించే యీ గీతంలో లేవోయ్! లేలే లేలే అని వేగిర పరచడం స్పష్టంగా కనిపిస్తుంది. స్వేచ్ఛా సమరానికి మేలుకొలుపుగా యీ నగారా గీతం మ్రోగించబడింది. ఉన్నతమైన ఉనికిని ఎత్తి చూపుతూ ఉన్నతంగా మసలేలా ఆయత్త పరచడం ఇందలి ముఖ్యోద్దేశం.

అనవేరా భారతవీరా!
అనవేరా నీ నోరార!

..................................

ముక్త రక్త గళమెత్తుమురా!
శక్తి వాక్కులందొత్తుమురా!
........................................ ॥ అనవేరా ॥ (పాట : 11)

అనే గీతంలోనూ అదే భావం కనబడుతుంది. స్వేచ్ఛకై గళమెత్తు మంటూ అందులో శక్తి వాక్కుల్ని గుప్పించమంటూ ప్రేరేపిస్తున్న గీతమిది.

| | |
|---|---|
| కడలిదరి దాకా | 5+4=9 |
| నడచెదము గాక! | 5+3=8 |
| చదలొరుగు దాకా | 5+4=9 |
| కదలెదము గాక! | 5+3=8 |
| ఆకడలి ఆ చదలు | 5+5=10 |
| ఏకమగుదాక | 5+3=8 |
| ........................ | |
| కదలెదము గాక | 5+3=8 |
| నడిచెదము గాక! | 5+3=8 |
| మన ప్రభుత, మన ఘనత | 5+5=10 |
| కొని తెచ్చు వరకు | 5+3=8 |
| మనగాంధి మన తండ్రి | 5+5=10 |
| మును నిలుచు వరకు | 5+3=8 (పాట : 12) |

వెనుకబడిన మనవాళ్లను వెన్నుదట్టి కర్తవ్యోన్ముఖుల్ని చేయడానికి, ఆంగ్లేయుల దాస్యంలో మ్రగ్గుతున్న భవ్యభారతి చెరవిడిపించడానికి అంతా ఒక్కటిగా, ఐక్యంగా కలిసి కదల్రండని చెప్పేగీతమిది. 'కడలి దరిదాక - చదలు (ఆకాశం) ఒరుగుదాక' అంటే సముద్రం చివర్లో నింగి-నేల కలిసినట్లు కనిపించే కడవరకు సాగుదామని అర్థం పరప్రభుత్వపు చీకట్లు బెదరగా దాస్యశృంఖలాలు చెదరగా గాంధీగారి అడుగుజాడల్లో కదలి మన ప్రభుత్వాన్ని మన మేర్పరచుకోవడ మనే ఏకైక లక్ష్యంతో సాగిపోవాలన్నది యీ గీత సారాంశం. 8,9 మాత్రల పంక్తుల్ని సాగదీసి పాడితే యీ గీతం ఖండగతిలో నడుస్తుంది. ఉదాత్త ఆశయాన్ని చాటే యీ గీతంలోని పల్లవినే 'మంగళ కాహళి' ప్రథమ పుటలో ముద్రించడం విశేషం.

పది మాత్రల పంక్తులతో సాగే యీ గీతంలో పల్లవిలోని ప్రథమ పాదంలో 9 మాత్రలే వున్నా 10 మాత్రల వరకు పాడడంలో సాగదీయబడి సమమవుతుంది. 'కదలెదము గాక, నడిచెదము గాక, కొని తెచ్చువరకు - మును నిలుచు వరకు' మొదలగు పంక్తుల్లో 5+3=8 మాత్రలే వుండి మెరుపుల్లాంటి విరుపుల్ని కలుగజేస్తున్నాయి.

హే భారత జననీ!
స్వేచ్ఛా గగన వీథీ విహారిణీ!
స్వతంత్ర కిరణ స్వర్ణారుణ
కంకణ కటక కలాపినీ!
.......................................
ఇది స్వతంత్ర భరతశాంత

సమర విజయ సమయోదయ
మిదె జగతీ కల్యాణో
త్సవ తాండవె కలకలమో!

స్వాతంత్ర్యం సిద్ధించాక, స్వతంత్ర భారతాన్ని హర్షాతి రేకంతో వర్ణించిన గీతమిది. మొదటి గీతమైన "జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి" స్వాతంత్ర్యం రాక ముందు 1933లో రచించబడినట్లు ప్రస్తావించ బడింది.

స్వేచ్ఛాభారతి స్వతంత్ర కిరణాలనే స్వర్ణారుణ కంకణాలుగా ధరించినట్లుగా అభివర్ణించబడింది. అహింసతో, శాంతి సమరంతో విజయం సాధించిన సమయమిదే! జగమంతా కల్యాణోత్సవంతో తాండవ మాడే కలకలమిదే! అని చెప్పడంలోనే స్వతంత్ర భారతిని గూర్చి అల్లిన గీతంగా రూఢి అవుతోంది. 'తాండవం' అనేది ఉద్రేకంతో చేయునాట్య విశేషం. కావున స్వాతంత్ర్య ఆనందోద్రేకాన్ని తాండవ కలకలంగా వర్ణించడం ఔచిత్యంగా వుంది. ఆ ఆనంద తాండవమే మరో గీత సృష్టిని కలిగించిందిలా.

ఎత్తండీ! ఎత్తరేం? స్వాతంత్ర్యపు జెండా!
ఎత్తవోయ్! ఎత్తు, ఎత్తు ఆకాశం నిండా!
కేలూపుచు తలవూపుచు గాలి దారులంట
మనజెండా మనదే వీరుల నెత్తురు పంట!
కొత్తవేడి, కొత్త వాడి భరతావని నిండ
ఎత్తవేం? ఎత్తు, ఎత్తు ఆకాశం నిండా! ॥ ఎత్తండీ ॥

స్వాతంత్ర్యం సిద్ధించాక కలిగిన ఆనందోత్సాహంతో మన మువ్వన్నెల జెండాను ఆకాశం నిండా అగుపడేలా పైపైకి ఎత్తండీ! అని గళమెత్తి అల్లిన గీతమిది. కొత్త వేడి - వాడి, కొత్త జగం - యుగం, కొత్త కాంతి - శాంతిలో సరికొత్త సమభావంతో కుటిలమైన కులం-మతం మూఢత్వాల్ని వీడి ముందుకు సాగాలన్నది ఇందలి అభిమతం. ఎందరెందరో ఆత్మత్యాగం చేయగా సిద్ధించిన స్వాతంత్ర్య పతాకాన్ని వీరుల నెత్తురు పంటగా అభివర్ణించడం ఔచిత్యంగా వుంది. అంతేగాక పాతకు తిలోదకాలిచ్చి కొత్తకు స్వాగతం పలకాలన్నది శాస్త్రిగారి ముఖ్యోద్దేశం. అందుకే 'కొత్త' శబ్దం కొట్టొచ్చినట్లుగా అన్నిసార్లు వాడారు.

నారాయణ నారాయణ! అల్లా అల్లా!
మా పాలిటి తండ్రీ! నీ పిల్లలమేమెల్లా!
..................................................॥ నారాయణ ॥
ద్వేషాలూ, రోషాలూ తెచ్చేదే మతమైతే
కలహాలూ, కక్షలు కలిగించేదే గతమైతే
మతం వద్దు, గతం వద్దు, మారణహోమం వద్దు
..................................................॥ నారాయణ ॥
హిందువులం ముస్లిములం

అందరమూ మానవులం
అందరమూ సోదరులం ॥ నారాయణ ॥ (పాట : 18)

మన దేశమంతటికీ వర్తించే జాతీయ గీతం లాంటిది యీ గీతం. మతం తొలినాళ్లలో శివ-కేశవ పరంగా ఆ తర్వాత హిందూ - ముస్లిం పరంగా తరతరాల పరంపరగా ఎదిగి ఎన్నెన్నో మారణ హోమాల్ని సృష్టించిన సాక్ష్యాలు ఇప్పటికీ చరిత్ర పుటల్లో గుప్పుమంటున్న వైనం అందరికీ తెలిసినదే! దేశ విభజన (ఇండియా-పాకిస్తాన్) సమయంలోనూ, రాజకీయ భజన కుపయోగపడే రాక్షస కుయుక్తుల్లోనూ ఎన్నోసార్లు హిందూ-ముస్లింల మధ్య మతం మారణహోమాల్ని సృష్టించింది. దారుణ కృత్యాల్ని ప్రోత్సహించింది. నాయకులు మారాలన్నా, ఎన్నికల్లో తమ వాళ్లు గెలువాలన్నా చీటికి-మాటికి మతం ఒక ఆయుధంగా మారింది. చివరకు 'అయోధ్య' వివాదంతో ఆ మధ్య దేశమంతా 'కర్ఫ్యూ'లో మూల్గింది. ఇన్ని అనర్థాలకు మూలమైన మతం మనకొద్దంటూ ఏనాడో ఎలుగెత్తారు, కృష్ణశాస్త్రిగారు. హిందువుల ఆరాధ్యదైవమైన 'నారాయణు'ణ్ణి ముస్లింల దైవమైన 'అల్లా'ను ఒకే పంక్తిలో ఏకనామంగా, అర్ధనారీశ్వర తరహాలో రూపొందించి అల్లడం కృష్ణశాస్త్రికే చెల్లింది. ద్వేషాలూ, రోషాలూ, కలహాలూ, కక్షలూ కలిగించేదే మతం - గతం అయితే ఆ మతం - గతం, మారణహోమం మనకేమీ వద్దంటూ అద్భుతంగా ప్రబోధించారు. అందరం మానవులం, కేవలం సోదరులం మాత్రమే అని మతాన్ని నిరసించారు. మానవత్వాన్ని ఆరాధించారు. నిరాకార, నిర్గుణుడే తమ దైవమని చాటే బ్రహ్మసమాజ భావాలున్న కృష్ణశాస్త్రి గారీ గీతాన్ని ఏనాడో రచించినా అది యీనాటికీ నిత్యనూతనంగా రేడియో, దూరదర్శన్‌లలో మోగుతూనే వుంది.

కమ్మగా బతికితే గాంధీయుగం - మనిషి
కడుపు నిండా తింటె గాంధీ జగం!
॥ కమ్మగా ॥

పరమార్థమొక్కటే గాంధీ మతం
భయము విడనాడుటే గాంధీ మతం
........................................... ॥ కమ్మగా ॥
తన కంఠమున దాచి హాలాహలం
తలనుంచి కురిపించి గంగా జలం
మనిషి శివుడవడమే గాంధీ వరం! - బాపు
ననుసరిస్తే చాలు మనమందరం!... ॥ కమ్మగా ॥ (పాట:21)

మనిషి కడుపునిండా తినగలిగితే, కమ్మగా బతకగలిగితే అదే గాంధీ యుగం, జగం అని శాస్త్రిగారు గాంధీజీ సిద్ధాంతాల్ని గౌరవిస్తూ అల్లిన గీతమిది.

గాంధీ రామరాజ్యాన్ని ఆశించేవారు. కావున భోగలోలత వీడి త్యాగరథమెక్కారు. ఆ గాంధీ పథమే మన పథంగా నొక్కి చెబుతూ, మనిషి చేదు హాలాహలాన్ని మింగి, స్వాదుమానవతా గంగా జలాన్ని కురిపించి శివుడిలా మసలాలని ప్రబోధించే పరమార్థ గీతమిది. ఖండగతిలో 17 మాత్రల పంక్తులతో కొసవిరుపులతో, కమనీయంగా కర్ణపేయంగా అల్లిన యీ గీతం ఇప్పటికీ రేడియోలో వినబడుతూనే వుంటుంది.

**పదవోయిక పదవోయీ!**
**ఇది నిజమే అనవోయీ!**

..........................................

**రాగలదది శాంతి యుగం**
**కాగలదభ్యుదయ జగం**

...................................... ॥పదవో॥

**వికసించే విధానమున**
**మకుట ధారి మానవుడని**

.................................... ॥పదవో॥ (పాట : 24)

ప్రపంచ పథంలో ప్రజారథం కదలిందిక పదవోయ్! పదవోయ్! అని ముదిమి పోయిన పదునైన యువజీవం మనదేనని త్వరలో శాంతి యుగం-అభ్యుదయ జగం రాగలదంటూ, ఆ అభ్యుదయ వికాసానికి మకుటధారి మానవుడేనని ఎలుగెత్తి ఆశాజనకంగా అల్లిన గీతమిది. కృష్ణశాస్త్రిగారు తేట తెలుగులో ఎంతబాగా రాయగలరో తత్సమపద సమాస భూయిష్టంగానూ అంత బాగా రాయగలరనడానికి దీనికి ముందున్న గీతమే చక్కటి ఉదాహరణ.

**మందికృత మహా యుగం!**
**ముందున్నది ముందున్నది**
**ముందున్నది మందే, మరి**
**మందే యువ మహా యుగం!**

..................................................

**ప్రాత రుజ్జ్వలాకాశం**
**భావి మందిరావాసం!**
**స్ఫీత జీవధౌతనాక**
**నేతలం విధాతలం!**
**స్ఫీత చలత్ ధౌతలసత్**
**చేతనులం నూతనులం!** (పాట : 23)

ఇందులోనూ నవతకు - యువతకు పట్టం గట్టే ప్రయత్నమే చేశారు. అడ్డంగా నడిచే "పీతలాంటి తాతల, తండ్రుల భూతకాలం నశించి పోగా ఉజ్జ్వలమైన భావిలో అత్యధిక జీవంతో కదలే స్వర్గానికి నేతలం! విధాతలం! మరియు చేతనులం! నూతనులం! మనమే" అనడంలో అదే అర్థం స్ఫురిస్తుంది.

నూతనత్వానికి ప్రాతిపదికగా సామాన్యంగా వాడబడని 'స్ఫీత జీవధౌత' అనే పద ప్రయోగం చేయడంలోనూ కొత్తకు స్వాగతమెత్తడం కనిపిస్తుంది.

ఒత్తండి జీవన శంఖము!
ఎత్తండి రీవిగ శీర్షము!
ఇటు సేతువు, అటు హిమగిరి
ఈ నడిమిదే మన స్వర్గము! (పాట : 26)

ముందు గీతంలో ఆశించిన భూతల స్వర్గము మరేదో కాదు అటు హిమాలయం ఇటు రామేశ్వరం సేతువు మధ్యగల మన భారతావనియే అని స్పష్టమవుతోంది. స్వాతంత్ర్యానంతరం సిద్ధించిన అఖిల భారతంలో రీవిగా శిరసెత్తి జీవనశంఖం పూరించుకుని ఎలుగెత్తిన గీతమిది.

కోటి భుజములు కోటి చేతులు
గిరుల శిరముల వంచునరరే...
ఝరుల తెరువుల మలచునరరే...
.........................................................
ఎల్లెడల కేదారములలో
ఎల్లెడల ఆరామములలో
జోరు జోరున అహోరాత్రం
పారగా పరవళ్లుగా దు-
ర్వార భారత కర్మధార
జయమని, నిర్భయమని, ఈ
జగతి మంగళ మయమని ॥ ఎత్తండి ॥ (పాట : 26)

భారతావనిలోని కోట్లాది జనులు కొండల్ని పగుల కొడుతూ, నదుల ప్రవాహాల్ని మళ్లిస్తూ, పంట పొలాల్ని సాగు చేస్తూ అహర్నిశలు శ్రమిస్తున్నారని, ఇక జయము తథ్యమని, జగతి మంగళమయమని కీర్తించిన గీతమిది. పరవళ్లు తొక్కేకర్మధారను తెలుపుటకై 'జయమని, నిర్భయమని, ఈ జగతి మంగళమయమని, ఒత్తంఢి జీవన శంఖము, ఎత్తండి రీవిగ శీర్షము' అని పదాల్ని ధారగా గుప్పించారీ పాటలో. ఇదే భావాన్ని పామర జనం పాడుకునేందుకు వీలుగా

కొండరాళ్లు పగుల గొట్టి కోన చదును చేద్దాం!
కోనలంట దారితీసి గోదారులు వేద్దాం! (పాట : 27)

అని శ్రామికుల్ని ఉత్తేజపరిచారు. 'కలపండీ చెయ్ చెయ్' అనే గీతంలో

కోడి కన్న ముందు లేచి కూతెట్టును ఫ్యాక్టరీ
కూడు గుడ్డ వొద్దామరి కునుకుతుంటె సోమరీ?
పాడుకుంటు పనిచేస్తే పది మందికి లాహిరీ
ఆడుకుంటు పనిచేస్తే అనిపించదు చాకిరీ! (పాట:27)

సోమరిగా పడుకోక ప్రొద్దున్నే లేచి ఫ్యాక్టరీలకు పరుగెత్తి పనిచేయాలంటూ, ఆడుతూ పాడుతూ పనిచేస్తే అది చాకిరిగా తోచక లాహిరిగా లాలిస్తుందని, అరటి పండు ఒలిచి అరచేత పెట్టినట్లుగా కార్మికుల్ని ప్రోత్సహించిన వైనం యీ గీతంలో అగుపిస్తుంది. ఇందులో ప్రాసనియతి విశేషంగా ఆద్యంతాలలోనూ పాటించారు, కృష్ణశాస్త్రి గారు.

**కొత్త కోవెల కొత్త కోవెల**
**నాల్గు దిక్కుల నడిమ ఈ ఇల ॥ కొత్త ॥**
**మానవా, నవమానవా**
**నీవు నిలిచిన నెలవె కోవెల**
**............................................ ॥ కొత్త ॥**
**ఎదల లోపల ఎదల వెలుపల**
**పదము పదమున పసిడి కోవెల (పాట : 28)**

మనకు నెలవైన - నాల్గు దిక్కుల నడిమి నేలయైన ఈ భారతావనియే ఒక కొత్త కోవెలయని ఎలుగెత్తిన గీతం. దయాశ్రు కణములొలికే ఎదలే - శ్రమతో చెమట రాల్చేస్థలాలే పదము పదమున అగుపించే పసిడి కోవెలలని ఆనందదీపాలు అగుపించే చూపులే, మధుర మందహాసాలే అడుగడుగున అలరారు కోవెలలు అని ఇందులో కొత్త భావాల్ని ఎత్తి చూపారు. రాతి గోడల గుడులు కాదు, అనురాగ పూరిత హృదయాలే - మానవతా నిలయాలే నిజమైన కొత్త కోవెలలని ఈ గీతంలో మెత్తగా విప్పి చెప్పారు.

**శాంతి శాంతి శాంతి**
**శాంతింపుము తల్లీ! మా పాలి కల్పవల్లీ!**
**కాలాంత భయద రూపముగని**
**జగములదరె తల్లడిల్లి ॥ శాంతి ॥**
**దిగంతాల మందహాసమల్లీ నవ**
**లతాంతాల మాలికలల్లి**
**దివ్యమోహన రూపము**
**చూపవేమి తల్లీ!**
**............................**
**నీ కన్నులలో నిండే నెనరేదీ తల్లీ?**
**మాకిక చూపకు మహిషాసుర మర్దన రౌద్రం!**
**.........................................................(పాట : 33)**

సకల లోకాలకు భయం గొలిపే మహిషాసుర మర్దనిగా అవతరించిన నాటి కాళికా రౌద్రాన్ని విడనాడి, దిగంతాలు నిండగా మందహాస మల్లికా

మాలల్ని పేర్చేదివ్య మోహన రూపంతో కన్నులలో కరుణామృతాలు వర్షించే చూపులతో మముచల్లగా చూడు తల్లీ! శాంతించుము తల్లీ! అని జగన్మాతను వర్ణించిన గీతమిది. మంగళ ప్రదమైన 37 గీతాలతో కూర్చిన 'విజయ భారతి' నిజంగానే భారత భారతికి పట్టిన జయహారతిగా అగుపిస్తుంది. 'విజయ భారతి' భరతమాత, భారతీయతపై అల్లిన గీతమాలిక కాగా మహాంధ్ర జననికి హారతు లెత్తుతూ, తెలుగు నేల తీరు తెన్నుల్నీ తెలుగు ప్రజల బ్రతుకు బాటల్నీ కళ్లకు కట్టేట్లు వర్ణించేది 'ఆంధ్ర గేహళి' శీర్షిక. ఇందులో పల్లీయుల, పడవవాళ్ల, శ్రామికులకు సంబంధించిన గీతాలనేకమున్నాయి. మొట్ట మొదట తెలుగు తల్లిని కీర్తించే గీతం.

జయ జయ మహాంధ్ర జనయిత్రీ!
జయ జయ మహాంధ్ర జనయిత్రీ!
జయ జయ ప్రియతమ భారత ధాత్రీ!
పుత్రీ! శుభ ధాత్రీ!
శ్యామల నవ సస్యాంబరా!
కోమల సుమవల్లీచికురా! ॥ జయ ॥
కదళీ రసాల లాంగలీ చల...
చ్ఛద మృదుతానిల చామరా!
సుందరాతి సుందర వసుంధరా!
.................................................... ॥ జయ ॥
ఎల్లర కోర్కెలు నిండుననీ
ఎల్లర మొక సంసారమనీ
అటు తెలంగాణ, ఇటు కళింగాన
అటునట కోస్తా రాయలసీమల
ప్రత్యాంధ్ర మందిర గేహళి, స
ర్వదా మ్రోగు నీ మంగళ కాహళి!
.............................................. ॥ జయ ॥ (పాట:38)

"విజయ భారతి" లో భారత భారతిని గూర్చి 'జయ జయ ప్రియ భారత జనయిత్రీ! దివ్య ధాత్రి' మార్గంలోనే "జయ జయ మహాంధ్ర జనయిత్రీ! ప్రియతమ భారత ధాత్రీ పుత్రీ! శుభ ధాత్రీ!" అంటూ విశాలాంధ్రా వనిని స్తుతించారు. భారతావనిలో ఆంధ్రావని ఒక అంతర్భాగం కాబట్టి భారత ధాత్రీ పుత్రీ! అనడం, సకల శుభాలను కలిగించేది కాబట్టి శుభధాత్రీ! అనడం అత్యంత ఔచితీమంతంగా వుంది. వీనుల విందుగా అనుప్రాసమూ తోడయింది. పంటల ఆకుపచ్చదనాన్ని చీరగా (శ్యామల నవసస్యాంబరా!) పుష్పిత లతల్ని

శిరోజాలుగా (సుమవల్లీ చికురా!) మొదటి గీతంలో మాదిరిగానే 'సస్యామల.... చేలాంచల', వసంత కుసుమలతా చూర్ణకుంతల' పద ప్రయోగంతో ఒకే భావంతో వర్ణించారు. కాని మన ఆంధ్రలో విరివిగా పండే అరటి ఆకుల్ని తెలుగు తల్లికి వింజామరలు చేస్తూ సుందర వసుంధరగా భావించడం మనోహరంగా వుంది. ఇటు తెలంగాణ, అటు కళింగాన అన్నట్లుగానే తెలంగాణాలోని మంజీర, కళింగ ప్రాంతమందలి వంశధార మరియు శబరి, పెన్న మొదలగు చిన్న నదులు కీర్తిస్తుంటే; చిద్విలాసంగా కృష్ణా, గోదావరీ మహానదులు తలలూపి హర్షిస్తుంటే, తెలుగు తల్లి దిగ్విజయంగా వెలుగొందుతున్నట్లు సమతా విశాల మానవతా సాధనమే మన మనోరథం అయినట్లు 'ఆంధ్రగేహళి' కి మంగళ కాహళి పలికిన మధుర గీతమిది.

జయ మహాంధ్ర జననీ! జయ మహాంధ్ర జననీ!....

.................................................................................

పాడేనా తెనుగు వీణె పాడాలి!
పండేనా తెనుగు చేనె పండాలి!

................................................ ॥ జయ ॥ (పాట:40)

ఈ గీతంలోనూ పై గీతం మాదిరిగానే ఆంధ్ర మాతను స్తుతించినా, పాడితే తెనుగువీణే పాడాలి! పండితే తెనుగు చేనే పండాలి! అనడంలో ఆంధ్రాభిమానం అనంతంగా అగుపిస్తుంది.

గోదారీ జోతలో ! పాదాల జోతలో!
మా తల్లీ గోదారీ ! మా లచ్చి జోతలో!
పడమటింటి కోనబుట్టి

..................................................

పాపికొండ లోయగొట్టి
బద్రాద్రి దాపులో
పట్టీసం సుట్ట బెట్టి
కోనసీమతోపులో
పాయపాయలైనావా!
పాడిపంటలిచ్చావా!
పైడిపంటలిచ్చావా! ॥ గోదారీ ॥

మహారాష్ట్రలోని పశ్చిమ కనుమల్లో పుట్టినా, తెలుగు నేలలో విస్తారంగా ప్రవహించి, తెలుగువారి జీవితాలలో ఒక భాగంగా నిలిచిపోయిన గోదావరిని తల్లిగా పల్లీయులు ప్రార్థించినట్లు అల్లినదీ గీతం. భద్రాద్రిని దాటి, పాపికొండల గుండెల్ని మీటి ప్రవహించే గోదావరి పట్టిసీమ ప్రాంతంలో చుట్టూ కలియబారి వెళ్తుంది. అందుకే 'పట్టీసం సుట్ట బెట్టి' అని వర్ణించారు. కోనసీమ చేరేసరికి గౌతమి, వశిష్ఠాది పాయలుగా చీలిపోతుంది. అనేక పసిడి పంటల్ని పండిస్తుంది. కావున యీ గీతం పసందైన పల్లెపదంగా తోస్తుంది.

ఓ విశాలాంధ్ర జనులారా కనరా!
ఓ సారి నా మాట చెవులార వినరా!
మన జాతి మన నీతి మట్టి పాలాయె!
మన చేత మన వ్రాత నగుబాటు లాయె!
ఇన్నాళ్ల స్వార్థాలు ఇంక మానండి!
ఎన్నెన్నో భేదాలు ఇక మరచిపొండి!
...........................................(పాట : 39)

'విశాలాంధ్ర' అవతరణ సమయంలోనే గాక 1969, 70లలో తలయెత్తిన 'జై తెలంగాణ', 'జై ఆంధ్ర' వేర్పాటు ఉద్యమాలెన్నెన్నో ఆంధ్రుల ఐక్యతకు వెన్నుపోటుగా తలచి, రాజకీయ కుతంత్రంగా భావించి ప్రబోధంగా ఎలుగెత్తిన గీతమిది.

పదవి పట్టాలకై పడి ఏడ్వకండి!
..................................................
గుండెలన్నీ ఒకే దండగా గుచ్చండి!
..................................................
ఎల్ల ఎల్లలు కరుగ ఎల్లకలలు సురుగ
చల్లన్ని మన ఆంధ్ర స్వర్గమే కట్టండి! (పాట : 39)

అనే పంక్తులలో ఆవేదన, సమైక్య భావన స్పష్టంగా అగుపిస్తుంది.

ఆంధ్ర దేశమున అయ్యలందరూ దానకర్ణులండీ.....
ఆంధ్ర దేశమున అమ్మలందరూ అన్నపూర్ణలండీ...
..........................................................................................
పాడి పంటలా పైడి రాసులానాడు కోనసీమ
కొబ్బరి తోటల దారులూ....సై
ఎక తోపులా బారులూ....సై
..........................................
తెలుగు భాష దివ్యవాణిరా...సై
తెలుగు వాడె అభిమానిరా....సై (పాట : 43)

ఆంధ్రాభిమానాన్ని అనాదిగా ఆంధ్రుల ప్రత్యేకతగా నిలిచిపోయిన 'బుర్రకథ' ధోరణిలో అల్లడం ఔచిత్యంగా వుంది.

ఎయ్‌రా! ఏసెయ్‌ర గడ
తొయ్‌రా! తోసెయ్ పడవ
................................................
ఇది పొలస, ఇది గిలస - ఈడ వల ఎయ్యరా!...
బలె - వాలుకళ్ల దానికైతె వాలువ లిచ్చెయ్యరా!...
జారూ జడదానికైతె సందువ లిచ్చెయ్యరా!...

..........................................................
జోరుసెయ్ బారుసెయ్
కోరంగి రేవుకీ, కోటిపల్లి రేవుకీ.... (పాట : 44)

అనే పాటలో తూర్పు గోదావరి పల్లీయుల పడవవాళ్ల భాషనేగాక, వారి ధ్యాసను, యాసను కూడ చక్కగా వాడుకున్నారు. పాలస-గిలస, వాలువ-సందువ మొదలగునవన్నీ చేపలపేర్లు. చేపల పేర్లతో అల్లిన యీ గీతం జానపద గీతంగా రాణిస్తోంది.

జెల్ల కొంకు మట్టి గిడుసు
సేదు పరిగె, రొయ్యపీసు
ఇసిక దొందు, బొమ్మిడాయి
ఎయ్‌రా! వలఏసెయ్! ఎఱ్ఱిపీనుగా!
సీకటయేలోగా ఎదవనారిగా!....
లిల్లే! లేలిల్లే! (పాట : 45)

పై పాటలాగే ఈ పాటలోనూ చేపలపేర్లు చేర్చడం కనిపిస్తుంది. సోమరిగా వున్న నారిగాన్ని ఉద్దేశిస్తూ చీకటి పడకముందే తొందర తొందరగా వలవేసి పట్టుకోవాలంటున్న వైనం కనిపిస్తుంది.

| | |
|---|---|
| ఐలెస్సా! ఓలెస్సా! (ఓ) | 6+6+(2)=12+(2) |
| ఐలెస్సా! ఓలెస్సా | 6+6=12 |
| ఆకాశం ఒరిగింది | 6+5=11 |
| ఆ కడలి పొంగింది | 5+5=10 |
| చిరుగాలి వీచింది! | 5+5=10 |
| తెరసాప ఊగింది | 5+5=10 ॥ ఐలెస్సా ॥ (పాట:46) |

పడవ గడవేస్తూ పాడుకునే యీ పాటలో ఆకాశం ఒరిగి కడలి ఉప్పొంగినా, గాలికి తెరచాప వూగినా వెరువక ముందుకే పదమన్న ధోరణి కనిపిస్తుంది. గాలి సహాయంతో, తెరచాప ఆసరాతో పడవ సాగిపోతుంది కాబట్టి గాలిని తండ్రిగా నిత్యమూ మసలే ఏరును తల్లిగా, మబ్బును అన్నగా - కెరటాన్ని చెల్లిగా భావించడం ఖండగతిలో సవ్యంగా వుంది, అక్కడక్కడ హెచ్చుతగ్గులున్నా.

ఐలెస్సా అంటూ నావ
అలల మీద వదలాలి!
ఓలెస్సా అంటూ నావ
గాలి దారి కదలాలి!
గుండెల్లోనిండాలి కులాసా!
ఉండాలీ మనసులో దిలాసా!........ (పాట : 47)

పడవ నడిపే ప్రతి వాడికీ గుండెల్లో సంతోషం, మనసులో ధైర్యం వుండాలని ఒకవేళ గాలి చెలరేగినా, ఉప్పెనలా కడలి ఉప్పొంగినా గాలి జూలు పట్టేది-కడలిని కాలితో తొక్కిపట్టేది, కంటి కగుపడని ఆ సరంగు

(నావికుడు) ఒక్కడే! కావున వాడిని నమ్ముకొని నావను అలల మీద వదిలేయాలంటూ అలానమ్ముకుంటూ వెళ్తే, చీకట్లో వెన్నెల్ని నీళ్లల్లో దారుల్నీ నిలిపే వాడే అవతలి తీరం చేరుస్తాడని వేదాంత ధోరణి వెల్లడించిన గీతమిది.

వినవమ్మా చెల్లెలా!
గుణభద్రా! తుంగభద్ర!
వినవా నా చెల్లెలా?
గంగా యమునల తోడు
గౌతమికే సై దోడు!
............................ ॥ విన ॥
పొంగవు, ఉప్పొంగవు కడు
పుణ్యశీల! దయాలోల!
రంగదాంధ్ర కర్ణాట ధ-
రాంగన ముత్యాల మాల! ॥ విన ॥ (పాట:48)

'గుణభద్రా! తుంగభద్ర!' అన్న పంక్తిని చూడగానే 'పాండురంగ మాహాత్మ్యం' లోని తెనాలి రామకృష్ణుని 'గంగా సంగమ మిచ్చగించునె...' అనే పద్యం స్ఫురణకు వస్తుంది, ఏ సాహితీ పరునికైనా. ఆ ప్రేరణతోనే అల్లిన పాటలా తోస్తుందిది. ప్రవహించి వెళ్లిపోతుంటే ఆ నీరంతా కడలి పాలే కాబట్టి కాస్త నిలిచి, పంటల్ని పండించుమంటూ నదీ ధర్మాన్ని బోధించారు. "ఉప్పొంగి ఉపద్రవాల్ని కలిగించే దానవుకాదు కాబట్టి పుణ్యశీలవు! దయాలోలవు! కర్ణాటక ప్రాంతాన్ని సస్యశ్యామలం చేసే ముత్యాల మాలవు!" అని గోదావరికి సాటి వచ్చే తుంగభద్రను కమనీయంగా స్తుతించిన గీతమిది.

నాగార్జున కొండ కాడ
ఆగిందిర కృష్ణయేణి

.........................................
కొండకాడికే ఎడదామా, మన
కండరాలు కరిగిద్దామా!
కొండరాలతో వడ్డాణం మన
కృష్ణయేణికి కడదామా! ॥ ఎయ్యరా ॥
ఆవలీవలికి కాలువలు తవ్వాలి
అందాల కృష్ణమ్మ చేతులల్లె

.........................................
పంట కాలువలు బీళ్లకు
ప్రాణాలు వరిమళ్లకు!
పాయసమే మన తిళ్లకు
బంగారం మన ఇళ్లకు ॥ ఎయ్యరా ॥ (పాట : 49)

నాగార్జున సాగర సౌధ నిర్మాణ సమయంలో 'డ్యాము' త్వర త్వరగా కట్టడానికి నాగార్జున కొండకు వెళ్దామంటూ కార్మికుల్ని వేగిరపరిచేగీతమిది. కండల్ని కరగించి 'డ్యాము' కడితే అది 'కృష్ణవేణి'కి వడ్డాణంలా అగుపిస్తుందని, కాలువలు ఇరువైపులా తవ్వితే కృష్ణమ్మ చేతుల్లా మారుతాయని, ఆ కాలువలే బీళ్లకు - వరిమళ్లకు ప్రాణాలై మన తిళ్లకు పాయసాలై, ఇళ్లకు పంటసిరులై పోతాయని కృష్ణవేణిని కీర్తించిన రచనా విధానం రమణీయంగా సాగింది

సెంబైలే జోరులంగర్
సెంబైలే జోరులంగర్
జోరులంగర్! రోడ్ రోలర్!
సాంబయ్యా! ఓ సన్నాసీ!
సవటల్లారా! లాగండేస్ !
.......................................... ॥ సెల ॥
కడవల తోటీ నీళ్లోసీ
కంకర గింకర తడిపేద్దాం!
కడవలతోటీ సెమటోసీ
వంకరటింకర సరిచేద్దాం!
..................................................
పగలంతా సూరీడు మేస్త్రీ!
..................................................
ఎయ్‌రా! సిన్నోడెయ్‌రా!
ఎయ్‌రా! నీ జోరు గాలా
ఎయ్‌రా! నీ బారుకూలా! (పాట : 50)

రోడ్లు వేసే కార్మికుల కోసం వారిని ఉత్తేజ పరిచేందుకు వారి పలుకు బళ్లతోనే అల్లిన గీతం యిది. కడవల తోటి నీళ్లు పోసి కంకర-గింకర సరిచేయడం సహజంగా కార్మికులు చేసే పని. కాని కడవలతోటి సెమటోసి వంకర-టింకర సరిచేద్దామనడమంటే అధికంగా శ్రమిద్దామని భావం. ఆ భావాన్నే అందంగా చెప్పారలా. మేస్త్రీ అనేవాడున్నా, పగలంతా సూరీడు మేస్త్రీ - రేతిరి సెందర వంక జోస్తే అనడంలో విశేషార్థముంది. పొద్దు పొడుపుతో పనిలో చేరి గ్రుంకే వరకు పనిచేస్తే కాస్త ఎక్కువ డబ్బులొస్తాయని, ఆ డబ్బుల్తో కల్లు - సారాలాంటిది కొని వెన్నెల్లో చంద్రున్ని చూస్తూ మజాగా తాగొచ్చుననే మనస్తత్వం చాలా మంది కార్మికుల్లో వుంటుంది. అందుకే శాస్త్రిగారు అలా చరణమల్లారు. సాయంత్రం కార్మికులు యిల్లు చేరేసరికి భార్యాపిల్లలు ఎదురు చూస్తూ వుండడం, దొరికిన నాలుగు డబ్బుల్లో దమ్మిడో గిమ్మిడో తమకూ దక్కుతుందని ఆశపడడం

ఇప్పటికీ సహజమే! 'ఎయ్‌రా! సిన్నోడెయ్‌రా!' అన్న జానపదగీతాన్ని ఆసరాగా చేసుకొని కార్మికుల జీవితాల్ని - మనస్తత్వాల్ని కళ్లకు కట్టినట్లు అల్లిన గీతమిది.

తెల్లారక మునుపే మా
పల్లియ లేస్తుంది!
పల్లెలోన ప్రతి యిల్లు
కళ్లు తెరిచి చూస్తుంది
చల్లతరిచి తరిపి వెన్న
గొల్ల పడుచు తీస్తుంది! (పాట : 54)

తెల్లవారకముందే కోడికూతతో మేల్కొని అనేక పనుల్ని చక చక చేసుకుపోయే పల్లె వాతావరణాన్ని కళ్లకు కట్టినట్లు అల్లిన గీతమిది. గొల్లపడుచులు చల్ల తరిచి వెన్న తీయగా ఘల్లు ఘల్లుమనే అందెల సందడి అవుతుందని జుర్రుమంటు త్రాగమంటు ఆవు తల్లి పాలిస్తుందని, పాలు తాగిన లేగదూడ వాడ వాడ పరుగుదీస్తుందని, మేతకై ఊరి బయటకు వెళ్లిన ఆలమంద మర్రిచెట్టు నీడలో ఆగి చూస్తుందని పల్లెల్లో జరిగే ఉదయ వాతావరణాన్ని హృదయానికి ఆకట్టుకునేలా త్రిశ్రగతిలో అందంగా రాగబంధంగా సాగిన గీతమిది. ఈ గీతం స్ఫూర్తితో ఇటీవల ఓ సినిమాలోనూ "తెల్లావారక ముందే పల్లే లేచింది - తనవారినందరినీ తట్టీ లేపింది" అని 'మల్లెమాల' రాయడం గమనార్హం.

వానదేవుడా! ఓ వానదేవుడా!
............................................
మిన్నంతా నీ తేరు వానదేవుడా!
మేఘాలు గుర్రాలు వానదేవుడా!
మెరుపులైతే జెండాలు వానదేవుడా!
ఉరుములైతే బాజాలు వానదేవుడా!
............................................ (పాట : 55)

పిల్లల కోసం అల్లినట్లు తోస్తుంది యీ గీతం చూడగానే. నడకలో తేలిక పదాల పొందికలో అది స్పష్టమవుతున్నా ఇది రైతన్నల కోసం రాసింది. ఆకాశాన్ని వాన దేవుని రథంగా, మేఘాల్ని గుర్రాలుగా, మెరుపుల్ని జెండాలుగా, ఉరుముల్ని బాజాలుగా భావించడంలో శాస్త్రిగారు తమ ముద్రను నిలుపుకున్నారు. చల్లని నీరిచ్చి కడుపు మంటలు చల్లారేలా తమ చేలల్లో సిరుల పంటలు పండించుమనే రైతుల ఆర్తి ఇందులో ఆగుపిస్తుంది.

'చువ్వీ చువ్వన్నలాలో, చువ్వన్నలాలో', 'గున్నాసారి గున్నమ్మ' పాటల్లో జానపదమే దర్శనమిస్తుంది.

గున్నాసారి గున్నమ్మ! ఓ గున్నాసారి గున్నమ్మా!
కలుపుతీసే కాడనీకు
కంటికి కాటుక ఎందుకే? గున్నాసారి గున్నమ్మా (పాట : 59)

నారుమడిలో దిగి కలుపుతీసే దానికి కంటికి కాటుక దేనికే? అని ఉడుపుల కాడకోరమీసం కోటయ్య గున్నమ్మను ఆటపట్టిస్తుంటే

**కత్తువ బట్టే కాడనీకు**
**కాశీకోకలెందుకురో? కోరమీసం కోటయ్యా (పాట : 59)**

అని సమాధానమిస్తుంది. సవాలుగా కాశీకోకలంటే సిల్కు పంచెలు! మోటుపని చేసేటప్పుడు సిల్కు పంచె అక్కర్లేదు. కలుపు తీసేప్పుడు కాటుకా అక్కర్లేదు. కాని ఒకరి మీద ఒకరు మనసు పడుతున్నారు. కాబట్టి ఒకరినొకరు ఆకర్షించుకోవడానికి ఆ అలంకారాలు చేసుకున్నారు. అది చెప్పకుండా ఒకరి నొకరు గేలి చేసుకోవడం యీ గీతంలో అల్లబడింది

**ఓ ఎలకా! చిట్టెలకా!**
**ఊరికే చూస్తా వెందుకు?**
**ఉలికులికి పడతావెందుకు? (పాట : 62)**

అని సమాధానం చెప్తుంది. భర్త రాక కోసం ఎదురు చూసే పడతి ఎడదను విప్పి చెప్పే ధోరణి జానపదంగా సాగినా, జాలిగా సానుభూతి జాలుగా తోస్తుంది.

**ఎవరాడ పడుచమ్మ - ఎవరాడ పడుచు?**
**ఏరుదాటొచ్చింది ఎవరాడ పడుచు?**
**పెట్టి పోసేవారు పుట్టింటి వారు**
**పుట్టింటికే తాను పురిటి కొచ్చింది!**

**.................................................**

**తన పుట్టినింటిలో తాను దొరసాని!**
**మగనింటిలో ఉంటె మగువ యువరాణి! (పాట : 63)**

పుట్టినింటికి పురిటి కొచ్చిన ఆడపడుచు గూర్చి అల్లిన యీ గీతం నడక, భావం తీరు చూస్తే, జానపదగేయంగా ప్రచారంలో వున్న "మా అన్నలొచ్చారు! మమ్మంపుతారా?" అన్నదానికి అనుకృతిగా - అదేశ్రుతిగా అల్లినట్లు తోస్తుంది. అందులో మెట్టినింట నున్న కోడలు అత్తను, మామను, బావను వరుసగా ఒక్కొక్కరినే పుట్టినింటికి వెళ్తానని అడుగగా, కడకువారు కట్టుకున్న భర్తనే అడుగుమనడం జరుగుతుంది. కడకు భర్త అంగీకారంతో పిల్లను, ముల్లెను సర్దుకొని పుట్టినింటికి సాగిపోతుంది. ఈ గీతంలో పుట్టినింటికి వచ్చిన ఆడపడుచుకు మరదళ్లు, వదినల్లు ఎలా అణగి మణగి సేవచేస్తారో తెలుపబడింది. ఆ పడుచు పుట్టినింట వుంటే దొరసానిగా, మెట్టినింట వుంటే యువరాణిగా చమత్కరించ బడింది. తెలుగింటి గారాల పట్టిగా చక్కగా చూపబడింది.

మొయ్యర అమ్మోర్ని మొయ్!
మెల్లగ - ఆఁ! మెల్లగ
మేనా పల్లకి మొయ్యర

..................................

జారెరా ఒయ్యారి కలలూ

దోర పెదిమల నవ్వులా-

మొయ్యరా! దారాన ముత్యం

మోస్తరు - అమ్మోర్ని మొయ్!

..................................

పెళ్లి కూతురు కళ్లనుంచీ

త్రుళ్లిరాలే సుక్కరా!

మొయ్యరా! అత్తోరి యింటికి

అమ్మోరి పల్లకి మొయ్యరా (పాట : 66)

అత్తవారంటికి వెళ్లే పెళ్లి కూతురును సంబోధిస్తూ, బోయీలు పల్లకిని మోస్తూపాడే పాట యిది. తమ పాటకు పల్లకి పైరగాలికి వూగే పువ్వులా, ఏటి నురగల సాగేపిట్టలా కదలి పోతుందనడం కమనీయ భావన! బోయీలను పల్లకిలో కూర్చున్న పెళ్లికూతుర్ని దారాన గుచ్చిన ముత్యంలా పదిలంగా మొయ్యమనడం మనోహరమైన పదచిత్రణ! దోరపెదవుల నవ్వులా పుట్టింట్లో కన్న కలలన్నీ జారిపోయాయనడంలో ఆర్ద్రత చోటు చేసుకుంది. ఆ ఆర్ద్రతతో కరిగిన పడుచు మంచున తడిసిన చుక్కలాగుందనడం, కన్నవాళ్లను వదలి కదలి పోతున్నందుకు పెళ్లికూతురు కళ్లల్లోంచి కన్నీటి చుక్కలు రాలుతున్నా యనడంలో 'అప్పగింతలు' సందర్భంగా ప్రతి తెలుగింటి ముంగిట్లో ఒదిగిన పదాల పొందికతో పోటీపడినట్లుగా బాణీని కూర్చి అనేకసార్లు ఆకాశవాణిలో ప్రసారం చేయబడగా అందరిమన్నన లందుకున్న గీతమిది. ఇది మిశ్రగతిలో తురంగంలా, కడలి తరంగంలా సాగినట్లు అనిపిస్తుంది.

వెన్నెలా, వెన్నెలా, వెన్నెలో...ఓ

వెన్నెల్ల పూవత్తి వెన్నెలో...ఓ

రెల్లుపూలావత్తి వెన్నెలో...ఓ

మల్లెపూలా వత్తి వెన్నెలో...ఓ

పాలకడలీ మరిగి వెన్నెలో...ఓ

నేలంత నురుగుల్లె వెన్నెలో!...

.......................................... (పాట : 69)

పాలవెన్నెల మీద అల్లిన పాట యిది. తెల్లని వెన్నెల రెల్లుపూలతో, మల్లెపూలతో పోల్చబడింది. పాల కడలి మరిగి పొంగి పోగా, నేలనంతా కప్పేసిన ఆ నురగలా విశ్వవ్యాప్తమైన తెలితెలి వెన్నెల్ని ఉత్ప్రేక్షించడం జరిగింది.

చెప్పు మరదలా చెప్పవే, ఈ

చిక్కు విప్పి నీవే నిజం!

తప్పులేదు, నెలతప్పెనో? నీ

చెరగు తిరగదేమే భుజం! (పాట : 70)

నెలతప్పిన మరదల్ని పరిహాసంగా ఆటపట్టించే వదినపాట యీ గీతం. గర్భవతి కావడం చేత కాస్తలావైన సంగతి చెప్పకపోయినా సరిపడక భుజం తిరగని కొంగు తేటతెల్లం చేస్తోందని, మగపిల్లాన్ని కంటే ఒప్పుకోనంటూ తన కొడుక్కు చేసుకోవడానికి తప్పకుండా ఆడపిల్లనే కనాలని అందుకై ఎప్పుడెప్పుడాయని ఎదురు చూస్తున్నానని మరదల్ని మరీ మరీ సాధిస్తున్నది వదిన. ఇలాంటి సందర్భాలెన్నో మన తెలుగు యిళ్లల్లో అగుపించడం చాలా సహజం. అందువల్లనే ఈ కోవలో జానపద గేయాలెన్నో వచ్చాయి ముందే.

నీరు చల్లిన ముంగిట్లో - ప
న్నీరు చల్లిన వాకిట్లో
దారి పొడుగునా ముగ్గుల్లు! ము
త్యాలు పోసినా ముగ్గుల్లు!

..........................................

నారుపోసిన ముంగిట్లో - గ
న్నేరు పూచిన వాకిట్లో
జారు జడలా కన్నెల్లూ - ఒ
య్యారి నడలా కన్నెల్లూ - ఒ
య్యారి నడలా జారు జడలా
కన్నెలుంచినా గొబ్బిళ్లూ! (పాట : 74)

సంక్రాంతి సందర్భాల్లో కన్నెపిల్లలు సావకాశంగా ముంగిల్లు తీర్చిదిద్ది ముగ్గులు వేయడం, అందులో అందంగా గొబ్బిళ్లు పెట్టడం మన ఆచారం. అదే విషయాన్ని రాగ యుక్తంగా రసమయంగా చెప్పారు. "నీరు చల్లిన ముంగిట్లో - పన్నీరు చల్లిన వాకిట్లో, నారు పోసిన ముంగిట్లో - గన్నేరు పూచిన వాకిట్లో, జారు జడలా కన్నెల్లూ - ఒయ్యారి నడలా కన్నెల్లూ, మొదలగు పంక్తుల్లో నీరు-పన్నీరు, నారు - గన్నేరు పద ప్రయోగంలో రెండు మాత్రల్ని అదనంగా కలిగి రెండో పంక్తి తూగి పడడం కనిపిస్తుంది. ఆ తూగులో పాటలో ఒక కొత్త నడక ఏర్పడి నొక్కి పలుకడానికి ఆస్కారమవుతుంది. పాడుకోవడానికి ఒక విధమైన వూపు కలిగించే యీ పద్ధతిలో దేవులపల్లిగారే ఎక్కువ రచన చేశారు.

ఏ పుట్లో దాగేవు? ఎంత పిలిచినా రావు!
నాగన్నా! ఓ నాగన్నా!
ఈ బుట్ట నీకోసం అల్లేనన్నా!
ఈ తేనె ఈ పాలు నీకేనన్నా!

..........................................

వెండి తీగలాగ................రావన్నా ఓ నాగన్నా (పాట:75)

నాగుల చవితికి పాముకు పాలుపోసే ఆచారం యిప్పటికీ తెలుగునాట అగుపిస్తూ వుంటుంది. దాన్ని ఆధారంగా చేసుకొని అల్లినగీతమిది. బసవరాజు కూడ "నీ పుట్టదరికి నా పాపలొచ్చేరు...కోపించి బుస్సలు కొట్టబోకోయి, నాగుల

చవితికి నాగేంద్ర! నీకు పొట్టనిండా పాలు పోసేము తండ్రీ!'' అని నాగన్న మీద ఒక గీతం రాశారు.

నవ్వంటే జాబిల్లి - పువ్వంటే మల్లి!
నవ్వేటి పువ్వంటే నా చిట్టితల్లి!
దొంగా కళ్లల్లో తొగల రేకుల్లో
తుమ్మెదలు మెదలు మళ్లీ మళ్లీ (పాట:77)

నవ్వు జాబిల్లిలా - మల్లెలా తెల్లగా వుంటుందని, ఆ నవ్వే పువ్వంటే నా చిట్టి తల్లి అని చెప్పడంలో ఒక కొత్తదనం కనిపిస్తుంది. పాపలు నిద్రపోతున్నట్లు కళ్లు మూస్తూనే మళ్లీ చటుక్కున తెరచి చూస్తారు. కలువ రేకుల్లాంటి ఆ కళ్లల్లో తుమ్మెదలు మెదలు అనడంలో గొప్ప భావం యిమిడ్చారు. నల్లని కనుపాపల్ని తుమ్మెదలుగా పోల్చడం కవి చేసిన చమత్కారం. తుమ్మెదలు మెదలు అనడంలో యమకానుప్రాసం లాస్యం చేస్తోంది. తన పాపను జోకొడుతూ ఒక తెలుగు ఇల్లాలు పాడుకునే పాటయిది.

వాళ్లమ్మ ఆలాగు వెళ్లొచ్చేసరికి
కళ్ల చెక్కిళ్లా కాటుకలు పాకె!
మళ్లీ మళ్లీ మళ్లీ నాచిట్టితల్లీ! (పాట : 77)

కళ్లకు దిష్టి తగలకుండ పాపల చెక్కిళ్లకు నల్లని కాటుక పెట్టడం సహజం. కాని కాకమ్మ కథ చెప్పి జోకొట్టి తల్లి బయటకు వెళ్లగానే పాప ఏడ్వడంతో ఆ కాటుక కళ్లలోంచి చెక్కిళ్ల మీదుగా కారి మొహమంతా పాకి పోయిందనే ఆ తల్లి ఆవేదన పై పంక్తుల్లో కనిపిస్తోంది.

నిదురపోవే తల్లి
నిదురపో నవ మల్లి!
నిదురపో జాబిల్లి
నిదుర పోవమ్మా! (పాట : 78)

జాబిల్లి పాపాయిని నిద్ర పుచ్చుతూ పాడుతున్న పాటయిది.

కోటికన్నుల మూసి
కునికె నాకాశమ్ము!
ఆటపాటల లోన
అలసె లోకమ్ము! (పాట : 78)

మిణుకు మిణుకు మనే నక్షత్రాల్ని కునికిపాట్లు పడుతున్న నింగి యొక్క కోటి కన్నులుగా భావించడం గొప్ప ఆలోచన!

తెలుగు తల్లకి మంగళమ్ ! మా
కల్పవల్లికి మంగళమ్!

..................................

వేద వేదములన్ని తరచీ
వాద భేదములన్ని మరచీ
స్వాదు ధర్మ పథమ్ము పరచు
విశాల శీలకు మంగళమ్! (పాట 83)

చివరగా తెలుగు తల్లికి మంగళం పాడడంతో 'ఆంధ్ర గేహళి' ముగుస్తుంది. వేద వేదాలను తరచి, వాద భేదములను మరచి స్వాదు ధర్మాన్ని చాటే విశాలశీలకు మంగళమ్! అని తెలిపే యీ పాట 3+4 మిశ్రగతిలో సాగింది మంగళ కాహళి 'మంగళమ్' పాటతో ముగియడం చాలా ఔచిత్యంగా వుంది

'ఆంధ్రగేహళి' తెలుగు సంస్కృతికి, ఆచార వ్యవహారాలకే గాక గ్రామీణ వాతావరణానికి నిలువుటద్దంగా నిలుస్తుంది

కృష్ణశాస్త్రి గీతాలు చాలా వరకు సమమాత్రల్లో సాగకుండా హెచ్చుతగ్గుల్లో కొత్త విరుపులతో, కవిత్వపు మెరుపులతో నడిచినట్లు కనిపిస్తాయి పల్లవి, చరణాలు వేర్వేరు గతుల్లో సాగిన సందర్భాలూ వున్నాయి. పద్యాల ధోరణిలో పదంలోని మొదటి అక్షరం పై పంక్తిలో వుంటే మిగతా అక్షరాలు క్రింది పంక్తిలో దర్శనమిస్తాయి. ఉదాహరణకు 'అమృతవీణ'లో

రాగయై ఈ బ్రతుకు చెడి - రా
యైన వేళల రామచరణం (పాట : 115)
శ్రీకంఠుడు మా తండ్రీ! స
తీ కళత్రుడేడీ...? (పాట : 117)
కనుమూయదు రేయి! ఉస్సు
రనుచు గాలి నిట్టూరుచు (పాట : 170)

మొదలగునవెన్నో వున్నాయి. 'మంగళ కాహళి' లో కూడా

జయ జయ సస్యామల సు
శ్యామ చల చ్చేలాంచల! (పాట : 1)
పటు శిరాన మకుటము
న్నటుల నిలంబడి అనవేరా (పాట : 11)
గౌతమీ సహ్య జాతటుల క
ళింగ సాగర తీరములను. అ
రేబియాంబుధి కూలములను (పాట : 26)
ఏటి కెరటం అంచుపై దూ
కేటి సెందర వంకరా! (పాట : 66)

మొదలగునవి చోటు చేసుకున్నాయి అలాగే ఆయన విశిష్ట పద ప్రయోగాలూ వున్నాయి.

### కృష్ణశాస్త్రి విశిష్ట పద ప్రయోగాలు:అమృతవీణ (గేయ సంహిత-1)

1. 'కృష్ణరజని' శీర్షికలో : విరిచేడె, ఖుదా, దర్బారు, జరూరు, అన్య దేశ్యములు. వెలుగు నీడల పడుగు పేకలు, బ్రతుకు కోకలు, నాగులు మొగిలు మొదలగు అచ్చ తెనుగు పదాలు.

2. 'కన్నీరు' శీర్షికలో : కలుష తిమిరము, కన్నీటి కాల్వలు, దీన సంఘ పరిత్రాతా, జ్ఞాన ప్రభాకరా! మోహతమోహరా

3. 'మహతి' శీర్షికలో : విరితావి, వెల్గుటేరు, దేవళము, చదలు (ఆకాశము) తారాదీపము, పులుగు ఇత్యాదులు.

4. 'మధు మురళి' శీర్షికలో : అధర సీధువు, మునిమాపు, వీధి వాకిలి, కాలు చల్లదనాలు కనలు తీయదనాలు, తీయతేనియ బరువు, కమ్మతెమ్మెర.

5. 'గుడిగంటలు' శీర్షికలో : శ్రీచరణ, చూపుల తీగలు, విన్ను పానుపు, పద ధూళి, మువ్వాక, మినువాక (సురగంగ) నేలరేక (నెలవంక).

6. 'ఋతుఖేల' శీర్షికలో : గగన నిటలాన, విహగాళి, రజనీ దీపం, సీతు కారు, గడ్డిసెజ్జ, మొయిలు తేరు. 'దివాణం, హవేలీ, కుళ్లాయి, తురాయి, హుమాయి, సవారి, గవాయి ఇత్యాదులన్యదేశ్యములు.

7. 'విరి తూపు' శీర్షికలో : 'నాగులు, మ్రోల, మొగసాల, గుసగుస ఉసురుసురు, మేఘమాసం, దవు దవ్వు, సమీరస్యందనా మొదలగునవి.

### 'మంగళ కాహళి' లో విశిష్ట పద ప్రయోగాలు :

'విజయ భారతి' శీర్షికలో : హురంగు, వలిగాలి, జీవధార, జరఠ, కుళీరం, తొగరు, అంసము.

'ఆంధ్రగేహళి' శీర్షికలో : తోపులు, సరంగు, దిలాసా, ఏరువాకమ్మ, అవురవురా!

## నండూరి సుబ్బారావు: (1895-1957)

ప్రేయసిగా దేవులపల్లి 'ఊర్వశి'ని అడివి బాపిరాజు 'శశికళ'ను సృష్టించు కున్నట్లే, నండూరి సుబ్బారావు 'ఎంకి' ని సృష్టించారు. 'ఊర్వశి', 'శశికళ' లలో అజ్ఞాత నాయకులు కవులే! కాని 'ఎంకిపాటలు'లో నండూరి ఎంకికి సరిజోడుగా నాయుడు బావను కూడ సృష్టించారు. భావంలోనే గాక భాషలోనూ నవ్యతను సాధించారు. పల్లె పదాలను గీత రచనలో పొందుపరిచారు. పాటకు సరికొత్త బాటల్ని వేశారు. జానపద గంధాల్ని పూశారు.

'ఎంకిపాటలు' విడి విడి పాటల సంపుటే అయినా, తదేక దృష్టితో చూస్తే, క్రమ పరిశీలన చేస్తే ప్రణయ కావ్యంగానే తోస్తుంది. ఎంకి ఒక చోట ముగ్ధగా మరొక చోట విరహదగ్ధగా, ఇల్లాలుగానే కాక ప్రియురాలుగా, పిల్లవాని తల్లిగానూ సాక్షాత్కరిస్తుంది.

నండూరి 'ఎంకి పాటలు' తప్ప మరేమీ రాయలేదు. రాసినవన్నీ జానపద గేయాల బాణీల్లో రాణించినవే! అంతేకాని ఇవి పూర్తిగా జానపదగేయాలు మాత్రం కావు.

జానపదగేయాలకు అజ్ఞాత కర్తృత్వంకాగా, ఈ గేయాలకు నండూరి కర్తృత్వం స్పష్టంగా తెలుస్తోంది. పైగా జానపద గేయాలు మౌఖిక ప్రచారానికి మాత్రమే నోచుకోగా ఈ గేయాలు లిఖిత సంప్రదాయానికి సంబంధించినవి. వాడుక భాషలో మాండలికపు యాసలో వన్నె కెక్కినవి. కావున ఇవి జానపదగేయాల బాణీల ఒరవడిలో వెలువడిన గీతాలు మాత్రమే అని చెప్పుకోవాలి. లలితగీత వికాసానికై కృషి చేసిన కవీంద్రులలో బసవరాజు, దేవులపల్లి గార్లను ప్రధానంగా పేర్కొనాలి. ఆ తర్వాత అడివి బాపిరాజు, నండూరి సుబ్బారావులను చెప్పాలి. కవితా రంగంలో బసవరాజు నండూరి కంటె పూర్వుడు. ఎందుకంటే నండూరి తన 'పీఠిక'లో బసవరాజు తనకు కవిత్వ కళారహస్యాల్ని తెలియజెప్పినట్లుగా పేర్కొన్నారు. అడివి బాపిరాజు తన పాటలకు అందంగా బొమ్మలు వేసి, కృష్ణశాస్త్రి వాటిని సాహిత్య సభలలో పాడి విశేష ప్రచారాన్ని కూర్చిన వారని శ్లాఘించారు. అధికార్ల సూర్యనారాయణగారి సాహచర్యంతో 1917-1918 సంవత్స రాలలో 'ఎంకిపాటల' రచనకు శ్రీకారం చుట్టినట్లుగా, అప్పటినుండి 1953 వరకు అప్పుడప్పుడు ఈ పాటల్ని రచించినట్లుగా పేర్కొన్నారు. ఆకాశవాణి వైణికులైన శ్రీమంచాళ జగన్నాథరావుగారి సాహచర్యంతో మనోహర గాన మొనర్చినట్లుగా రాగస్వరాల్ని ఏర్పరచినట్లుగా వెల్లడించారు.

భావకవులు మృదుమధుర గ్రాంథిక పదజాలంతో గీత రచన చేస్తున్న దశలో కేవలం వాడుక భాషలో పల్లీయుల యాసలో నండూరి 'ఎంకి పాటలు' రచించడం సాహసమే! నండూరి రాసిన 35 పాత పాటలు, 43 కొత్త పాటలు కలిపి 'ఎంకి పాటలు'గా గ్రంథరూపంలో వెలిశాయి. ఎంకి పాటలలో ఛందస్సు జానపదగేయాలకు మాతృక అయిన ద్విపద బాటలో నడవడం వల్ల ఖండగతియే కనిపిస్తుంది. 'తపస్సు', 'కోకోకో' అనే పాటలలో మిశ్రగతి అగుపిస్తుంది.

ఒక్కొక్క పాటనే పరిశీలిస్తే భావం, భాషతో పాటు ఎంకి పాటల సొగసులు, ఛందస్సులు తేటతెల్లమవుతాయి.

మద్రాస్‌లో ఒకరోజు కాలేజి నుండి 'ట్రాం' బండిలో వస్తుండగా, ఎప్పుడో విన్నపదంలాగా 'గుండె గొంతుకలోన కొట్లాడుతాది' అనే పల్లవి పల్లవించి క్రమంగా పాటగా రూపు దాల్చింది అని నండూరిగారే పీఠికలో రాసుకున్నారు.[1] అప్పటినుండి ఎంకిని ఏనాడూ మరవలేదని వెల్లడించారు. అంటే వారి కవితా ప్రేరణగా ఎంకి నిలిస్తే, అనేక పల్లె పదాలు అజ్ఞాతంగానే ఆధారమయ్యాయి. ఆ ఎంకికి అలంకారాలయ్యాయి.

'ముద్దుల నా యెంకి' అన్న మొదటి పాటకు పల్లవి,

---

1. ఎంకిపాటలు - నండూరి సుబ్బారావు. పుట :

గుండె గొంతుకలోన కొట్లాడు తాదీ = 19 మాత్రలు
కూకుండ నీదురా కూసింతసేపు = 18 మాత్రలు
నా కాసి సూస్తాది నవ్వు నవ్విస్తాది = 20 మాత్రలు
యెల్లి మాటాడిస్తే యిసిరి కొడతాదీ = 19 మాత్రలు ॥గుండె॥

పై పల్లవిలోని మూడవ పంక్తి 20 మాత్రలతో సాగింది. ఖండగతిలో యిలా

నాకాసి + సూస్తాది + నవ్వున + వ్విస్తాది
U U I U U I U I U U U I

ఖండగతియే ఈ పల్లవికి చక్కగా సరిపోతుంది. కావున

గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ....
కూకుండ నీదురా కూసింత సేపూ...

అని 'కూసింతసేపు' ను 'కూసింతసేపూ'....అని దీర్ఘాంతం చేసి ప్లుతంగా పలికితే 19 మాత్రల పంక్తులు కాస్తా 20 మాత్రల పంక్తులుగా మారతాయి. 4వ పంక్తిని కూడ సవరిస్తే అన్నీ సమమాత్రలతో సవ్యంగా ఖండగతిలో నడుస్తాయి. ఇలాగే గీతమంతా చూసుకోవాలి.

హృదయంలోని భావావేశం రాగంగా వెలువడడానికి జరుగుతున్న ఆరాట పోరాటాల్ని 'గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ' అనే పల్లవిగా పలికించడం నవ్య ప్రయోగంగా చెప్పాలి! 'కాసింత' పదాన్ని 'కూసింత' గానే గాక 'నాకేసి' అనే పదాన్ని పల్లెయాసలో 'నాకాసి' సూస్తాది అని మలచడమైనది. యెంకి చాలా చిత్రమైనది, గడుసుది. అందుకే నాయుడు బావకేసి చిలిపిగా చూస్తుంది. చిత్రంగా నవ్వుతుంది.తీరా వెళ్లి సరసంగా మాటాడిస్తే విసిరికొడుతుంది. అంతేగాక

కన్నుగిలికిస్తాది, నన్ను బులిపిస్తాది
దగ్గరగ కూకుంటే అగ్గిసూస్తాదీ!

అని వాపోతాడు. అగ్గిసూస్తాదీ అనడం మంచి ప్రయోగం! కోపతీవ్రతను సూచించడానికి అగ్గిలా అయిపోయింది. చూపుల్లో నిప్పులు కురిపించింది అనడం సహజం. కావున ఊరుకుందామని భావించినా

మందో మాకో యెట్టి మరగించినాదీ
వల్లకుందామంటె పాణమాగదురా!

అని తన అశక్తతను ప్రకటిస్తాడు. మందో మాకో పెట్టడం, పాణమాగక పోవడం జానపద సహజ లక్షణాలు.

జాము రేతిరి యేళ జడుపు గిడుపూ మాని
సెట్టు పుట్టా దాటి సేనులో నేనుంటె
మెల్లంగా వస్తాది నా యెంకీ!
సల్లంగా వస్తాది నా యెంకీ!

పచ్చనీ సేలోకి పండు యెన్నెల్లోన
నీలి సీరాగట్టి నీటుగొస్తావుంటే
వొయ్యార మొలికించు నా యెంకీ!
వొనలచ్చి మనిపించు నా యెంకీ!

తాను జామురాత్రివేళ జడుపు లేక చెట్టు, పుట్టా దాటి చేనులో వుంటే, ఆ పచ్చని చేలల్లోకి పండు వెన్నెల్లో నీలి చీర గట్టుకొని తన కోసం తరలి వచ్చే యెంకి అచ్చం వనలక్ష్మిలాగుండి వయ్యార మొలికిస్తోందని మనోహరంగా అల్లినపాట 'వొనలచ్చిమి' అనే గీతం.

ఈ గీతం కూడ ఖండగతిలోనే సాగింది. అయితే 'మెల్లంగా' 'సల్లంగా' అనే పదాల్ని హ్రస్వంగా 'మెల్లంగ' 'సల్లంగ' అని పలికితేనే

మెల్లంగ వస్తాది నా యెంకీ!
సల్లంగ వస్తాది నా యెంకీ!

వలెమారి ఖండగతికే గాక కింది పంక్తులైన

వొయ్యార మొలికించు నా యెంకీ!
వొనలచ్చి మనిపించు నా యెంకీ!

అనే చరణానికి సమతూకంలో నిలుస్తుంది. అలా జామురాత్రి వనలక్ష్మిలా వచ్చిన యెంకి

మాటలన్నీసెప్పి మంచెకిందా కెల్లి
గోనె పట్టా యేసి గొంగడీ పైనేసి
కూలాస గుంటాది నా యెంకీ
కులుకు సూపెడతాది నా యెంకీ

అని మురిసిపోతాడు నాయుడు బావ.

ముచ్చట్లతో హాయిగా అలా ఎంతో సేపు గడిపాక, తెల్లవారే ముందు కోడి కూత వినరాగానే ఎవరైనా చూస్తారేమోనని త్వరగా ఇంటికి వెళ్లాలని తొందర పెడుతుంది యెంకి. 'యెంకి ముచ్చట్లు' అనే పాటలో

యెన్నాని సెప్పేది యెంకి ముచ్చట్లు!
యేటి సెప్పేది నా యెంకి ముచ్చట్లు?
..............................................................
కోడి గూసేసరికి కొంప కెల్లాలి, నీ
కోసరమె సెపుతాను కోపమొద్దంటాది
..............................................................
యెంత సేపున్నాను యిడిసి పెట్టాలేవు
తగువోళ్లలో మనకు తలవంపు లంటాది

అంటే యెంకి-నాయుడి బావదింకా చాటుమాటు ప్రేమనే! పెళ్లిగాకుండానే అలా ముచ్చట్లలో మునిగి తేలితే నలుగురు చూసి నవ్వుకుంటారని తమకే తలవంపులని యెంకి బాధ.

'యెంకి తో తిరపతి' అనే పాటలో నాయుడు యెంకిని మనువాడినట్లు అగుపిస్తాడు. అందుకే హుషారుగా

యెంకీ నా తోటి రాయే
మన
వెంకటేశరుణ్ని యెల్లి సూసొద్దాము
..........................................................
ఆ సామి మీదేటొ
వూసులాడుకొంట
కొండమెట్లన్ని నీ
కొంగట్టు కెక్కాలి........అని అంటాడు

అంతేగాక

రేతిరీ పగటేల
రెప్పయ్యి కెంకీని
సల్లంగ సూడమని
సామితో జెప్పాలి

అని కోరుకుంటాడు.

బావమీద మనసుపడ్డ మరదలుకు ప్రతిపనికీ బావ గుర్తుకు రావడం సహజం! అలాంటిది నాయుడు బావ యెంకిని వదలి ఎటో వెళ్లి తిరిగిరాకపోతే యెంకి ఎలా కలవరిస్తుందో విప్పి చెప్పే పాట 'నా యెంకి'

నన్నిడిసి పెట్టెల్లినాడే, నా రాజు
మొన్నె తిరిగొస్తనన్నాడే!
నీలు తేబోతుంటె-నీ తోడె వోలమ్మి
నాయెంట యెవరోను - నడిసినట్టుంటాదె! ॥ న ॥
అద్దములో సూత్తుంటె - అది యేటొ సిగ్గమ్మి
నా యెనక యెవురోను - నవ్వినట్టుంటాదె! ॥ న ॥
సల్లని యెన్నెట్లొ - సాపేసి కూకుంటె
ఒట్టమ్మ -ఒల్లంత ఉలికులికి పడతాదె ॥ న ॥

అని యెంకి నాయుడి గూర్చి తలపోస్తే, నాయుడు తన ప్రాణంలా భావించే యెంకిని గూర్చి గొప్పగా పాడుకునే పాట. 'నమిలి మింగిన నా యెంకి'.

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!
మెళ్లో పూసల పేరు
తల్లో పూవుల సేరు
కళ్లెత్తితే సాలు
కనకాబిసేకాలు ॥యెంకి॥

సెక్కిట సిన్నీ మచ్చ
సెపితే సాలదులచ్చ!
వొక్క నవ్వే యేలు
వొజ్జిర వొయిడూరాలు!
................................ ॥యెంకి॥
రాసోరింటికైన
రంగు తెచ్చేపిల్ల
నా సొమ్ము-నా గుండె
నమిలి మింగిన పిల్ల ॥యెంకి॥

తన యెంకి వంటి పిల్ల యీ ప్రపంచంలోనే లేదంటూ, ఆ యెంకి కళ్లెత్తి చూస్తేచాలు, తన కవి కనకాభిషేకాలు అవుతాయి అనడం గొప్ప భావన. అయితే ఇందులో పల్లె తనం కన్నా పాండిత్యపు పనితనమే మిన్నగా కనిపిస్తుంది. ఒక్క యెంకి నవ్వే వజ్రవైఢూర్యాల్ని యేలు అనడం కూడా ఇలాంటి ప్రౌఢోక్తియే! రాసోరింటికైన రంగుతేవడమంటే గొప్పింటికి సరితూగ గలదని కవి భావం! తన సొమ్ముయైన గుండెను గూడ 'నమిలి మింగిన పిల్ల'గా యెంకిని భావించడం నాయుడి జానపద దృష్టికి చక్కటి ఉదాహరణ! తన గుండెనిండా ఆమెనే కొలువున్నదనడానికి మరో మంచి భావన! ఈ పాటలో మొదటి పంక్తిలోని 'యెంకి వొంటి పిల్ల'ను 'యెంకి వొంటీ పిల్ల' అని పలికితేనే ఖండగతి కుంటు పడకుండా సాగుతుందిలా-

**యెంకి వొం + టీ పిల్ల + లేదోయి + లేదోయి**
**యెంకినా + వొంకింక + రాదోయి + రాదోయి**

గోదారి మీదుగా భద్రాద్రికి పడవపై శ్రీరామనవమికి తరలి వెళ్లడం అనాదిగా వస్తున్న కోస్తా ప్రాంతపు ఆచార వ్యవహారం. అందుకే చుక్కానిలా యెంకి ముందున కూర్చుంటే, తాను గెడవేస్తూ పడవ నడుపుతానంటాడు. గోదారి గంగలో మునిగి కలిసి స్నానాలు చేద్దామంటాడు, 'యెంకితో బద్రాద్రి' అనే పాటలో

ఆడ నీ సుక్కాని యీడ నే గెడ యేసి
పడవెక్కి బద్రాద్రి పోదామా!
బద్రాద్రి రాముణ్ణి సూదామా!
గోదారి గంగలో కొంగు కొంగూ గట్టి
కరువు తీరా బుటక లేదామా!
సరిగెంగ తాణాలు సేదామా!

ఒకరిని విడిచి మరొకరు బ్రతకలేరనే భావాన్ని 'యెర్రి నా యెంకి' అనే చిన్న పాటలో మిన్నగా చెప్పడం జరిగిందిలా -

యెనక జన్మములోన - యెవరమోనంటి!
సిగ్గొచ్చి నవ్వింది - సిలక నా యెంకి!

ముందు మనకే జల్మముందోలె యంటి!
తెల్ల తెలబోయింది - పిల్ల నా యెంకి!
యెన్నాళ్లో మనకోలె యీ సుకములంటి!
కంట నీరెట్టింది - జంట నా యెంకి!

మళ్లీ ముందు జన్మ మనకుందో లేదో యనగానే తెల్లబోయిన యెంకి, ఈ సుఖమింకా మనకెన్నాళ్లు వుంటుందో అని నాయుడు అనుమానం వ్యక్తపరచినందుకే అతని వియోగాన్ని సహింపలేక కంటనీరు పెట్టిందంటే, ఎంతటి ప్రేమానురాగాలతో యెంకి నాయుడిని పెనవేసుకుందో ఊహించుకోవచ్చు! ప్రశ్న-సమాధానాల మాదిరి సాగిన ఈ పాట మంజరీ ద్విపద లక్షణాలైన 3 ఇంద్రగణాలు ఒక సూర్యగణంతో మాత్రాబద్ధమే గాక గణబద్ధమైనది.

యెనకజ|న్మములోన|యెవరమో|నంటి
సిగ్గొచ్చి|నవ్వింది|సిలకనా|యెంకి

మొదటి గణంలోని మొదటి అక్షరానికి మూడవగణంలోని మొదటి అక్షరానికి యతిలేక ప్రాసయతి ప్రతి పంక్తిలోనూ పాటించబడడంవల్ల , పాటగా అనిపించినా ఇది మంజరీ ద్విపదయేనని రూఢి అవుతోంది.

మనిసేసాలు! మనిసి మాటే సాలు!
మనిసే వొసనే సాలు ! మనిసే సాలు!
ఏతాము కెదురుంగ యెంకుంటే సాలు
వొంటరిగ సిటికేసి కుంట కలిపేను
........................................................ ॥మ॥
యెంకి గాలొక సారి యిసిరినా సాలు
తోటంత రాజల్లె తొవ్వి పోసేను
........................................................॥మ॥

ఇలా సాగే, 'సాలు! సాలు!' అనే పాటలో యెంకి తనకెంతటి ఉత్సాహాన్ని-ఉల్లాసాన్ని కలిగిస్తుందో చెప్తూ, నాయుడు తనకు యెంకి మీద గల గాఢానురాగాన్ని గుండెలో నుండి పాటల ఏతాముతో ఎత్తిపోశాడు.

'అంతే నాకు చాలు! తమలపాకు తొడిమే పదివేలు' అనే జానపదగేయం తలపుకు వస్తుందీ పాట చదవగానే. కాని దానికీ దీనికీ భావంలో ఎలాంటి అనుసరణ లేదు.

ఎంకి - నాయుడుకు పిల్లవాడు కూడ కలిగాడేమో! అందుకే 'పిల్లోడు' అనే పాటలో సంకలో పిల్లాడు సంబ్రాలు పడుతుంటె

యెంకితో తీర్తాని కెల్లాలి!
నెత్తి మూటల నెత్తుకోవాలి
కొత్త మడతలు దీసి కట్టాలి
అడవి దారుల యెంట నడవాలి
బరువు మారుసుకొంట
ఫక్కున్న నవ్వాలి!

అని ఆనందంగా నాయుడి చేత పాట పాడించారు నండూరి. వీపున ఎక్కిన పిల్లవాడికి వినోదంగానే వుంటుంది. కాని దారిపొడవునా తల్లిదండ్రులు మోయలేక మార్గమధ్యంలో కాస్సేపు ఒకరి నొకరు విరామంగా పిల్లవాన్ని మార్చుకుంటూ నవ్వుతూ నడవాలనుకోవడం సహజం. దానినే 'బరువు మారుసు కొంట' అని ప్రయోగించారు

**తాతనాటీ వూసు తలవాలి**
**దారి పొడుగున కీసులాడాలి**
**'తప్పు నీదే' యంట దెప్పాలి**
**దైభమున్నాడాని దడిపించుకోవాలి**

**.......................................................**

**కోనేటిలో తానమాడాలి**
**గుడిసుట్టు ముమ్మారు తిరగాలి**
**కోపాలు తాపాలు మానాలి**
**ఇద్దరము పిల్లోణ్ని యీశుడికి సూపాలి**

జానపదులు తీర్థయాత్రల కెళ్తూ మార్గమధ్యంలో మసలే విధానాల్ని చక్కగా యిందులో విశదపరచారు. వారి మనస్తత్వాన్ని వెల్లడి చేశారు. చివరకు ఈశుడి అనుగ్రహంతో కలిగిన ఆ పిల్లోడిని భక్తితో ఆ దేవుడికి చూపాలి అనడంలో మొక్కుతీర్చుకోవడానికే ఆ దంపతులు దైవసన్నిధికి చేరుకున్నట్లు తెలుస్తోంది!

నాయుడికి ఎంకి చక్కదనాన్ని గుడ్డి దీపపు వెలుతురులో కంటె, చీకట్లోనే 'తనకళ్లు చిల్లులు పడేట్లు'గా చూసుకోవాలని సరదా! అందుకే దీపం ఆర్పేయమంటాడు, దీపం అనే పాటలో

**'ఆరిపేయవె దీపమూ!**
**యెలుగులో నీమీద**
**నిలుపలేనే మనసు**
**ఆరిపేయవె దీపమూ!**

**.......................................**

**సీకట్లొ సూడాలి**
**నీ కళ్ల తళ తళలు**
**తళుకుతో నీ రూపు**
**తలుసుకొని తలుసుకొని**
**సీకట్లొ నా కళ్లు**
**సిల్లులడ సూడాలి!'**

అని కోరుకుంటాడు. చివరకు ఒకరి ఒడిలో ఇంకొకరు ఒరిగి నిదరోదాము అని ప్రణయ వాంఛను ప్రకటిస్తాడు.

ఇలా నండూరి చేత ఎన్నో పాటలు పాడించింది గడుసు పడుచు యెంకి. పాతదారుల్ని వదలించి, కొత్తబాటలో సరికొత్త పాటల్ని పలికించింది. అందుకే నండూరి నాయుడిగా మారారు.

వుత్త మాటలు నీవి పొమ్మందిరా
యెంకి
కొత్త పాటలు పాడు కొమ్మందిరా

అని పరవశించారు. పది కాలాల పాటు నిలిచిపోయే పాటల మూటల్ని అందించారు. ఇంతవరకూ పాడుకున్నవి పాత పాటలుగా భావించిన నండూరి సుబ్బారావు 'కొత్త పాటలు' శీర్షికతో మారిన కాలానుగుణంగా మళ్లీ గొంతెత్తారు.

ఈ 'కొత్తపాటల' లోనూ పాత యెంకియే ప్రత్యక్షమై శ్రుతి కలిపినా నాయుడు కాస్త నాగరికుడైనట్లు అక్కడక్కడ భాషలో భావంలో పట్టుబడతారు. అందుకేనేమో కొందరు విమర్శకులు ఈ పాటలు మారిపోయినట్లుగా, మరో విధంగా వున్నట్లు తేల్చి వేశారు. భాషలో భావంలో కాస్త మార్పు కనిపించినా హృదయం మాత్రం ఒక్కటే అని చెప్పవచ్చు! 'తెరచాటు' అనే పాటలో

కలలోన నా యెంకి
కతలు సెపుతున్నాది
వులికులికి పడుకొంట
'ఊ' కొట్టుతున్నాను
.......................................
రెక్కలతొ పైకెగిరి
సుక్కల్లె దిగుతాది
కొత్త నవ్వుల కులుకు
కొత్త మెరుపుల తళుకు
తెలివి రానీయకే
కలకరిగి పోతాది' -

తన యెంకి కథలు చెప్తుంటే తాను 'ఊ' కొడుతున్నట్లు నాయుడు కలగంటున్నాడు. ఆ కలలో ఎంకి రెక్కలు కలిగిన దివ్యాంగనలా పైకెగిరి చుక్కలా కిందికి దిగుతున్నది. కొత్త తళుకులు కులుకుల్ని చూపుతున్నది. తెలివైతే ఆ కమ్మని కల కరిగిపోతుంది కాబట్టి లేపకు మంటున్నాడు. ఇంతకూ లేపుతున్నది కూడా యెంకియే! ఎంకికి నాయుడొక్కడే, కాని నాయుడి కంటికి అనేక రూపాలలో ఎంకి సాక్షాత్కరిస్తూ సరసాలాడుతుంది. అందుకే

ఒక్క నేనే నీకు
పెక్కు నీవులు నాకు

అని పాట చివరలో ప్రస్తావించాడు; సమాధానంగా.

నాయుడు బావ తన చెంత చేరనందుకు చిన్నబోయిన ఎంకి చింతిస్తూ 'కలత నిదర' అనే పాటలో

ఈ రేయి నన్నొల్లనేరవా? రాజా!
ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర!

అని దీనంగా అర్థించింది. ఇందులో 'రాజా' అన్న పదాన్ని ప్లుతంగా

సాగదీసి పలికితే మొదటి పంక్తి రెండవ పంక్తిలాగే 20 మాత్రలు కలిగి సమమవుతుంది. పైగా ఆర్తిలోని వేదన వెల్లడవుతుంది.

..............................................

ఆకాశ మా వొరస
ఆవులించిన రేయి
మిసమిసలతో యేటి
పసలలో నను సుట్టి
ఈ రేయి నన్నొల్ల నేరవా? రాజా!....

..............................................

యెలుతురంతా మేసి
యేరు నెమరేసింది
కలవరపు నా బతుకు
కలత నిదరయ్యింది

అని వాపోతుంది. అర్ధరాత్రి కాగా ఆకాశానికి కూడ నిద్ర వచ్చేస్తున్నట్లు సూచిస్తూ 'ఆకాశ మా వొరస - ఆవులించిన రేయి' అని చెప్పడం, ఏటి మీద పడుతున్న అందాల వెన్నెలనంతా ఏరు తీరిగ్గా తినేసి నెమరు వేస్తుందనడం కవి భావనా చమత్కృతికి ఒక మచ్చు తునకగా భావించవచ్చు!

రవల వెలుగుల గంగ రమ్మందిరా-యెంకి
శివమెత్తి తానాలు చేసిందిరా!
సిరులతో ముత్యాల
సరుల చెల్లాటతో
సిరిసిరీ మువ్వలా
చిందులా గంతులా ॥రవల॥

అని 'తబ్బిబ్బు' పాటలో తన యెంకి కాశీలోని గంగలో స్నానం చేసిన వైనాన్ని వివరించాడు.

పాపాలనే గాక మాలిన్యాన్నంతా కడిగేసే ఆ పవిత్రగంగలో మునకలేయగానే

..............................................

తేలింది వెలుగుతో
మబ్బు సెందురుడల్లె
మనిసిలో మనసల్లె! ॥ ర ॥

మబ్బు వీడిన జాబిల్లిగా చూడ ముచ్చటగున్న తన యెంకిని చూసిన కాశీనాథుడు తబ్బిబ్బై తల తడుముకున్నాడనడం మనోహరంగా వుంది. అంటే శివుడు తలలో దాచుకున్న గంగనే తన ముందుకు దిగివచ్చిందా అని యెంకిని భ్రమించడాన్ని నాయుడు బావతో ఊహింపజేశారు నండూరి. అందుకే తబ్బిబ్బయి తల తడుముకున్నట్లు చెప్పారు.

నండూరి ఈ కొత్త పాటల్ని 'నా రవలవెలుగుల పాటలో తలదడుముకొని తబ్బిబ్బులైన అద్భుత మూర్తికి' అంకితం చేస్తున్నట్లు ప్రకటించారు. కాని ఆ అద్భుత మూర్తి కాశీనాథుడని ఈ పాట చదివితే గాని పాఠకులకు అర్థం కాదు.

'మాట కోటలు' అనే పాటలో బావ కోసం నిరీక్షించే ఎంకి, వస్తానన్న బావ ఎంతకూ రాకపోయేసరికి దీనంగా ఎలుగెత్తుతోందిలా

**ఆట పాటలలోనె మరచినావా, రాజ!**
**మాట కోటలలోనె మసలు మన్నావా?**

**..............................................**

**నెలవంక పలకలో**
**నీరూపె గీతురా**
**తల వంచి సెలయేట**
**ఆ రూపె సూతురా!**
**కలలోన నీవునా**
**కంటి కవుపడకున్న**
**మెలకువయ్యేదాక**
**కలవరించేను నిను**
**కందుటెరుగని మనసు**
**గాయమై పోయెరా!**
**నీకె చేటని కంట**
**నీరు రానీనురా!**

నెలవంకను పలకలా భావించడం, అందులో తన ప్రియుడి రూపాన్ని గీసి, యేటి అద్దంలో చూడడం నవ్యంగా వుంది. ఇల్లాలి కంటినీరు ఇంటికే అరిష్టం అన్న సామెతను తలచి, కన్నీరు కారిస్తే కట్టుకున్న బావకే చేటు కలుగుతుందేమోనని కంటనీరు పెట్టడం మానుకున్నాననడం దివ్యంగా వుంది.

తన బావకోసం కొండ-కోన తిరిగి గరిక పూల మాలను, ఆవును- అడవిని అడిగి గుమ్మపాలు-కొమ్మతేనె తెచ్చానని పచ్చిక బయళ్ల పానుపులో మెత్తగా మేనువాల్చుదాం రమ్మంటున్న ఎంకి పిలుపు 'కో, కో, కో' అనే పాటలో కోయిల స్వరంలా వినబడుతుంది. (పుట : 62)

| | | | | |
|---|---|---|---|---|
| **కొండ తిరిగీ** | = | 3+4 | = 7 | మాత్రలు |
| **కోన తిరిగీ** | = | 3+4 | = 7 | మాత్రలు |
| **చీర చెరగున** | = | 3+4 | = 7 | మాత్రలు |
| **కూరిచితిరా!** | = | 3+4 | = 7 | మాత్రలు |

| | | | | |
|---|---|---|---|---|
| గరికపూలా కంఠమాలా | = | 3+4+3+4 | = 14 | మాత్రలు |
| ఆవునడిగీ | = | 3+4 | = 7 | మాత్రలు |
| అడివినడిచీ | = | 3+4 | = 7 | మాత్రలు |
| పూల గిన్నెల | = | 3+4 | = 7 | మాత్రలు |
| పొందుపరిచితి | = | 3+4 | = 7 | మాత్రలు |
| గుమ్మపాలూ కొమ్మతేనే | = | 3+4+3+4 | = 14 | మాత్రలు |

ఈ గీతంలో భావం, భాష కాస్త మారినట్లుగా తోస్తుంది. నడక కూడ ఎప్పటిలా ఖండగతిలో గాక మిశ్రగతిలో సాగింది.

తానెక్కడికి పోయేది, ఎక్కడి నుండి వచ్చేది, ఎలా మసలేది అంతా యెంకికి తప్ప ఇంకెవరికి తెలుస్తుందంటూ నాయుడు చేత పలికించిన పాట 'రాకపోకలు' (పుట : 75)

ఏ లోకమో పోక ఎటకో నారాక
యితరులెవ్వరి కెరుక యెంకికే గాక!

.........................................................

మోట నడుపుట నేను
తోట తడుపుట తాను
మనిసినే యని వగతు
మాకునై పోవలతు
చేనులోనే నిదుర
తాను వెలుగుచు యెదర
స్వప్నలోకము దించు
స్వర్గమును స్వారించు

'స్వర్గమును స్వారించు' అనడం ఎంకి పాటలో ప్రయోగించిన పెద్దమాటగానే చెప్పాలి. తన యెంకి ప్రతి పనిలో సాయంగా వుంటూ చేలల్లో చేదోడుగా వుంటే, స్వప్నంలా స్వర్గంలా వుంటుందని తలచే నాయుడికి ఎంకి మీద ఎంత ప్రేమనో తెలుస్తుందీ గీతంలో.

'ఎంకితనము' (పుట : 89) అనే పాటలో
ఆ చిత్రముకు మెరుగు నీ చక్కదనమే!
ఈ చిత్తముకు వెలుగు నీ యెంకితనమే!

అని అంటాడు నాయుడు. తన యెంకి చిత్రం గీసి, ఆ చిత్రం బాగున్నట్లు అగుపిస్తే ఆ గొప్పతనం ఎంకి చక్కదనం వల్ల కలిగిందంటూ, తన చిత్తం ఉల్లాసంగా వుందంటే అది తన మదిలోని ఆ యెంకితనం వల్లనే కలిగిందంటూ పేర్కొనడం మనోహరంగా వుంది. 'యెంకితనం' చక్కదనం అనే పదానికి పర్యాయంగా ప్రయోగించడం నవ్యంగా వుంది.

కొమ్మనొక చేయూని
గోవునొక చేయూని
వేళ్లు కదిపితివా, నె
మళ్ల జత దిగియాడ!

.......................................

కోడె, పసిలేడి, నడి
కోన నిను పసిగట్టి
'నేనునే' నని యురికి
నిను తాకి కను మూయ!

.......................................

అని ప్రకృతి పారవశ్యాన్ని కళ్లకు కట్టినట్లుగా, చక్కటి భావాన్ని కుంచెతో చిత్రించినట్లుగా మలిచారు నండూరి. 'ఉయ్యాల' అనే మరో పాటలో (పుట: 93)

ఎంకి వూగెను కొమ్మ వుయ్యాలా! చంద్ర
వంక వూగెను బొమ్మ వుయ్యాలా!...
ఏటిపై కొమ్మనూయెల యెంకి అమరించె
నీటిబొమ్మ వూయల నెలవంక వెలయించె

అనే పల్లవితో ఏటిగట్టున చెట్టు కొమ్మను వూయలగా చేసుకొని ఎంకి వూగుతుంటే, నెలవంక ప్రతిబింబం కదలే సెలయేటిలో బొమ్మ వూయలై వూగుతున్నట్లు మనోజ్ఞ కల్పన చేశారు నండూరి.

ఎంకి వన్నెల చీర
నెగిరె వెన్నెల పూలు

.......................................

సిగపూలు, ముంగురులు
ఒక చే సదరు కొనుచు
ఒయ్యారమే వూగె!

ఎంకి కట్టిన రంగు రంగుల వన్నెల చీర మీద వెన్నెల పూలు ఎగరడం: సిగపూలు, ముంగురులు, చిన్ని మువ్వల ఒడ్డాణం సరిచేసుకుంటుంటే ఒయ్యారం వూగడం అనే వర్ణన ఔచిత్యంగా వుంది. 'ఇంతింతై వటుడింతై' అని పోతన విశ్వరూపం దాల్చే వామనుడికి సూర్యచంద్రులు మొదలు నేత్రాలుగా, తర్వాత కర్ణకుండలాలుగా, కరకంకణాలుగా, కాలికడియాలుగా అమరినట్లు వర్ణించడం అందరూ ఎరిగినదే! అయితే అదే ధోరణిలో నండూరి కల్పనలో వూయలనూగే ఎంకికి నెలవంక ఎలా అగుపిస్తున్నాడో పరిశీలిద్దాం!

తీగల నడుమ నూగె
దీపమై, తిలకమై
పీఠమై - ఎంకికి - కి
రీటమై నెలవంక !

కొమ్మ వుయ్యాల నూగే ముద్దుగుమ్మ యెంకికి నెలవంక వెన్నెల దీపంలా నుదుటి తిలకంలాగే గాక, వూయలపైకి వెళ్లేప్పుడు సాచే కాళ్లకు పీఠంలాగా, కిందికి వచ్చేప్పుడు తలమీది కిరీటంలాగ వుందనే వర్ణన అద్భుతంగా సాగింది.

ఇలా అనేక రకాల వర్ణనలతో, మనోహర భావాలతో, పల్లెపదాలతో గీతాల్ని నండూరి నవనీతాలుగా మలిచారు.

## తల్లాప్రగడ విశ్వసుందరమ్మ : (1899-1949)

మనకున్న ఆధునికాంధ్ర కవయిత్రులలో అగ్రస్థానంలోనే గాక మొదటి కవయిత్రిగా లెక్కింపదగిన రచయిత్రి, శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ. ఈమె బ్రహ్మసమాజ ప్రభావంతో గాంధీగారి ఉద్యమం కంటె ముందుగానే అస్పృశ్యత రూపు మాపుటకై కృషి చేసిన సంఘ సంస్కరణాభిలాషిణి! గోదావరి తీరమున 'ఆనందాశ్రయము'ను స్థాపించడమే గాక, ఉప్పు సత్యాగ్రహములో పాల్గొని కారాగార వాసమనుభవించిన దేశభక్తురాలు. ప్రముఖ కవి మల్లవరపు విశ్వేశ్వర రావుగారి అక్కయ్యగా గొప్ప సాహితీ కుటుంబంలో జన్మించిన ఈమె గీతాల్ని పరిశీలిస్తే నవ్యత, స్పష్టత, ప్రసన్నంగా గోచరిస్తాయి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆర్థిక సహాయంతో 1973లో మల్లవరపు సోదరులు ప్రచురించి వెలువరించిన వీరి 'కవితా కదంబం'లో అనేక లలితగీతాలు సలక్షణంగా సాక్షాత్కరిస్తాయి.

'ప్రకృతి సీమ' గేయం (పు. 7)లో పచ్చని పైరులను పచ్చతివాసీగా

నాగరికపు నగర జనావాసం కన్నా పల్లెల ప్రకృతి సీమనే మిన్నగా వర్ణించారు.

జల జల మని ప్రవహించే
సెలయేరుల దరినుంటిని

..............................................

పచ్చని పైరు తివాసులు
ముచ్చటగా ముందు వెలయ
నెచ్చట జూచిన జగమున
హెచ్చుగ సంతసము నిండె

..............................................

పరవశమును బొందజేయు
ప్రకృతి సీమలుండగనిక
పలు నాగరికంపు జనా
వాసముల వసింపనేల?

'రేరాజు' గేయం (పు:9) లో జాబిల్లి గౌతమీ తరగల తారాడుతూ గిలిగింత పెడుతున్నాడని, మేఘాలపై తేలి మేలము లాడుతూనే, తరుల శాఖల్లో దాగి దరహాస మొలికిస్తూ ముగ్ధగోదావరితో ముచ్చట లాడుతున్నాడని వర్ణించడం మనోహరంగా వుంది.

తారాగణమ్ముతో కేరింతలాడుతూ
తారా పథమ్ములో రేరాజ! వెళ్లేవు!

..................................................

శీతకరముల జాచి గౌతమీనీరముల
గిలిగింత గొల్పేవు, అలల పులకించేవు

..........................................................

తరుల కొమ్మల దాగి దరహాస మొల్కేవు

..............................................................

ముగుద గోదారితో ముచ్చటలు సల్పేవు

హాయిగా ఖండగతిలో పాడుకోవడానికి వీలుగావున్న గేయమిది. 'పుష్ప విలాపం'కు విలోమంగా పుట్టి పరుల కానందాన్ని కలిగిస్తూ గిట్టడమే తన పరమావధియని తలపోసే గేయం 'పూవు బ్రతుకు' (పు : 3)

పచ్చని పచ్చిక గుబురుల
పరమేశుడు ననుసృజించె!

..............................................

సంతసమే నా పుట్టుక
సంతసమే నా జరయును
సంతసమే నా బ్రతుకగు
సంతతమును సంతసమే!

పూవు నేలరాలినా తిరిగి గగన వీధిలో మళ్లీ తారకనై జన్మిస్తానని తలపోయడంతో చివరి చరణం కూర్చబడింది.

ధన్యజీవి నగుచు భువిని
దనరి యంత గగన వీధి
మాన్యత గను తారకనై
మరల మరల మహి జనింతు!

ఇలా 12 మాత్రల పంక్తులతో పసందైన భావంతో నడిచిందీ గేయం.

నిరీక్షణతో కన్నుల నీరుకారగా తన ప్రియున్ని ఆ కన్నీరు తుడిచి, ఎదకు హత్తుకొమ్మనే ప్రియురాలి ఆర్తి 'అశ్రుధార' (పు:25) లో అగుపిస్తుంది.

జాలి పొంగెడు నాదు కన్నుల
జాలు వారెడు నశ్రు ధారలు
ఎడద హత్తుకు తుడువ వేలా,
ప్రియుడ, నా కనులు?

.....................................

నీవు వెడలిన నాటి నుండియు
భావమున గడు వంత నొందుదు

ఎడద హత్తుకు తుడువవేలా
ప్రియుడ, నా కనులు?
స్వాదు గాన మరంద ధారల
సార మొల్కెడు మాటలాడుచు
ఎడద హత్తుకు తుడువవేలా
ప్రియుడ, నా కనులు?

మధుర భాషణంతో తీయని ప్రేమగానంతో తనను హృదయానికి హత్తుకొమ్మంటూ, తన ప్రియుని హస్తం సోకగానే సమస్త బాధలన్నీ మరచి పోగలనని చెప్పడం మనోహరంగా వుంది. మొదటి మూడు పంక్తులు మిశ్రగతిలో 14 మాత్రలతో సాగి 4వ పంక్తి 'ప్రియుడ నా కనులు' అని 8 మాత్రలతో విరిగి ముత్యాల సరాన్ని పోలివుంది. సామాన్యంగా ప్రతిపాటలో మొదటి పంక్తులు పల్లవిగా 'రిపీట్' అయితే, ఈ గేయంలో మాత్రం అను పల్లవి 'రిపీట్' కావడం విశేషం!

పూలు అందంగా - మకరందంగా వికసించినందుకు కలిగే ప్రతిఫలం పరితాపమే అనే భావం 'ప్రతిఫలము' (పుట:39) గేయంలో అగుపిస్తుంది.

పూల మాలిక లిచ్చినందుకు
కరకు కత్తులె కానుకాయెను!
తీయతేనియ లొసగినందుకు
తేటి పోటుల గాటులాయెను!

ప్రతి పంక్తికి మిశ్రగతిలో 14 మాత్రలతో సమంగా ఆరంభమైన యీ గేయం మధ్యలో చరణాలలో 4వ పంక్తి 12 మాత్రలతో విరుగగా ముత్యాలసరంగా మారి గమనాన్ని మార్చుకున్నదిలా

గరళమగునో కట్టకడకూ
మురళి సన్నిభ గానమగునో?
వేచి యుండుము వేగపడకను
కాచి యుండుము మాలతీ!

రవి చంద్రులు లేనిదే సృష్టిలేదని, దివారాత్రములు లేవని వారిని కొనియాడే 'సూర్యచంద్రులు' (పుట : 47) గేయం మాత్రం ఆసాంతం 14 మాత్రలతో సవ్యంగా సాగిపోతుందిలా

మేఘమాలల జెదరగొట్టే
వేడి వెల్గుల సూర్యబింబము!
తమములన్నీ పారద్రోలే
చలువలీనెడి చంద్రబింబము!
.............................................
నింగి మసలుచు పవలురేలును

ఖంగ మింతయు లేక నడతురు

...............................................

మీరు లేనిది జగము నడువదు

మిథ్య యగునది, శూన్యమే యగు!

విదేశ వస్త్రబహిష్కరణ గావించి స్వాతంత్ర్య సముపార్జనలో స్వదేశ వస్త్రధారణ ప్రాముఖ్యతను చాటిన సందర్భంలో అల్లిన మంచి ప్రబోధ గేయాలు 'ఖద్దరు' 'స్వదేశ వస్త్రము' (పుట : 140, 141)

ఖద్దరెంతొ ప్రీతి గట్టుమా

మొద్దు దనుచు మూతి ముడువక!

కన్నతల్లి సేవ జేయుమా

వన్నెవాసి గనగ గోరుమా!

'స్వదేశ వస్త్రము' గేయంలో సేలం చేనేతను, పొందూరు ఖాదీని విశేషంగా పొగడడం జరిగింది.

స్వదేశ వస్త్రము జక్కగ గట్టగ

విదేశ మోహము వీడె గదా!

...............................................

| | |
|---|---|
| సేలపు టంచుల నీలపు చీరెలు | 4+4+4+4=16 |
| చెలువం బెంతో పెంచెగదా! | 4+4+4+2=14 |
| నీ చెలువం బెంతో పెంచెగదా! | 2+4+4+4+2=16 |

...............................................

| | |
|---|---|
| అతి సుతారమగు పొందూర్వలువలు | 2+4+2+4+4=16 |
| మతి కెక్కెను గాభువిలోన | 2+4+4+3=13 |
| సన్నుతి బొందెను గాభువిలోన | 4+4+4+3=15 |

చరణాలలో రెండవ పంక్తి, రెండు మాత్రలు తగ్గిపోయి, మళ్లీ రెండు మాత్రల పెంపుతో మూడవ పంక్తి ముగింపు కావడం వీటికో సరికొత్త బిగింపును సంతరించింది. భావావేశాన్ని పెంచింది. అయితే కింది చరణంలో రెండవ పంక్తి, మూడవ పంక్తిలో ఒక మాత్ర లోపించింది. ఆ లోపాన్ని 'భువిలోన' పదాన్ని 'భువిలోనా' అని 'న' అక్షరాన్ని దీర్ఘంగా పలికితే సమ మాత్ర పంక్తులవుతాయి. చతురస్రగతిలో సాగుతాయి.

స్వరాజ్య సాధనకు 'రాట్నం'ను గాంధీ సుదర్శన చక్రంలా ఉపయోగించగా ఆ ప్రభావంతో అల్లిన గేయం 'రాట్నమా' (పుట : 150)

రాట్నమా! రాట్నమా! రావె మాయమ్మ

రాట్నమా! మా యింట నాట్యమాడగ నీవు ॥ రా ॥

కాటకములన్నింటి దాట నీవేతరణి

దీటులేని నూలు దీసి మాకీయగా ॥ రా ॥

రాట్నంతో దూది వడికి దారం తీసి, ఖద్దరుతో స్వదేశ వస్త్రం తయారు చేసుకోవడం, తద్వారా విదేశీయుల ఆర్థిక వ్యవస్థను దెబ్బతీయడం ప్రథమ లక్ష్యం. ఆ లక్ష్యాన్ని చేరుకోవడానికి అల్లిన ప్రబోధ గేయమిది. అందుకే బ్రిటను 'లంకషైరు' మిల్లులు కూలిపోయేలా రాట్నం తిప్పమనడం-

పరసీమలందు నీ నిరుపమంబగు కీర్తి
విరజిల్లి దేశంబు సిరుల హెచ్చింపగా ॥ రా ॥
లంకషైరూ మిల్లు లింకనీ దెబ్బచే
కూలిపోవగ మేలి కూడుమాకొసగగా ॥ రా ॥

ఖండగతిలో చక్కగా సాగిన గేయమిది.

'పతాక వందనము' గేయం (పుట : 161) లో ఆంగ్లేయుల లాఠీ దెబ్బలకు వెరువక రక్షణ చేయమనడం, స్వరాజ్యమే ముఖ్యోద్దేశమని చాటడం ప్రస్ఫుటంగా అగుపిస్తుంది.

భారత వీర పతాకమా!
భారత విజయ పతాకమా!
లాఠీ దెబ్బకు లెక్కింపక నిను
రక్షణ జేతుము పతాకమా!

..............................................

స్వరాజ్యమే మా జన్మ హక్కనుచు
చాటుచు పల్కెడి పతాకమా!

..............................................

పరాధీనమగు భారతభూమికి
స్వతంత్ర మొసగుము పతాకమా!

గురజాడ దేశభక్తి గీతం ప్రభావంతో ఆయన ముత్యాలసరం నడకలోనే అల్లిన గేయం 'మేలుకొలుపు' (పుట : 163)

మేలుకొనుమో భారతీయుడ!
మేలుకొనుమో దేశభక్తుడ!
మేలుకొని నీ తల్లి దేశపు
ముక్తిగనవయ్యా!

..........................................

అంటరాదూ, ముట్టరాదను
అసమభావము మానిబుద్ధిని,
గాంధి ప్రభుని సుబోధనలను విని
గణ్యతను పొందూ!
ఆ మహాత్ముని త్రోవ నడచిన
ఈ మహా విశ్వంబు గెల్తువు!
మోహ తమసము బాసిపోవును
ముక్తియును పొదలున్!

ఈ కవయిత్రికి గాంధీ యెడ ఎంతటి భక్తి విశ్వాసాలున్నవో తేట తెల్లమవుతాయీ గేయంలో అందుకే గాంధీ నిర్యాణంతో ఆవేదన పెల్లుబుకగా ఆనాటి ఘోర దృశ్యాన్ని కన్నుల ముందు నిలుపుతుంది. 'గాంధీ నిర్యాణము' (పు.188)లో

గోడ్సే పిస్తోలు గుండ్లు
గుండెలందు దూసి పోవ
'హేరామా' యనుచు కూలి
అవతారము చాలించిన
కన్న తండ్రి గాంధి యేడి?
కరుణామూర్తి గాంధి యేడి?
..........................................
హతసాక్షులు లోకమాన్య
చిత్తరంజనాదులచట
స్వాగత మిడ వేచిరొ యా
స్వర్గ వాటిలో!....

త్రిశ్రగతిలో సాగిన యీ గేయంలో వేదనా తీవ్రత గోచరిస్తుంది. స్వాతంత్ర్యం, సంఘ సంస్కరణం కాంక్షించిన యీ కవయిత్రి ఆనాడే మద్యపానాన్ని విషంతో పోల్చి కల్లుమానమంటూ అల్లిన గేయం, 'త్రాగవలదు' (పుట : 196)

త్రాగవలదురా!
అన్న త్రాగవలదురా!
ఇల్లాలేవ్వ పిల్లలేడ్వ
తండ్రి కసర తల్లి దిట్ట
..................................... ॥ త్రా ॥

నేడు మద్యపాన నిషేధం పేరుతో సారా, బ్రాందీ, విస్కీలనే మానమంటే అన్ని అనర్థాలకు మూలమయ్యే కల్లును కూడ త్రాగవద్దని ఆనాడే గొంతెత్తినదీ కవయిత్రి!

ఈతకల్లు తాటికల్లు
తాతలానినార, నీదు
పాతకముల కెల్ల యిల్లు
భూతలంబు నందు కల్లు ॥ త్రా ॥
కప్పురీతి వదరుతావు
తప్ప త్రాగినపుడు నీవు
చొప్పదంటు ప్రశ్నలతో
సోది చెప్పుతావు నీవు ॥ త్రా ॥

అని కల్లు త్రాగినపుడు లోకులు చేసే వికృత చేష్టలన్నీ వివరిస్తూ, ఆ కల్లును మానుకొమ్మనే ప్రబోధాన్ని చక్కగా చెప్పారు.

ఇలా అనేక సాంఘిక సమస్యల్ని వస్తువుగా చేపట్టి విశ్వసుందరమ్మ తనదైన విశిష్ట శైలిలో అల్లిన గీతాల సంకలనం, యీ 'కవితా కదంబం' అని పేర్కొనవచ్చు.

మనకున్న కవయిత్రులలో లలితగీత వికాసానికి తోడ్పడిన వారిలో విశ్వసుందరమ్మ, తదుపరి చావలి బంగారమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మమ్మ అగుపిస్తారు.

చావలి బంగారమ్మ గీతాలు 'వైతాళికులు' లోనే అగుపిస్తాయి.

## చావలి బంగారమ్మ : (1897 - 1960)

తెనుగు కడుపున పుట్టి చేవదేరిన నుడికారం ఈమె భాష పోకడలలోనూ, తాటాకు బొమ్మలకు ప్రాణంపోసి కన్న బిడ్డనుగా చంకకు యెత్తగలిగిన పసినాటి తెలుగు భావన ఈమె ఊహావీధిలోనూ అగుపిస్తుంది.

'నీడ' అనే గేయం (వైతాళికులు పుట : 189) లో చెరువు గట్టున గల మందార తన నీడను నీటిలో చూస్తూ, అంద చందాల్ని గమనిస్తూ వంగి బొట్టు పెట్టుకుంటున్న దన్న భావన మనోహరంగా వుంది.

**అందాలు తానె చూసింది**
**నీటిలో**
**చందాలు తానె చెప్పింది**
**నాతోటి**
**వొడ్డున్న మందార**
**వొంగి బొట్టెట్టు కొని**
**అందాలు తానె చూసింది**

..............................................

ఈమె ఊహలో ఎంతటి గారడీ వున్నదో చూడాలంటే 'ఆ కొండ' అనే గేయం ('వైతాళికులు' - పుట: 210) లో గమనించవచ్చు! మనకు రైలు ప్రయాణంలో కొండలు-కోనలు వెనక్కు వెళ్తున్నట్లుగా, కొన్ని చోట్ల ఎడతెగని పర్వత శ్రేణులు మనల్నే అనుసరిస్తున్నట్లుగా అగుపించడం సహజం. ఆ అనుభవాల్నే అందమైన గేయంగా మలిచారీ కవయిత్రి.

..............................................

**రైలు లోపల నేను**
**రాబోతు వున్నాను**
**నను జూసి వెనుదిరిగెనో!**
**ఆ కొండ**
**నైజమే అటులుండెనో!**

........................................

**పరుగు పరుగున నాతో**

పయనమై ఆ కొండ
సరగున్న రాబోతె
దారికడ్డము నిల్చు
సరివి తోటలు దాటెనే!
ఆ కొండ
తలయెత్తి నను చూసెనే!

.........................................

వానలు కురియక పోతే కప్పకు పెళ్లి చేస్తే వరుణ దేవుడు కరుణిస్తాడనేది అనాదిగా వస్తున్న మన విశ్వాసం! ఆ విశ్వాసంతో జరిపే కప్పల పెళ్లిని గాంచి అల్లినగేయంగా 'కప్పతల్లి పెళ్లి' (వైతాళికులు - పుట : 217) అగుపిస్తుంది.

1. కప్పతల్లీ పెళ్లి నేడూ, చూడరే
2. కావెళ్ల నీళ్లొంపినాడూ
3. వరుణ దేవుడు పంపినాడూ, ఓ చెలీ!
4. వాడలన్నీ నింపినాడూ...

ఉరుములు, మెరుపుల్ని పెళ్లికి బాణా సంచా పేల్చినట్లు ఉపమించడం చాలా బాగుంది.

5. బాణ సంచా వెలితి లేదే, పెళ్లికి
6. బహు బాగుగా చేసినారే!
7. కళ్లు చెదిరే మెరుపులమ్మా చూడు
8. ఒళ్లు పరవశ మౌను మేళములు
9. కప్పమ్మ పెళ్లి కోయంచూ, మేళములు
10. గొప్పగా తెప్పించినారే!

.........................................

11. కప్పులెగిరే వానలమ్మా, పొలములూ
12. కనకమే పండుతాయమ్మా

పల్లవిలోని 1వ పంక్తి చివరలోని 'చూడరే', '3వ పంక్తిలోని 'ఓ చెలీ' 5 మాత్రల విరామంగా విరిచి పాడితే ఈ గేయం 14 మాత్రల మిశ్రగతిలో నడుస్తుంది. చరణాలు కూడ అలాగే సాగుతాయి. కాని 5వ పంక్తిలోని 'పెళ్లికి' అనే పదాన్ని 'పెళ్లికీ' అని 7వ పంక్తి చివరి లోని 'చూడు' అనే పదాన్ని 'చూడరే' అని చిన్న మార్పు చేసుకుంటే పంక్తులన్నీ సమమాత్రా గణాలతో చక్కగా సాగుతాయి. కార్తీకంలో దూదిపింజల్లా ఎగిరే శారద నీరదాల్ని గాలి ఉయ్యాలలుగా భావించడం, వాటిని అడ్డుతగులుతున్నా దాటుకుంటూ పున్నమి జాబిల్లి ముందుకు సాగిపోవడం మనోహరంగా వర్ణించబడిన గేయం 'కార్తీక పూర్ణిమ' (వైతాళికులు - పుట : 220)

గాలి ఉయ్యాలపై కదులు తుండెడి మబ్బు
కనుల కడ్డము రాగ, కాలైన తడబడక

పోవుతున్నాడు తాను
తన గర్వ పొంకములు దెలుపుతూను!

..............................................

పక్షి కల కలములే పరిభవంబని యెంచి
తెల్లబోయిన మోము తెలియకుండుటకునై
పోతు వున్నాడు తాను!
తనువెల్ల తారుమారగుట చేను!

ఆకాశమున కెగిరినా, నేలపై దొర్లినా ఎటు చూసినా అంధకారమే ఎదురైన దంటూ నిరాశ-నిస్పృహలతో అల్లిన గేయంగా 'తమస్సు' (వైతాళికులు-పుట : 224) గోచరిస్తుంది.

..............................................

పిలిచాను పిలిచాను అలసిపోయాను
అలసిపోయిన గుండె అట్టె ముడిపోవ
ఆకాశమున కెగిరితి
అక్కడా
అంధకారమె చూసితి!

..............................................

అంధకారములోనె అట్టె రెక్కలు ముడిచి
అవనిపైనే బడితిని,
అక్కడా
అంధకారమె గంటిని!

## 'సౌదామిని' (బసవరాజు రాజ్యలక్ష్మమ్మ) (1904) :

బసవరాజు అప్పారావుగారి సతీమణియైన బసవరాజు రాజ్యలక్ష్మమ్మ 'సౌదామిని' కలం పేరుతో రచనలు సాగించింది. ఈమె రచనల్లో నిర్మల నిరాడంబరత్వం, విశ్వప్రేమ గోచరిస్తాయి. 'వైతాళికులు' లో ఈమె గీతాలు చోటు చేసుకున్నాయి.

ఆకసమున నవిగొ చుక్క
లల్లు కొనెడు చందమామ
వృక్షమ్ముల సందునుండి
తొంగి తొంగి చూచుచుండె!

అని ఆరంభమయ్యే 'పరిచిత కంఠము' గేయంలో (వైతాళికులు-పుట-58) నింగిలోని చందమామ చుక్కల్ని అల్లుకుంటూ వృక్షముల సందుల్లోంచి తొంగితొంగి చూస్తున్నాడంటూ భావించింది.

కొండలోయ ధిగెడు వాగు
నుండి జీవ జలములవిగొ

నురగ గ్రుక్కు నలల తోడ
గుసగుసలాడుచు పోయెడు
పండు వెన్నెలన్ మెయి పర
వశమొందగ, కోకిలంపు
పాటకు చెవి యొగ్గి, పూల
వాసనకున్ మదిన్ పొంగి
కూరు చుంటి సుఖముగ నీ
కొండ రాతిపైన నౌర!

లోయలోకి జారిపడే ప్రవాహంలో అలలకు నురగ లేర్పడడం సహజం. ఆ నురుగులతో జీవజలము గుసగుసలాడుతూ ప్రవహిస్తోందంటూ పండువెన్నెల్లో పరవశిస్తూ కోయిలపాట వింటూ పూలనెత్తావులతో పులకిస్తూ ఆ కొండ రాతిపై కూర్చున్నానంటూ కవయిత్రి కమనీయ వర్ణన చేసింది. కాని ఈ చరణాలు పాటలాగాక పద్యంలా నడిచాయి, ఎడతెగకుండా. పైగా మధ్య మధ్య 'వెన్నెలన్', 'వాసనకున్' అనే పొల్లు హల్లుల ప్రయోగంతో పాడుకోవడానికి కష్టమై పోయింది. 12 మాత్రలతో పంక్తుల్ని త్రిశ్రగతిలో నడిపినా పద్య ఛాయల్ని ప్రవేశపెట్టడంతో గీత సౌకుమార్యం దెబ్బతిన్నది. ఈ చరణాల్ని అదే 12 మాత్రల్లో సులువుగా పాడుకునేలా రచించే వీలులేకపోలేదు ఇలా-

నురుగ గ్రక్కునలల తోడ
గుస గుస లాడుచు పోయెను

అని క్రియను సమాప్తి చేస్తే చరణం స్వేచ్ఛగా పాడుకోవచ్చు.

| | |
|---|---|
| పండువెన్నెలన్ మెయిపర | 12 మాత్రలు |
| వశమొందగ కోకిలంపు | 12 మాత్రలు |
| పాటకు చెవి యొగ్గి పూల | 12 మాత్రలు |
| వాసనకున్ మదిని పొంగి | 12 మాత్రలు |

అనే చరణంలోనూ అసమాపక క్రియను కూడ క్రియ పూర్తి అయ్యేలా చేసి, పొల్లు హల్లుల్ని తొలగించవచ్చునిలా-

| | |
|---|---|
| పండు వెన్నెలందున మెయి | 12 మాత్రలు |
| పరవశ మొందగ కోకిల | 12 మాత్రలు |
| పాటకు చెవి యొగ్గ పూల | 12 మాత్రలు |
| వాసనలకు మదియె పొంగె | 12 మాత్రలు |

'పరవశమొందగ కోకిలంపు' అన్న పాదంలో మాత్రా నియతికై 'పరవశ' మందలి 'పర' ను పై పాదంలో 'వశ'ను కింది పాదంలో ఇమిడ్చడమేగాక 'కోకిలంపు' శబ్దంలో 'లంపు' అనే వ్యర్థాక్షరాల్ని తొలగించి 'కోకిల' అని స్పష్టంగా సరళంగా

'పరవశ మొందగ కోకిల
పాటకు చెవి యొగ్గి....'

అని సంస్కరించుకునే వీలున్నా ఏలనో రచయిత్రి పై విధంగా పద్యపు నడకను అనుసరించింది. అందువల్ల గీతం చరణాలు కుంటుపడ్డాయి. ఇదే విధంగా 'ప్రియనిరీక్షణము' (వైతాళికులు-పుట. 95) లోకూడ పల్లవి ఎత్తుగడ బాగున్నా, చరణాలలో మళ్లీ పొల్లుహల్లుల్ని చొప్పించిందనవసరంగా...

చింతమాను కొమ్మపైన
వింతగాను గువ్వజంట
సంతోషము తోడ సరస
సల్లాపము లాడుచుండె

ఇంతవరకు సవ్యంగా సాగిపోయి,

"వాడుటాకులన్నియు బడి
వాడలనాడుచు బోవున్" - అని వుంది

వాడి నేల రాలిన ఆకులన్నీ వాడల్లో ఆడుచు పోయాయనే భావన బాగుంది. అదే విషయాన్ని

"వాడుటాకులన్నియు బడి
వాడల నాడుచు బోవగ
చల్లని చిరుగాలి పాట
మెల్లగ వీనులు సోకగా" అంటే చాలు.

అయితే ఆ గల గల ఆకుల చప్పుడు అయినప్పుడల్లా తన నాథుడు వచ్చి వాకిట నిలిచినట్లు తోచి ఆత్రంగా తొంగి చూసేదాన్ని అనే భావనను మధురంగా 'ప్రియనిరీక్షణ'గా మలచిందీ రచయిత్రి, చివరి చరణంలో.

చూచితి మెంతో దేశము
సుఖము శాంతి దొరుకునొయని
మునిగితి మెన్నో నదులను
మోక్షము చేపట్టుదమని

.............................................

నోచితిమెన్నో నోముల
కాచి బ్రోచునని పార్వతి
కడకు దేవి దయ చేతను
కంటిమి రత్నములు రెండు

అని సాగే 'దురదృష్టము' అనే గేయం (వైతాళికులు-పుట : 238) మాత్రం రాజ్యలక్ష్మమ్మ రసరమ్యంగానే గాక ఆర్ద్రంగా అల్లింది. ఎన్నో క్షేత్రాలు దర్శించి, నోములు నోచగా కడకు కాత్యాయని కరుణతో ఇద్దర్ని సంతానంగా పొందినట్లు పై పంక్తుల్లో చెప్పింది.

కాని దురదృష్టవశాత్తు తమ సంసార జీవితాని కలంకారాలైనట్టి ఆ రెండు రత్నాల్ని పోగొట్టు కున్నామని అల్లిన చివరి చరణం కరుణ రసం వెదజల్లుతుంది

బతుకు కలంకారములే
వాని దాచ చేతగాక
ఎచటనో పోగొట్టుకొంటి
మెంతటి దురదృష్టముననో?

రత్నాలు అలంకారమునకు శోభనిస్తాయి. అలాగే ధనం లాగే పోగొట్టుకోవడానికి ఆస్కారమవుతాయి. అందుచేత దురదృష్ట వశాత్తు కోల్పోయిన తమ సంతానాన్ని రత్నాలతో పోల్చడం ఔచితీమంతం. మొదట పేర్కొన్న గీతాలకన్నా ఈ గీతంలో రచయిత్రి పరిణతి ప్రస్ఫుటమవుతోంది.

ఇలా లలితగీత వికాసంకై కృషి చేసిన కవయిత్రులలో విశ్వసుందరమ్మ, బంగారమ్మ, సౌదామినిగార్లే మొదటి వరుసలో అగుపిస్తారు.

బసవరాజు, కృష్ణశాస్త్రి, బాపిరాజు, నండూరి పిదప భావగీతాల్ని రాగయుక్తంగా మలిచిన మరొక మంచికవి మల్లవరపు విశ్వేశ్వరరావు.

## మల్లవరపు విశ్వేశ్వరరావు : (1906)

ఈయన 15.6.1906లో జన్మించి కాకినాడ పి.ఆర్. కాలేజిలో చదివి ఆ తర్వాత 'శాంతినికేతన్'లో రవీంద్రుని వద్ద ఉన్నత విద్యనభ్యసించి 1932 సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లిన దేశభక్తుడు. లలితగీతాలే గాక అనేక గేయనాటికలు రచించిన వీరి 'బిల్హణీయము' ఆకాశవాణిలో ప్రసారమైన ప్రప్రథమ గేయ రూపకము (1939) కావడం విశేషం.[1] లలితగీత పరిపూర్ణ వికాసమునకు తోడ్పడిన మల్లవరపు వారి గీతాల కొన్నింటిని ప్రస్తుతం పరిశీలిద్దాం. ముద్దుకృష్ణ సంకలన మొనరించిన 'వైతాళికులు'లో వీరు రచించిన 'సింగారము'అను చిన్న గేయం వుంది (వైతాళికులు : పుట : 50) అది అలంకరణకు సంబంధించింది.

| | |
|---|---|
| ఒక పువ్వు నీ సిగకు | 5+5=10 మాత్రలు |
| నగయై సుమించినది | 5+5=10 మాత్రలు |
| ఒక పులక నా యెదకు | 5+5=10 మాత్రలు |
| నగయై భ్రమించినది | 5+5=10 మాత్రలు |

..........................................

ఒక పలుకు నీ పెదవు
లకు వెనక దాగినది
ఒక ఆస నా బ్రదుకు
సుకమాహరించినది

అని చక్కటి ఖండగతిలో సాగిపోయింది. పువ్వు చెలిసిగకు నగలా సింగారం కావడం సహజం. కాని పులక ఎదకు సింగారమైన దనడం విశేషం!

1 తెలుగులో గేయ నాటికలు - డా తిరుమల శ్రీనివాసా చార్య పుట 170

అలాగే పలుకు పెదవి వెనక దాగడం సహజం. అయితే ఆశ బ్రతుకు సుఖమునే ఆహరించడం - అపహరించడం జరిగిందన్న భావాన్ని వెల్లడి చేస్తుందీ గీతం.

ఖండగతిలోనే కమనీయంగా సాగిన మరోగీతం 'ఏనాడు' (వైతాళికులు పుట 88)

ఏనాడు నీ మోవి
లేనవ్వు పొల్చునో
ఏ రేయి చీకట్ల
నీ చేయి తుడుచునో
ఏ ప్రొద్దు పొడుపులో
నీ ప్రేమ మొలచునో
ఆనాడు ఆరేయి
ఆ ప్రొద్దె రేకెత్తు
నా వాడినట్టి గుం-
డెలలోని పూగుత్తి!

ఏ రేయిలో చీకట్లను నీ చేయి తుడుచునో, ఏ ప్రొద్దులో నీ ప్రేమ మొలుచునో ఆ ప్రొద్దే వాడిన నా గుండెలలో వలపు పూగుత్తి రేకెత్తుననే భావానికి తగిన సుకుమార పదాల్ని కూర్చారు, విశ్వేశ్వరరావు. కాని మిగతా గేయాన్ని ఎందుకో ఇంత సౌకుమార్యంతో నడుపలేదు.

మరిగి కష్టపుటలల్
విరిగి తుంపరతాను
వేగి నిశ్వాసముల్
వీగు తుత్తునియలై

అని 'కష్టపుటలల్' 'నిశ్వాసముల్' అనే పొల్లు హల్లుల్ని పొందుపరిచి కాస్త నడక కుంటుపడేలా చేశారు. 'కష్టపుటలలు', 'నిశ్వాసములు' అని మామూలుగా మార్చి రాసినా భావంలోగాని, మాత్రలలో గాని ఎలాంటి భేదమేర్పడదు. అలాగే

....................................
గాలిలో రెపరెపల్
తేలి వచ్చున దెపుడు

లోని 'రెపరెపల్'ను రెపరెపలుగా మార్చుకుంటే మరింత సుగమంగా వుంటుంది.

నీలాకాశంలో సాగిపోయే చంద్రబింబాన్ని నీటిపై తేలిపోయే తెప్పలా భావిస్తూ, అందులో తన ముద్దుల ప్రేయసి వుందేమోననే ఊహతో అల్లిన 'గడ్డిపువ్వు' (వైతాళికులు - పుట 100, 101) పల్లవి మనోజ్ఞంగా వుంది.

తెప్పవోలిక చంద్ర బింబం 3+4+3+4=14 మాత్రలు
తేలిపోతో వుంది నింగిని 3+4+3+4=14 మాత్రలు

అందులో నా ముద్దు ప్రేయసి 3+4+3+4=14 మాత్రలు
వుంది కాబోలు 3+5=8 మాత్రలు

మొదటి మూడు పంక్తులు 14 మాత్రలతో సాగి నాల్గవ పంక్తి కేవలం 8 మాత్రలతో విరిగి, ముత్యాల సరంలా మిశ్రగతిలో నడిచింది. పల్లవి చరణాలు మాత్రం 12 మాత్రలే గల నాల్గవ పంక్తితో నడిచాయిలా-

లేత చిరునవ్వెందుకో సిగ 3+4+5+2=14 మాత్రలు
లోన వెన్నెల మల్లెలెందుకో 3+4+3+4=14 మాత్రలు
చేతి సైగలుచేసినన్నటు 3+4+3+4=14 మాత్రలు
చేర రమ్మను టెందుకో? 3+4+5=12 మాత్రలు
గడ్డి పువ్వని, నన్ను ప్రేయసి
గాలి తరగల తేలిపోతో
కళ్లలో అద్దాల మెరుగులు
చల్లి కలచెద వెందుకో?

సామాన్యంగా పువ్వును ప్రేయసితో పోలుస్తాము. కాని ఇక్కడ గడ్డిపువ్వునే ప్రియుడిగా మలచి, ఆ గడ్డిపువ్వు తన ప్రేయసిని చంద్రబింబంలో వెదుక్కోవడం విశ్వేశ్వరరావు చేసిన విశేషరచనా విన్యాసం! చంద్రబింబంలో వున్నందుకేమో తన ప్రేయసి వెన్నెల మల్లెల్ని సిగలో తురుముకున్నట్లు- గాలి తరగల తేలిపోతూ అద్దాల మెరుగుల్ని చల్లుతున్నట్లు భావించాడు.

నీకు నేనే కావలిస్తే 3+4+3+4=14 మాత్రలు
నింగి వొదులుకు నీవె, సీతా 3+4+3+4=14 మాత్రలు
కోక చిలుకవై, దేనివో అయి 3+4+3+4=14 మాత్రలు
రాగలవు నేనొద్దు కనకే 3+4+3+4=14 మాత్రలు
ముత్తెములొ రత్నాలొ యేరుతొ
చిత్రమవునా మబ్బుకడలినె
అర్థ చంద్రుడి దోనె లోనే
ఆడుకుంటావు!

నీకు నేనే కావలిస్తే నింగి వొదలి నీవే సీతాకోక చిలుకవై దరికి రాగలవని గడ్డిపువ్వు తలపోస్తున్నది. సామాన్యంగా పూవును ప్రేయసిగా భావిస్తే భ్రమరాన్ని ప్రియుణ్ణి చేస్తాము. కాని ఇక్కడ గడ్డిపువ్వే ప్రియుడు కాబట్టి ప్రేయసి సీతాకోక చిలుకయై రాగలదనడం ఎంతో ఔచిత్యంగా వుంది. పై చరణంలో ప్రతి పంక్తి 14 మాత్రల గేయంగా సాగినట్లున్నా శుద్ధ వచనంగా రాసి చూపవచ్చు! క్రింది చరణం మళ్లీ ముత్యాల సరమై సాగింది.

తన మీద యిష్టం లేదు కనుకనే తన ప్రేయసి క్రిందికి దిగిరాకుండా మబ్బుకడలి చెంతనే ముత్యములో రత్నాలో యేరుతూ అర్ధచంద్రుడి దోనెలో ఆడుకుంటున్నదని భావించడం మనోహరంగా వుంది. కడలిలో రత్నాలుండడం

మబ్బులో నీరుండడం సహజం. కావున 'మబ్బు కడలి' అనే ఆచ్ఛిక సమాసాన్ని అందంగా కూర్చారు. విలక్షణ భావగీతాన్ని తీర్చారు

రాకా సుధాకరా!
లోకోదయమ్మయ్యె!
చీకు చింతల మాను
మోకవీ! ఓ కవీ!
..............................
తెరుచుకోనీ తలుపు
అరసిరానీ పిలుపు
విరియనీ నీ వలపు
ఓ కవీ! ఓ కవీ!

అని 'నవాలోకము' అనే గీతాన్ని (వైతాళికులు పుట : 184) రచించి చీకటి చింతలలో క్రుగ్గక, పండు వెన్నెలలో పసందైన వలపు తలపుల్లో విహరించమంటూ కవిని మేల్కొలిపారు.

చుక్కలన్నీ గోట
నొక్కమారే మీట
దిక్కుదిక్కుల వీణ
చొక్కి మ్రోసిన రేయి
....................................
నిండు పున్నమి రేయి
పండు వెన్నెల పూచె!
కొండ కోనల శాంతి
మెండయ్యె! మెండయ్యె!

చుక్కలన్నీ ఒక్కమారే కొనగోట మీటగా నలుదిక్కుల వీణలు మ్రోగగా పండు వెన్నెల్లో నిరాశ, నిస్పృహల్ని వదలి శశ్వదానంద మూర్తిగా విశ్వగానాలాపన వినమంటూ, విశ్వదీపరశ్మిని కనమంటూ రచించిన యీ గేయం ఖండగతిలో సాగింది.

వచ్చె చైత్ర మాసము!
వాసంత విలాసము!
చలిగాలి వీచె వీచె
మెల్ల మెల్ల జల్లు లేచె
పిల్ల లతల పూత విచ్చె ॥ వచ్చె ॥
గున్న మావి క్రొన్ననతో
సన్నజాజి మన్ననతో
ఎన్నరాని చిన్నెలతో ॥ వచ్చె ॥

అని 'చైత్రము' (వైతాళికులు. పుట . 215) లతలు విరిసినట్లుగా రసానంద స్ఫోరకంగా రచించారు. చిగురించిన గున్నమావి క్రొన్ననతో, అల్లుకున్న సన్నజాజి అనురాగాల మన్ననతో సాటిలేని అందాల ఆమని చిన్నెలతో సాగి వచ్చిన చైత్రాన్ని వినసొంపైన పదాలతో వర్ణించారు.

వచ్చె చైత్ర మాసము 5+5=10 మాత్రలు
వాసంత విలాసము 5+5=10 మాత్రలు

అనే పల్లవి మాత్రం 10 మాత్రలతో ఖండగతిలో సాగగా

చల్లగాలి వీచె వీచె 3+3+3+3=12 మాత్రలు
..................................
గున్నమావి క్రొన్ననతో 3+3+3+3=12 మాత్రలు

చరణాలు 12 మాత్రలతో సాగి త్రిశ్రగతి నాశ్రయించాయి. అంతేగాక చివరి చరణం చతురస్రంలో సాగడం యీ గీత ప్రత్యేకతగా చెప్పవచ్చు!

రెక్కలు కట్టుకు మేఘము 4+4+4=12 మాత్రలు
లెక్కుద మెంతటి సౌఖ్యమిం 4+4+5=13 మాత్రలు
కెక్కడి దక్కడ దుఃఖము 4+4+4=12 మాత్రలు

1937లో నవ్య సాహిత్య పరిషత్తు ప్రచురించిన 'మధుకీల' గ్రంథంలో మల్లవరపు విశ్వేశ్వరరావుగారి మరికొన్ని గీతాల్ని పరిశీలించవచ్చు! 'ప్రేమగానము' (పు:19) ఖండగతిలో

నీ-సోగకన్నుల కొనల-సుమియించెనో సఖీ!
వేయితారల మిన్కులూ తళ్కులూ నాకు!

అని తన ప్రేయసిని గూర్చి తలపోశారు. ఆమె కనుకొనలలో వేల తారల తళుకులు వికసించినట్లు భావించారు. గతిలో ఒదగని 'నీ' ని ముందే ప్రయోగించి రచించిన గేయమిది.

నీ గులాబీ నవ్వు - లోగుబుల్కొను తావి
ఆ లేత భావాలు - ఆ వింత సైగలూ
నా గుండెలను లాగ - నా యౌవనము రేగ
నీ చేలపు చెరంగు - వీచు గాలులు సోక
ఉపశమిల్లునొ మనసు - తపన పాలే యౌనొ?

గుబాళించే చెలి గులాబీ నవ్వులు తన గుండెను లాగగా, ఆమె కొంగు గాలి సోకగా మనసు ఉపశమించునో, తపించునో అని ప్రణయావస్థను వెల్లడించారు చివరలో.

నా గానమున మ్రోయు - నాదలక్ష్మివి నీవ!
నాకు నీవేలేని - నాకలోక మెడారి!

అని ఆమెలేని నందనమైనా తనకు ఎడారియే యని పరితపించారు. 'ఒంటరి సుఖము' అనే గేయంలో (పుట . 43)

పలవ కొమ్మల మర్రి - పచ్చ నాకుల గొడుగు!
నీడ నీతో గూడి - పాడుకున్నా సొగసు!

అని మర్రి చెట్టు ఆకుల గొడుగు పట్టగా, ఆ నీడలో నీతో కూడి పాడుకుంటే ఎంత బాగుండునని చెలిని రమ్మంటూ పిలుస్తున్నాడు ప్రియుడు కాని దూరాన నింగి నీరధిని అంటినట్లు ఆమె స్మృతులు తనను అంటినాయే తప్ప నిజానికి చెంత చేరడం లేదని వాపోయాడు. అందుకే చివరకు

నీడలోనే మరిగి - వాడినేలను వ్రాలు
దండ ప్రేయసిలేని - యెండుటాకును సుమ్ము

అని తనను వాడి నేలకొరిగే యెండుటాకుతో పోల్చుకున్నాడు కవి యొక్క ఈ నిరాశ, నిస్పృహ భావాలు కృష్ణశాస్త్రి బాటలో పుణికి పుచ్చుకున్నట్లు తోస్తాయి.

ఎంతకూ రాని ఆ ప్రేయసిని ఎలుగెత్తి పిలుస్తున్న గీతం నిరీక్షణ (పుట·51)

..........................................

ఏలరావో ప్రేయసీ! నా
కాలమిట్టులె కడపి పుత్తువొ?
ప్రేమకంటె నీకేమి తెత్తును
ప్రేయసీ! నా ప్రేయసీ!...
కాలగర్భము కరిగిపోగా
నీలగగనము విరిగిపోగా
వేయి కోర్కెల వెర్రి బరువుల
సోలి పాడితి! సొమ్మసిల్లితి!

..........................................

కంటి రెప్పలు మింటి కప్పుల
నంటి పోయె నిరీక్షణంబున

అని తన కంటి రెప్పలు నిరీక్షిస్తూ మీదికి చూడడం వల్ల మింటి కప్పుకు అంటుకు పోయాయనడం విరహ భావంలోని తారాస్థాయిని సూచిస్తున్నాయి. మిశ్రగతిలో ముత్యాల సరంలా సాగిన గీతమిది. ఇందులో ప్రియుడు ప్రేయసికై నిరీక్షిస్తూ నిట్టూరిస్తే, 'అభిసారిక' గేయంలో (పుట : 71) ఒక గోపిక మురళీ ధరుని కౌగిట కరిగిపోవాలనే కాంక్షతో ప్రతీక్షిస్తూ పరితపిస్తున్నది.

..........................................

| | |
|---|---|
| కలువరేకుల కనులు | 5+5=10 మాత్రలు |
| కన్నీటి ముత్యాలు | 5+5=10 మాత్రలు |
| తళుకు చెక్కిలి, నిండు | 5+5=10 మాత్రలు |
| వలపూరు కెమ్మోవి | 5+5=10 మాత్రలు |

అర్పించడానికి గోపిక అభిసారికగా నిరీక్షిస్తున్నది. కాని ఎంతకూ కొంటె కృష్ణుడు రాకపోయేసరికి ఆమె కలువ కన్నుల్లో కదలిన కన్నీటి చుక్కల్ని ముత్యాలుగా పోల్చడం మనోహరంగా వుంది.

మురళీ మధురగాన
రవళి దేలుచు వచ్చి
నా హృదయ పద్మాన
నధివసింపుము పతీ!

..................................

కరిగిపోవుదు నీదు
మరగు కౌగిలిలోన!

అంటూ అభిసారిక తన అంతరంగాన్ని విప్పి చెప్పడం ఖండగతిలో అందంగా సాగింది. 'అదృశ్య' (పుట : 80) అనే గీతంలో అందీ అందక అదృశ్యంగా వుండి, వెన్నెల - చీకటిగా, కన్నుల స్వప్నంగా కదలే తన ప్రేయసిని కదలి రమ్మంటున్న ప్రియుని పిలుపు చక్కగా వివరించబడింది.

| | |
|---|---|
| సందె గుస గుస లందె వింటిని | 3+4+3+4=14 మాత్రలు |
| సకియ! నీ ఏకాంతములు నే | 3+4+3+4=14 మాత్రలు |
| వెలుగు చీకటులందె నీకయి | 3+4+3+4=14 మాత్రలు |
| వెదకు చుంటిని వేచి యుంటిని! | 3+4+3+4=14 మాత్రలు |

.........................................................

స్నిగ్ధమే నీ ప్రేమ సకియా!
ముగ్ధవై ఎన్నాళ్లు దాగుట?
మంచుతెర, తొలిసంజ ప్రేయసి!
చించుకొని పుష్పించవమ్మా!

అని తన ప్రేయసిని వెంటనే తొలిసంజలో కరిగిపోయే మంచుతెరను చించుకొని పుష్పించి, అరుదెంచ మనడం అద్భుతంగా వుంది. ఈ గీతం మిశ్రగతి ఏకతాళంలో నవ్యంగా సాగింది.

'పూర్ణిమ' అనే గేయంలో (పుట : 87) పుట్టెడు ప్రేమతో ప్రేయసిని పిలుస్తున్న వైనం అగుపిస్తుంది.

ఆరబోసిన వెన్నెలలలో
ఆడుకుందము ప్రేయసీ!....

..............................................

చెట్లనీడలు చెంగు చెంగున
చెమ్మ చెక్కల చొక్కెనే!
ఈ పిల్ల గాలుల ప్రేమ వార్తలు
వెల్లి విరిసెనె ప్రేయసీ!

గడ్డి పువ్వులు గాఢ ప్రేమల
గౌగిలించుకు పోయెనే!
ఈ దూది వెన్నెల సెజ్జ నిద్దుర
పోదమే, రా! ప్రేయసీ!...

పిల్లగాలులు ప్రేమవార్తలతో వెల్లి విరియడం, ప్రియుడు గడ్డీ పువ్వుల్లా తెలి వెన్నెల సెజ్జపై నిదురించుదామని ప్రేయసిని రమ్మని రాగయుక్తంగా పిలవడం ఈ గీతంలోని విశిష్ట భావన, వినూత్న కల్పన. మిశ్రగతిలో సాగే ఈ గేయంలో 'ఈ పిల్లగాలుల'...లోని 'ఈ' ని 'ఈదూది వెన్నెల...' లోని 'ఈ'ని విడదీసి పాడుకుంటేనే నడక సాఫీగా సాగుతుంది. సమమాత్రలతో తూగుతుంది. 'సామ్యము' అనే గేయంలో (పుట : 103) ఆమని అందాల్ని, కోకిల కూజితాల్ని మనోహరంగా వర్ణించారు.

లేత లేత తీగె వోటి పూత పూచెను = 19 మాత్రలు
తేనెలూరు చిన్నిపూలు తేరి చూచెను = 19 మాత్రలు
.........................................................
కొత్త కొత్త కోకిలమ్మ కోన సొచ్చెను = 19 మాత్రలు
మత్తమధుర గళరవమ్ము నెత్తి పాడెను = 19 మాత్రలు
గున్నమావి ఎర్ర చివురు సన్న లొడ్డెను = 19 మాత్రలు
చిన్ని కోకిలమ్మ మావి గున్నజేరెను = 19 మాత్రలు
.........................................................
నవ్య భావకవి యొకండు కావ్యమల్లెను = 19 మాత్రలు
కావ్యజాల మందు వయసు కన్నె చిక్కెను= 19 మాత్రలు

గున్నమావి చిగురిస్తే, కోకిలమ్మ వాటిని మేసి ఎలుగెత్తడం ఎంత సహజమో, భావకవి ఆ అందాల్ని చూసి కావ్యమల్లితే ఆ కావ్యంలో పడుచు కన్నె ప్రవేశించి ప్రేయసిగా హృదయాన్ని పాలించడం అంతే సహజం. కావున ఇందులో చక్కటి సామ్యం తొంగి చూసింది. లేత లేత పూత పూయగా, తేనెలూరే చిన్న పూలు తేరి చూశాయనే ఎత్తుగడనే ఎంతో మనోహరంగా వుంది. త్రిశ్రగతిలో తీయగా సాగిన గేయమిది. లోతుగా పరిశీలిస్తే, మూడేసి మాత్రల చొప్పున విరుగుతూ ప్రతి పంక్తి చివరకు నాలుగు మాత్రలతో అంతమవుతోందిలా

లేత+లేత+తీగె+వోటి+పూత+పూచెను = 3+3+3+3+3+4
= 19 మాత్రలు

ఇది జానపదుల పిల్లల పాటల్లోని 'బుర్రపిట్ట' పాట బాణీని అనుసరించి నట్లు అగుపిస్తుంది.

బుర్రు పిట్ట బుర్రు పిట్ట తుర్రుమన్నది= 19 మాత్రలు
.........................................................
పడమటింటి కాపురమ్ము చేయనన్నది = 19 మాత్రలు

అదే కొలతలో అదే తూగులో విశ్వేశ్వరరావు ఈ గేయాన్ని రాసినట్లు రూఢి అవుతోంది. అనేక మార్గాల్లో సాగి లలితగీత పరిపూర్ణ వికాసానికి విశ్వేశ్వరరావు కూడ పాటుపడినట్లు స్పష్టమవుతోంది.

ఇలా లలితగీత వికాసంకై విశేష కృషి సలిపిన వారిలో బసవరాజు, దేవులపల్లి ప్రదమ స్థానంలో నిలుస్తారు బాపిరాజు-నండూరి ద్వితీయ స్దానంలో గోపగేయాల-పల్లెపదాల మార్గంలో అగుపిస్తారు. వీరి బాటలో పయనించి మరింత అభ్యున్నతికి యత్నించి కృత కృత్యులైన వారిలో విశ్వసుందరమ్మ, విశ్వేశ్వరరావు నిలుస్తారు

మొత్తానికి గురజాడ పాదులో అవతరించిన 'లలితగీత' లత రాయప్రోలు పోషణతో అబ్బూరి, దువ్వూరి, శివశంకరశాస్త్రి, విశ్వనాథ, కవికొండల మొదలగు వారి గేయపత్రాలతో చిగురించి, బసవరాజు, దేవులపల్లి గీతసుమాలతో వికసించి, బాపిరాజు-నండూరి విలక్షణ రచనలతో జానపద జాజి నెత్తావుల్ని విరజిమ్మింది. ఆ గంధాల్ని మల్లవరపు రచనలు మలయ పవనంలా మోసుకుపోగా లలిత గీత పరిమళాలు సలక్షణంగా పలుదెసలకు వ్యాపించాయి.

ఇట్టి లలితగీత లత వికాసానంతరం వివిధ ప్రతిభా విద్వత్కవుల రచనలతో శాఖోపశాఖలుగా విస్తరించింది. ఆ విస్తార క్రమాన్నిక తదుపరి విభాగంలో ప్రస్తావిస్తాను



# 6. విస్తారం

## బాలాంత్రపు రజనీకాంతరావు :

బాలాంత్రపు రజనీకాంతరావుగారు లలితగీత ప్రక్రియా విస్తారకులలో ప్రముఖులు. వీరు 'ఆకాశవాణి' లో పనిచేసిన కాలంలో అనేక లలిత గీతాలు స్వయంగా రచించి, ఇతర కవుల గేయాలకూ బాణీలు సమకూర్చి, ప్రసార యోగం కల్పించారు. లలిత గీతాలకు సాహిత్య స్రవంతిలో ఒక ప్రత్యేకత ఏర్పరచారు.

లలితగీతం కేవలం రాతరూపంలో వున్నంత మాత్రాన సరిపోదని, అది పలువురి నోట పదికాలాలపాటు పాటగా పలకగలగాలని, అలా పలకబడేందుకు వీలుగా అనేక రకాలుగా స్వరాలు కూర్చారు. కృష్ణశాస్త్రిగారితో కలిసి స్వరాలకు సరిపడు పదాల్ని కుదిరేలా కృషిచేశారు. అందుకే కృష్ణశాస్త్రి రచనల్లో 'కృష్ణరజని'గా నిలిచారు. లలిత గీత ప్రక్రియలో అనేక ప్రయోగాలు చేసి దానికి కావలసిన ప్రచారం, ప్రమాణం కల్పించారు.

రజనీకాంతరావుగారి గీతాలలో చాలావరకు బాణీలకు అల్లినవే అగుపిస్తాయి కావున అన్ని పాదాలు సమమాత్రల్లోగాని ఒకే గతిలో గాని సాగినట్లు కనిపించవు! చాలావరకు వీరివి స్వేచ్ఛాయుత భావగీతాలుకాగా కొన్ని రవీంద్రుని అడుగుజాడల్లో, మరికొన్ని కృష్ణశాస్త్రి బాటల్లో సంచరిస్తాయి! దేశభక్తి ఏకేశ్వరోపాసనలతో గుబాళిస్తాయి! ఆ తర్వాత ఉమర్ ఖయ్యాం భావానువాదాలు, అనేక నాటిక సంగీతరూపక గీతాలు, ప్రకృతి అనుభూతులే ప్రధానంగా 'శతపత్రసుందరి'లో వందరేకులుగా వర్ధిల్లినట్లు గోచరిస్తాయి. రజనీగారి 'శతపత్రసుందరి' 1952-53వ సంవత్సరానికి ఉత్తమ ఖండకావ్య సంపుటిగా తెలుగు భాషా సమితి, మద్రాసు ప్రభుత్వపు బహుమతి బడసింది. ఈ సంపుటిలో వసంత పత్రావళి, గ్రీష్మ పత్రావళి, గ్రీష్మ నాటికా గీతాలు, వర్షపత్రావళి, దివ్యజ్యోతి నాటక గీతాలు, శరత్పత్రావళి, శతపత్రసుందరి నాటికా గేయాలు, అవంతి సుందరి నాటికా గేయాలు, కడలిదరి పాటలు, మాళివిక పాటలు, హేమంత పత్రావళి, విషవృక్ష గీతాలు, ఉమర్‌ఖయ్యాం పాటలు, శిశిర పత్రావళి, దేవదాస్ నాటికా గీతాలు, బేహుల నాటికా గీతాలు, లైలామజ్ను గీతాలు, ధర్మచక్ర నాటక గీతాలు, నవవసంత పత్రావళి, అనే శీర్షికలు వరుసగా అగుపిస్తాయి. 260 గీతాలు మృదు మధురంగా పలకరిస్తాయి.

ప్రథమంగా 'వసంత పత్రావళి' శీర్షికలో ఉగాది, వసంత ఋతుహేలలు కోయిల రావాలు, మధు మధురులు, పుష్పసౌందర్యం, ప్రేమ, వలపు, మలయపవనాలు, తొలికోరికల మేలుకొలుపులు, కల్యాణ శోభలు మొదలగునవి వర్ణనాంశాలు. ఈ శీర్షికలోని మొదటిగేయం, 'ఉగాది'. ఉగాది ఉషస్సులు మన మనస్సులలో ఎలా ప్రజ్వలించాలో ఈ గేయంలో వివరించారు. జీవితాలలో కొత్త ఉగాది వసంతంలా విరియాలని ప్రబోధించారు.

ఆలయమున వినబడునదిగో
ఆకసమున కనబడునదిగో
నవవర్షపు ఘంటానినదం
నవ్యాశాజ్యోతి!
ప్రాత యేటి పెను తమస్సులు
పాపకలితములు మనస్సులు
పటాపంచలే!
క్షుభిత హృదయములపై విరిసి
విభుని కరుణ జడులై కురిసె
నవ వసంతమై!
శుభోదయోత్సవ సమయమున
ప్రభూ! యనుచు మధురరవమున కీర్తించుదమా[1]

తేలిక పదాలతో చక్కటి భావాన్ని అందించడం రజనిగారి ప్రత్యేకత! చలన రహితంగా ఏటిలో నిలిచిన పాతనీటిని కదలించడానికి జల్లుగాపడేవాన నీటిలా పెనుచీకట్లలో పాప పంకిలమైన మనస్సులను కడిగేయడానికి భగవంతుని కరుణ జలధారగా కురిసి, లోకమంతా నవ్వుల నవవసంతాలు చిందించే శుభోదయాన్నిస్తుందని, అప్పుడు ఎల్లరూ ఏకకంఠంతో ప్రభూ! అని మధురస్వరంతో భగవంతుణ్ని ప్రార్థించాలంటూ ప్రబోధించారు. ఈ విషయమే వర్ణించబోయే గగన మేఘాలలో ఆలయ ఘంటా నినాదాలలో ఏటి కొత్తనీటి ఆశలా అగుపిస్తోందంటూ స్వరమెత్తి చాటారు. లోకంలోని చింతల చీకట్లను తొలగించి, నవ్వుల వెలుగుల్ని నింపడానికి భగవంతుని కృపయే నవవసంతమై వచ్చిందంటూ వర్ణించారు. ఇలా ప్రభుని ధ్యానించడం, ఆరాధించడం రవీంద్రుని భావవిన్యాసానుకరణమే! రవీంద్రుని భక్తి, భావ, ఏకేశ్వరోపాసన మార్గాల్లో కృష్ణశాస్త్రిలా రజనీగారు కూడ స్వరమెత్తారు.

'తెలుగుతల్లీ! అనే గేయంలో (పుట 7,8) తెలుగుతల్లి కీర్తిని శ్రావ్యంగా శ్లాఘించారు.

పసిడి మెరుంగుల తళతళలు
మిసిమి వెలుంగుల మిలమిలలు
గౌతమి కృష్ణల గలగలలు
గుడి జేగంటల గణగణలు
మెరపి మొరసి మించిన
శుభ సమయము తల్లీ!

అని తెలుగు నేలపై ప్రవహించే నదుల గల గలలు, గుడి గంటల గణగణలు, కవికోకిలల మధురగానాలు, నెమలి క్రేంకారాల వంటి గాయకుల స్వరాలు తెలుగుతల్లి కీర్తిని నర్తింప జేస్తున్నాయని, ఆ తెలుగు తల్లికి స్వతంత్ర

1 శతపత్రసుందరి (రజని గేయములు) ప్రమరణ 1954 పుట 3

ప్రతిపత్తిగల ప్రత్యేక రాష్ట్రం సిద్ధించే సమయమాసన్నమైందని రజనిగారు రమ్యంగా రచించారు.

ఇదే గీతి భావానికి అనుగుణంగా తర్వాత కాలంలో కృష్ణశాస్త్రిగారు 'అమెరికా అమ్మాయి' చిత్రంలో

పాడనా తెలుగు పాట?
మీ యెదుట మీ పాట!

.........................................

కోవెల గంటల గణగణలు
గోదావరి తరగల గల గలలు

అని రచించినట్లు తోస్తుంది.

'శతపత్ర సుందరి' అనే గేయంలో (పుట : 9) ఉదయ సంధ్యలో సువాసనలు వెదజల్లుతూ రేకులు విప్పారిన 'శతపత్ర సుందరి' అనే పద్మం అందాల్ని అందంగా వర్ణించారు. విరిసిన రేకులతో మదిలో రాగభావాల్ని చిందించే నవ్వులు రువ్వుతూ, మన్మథ నిలయంగా భావిస్తున్నదని, ఆ పుష్పసుందరి హృదయంలో మధువుల్ని చిందించిందని, తుమ్మెదలు తన యౌవన మధువుని మరిగేటట్లు, వలపులు ఇనకరాళిలో కరిగేటట్లు సౌందర్యాన్ని సంతరించుకున్న శతపత్ర సుందరిని వర్ణించారు.

శతపత్ర సుందరీ! ఓహో శతపత్ర సుందరీ!
సురభిళ భ్రాంతిలో
సుందర నయనదళ కాంతిలో
ఈ ఉదయ సాంధ్యవేళ మెరిసెలే!
ఈ ఉదయ సాంధ్యవేళ
నా హృదయ భావవేల విరిసెలే!
నా హృదయ భావవేల ॥ శత ॥
నీ మధువు మధుకరాళి మరగెలే!
నీ మధువు మధుకరాళి!
నీ వలపు లినకరాళి కరగెలే!
నీ వలపులినకరాళి!
ఓ శతపత్ర సుందరీ, ఓహో శత పత్ర సుందరీ!

అని సాగిన యీ గేయం ముందుగా కూర్చుకున్న బాణీకి రచించినట్లుగా తోస్తుంది.

ఖండగతిలో కమనీయంగా సాగిన 'కోయిలా' (పుట:13) అనే గేయంలో

పాడవే కోయిలా
పంచమ స్వరమెత్తి
పాడవే కోయిలా!
బయలు పచ్చని మ్రాకు

పాటాలకించేని,
చలన రహిత సదాన
శశియు తిలకించేని,
పాడవే పాడు మవ్యమధుర రవాన
పాడవే!

అంటూ కొసరి కొసరి కోయిలను పాడమంటారు కోయిల పాట చుక్కలను కూడ మైకంలో ముంచెత్తగలదు. అందుకే రాత్రి హృదయం నుండి కదలి హాయిగా జాలిగా, చేలగట్లు దాటి తెరలు తెరలుగా సాగేలా స్వరమెత్త మంటారు తన కలల మధువుతాగే తేటిగా కోయిలను భావించారు. కలల స్వర్గ వీథుల్లో యథేచ్ఛగా సంచరిస్తూ, ఆకలిగా, నిప్పులాగ అంతలోనే మంచులాగ కోరికల కోయిల పాడాలని ఆశించారు. స్వేచ్ఛ, ఆనందం, కోరికల పరంపర అన్నింటినీ కోయిలలో దర్శించారు. అందుకే ఈ భావవర్ణాలన్నీ పంచమ స్వరంలో పాడమని కోయిలను యీ కవికోకిల అర్థించారు.

'ఆరు ఋతువుల ఊయెల' (పుట. 45, 47) గేయాన్ని చతురస్ర గతిలో నడిపారు. తాను వనదేవతయై, ఆరు ఋతువుల ఊయెలను ఊగాలని తియ్యటి కలను వివరిస్తూ, ఊయెలగా మారిన ఆరు ఋతువుల సౌందర్యాన్ని కళ్లకు కట్టించారు.

జీవిత మూయెలగా
ఊగెద తియ్యని కలగా!
ధళ ధళమను మెరుపులలో
ఫెళ ఫెళ మను ఉరుములలో
ఝుర ఝుర పడు ధారలలో
చర చర నర్తించు నెమలినై! ॥ జీ ॥
తెలి మల్లెల పూల తోటలో
చలి పందిరి తేనె యూటలో
తరువు తరువు ఫలాల బరువులో
వరలి మురియు వనదేవతనై ॥ జీ ॥

అని వర్షఋతువులో ధారలుగా కురిసే వానలు, ఉరుములు మెరుపులతో పులకించే ప్రకృతిలో నెమలినై నర్తించాలని ఆశించారు.

శరత్కాల మంటేనే చల్లని, తెల్లని వెన్నెలకు ప్రసిద్ధి ఆకాశం అంతా వర్షాల హోరు జోరుమని అక్కడక్కడా తెల్లని మబ్బులు తిరుగాడే శరదృతువులో తెలి మబ్బుల నురగలలో, వెన్నెల తరగలలో ప్రయాణం చేసే చంద్రనౌకలో శయనించే తారాకోమలిగా మారిపోవాలని అభిలషించారు.

హేమంతరాజు చేయందియగా చేమంతుల దండలతో తెరల తెరల నునుమంచు వలువలో సిరులొలకగా పుడమి చెలువనై హేమంత ఋతువనే ఊయెలపై కలగా ఊగిపోవాలని కాంక్షించారు

ఆకులన్నీ నేలరాల్చి, తలవాల్చి నిలుచున్న చెట్లలో చలి మంటల వెలుగులలో వలపు చిలికించు చెంగలువగా తాను శిశిరమనే ఊయెల ఊగాలని ఆశించారు.

వసంత మొచ్చిందంటే చిగుళ్లతో చెట్లు పచ్చటి వలువల్ని కట్టుకుంటాయి పువ్వుల నవ్వుల్ని రువ్వుతుంటాయి తేనెధారల కోసం తుమ్మెదలు హోరుమంటుంటాయి. తెలిమల్లెల పూలతోటలో. చలిపందిరి తేనె యూటలో తరువులన్నీ ఫలాల బరువుతో వంగి వర్ధిల్లగా, వనదేవతగా ఊయెల ఊగాలని తియ్యని కలగన్నారు యీ గేయంలో

'హరివిల్లు' అనే గేయంలో (పుట 80)

అదిగో లేచెను హరివిల్లు
హరివిల్లు! హరివిల్లు!
ఆకసమందున అందాలొలికే
ఏడు రంగులా హరివిల్లు!
.... ................................... ॥ అది ॥
నేరెడి రసమెవరో విల్లున
నిలువున పూశారే!
పాలపిట్ట రెక్కల నెవరో
బాగుగ కట్టారే! ॥ అది ॥

హరివిల్లులోని రంగులన్నీ పేర్చినట్లున్నాయని, హరివిల్లు సౌందర్యాన్ని తమ భావుకతతో అందంగా వర్ణించారు, రజనిగారు. నేరేడు రసం నిలువునా పూసినట్లు పాలపిట్ట రెక్కల నెవరో కట్టినట్లు, నీలి నీలి పచ్చపచ్చ రంగులతో సముద్రపు పాయో, పొలాల ఛాయో అన్నట్లు చక్కగా మెరిసిపోతున్నదని, పాలవెల్లిలో పసుపు కుంకుమలు అద్దినట్లు సాగివచ్చిన శ్రావణ లక్ష్మికి గొడుగు ఎత్తినట్లు ఆకాశంలో అందాలు చిందే ఏడు రంగుల ఇంద్రధస్సును ఎంతో చక్కగా వర్ణించి కృతార్థులయ్యారు.

'ములగసిర' (పుట · 93) అనే గేయంలో వర్షాకాలపు విజృంభణ కనిపిస్తుంది.

వొచ్చిందా! తిరిగీ వొచ్చిందా!
తొంగి చూసిన ములగసిరకి పొంగి పోయే తొలి మేగం
వొచ్చిందా, తిరిగీ విచ్చిందా?
నల్లా కర్రి యేన్గుల బారో
కొల్లేటీ కొంగల తీరో
అందాల మెరుపు రథాలో
కిందా మీదౌతు నింగి రాలేయా, పొంగి కూలేయా
. ... .. . ......... ... ... . . . ॥ వొ ॥

అని నల్లటి ఏన్గుల బారులాగా, కొల్లేటి కొంగల్లాగా ఆకాశంలో మేఘాలు ఎగురుతున్నాయని, మెరుపుల తళతళలు విజృంభిస్తున్నాయని, రాబోయే వాన హోరుక ఏటి గట్టున నున్న మొల్ల పొద వెల్లువగా నవ్విందని, నవ్వుతూ తన కళ్లతో నవరసాలు రువ్విందని తొలకరి మేఘాల్ని తోలుకు వచ్చే 'మృగశిర' కార్తెను ముదమార వర్ణించారు

'మయూరీ' అనే గేయంలో (పుట : 96) నర్తించే నెమలి నెలతను కమనీయంగా వర్ణించారు. ఇదంతా చదువరులకు ఒక నర్తకియే శాస్త్రబద్ధంగా నాట్యం చేస్తున్నట్లనిపిస్తుంది. చల్లని తడిగాలి పిల్ల మెల్లగా మేను సోకిందని, మయూరి రెక్కల సందున ఏదో చక్కిలిగింత కలిగిందని, ఆకాశంలో వర్షించడానికి పైపైకి అలుముకుంటున్న నీలిమబ్బు దుప్పటిలో మయూరి కలలు తేలిపోతున్నాయని మనోహరంగా వర్ణించారు.

ఉరుముల సడి మెరుపుల వడి
చినుకుల జడి తాళముగా
సరస నీ సఖుడు పురివిడి
వన్నెల కన్నుల చూడగ...

అని వన్నెల కన్నుల పురుల విప్పి సఖుడైన మయూరుడు చూడగా మయూరుని తోడుగా ఆడమని ప్రోత్సహించారు. అందుకే

కటి యిటునటు కదలియాడ
చిరుపదాలు చిందులాడ
వంపుల మెడ సొంపులొలుక
నటనమాడవే మయూరీ!
నటన మాడవే!

అంటూ గళమెత్తి పాడారు. తేమగల తెమ్మెరను 'తడిగాలిపిల్ల' యని వినూత్నంగా అచ్చతెనుగు పదబంధాన్ని కూర్చారు.

'మేఘరంజని' (పుట 107, 108, 109.) I & II పేరుతో రెండు గేయాలు రచించారు. మేఘరంజని I లో భావావేశం, ఆవేశానికి తగ్గట్లు శబ్దాలంకారం చిందులు వేయగా, మేఘరంజని II లో ఏకేశ్వరోపాసన దర్శనమవుతుంది.

'మేఘరంజని' I లోని గేయం నడక కదం తొక్కినట్లు కనిపిస్తుందిలా-

ఘనా ఘనా! ఘనా ఘనా!
గర్జింపవో ఘనాశని!
దిశాంతముల నుండి పైకి
కొసల్ బిగించి లేవనీ!
ప్రశాంత సమీర ప్రసరిత
పయోధర వినీల శాటి! ॥ ఘ ॥
వియత్తలిక తటిల్లతల్
చలచ్చకితలై పారగ

ధరాతలాన వారిధుల్
నభోంగణమ్ము మీరగ
చిటుక్ -చిటుక్ -చిటుక్ చిటుక్
చిద్రుపలొచు చినుకు జడులు
ఝురత్ ఝురత్ ఝురత్ ఝురత్
ఝురులై ప్రవహించు ధార.... ॥ ఘ ॥

అని చివరి చరణాల్లో రావణుని శివస్తోత్ర ధోరణి కనబరచారు. శబ్దాల్ని అనే పనిగా దొర్లించారు.

'దివ్యజ్యోతి' నాటక గీతాల సంపుటిలో చెప్పుకోతగ్గది. 'ఒక్కడవే' అనే గేయం (పుట 142) రవీంద్రుని 'ఏక్‌లా ఛలో' అన్న గీతానికి అనువాదమిది. సమాజం తోడు రాకపోయినా, గొంతు కలుపకపోయినా ఒక్కడవే ఎలుగెత్తి వాస్తవాన్ని చాటమంటాడు కవి మనిషి తాను ఎంతటి దైన్యంతో వున్నా ధైర్యాన్ని కోల్పోక, 'ఎవరూ కేక విని రాకపోయినా సరే ఒకడివె పదవోయ్' అని ప్రబోధించిన గీతమిది

ఒకరయినా నీ కేకకు ఓయని రాకున్నా
ఒక్కడవే బయలుదేరు
ఒక్కడవే బయలుదేరు
ఒక్కడవే ఒక్కడవే ఒక్కడవే బయలుదేరు
............................................................ ॥ ఒ ॥

అంటూ చుట్టూ ఆవరించిన అజ్ఞానపుటంధకారాల్ని చీల్చుకుంటూ ఒంటరిగా ధైర్యోత్సాహంతో ముందుకు సాగిపొమ్మని ఉత్తేజ పరిచారు.

మనసు విప్పిలోలోపలి
మర్మమేదొ కంఠమెత్తి
నీకు నీవె చెప్పవోయి!
పిడుగు మంట కొల్మిలోన
పడిమండే నీ గుండెల
ఒంటిగానె వెలుగనీయి! ॥ ఒ ॥

అంటూ త్రిశ్రగతిలో రవీంద్రుని భావాల్ని ఎంతో రమ్యంగా ఆంధ్రీకరించారు.

'శరత్పత్రావళి' ఖండికలో శరదాగమనం, శరత్కాల సంధ్యలు, స్వప్న జగత్తులోని స్నేహమాధురులు, వలపు వినకనే జారిపోయిన అస్తమయాలు, గగన యానాలు, శతపత్రసుందరికి మేలుకొలుపులు, వెన్నెల రాత్రులు రమ్యంగా చోటుచేసుకున్నాయి

మొదట 'ఆగమనము' అనే గేయంలో (పుట . 147)

చల్లగాలిలో యమునా తటిపై
శ్యామసుందరుని మురళి
ఉల్లము కొల్లగొనే మధుగీతులు

మెల్ల మెల్ల చెవిసోకునవే!

.......................................

మురిసి మురిసి నా వెనుక దరిసి కను
మూయు చివురు కెంగేళులివే!

అంటూ రాలిన వటపత్రముల మీద తేలిపడే అడుగుల గుర్తులు, పూతీగల చాటుగా కనిపించే శిఖిపింఛం, చెట్ల మాటునుండి తనను గమనించే చిలిపి చూపులు, వెనుక నుండి మెల్లగా వచ్చి కళ్లు మూయు చేతులు ఇవన్నీ గోపాలుని రాకను తెలిపే విషయాలు! దూరాన మురళీగీతికతో ఆకట్టుకొని, మెల్ల మెల్లగా చేరువవుతూ మైమరపించే కృష్ణతత్త్వాన్ని గోపికా హృదయంతో వివరించారు.

'విభావరి' (పుట : 148) అనే గేయంలో కదలే చీర చెరగులలాంటి స్వప్నసీమలో భయచ్ఛాయలు-సౌఖ్యభ్రాంతులు ఏల? శాంతియుత వాతావరణంలో తరంగిణిలా - మత్తెక్కిన కురంగిణిలా అలసగమనము - విలాస గమనము ఏల? అని పరస్పర విరుద్ధ ఛాయలలో చల్లని చంద్రకాంత శిలామంటపంలో నిలిచి, యుగయుగాలుగా అగమ్యుడుగా నున్న ఎవరిని వలచి పరిభ్రమిస్తున్నావని విభావరిని ప్రశ్నలతో పరామర్శించారు. 'సౌఖ్యరోచిర్లీల' వంటి చక్కటి పద ప్రయోగాలు చేశారు. ఇదే శ్రీశ్రీ 'కవితా ఓ కవితా'లో రోచిర్నివహంగా, విప్లవ గేయంగా చిందులు వేయగా ఇందులో లాలిత్యంగా సౌఖ్యరోచిర్లీలగా లాస్యం చేసింది.

ఓ విభావరీ! ఓహో విభావరీ!
నీహార హార నీలాంబర
ధారిణీ! మనోహారిణీ!

.......................................

ధరణీతల చంద్రశిలా
తరళ మంటపమున నిలిచి
యుగములుగ పరిభ్రమింతు
వగమ్యుడౌ యెవని వలచి
ఓ విభావరీ! ఓహో విభావరీ!....

అని వెన్నెల రేయిని కన్నుల పండువుగా అభివర్ణించారు.

'మేలుకొలుపు' (పుట · 163) గేయంలో ఉదయకాంతులు ప్రసరించాయని, ఎడదరేకుల్ని విప్పి మధువు చిందించమని, కోడి కూతల మేలుకొలుపులు, తుమ్మెద వంది మాగధుల కైవారాల నడుమ మేలుకొనుమని శతపత్ర సుందరికి మేలుకొలుపు పాడారు.

మేలుకొనవె శత పత్రా!
శతపత్రా! శతపత్రా!
అరుణ తరుణ కోమలగాత్రా!
అలసమీలితాయత నేత్రా! ॥ మే ॥

అని మృదువుగా మృణాళిని తట్టిలేపారు.

'మనమిద్దరమే' (పుట-178) అనే గేయంలో

ఇద్దరమే, మనమిద్దరమే!
నీలి బైలి లోయలలో
చేయి చేయి కలిపి, హాయి
హాయి నొక్కటై పోదము!
తెలి మబ్బు తెరలలో
నెలవంక దోనెలో
కలిసి ఒకటౌదామా?....

అంటూ పాలపుంతలు దాటి, ఎక్కడికో జంటగా వెళ్లిపోవాలని కలగన్నారు తెల్లని మబ్బు తెరలలో, నెలవంక దోనెలో వలపుటుయ్యాలలు వూగి తామిద్దరూ ఒక్కటై పోవాలన్న అనుభూతిని వ్యక్తం చేశారు. ఈ గేయంలో 'నెలవంకదోనె' ఒక విశిష్ట ప్రయోగం. ఆకును దొన్నెగా మడవడం సహజం. కావున కృష్ణశాస్త్రి గారు తమ 'గోపికాన్వేషణ'లో 'తలిరాకుదోనె'ను ప్రయోగిస్తే రజనిగారు శుక్లపక్షంలోని నెలవంకను దోనెగా మలిచారు. ఆ దోనెను వలపుటుయ్యాలగా ఊహించి, అందులో ప్రేయసీ ప్రియులుగా ఊగిపోవాలని భావించారు. 'ఎవరోహో' (పుట : 291) అనే గేయాన్ని చతురస్రగతిలో నడిపారు. మనస్సు కలిచివేసి, హృదయాన్ని ముక్కలు చేసి, ఎదలో జ్వాలలు రేపి, బ్రతుకుని హాలాహలంగా మార్చి, తనను మననీయకుండా చేసి, బ్రతుకు బరువై విషాన్ని మింగబోతే తనను ఆ విషాన్నైనా తాగనీయకుండా 'ఇపుడా నను పిలిచేరు?' అంటూ ఆవేదనను వ్యక్తం చేశారు.

**ఎవరోహో! ఎవరోహో!**
**ఇపుడా నను పిలిచేరు?**

**......................................**

**బ్రతుకే హాలాహలమై**
**బరువై కరవయ్యేనే!**
**ఎవరూ నను మననీరో?**
**విసమైనా తిననీరో?**

ఈ గేయం కృష్ణశాస్త్రిగారి రచనా ధోరణిని గుర్తు చేస్తుంది. దుష్ట సమాజానికి దూరంగా ఎక్కడికో మానసికంగా ఒంటరిగా వెళ్లిపోయిన తనను అక్కడ కూడా 'ఒంటిగా ఏడ్వనీరు నన్ను' అన్న కృష్ణశాస్త్రిగారి కవితా పంక్తుల్ని తలపింపజేస్తుంది.

'అన్నపూర్ణ' (పుట : 317) అనే గేయంలో అన్నపూర్ణగా, విశాలాక్షిగా విశ్వవిఖ్యాతి గాంచిన భారతరత్నగర్భలో ఆకలికేకలు నిర్దయలు చోటు చేసుకున్నాయని, దేశసంపదనంతా దోపిడిదారులు దోచుకుపోతున్నారని వాపోయారు

'అన్నపూర్ణా! విశాలాక్షి! దేవి
కన్నతల్లీ! అహోరత్న గర్భ!
ఆకలను కేకలాకసముతాకె
చీకటుల మూక నల్దెసలు ప్రాకె
చేరదా! నీ శ్రవోయుగళిదాక!
పారదా! నీ కృపాకాంతి రేఖ!

అని ఆకలితో ఆక్రందించే ప్రజల ఆర్తి నీ చెవికి వినబడడం లేదా? బ్రతుకులోయలో నుండి బైట పడడానికి యత్నించే దీనులు కనబడడంలేదా? అని దేశమాతను ప్రశ్నించారు. కృపాకాంతుల్ని ప్రసరించమని ప్రార్థించారు. నేటి దౌర్భాగ్యస్థితిని తొలగించి, పూర్వ ఔన్నత్యాన్ని పొందమని నైరాశ్యంలోనే ఆశల్ని గుప్పించారు.

చివరి ఖండికయైన 'నవవసంత పత్రావళి'లో 20 దేశభక్తి గేయాలు రచించారు. 'మహోదయం' (పుట : 341) అనే మొదటి గేయంలో -

మహోదయ మాయెనహో! అహో!
శుభోదయ మాయెనహో!
......................................
తూరుపు వాకిలి బంగరు తలుపుల
జయ గంటల గణగణలోన

అని స్వాతంత్ర్య కిరణాల వెలుగులలో శుభోదయాన్ని మహోదయంగా అభివర్ణించారు.

'స్వతంత్ర భేరి' (పుట . 346) అనే గేయంలో

మ్రోయింపు జయభేరి!
వాయింపుము నగారా!
తేలింపుము నభోవీధిని త్రివర్ణాంచిత పతాకా!
భారతదేశ స్వేచ్ఛాసూర్యునాచ్ఛాదించు రాహుచ్ఛాయ
అంతర్ధానమాయె! అంతర్ధానమాయె!

అని భారత భారతికి బానిసత్వపు సంకెళ్లు తెగిపోయినందుకు జయభేరి మ్రోగించమంటూ, స్వార్థాన్ని-సౌఖ్యాన్ని వదలి, స్వతంత్ర సంగ్రామాన వీరస్వర్గమలంక రించిన ధీరులకు జోహార్లు అర్పించమని, జగమంతా శాంతి కాంతి ప్రసరించగా జయభేరి మ్రోగించమని ఎలుగెత్తారు. పద్యాల మాదిరి దీర్ఘసమాసాల్ని హర్షాతి రేకంతో యీ గేయంలోనూ గుప్పించారు.

'సరోజిని' అనే గేయంలో (పుట : 358) వీరనారి, స్వతంత్ర సమర యోధురాలు, కవయిత్రియైన సరోజినీ నాయుడు త్యాగాన్ని, దేశసేవానిరతిని ప్రస్తుతించారు.

అందుకొనుము ఈ సుమాంజలి!
అమర గాయనీ! సరోజిని!

వీరనారివై స్వతంత్రతా
ఘోర రణంబున పోరితివి
విదేశీయులకు భారతవిదుషీ
వికాసమును ప్రకటించితివి!

అంటూ ఈ స్తుతి గీతాన్ని త్రిశ్రగతిలో రచించారు.

'ఉగాది' (పుట 365) అనే ప్రసిద్ధి గాంచిన గేయాన్ని చతురస్రగతిలో చకచకా నడిపించారు.

స్వతంత్ర భారత జననీ! నీకిదె
నితాంత నవ నీరాజనము
అశేష పూజా శిరీషములతో
అగణిత నరనారీజనము
............ ................ ....... ..
వాడ వాడ నీ హృదిలో మేడల
నేడు త్రివర్ణ పతాకములే! ॥ స్వ ॥

అని సుమారు 300 సంవత్సరాల దాస్య శృంఖలాలన్నీ తెగిపోగా, దైన్యపు చీకట్లు చెల్లా చెదరయ్యాయని, హిమాలయాలనుండి కన్యాకుమారి వరకు భరత ఖండం ఒక్కటిగా ఆనందతరంగాలలో ఓలలాడిందని స్వతంత్ర భారతాన్ని కీర్తించారు. శౌర్యానికి జేగురు రంగు, శాంతికి తెలుపురంగు, సస్యసంపదకు పచ్చని రంగు ప్రతీకగా సూచిస్తూ త్రివర్ణ పతాకం కర్మభూమికి గుర్తుగా చక్రాన్ని మధ్యలో ధరించిందని, ఏవాడలో చూసినా మేడలో చూసినా మువ్వన్నె జెండాల రెపరెపలే సాక్షాత్కరించాయని తనివి దీరా ప్రస్తుతించారు.

'స్వాతంత్ర్య ఘంట' (పుట : 267) అనే గేయంలో

స్వాతంత్ర్య శుభోదయ ఘంటా
నాదంబదె మ్రోగెను మింట
టంఠం-టఠం-టరటం!
టంఠం-టఠంఠం!

అని స్వాతంత్ర్య ఘంటారావాన్ని వినగానే కొత్త ఆశలు చిగురెత్తాయని, జనుల శిరాలు భారతి పాదాలపై కొరిగి మ్రొక్కాయని, కరాలు మాతృదేవికి హారతులు పట్టాయని, విద్వేషాలు సమసి ప్రశాంత వదనాలతో భారతిని విలోకిస్తున్నారని, కీర్తిపతాక ధర్మచక్రంతో రెపరెపలాడుతోందని, సత్యాహింసలె ఆయుధాలుగా స్వాతంత్ర్యాన్ని సాధించిన గాంధీని కన్నతల్లియగు భారతికి స్వాగతంగా 'శుభోదయ ఘంట' నాదంగా మ్రోగిందని ఆ నాదాన్ని అడుగడుగునా 'టంఠం-టంఠం-టఠటం' అంటూ శబ్దరూపంగా చెవులకు వినిపింపజేశారు.

రజనీగారి దేశభక్తి గేయాలలోని 'స్వాతంత్ర్యోత్సవ పుష్పాంజలి' (పుట. 371) ఆ రోజుల్లో దేశం నలుదిశలా టంగుటూరి సూర్యకుమారి గళంలో మారు మ్రోగిన గేయం-

మాదీ స్వతంత్ర దేశం
మాదీ స్వతంత్ర జాతి!
భరత దేశమే మాదేశం
భారతీయులం మా ప్రజలం!
......................................
ఆలయమ్ముల శిల్ప విలాసం
ఆరామమ్ముల కళా ప్రకాశం
మొగల్ సమాధుల రసదరహాసం!
మాకు నిత్యనూతనేతిహాసం!! ॥ మా ॥

అని వింధ్యాది పర్వతాల నడుమ ఎగిసే సంధ్యారుణిమలాంటి ఆశలు మావి, గంగాది నదులలాగ ఉత్తుంగ తరంగాలతో ఎగిసిపడే హృదయాలు మావి, ఆలయ శిల్పకళావిలాసం ఆరామాల ప్రకాశం, మొఘల్ సమాధులు చెప్పే 'తాజ్‌మహల్' లాంటి రసవత్తర చారిత్రక సత్యాలు మాకు నిత్యనూతన ఇతిహాసాలని 'అహింసా పరమోధర్మః' , 'సత్యంవద-ధర్మంచర' ఇత్యాది వేదోక్తులు ఎప్పటికీ శిరోధార్యాలనీ, స్వతంత్రం, సౌభ్రాతృత్వం, సమత అనేవి మా సదాశయాలంటూ, అందుకే భారత భారతికి నివాళులు అర్పిస్తున్నామంటూ సంగీత సాహిత్యాన్ని సమంగా రంగరించారీ గేయంలో. గేయం మొత్తం చతురస్ర గతిలో చక్కగా నడచింది. ఈ గీతం గ్రామఫోన్ రికార్డుగానే గాక ఆకాశవాణిలోనూ అనేకసార్లు ప్రసారమై అఖిలాంధ్రుల మన్ననలందుకున్నది. రజనీగారి లలితగేయాలు లలితగీత ప్రక్రియకు తగిన ప్రచారాన్ని అనుకూల విస్తారాన్ని కలుగజేశాయి.

రజనీ గారి గేయాల్లో సరళత, స్పష్టత, సంగీత నిబద్ధత స్పష్టంగా గోచరిస్తాయి. రజనీగారు చాలావరకు ముందుగా బాణీల్ని ఏర్పరచుకునే వాటికి తగిన పదాల్ని కూర్చుకున్నట్లు తేటతెల్లమవుతోంది. అందుకే ఏ గీతమూ సమ మాత్రల్లో సామాన్య గతుల్లో నడిచినట్లు తోచదు.

బాలాంత్రపు రజనీకాంతరావుగారు వృత్తిరీత్యా ఆకాశవాణిలో లలితగీత కార్యక్రమాల ప్రయోక్తగా చాలాకాలం పనిచేసిన కారణాన వారు స్వయంగా రచించడమే గాక ఇతరుల గీతాల్ని కూడ స్వరపరచి ప్రసారం చేశారు. కృష్ణశాస్త్రికి కుడిభుజంలా మసలారు. అందుచేత వికసిత 'లలితగీత' విస్తారానికి పట్టుగొమ్మలా నిలిచారు. పది కాలాలపాటు ఈ ప్రక్రియను నిత్యనూతనంగా నిలిపారు.

## శ్రీశ్రీ : (1910) :

కార్మిక శ్రామిక వర్గపు కవిగా, విప్లవ మార్గపు రవిగా ఖ్యాతిగాంచిన శ్రీశ్రీ రచించిన 'మహాప్రస్థానం' Free Verse గా ముద్రపడినా అధిక భాగం మాత్రాబద్ధమైనదే! కాపున మహాప్రస్థానంలోని అనేక కవితలు గేయాలుగా నిలుస్తాయి. గీతాలుగా తాళ-లయ సమన్వితంగా పలుకుతాయి 'మహాప్రస్థానం' అనే మొదటి గేయంలో (పుట : 17)

మరో ప్రపంచం, మరో ప్రపంచం 4+4+4+4 మాత్రలు
మరో ప్రపంచం పిలిచింది 4+4+4+1 మాత్రలు
పదండి ముందుకు పదండి త్రోసుకు 4+4.4+4 మాత్రలు
పోదాం పోదాం పైపైకి! 4+4+4+1 మాత్రలు

అని తోటి మానవుల్ని ఉన్న ప్రపంచంలో నుంచి మరో ఊహా ప్రపంచానికి కొత్తదారిలో తీసుకువెళ్తారు. సరికొత్త విలోమగతిలో మార్గాన్ని చూపుతారు. ఆ మార్గంలో ఎదురయ్యే

నదీ నదాలూ, అడవులు - కొండలు
ఎడారులా మనకడ్డంకి?

అని ప్రశ్నిస్తారు.

ఎముకలు క్రుళ్ళిన, వయస్సు మళ్లిన
సోమరులారా! చావండి!
నెత్తురు మండే, శక్తులు నిండే
సైనికులారా! రారండి!

అని శక్తులుడిగిన వారిని, సోమరుల్ని చావమంటూ ఉడుకు నెత్తురు ఉరకలెత్తే సైనికుల్ని రమ్మంటూ స్వాగతం పలుకుతారు.

త్రాచుల వలెనూ, రేచుల వలెనూ
ధనంజయునిలా సాగండి!
కనబడలేదా మరో ప్రపంచపు
...............................................
ఎర్రబావుటా నిగనిగలు

అని త్రాచుల్లా, రేచుల్లా ధనంజయుల్లా సాగి ఎర్రజెండా ఎగిరే మరో ప్రపంచాన్ని చేరుకొమ్మంటారు. కమ్యూనిస్టు గీతంలా అగుపించే యీ గేయం చతురస్రంలో సాగింది.

శ్రీశ్రీ రాసిన గేయాలలో చెప్పుకోతగినవి, పాటకు ఒదిగేవి చాలా ఉన్నాయి మచ్చుకు 'మహాప్రస్థానం'లోని మరికొన్ని శీర్షికల్ని పరిశీలిస్తే, భిన్న గతి-లయలలో, ఆ గేయాల ఒరవడి ఎలా సాగిందో తెలుస్తుంది. శ్రీశ్రీ గేయాల్లో కొన్ని ఒకే బాణీలో ఒకే భావంతో సాగితే, మరికొన్ని అడుగడుగున భిన్న భావాభివ్యక్తితో, భిన్నలయలతో నర్తిస్తాయి. ఈ భిన్నభావ, భిన్నలయ, గతి 'జయభేరి' లో కనిపిస్తుంది (పుట : 21)

'జయభేరి'లో మొట్టమొదటి 3 చరణాలు,చిట్ట చివరి 3 చరణాలు ఒకే గతి ఒకే లయలో మిశ్రమంలో నడుస్తాయి.

నేను సైతం 3+4=7
ప్రపంచాగ్నికి 3+4=7
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను 3+4+3+5=15
నేను సైతం 3+4=7

| | |
|---|---|
| విశ్వ సృష్టికి | 3+4=7 |
| అశ్రువొక్కటి ధారపోశాను! | 3+4+3+5=15 |
| నేను సైతం | 3+4=7 |
| ప్రపంచాబ్జపు | 3+4=7 |
| తెల్లరేకై పల్లవిస్తాను | 3+4+3+5=15 |
| నేను సైతం | 3+4=7 |
| విశ్వవీణకు | 3+4=7 |
| తంత్రినై మూర్ఛనలు పోతాను! | 5+5+5=15 |
| నేను సైతం | 3+4=7 |
| భువన భవనపు | 3+4=7 |
| బావుటానై పైకిలేస్తాను | 3+4+3+4+1=15 |

'తంత్రినై'...పాదంలో ఖండగతి ప్రవేశించింది. కాని అక్షరాలను కాస్త సవరించి పాడితే ఒకటేలయ కనిపిస్తుంది. తంత్రినై మూర్ఛనలు పోతాను. పాదాన్ని తంత్రి+నైమూ+ర్ఛనలు+పోతా+ను-ఇలా పదాలు విరిచి, అక్షరాలు ముందు పదాలకు జరిపితే మిశ్రగతికి సరిపోతుంది. లయ కూడా సరిపోతుంది.

ఈ 'జయభేరి' అంతా ఇదే గతిలో సాగలేదు. మిశ్ర ఛందంలో సాగుతూ చివరి పాదంలో చివర 3+4కి బదులు 3+5గా రచన చేసినా గేయమంతా ఇదే పద్ధతి పాటించలేదు. హఠాత్తుగా ఒక భావ వ్యక్తీకరణ ముగించి, మరొక భావ వ్యక్తీకరణ చేస్తూ దానికి తగ్గట్టు గతిని, కొంత భిన్నంగా మార్చటం వల్ల లయ కూడ మారింది. గేయంలో హఠాత్తుగా కొత్తవిరుపు, ఉద్వేగం, భావాన్ని నొక్కి చెప్పడం కనిపిస్తాయి. అంటే మొదటి చరణాల్లో వినిపించిన భావ వ్యక్తీకరణ లయకు భిన్నంగా తరువాతి చరణాల్లోని భావవ్యక్తీకరణ లయ ఉంటుంది. దీనికి కారణం మిశ్రగతిలో నడిచే నడకే అయినా ఆ ఛందానికి కలిగించే విరుపు వల్ల లయ, భావోద్వేగం మారాయి.

మొదటి 3 చరణాలు 'సమిధని ఆహుతివ్వడం', 'అశ్రువుని ధారపోయడం' 'వెర్రి గొంతుక విచ్చి మ్రోయడం', అనే పనులు సామాన్య శ్రామికుని ఆత్మ విశ్వాసాన్ని శ్రామికతత్వాన్ని చాటుతాయి. ఆ తరువాతి చరణాలు ఇందుకు భిన్నంగా ఆ సామాన్య శ్రామికుడు ఇంతదాకా తాననుభవించిన దైన్యాన్ని వెల్లడిస్తాయి. అందుకే వీటిలో శ్రామికుడు సమాజాన్ని ప్రశ్నించడమే కనిపిస్తుంది. ఆ శ్రామికుడు సమాజం మీద కురిపించే ప్రశ్నలకు తగ్గట్లు గతి విరుపు కూడ మారింది అంటే భావం మారింది. భావంతో పాటు గతి, విరుపు, లయ కూడా మారి గేయానికి కొత్త ఊపు, మలుపు సిద్ధించాయి. ఉదాహరణకు ఇదే గేయం లోని రెండవ ఖండాన్ని చూస్తే -

| | |
|---|---|
| ఎండకాలం మండినప్పుడు | 3+4+3+4=14 |
| గబ్బిలం వలె | 3+4=7 |
| క్రాగి పోలేదా? | 3+6=9 |

"...నీరు కాలేదా?" "...ఆకలేసి కేకలేశానే?" అనే రెండు చరణాలు ఇదే విరుపులో 3+4, 3+4, 3+4, 3+6 గా కనిపిస్తాయి.

మూడు పంక్తులకు ఒక భావఖండాన్ని పూర్తిచేసి, మరొక భాగాన్ని (భావఖండం) చెప్తూ మళ్లీ కొత్త విరుపు చూపించారు శ్రీశ్రీ.

| | |
|---|---|
| నేనొకణ్ణే | 3+4=7 |
| నిల్చిపోతే | 3+4=7 |
| చంద్రగాడ్పులు, వాన మబ్బులు, మంచుసోనలు | 3+4.3+4.3+4=21 |
| భూమి మీదా | 3+4=7 |
| భగ్గుమౌతాయి! | 3+5=8 |

తరువాతి చరణాల్లో కూడ చివరి పాదం 3+5గానే ఉంది గాని పాదాల విరుపు మొదటి మూడు పాదాల్లో 3+4 3+4. గా రాదారు. శ్రామికులంతా సంఘటితంగా ఐక్యమై ఒక్కటిగా నిలబడితే ఈ ప్రపంచంలో సంభవించే మార్పు ఏమిటో ఈ చరణాల్లో వివరించారు శ్రీశ్రీ ఇదంతా శ్రామికుడు సమాజానికి చేసే హెచ్చరిక.

| | |
|---|---|
| నింగి నుండీ తొంగి చూచే | 3+4+3+4=14 |
| రంగు రంగుల చుక్కలన్నీ | 3+4+3+4=14 |
| రాత్రి నెత్తురు క్రక్కుకుంటూ | 3+4+3+4=14 |
| పేలి పోతాయి!... | 3+4+1=8 |

అని కార్మికుడు కళ్లెర్ర జేస్తే నింగి చుక్కలనే కలవాళ్లు రాలిపడతారని ముత్యాల సరంలో చెప్పారు. శ్రామికుడు తాను సాధించిన విజయగీతి తంత్రులపై మీటి, పతాకలుగా ఎగురవేసి ప్రపంచశాంతికి పాటు పడడం అనేది చిట్టచివరి మూడు చరణాల్లో కనిపిస్తుంది. ఇక్కడ గతి మొట్ట మొదటి చరణాలలో లాగే ఉంది.

| | |
|---|---|
| నేను సైతం | 3+4=7 |
| ప్రపంచాబ్జపు | 3+4=7 |
| తెల్లరేకై పల్లవిస్తాను | 3+4+3+5=15 |

'అవతారం' గేయం (పుట:24) కూడ 3+4 మిశ్ర ఛందంలోనే నడిచింది. కాని పదాల విరుపుల ప్రయోగంతో మరోకొత్త బాణీని, తూగును శ్రీశ్రీ సాధించారు. ఇందులో మొదటి మూడు చరణాలలో గతి ఒక విధంగా సాగించి విప్లవానికి బాట వేయడం సూచించారు. లోహ గంటలు ఖణేల్ మనడం, జాగిలాలు ఉరికి పడడం, సూర్యుని సప్తహయాలు పరుగు పెట్టడం కదిలే విప్లవసేనగా చిత్రించారు. వీటిలో గతి-

| | |
|---|---|
| యముని మహిషపు లోహగంటలు | 3+4+3+4=14 |
| మబ్బు చాటున | 3+4=7 |
| ఖణేల్ మన్నాయి | 3+5=8 |

'మబ్బు చాటున ఖణేల్ మన్నాయి' అని రెండవ, మూడవ పాదాన్ని కలిపి ఒకటిగా చేయవచ్చు. అలాగే మిగతా చరణాల్ని కూడ రాయవచ్చు. కాని అలా చేయలేదు. వైవిధ్యం కోసం సాగే ఈ విప్లసేనని చూసి చైతన్యవంతులైన మరికొందరు దాస్యవిముక్తికోసం మేల్కొనడం తర్వాతి పాదాల్లో రాయకుండా మొత్తం ఒకే పాదంలో పొడుగ్గా రాసి రెండు చరణాలని రెండు పొడుగు పాదాలుగా రాశారు శ్రీశ్రీ. ఇదొక ప్రయోగం. ఇలాంటి పొట్టి, పొడుగు పాదాల విన్యాసమే వచన కవితకు మార్గదర్శకమైంది. ఉదాహరణకు -

**కనక దుర్గా చండ సింహం జూలు దులిపి, ఆవులించింది!**
**ఇంద్రదేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది!**

ఈ చరణాలు కూడ పై గతిలోనే నడిచాయి. కాకపోతే వాటిని ఛందోనుగుణంగా విరగ్గొడుతూ భావోద్వేగం కోసం ఒకే పాదంగా మలిచారు శ్రీశ్రీ.

తరువాతి చరణాల్లో ఇదే మిశ్రగతి ఛందాన్ని పాదాల విరుపుతో-

| | |
|---|---|
| **నందికేశుడు** | **3+4=7** |
| **రంకె వేస్తూ** | **3+4=7** |
| **గంగడోలును కదిపి గెంతేడు!** | **3+4+3+5=15** |

అని ఈ గేయానికి కొత్త వేగాన్ని కూర్చారు. అలాగే పాటకు పనికొచ్చే మరో గేయం 'నవకవిత' (పుట : 26)

| | |
|---|---|
| **సిందూరం, రక్త చందనం** | **6+8** |
| **బంధూకం, సంధ్యారాగం** | **6+8** |
| **పులిచంపిన లేడి నెత్తురూ** | **6+8** |
| **ఎగరేసిన ఎర్రని జెండా** | **6+8** |
| **రుద్రాలిక నయన జ్వాలిక** | **6+8** |
| **కలకత్తా కాళిక నాలిక** | **6+8** |
| **కావాలోయ్ నవకవనానికి** | **6+8** |

అని కమ్యూనిస్టులు అభిలషించే అరుణిమను, అధునాతన చైతన్యాన్ని, నవకవితకు ఊపిరిగా చేయాలన్నారు.

కేవలం చతురస్రంలో నడిచే 'కళారవి' గేయం ఒక శబ్ద చమత్కారం మాత్రమే.

**పోనీ పోనీ**
**పోతే పోనీ**
**సతుల్, సుతుల్, హితుల్ పోనీ**
**పోతే పోనీ**

శ్రీశ్రీ 'ఒకరాత్రి' (పుట:54) గేయం ఆద్యంతం వరుసగా 3 ఇంద్రగణాలు ఒక సూర్యగణంతో నిండి మంజరీ ద్విపదలోనే నడిచింది.

గగనమంతా నిండి
పొగలాగు క్రమ్మి
బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను!

పాటకి ఒదిగే చక్కటి గేయం "నీడలు" (పుట 62) యుగాల దోపిడిలో నరనరాల రాపిడిలో నలిగిన పేదల దుస్థితికీ గేయం అద్దం పడుతుంది. నరనరాలలో వేదన, తరతరాలుగా రోదన తరగెత్తడంతో నిరుపేదలు బక్కచిక్కి, మనోధైర్యాన్ని కోల్పోయి శిథిలమైన గోడల్లాగా సమాజంలో నిలబడ్డారు. వాళ్ల బతుకుల్లాగే వాళ్ల వాడలు కూడా పాడుబడ్డాయి. వాళ్ల నీడలు పూలులేని (సంతోషం లేని) కాడలు. అందుకే ఆ కాడలు సూర్యునితో క్రీడలు సాగించి, సూర్యునిలో సూదులతో క్రీడలాడే నీడలై మండే గోళాలై తిరుగుబాటుకోసం ఉడుకెత్తుతున్నాయని శ్రీశ్రీ అభివ్యక్తీకరించారు ఇది చక్కటి శ్రుతి-గతి కలిగిన పాట.

చూడు చూడు నీడలు!
నీడలు - పొగ మేడలు!
యుగయుగాల దోపిడిలో,
నరనరాల రాపిడిలో,
.................................
చూడు చూడు నీడలు
పేదవాళ్ల వాడలు
నరనరాల వేదనలో
తరతరాల రోదనలో
.................................
పడిన బతుకు గోడలు!
పాడుపడ్డ వాడలు!
.................................
చూడు చూడు నీడలు
పూలు లేని కాడలు

ఈ గేయమంతా పేదల దైన్యం ధ్వనిస్తుంది. విషాదం, విప్లవం రెండూ సమపాళ్లలో సాగిన గేయమిది.

'శైశవగీతి' గేయం 'Free verse' లా సాగే చతురస్రగతి గీతం.

| | |
|---|---|
| పాపం పుణ్యం, ప్రపంచ మార్గం | 4+4+4+4=16 |
| కష్టం సౌఖ్యం, శ్లేషార్థాలూ | 4+4+4+4=16 |
| ఏమీ ఎరుగని పూవుల్లారా | 4+4+4+4=16 |
| అయిదారేడుల పాపల్లారా | 4+4+4+4=16 |

బాల్యంలోకి తొంగి చూడడం ఒక మానసిక అవస్థ. "గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్" లాగ కవి తనలోని దైన్యాన్ని, స్తబ్ధతని తట్టుకోలేక గత స్మృతులు తవ్వుకొని, తవ్వుకొని బాల్యానికి వెళ్లి, ఒక్కసారి తన క్రోనలాజికల్ ఏజ్ (C.A.= అసలు వయస్సు) నుండి మెంటల్ ఏజ్ (M.A. = మానసిక వయస్సు)లో వెనక్కి వెళ్లిపోతారు.

**....పాతాళానికి పల్టీకొట్టీ**
**వైతరణీనది లోతులు చూస్తూ,**
**శాంతము లేకేకాంతముగా,ది**
**గ్భ్రాంతిలో మునిగి గుటకలు వేస్తూ**
**మెటికె విరుస్తూ ఇట కూర్చుండిన**
**నను చూస్తుంటే నవ్వొస్తుందా?**

అని ఎక్కడో కవి తన జీవితం తిరగబడిందని ఖేదపడ్డాడు. ఒక 'డిప్రషన్'లోకి జారిపోయాడు. ఏదో మానసిక దైన్యంలో కొట్టుమిట్టాడి ఓడి, విసిగి బాల్యంలోకి పరుగెత్తి దాక్కుని తన ఎదురుగా లేని పసితనంతో మాట్లాడిన మాటలివి. ఈ గేయం పిల్లల కోసం రాయలేదు. అందమైన బాల్యాన్ని చిత్రించటానికి అసలే కాదు. మానసిక వత్తిడి తట్టుకోలేక డిప్రషన్‌లో నలిగి-

**నాకు కనంబడు నానాతారక**
**లనేకవర్ణా, లనంతరోచులు,**
**దిక్కుదిక్కులా దివ్యగీతములు**
**మీరూ వీటికి వారసులే! ఇవి**
**మీలో కూడా మిలమిలలాడును!**

అవి తనకొక్కడికే కాదు, ప్రతివారిలోనూ మిలమిలలాడుతా యంటాడు. పైకి అతి సాధారణంగా కనిపించే ఈ రచనలో శ్రీశ్రీ ఆవేదన చిన్ననాటి నివేదన అగుపిస్తుంది.

'పేదలు' (పుట:67) అనేగేయం స్విన్‌బర్న్ గీతానికి అనువాదమే అయినా అందంగా అచ్చమైన గీతంగా తోస్తుంది.

**అంతేలే పేదల గుండెలు**
**అశ్రువులే నిండిన కుండలు**
**శ్మశానమున శశికాంతులలో**
**చలిబారిన వెలిరాబండలు**

......................................

**అంతేలే పేదల బ్రతుకులు**
**తిరిపెమునకు పిడికెడు మెతుకులు**

పేదల గుండెలు కన్నీటి కుండలని వారి బ్రతుకులు బిచ్చమెత్తుకునే పిడికెడు మెతుకులని శ్రీశ్రీ దయనీయంగా, ఆర్ద్రంగా అభివర్ణించారు. ఈ గీతం ప్రేరణతో ఇదే ఆర్ద్రతతో డా.సి.నా.రె.గారు 'పుణ్యవతి' సినిమాలో ఒక పాట రాశారు ' 'ఇంతేలే నిరుపేదల బతుకులు' .అని

A.C. Swinburne మార్గంలోనే రాసిన మరో మంచిగీతం 'అద్వైతం' (పుట : 70)

ఆనందం అర్ణవమైతే 6+8
అనురాగం అంబరమైతే 6+8
అనురాగపుటంచులు చూస్తాం 6+8
ఆనందపు లోతులు తీస్తాం 6+8

అని అనురాగాకాశపు అంచులు చూస్తామంటూ-ఆనంద సముద్రపు లోతులు తీస్తామంటూ అందంగా, ఆశాజనకంగా భావాన్ని అభివ్యక్తీకరించారు.

'దేశచరిత్రలు' (పుట . 73) గేయంలో గతచరిత్రనంతా చిత్రిక పట్టారు. 'నరజాతి చరిత్ర సమస్తం-ఒకరి నొకరు దోచుకోవడమేనని - చంపుకోవడమేనని సర్వం స్వార్థపూరితమేనని వివరించారు. ఇదంతా ఒక సంఘర్షణ ఫలితంతో సంభవించిన మార్పుగా ప్రకటించారు. దాని వెనుక ఉన్న గతి తర్కాన్ని విశ్లేషించారు.

ఏదేశచరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం
..........................................
ఏ శిల్పం? ఏ సాహిత్యం?
ఏ శాస్త్రం? ఏ గాంధర్వం?
ఏ వెల్లువలకీ ప్రస్థానం?
ఏ స్వప్నం? ఏ దిగ్విజయం?

అని తరతరాల మానవజీవన ప్రస్థానంలో సాధించిన స్వప్నాలు, విజయాలు అసలే లేవని బల్లగుద్ది చెప్పారు.

'మహాప్రస్థానం'లో మాదిరిగా గత వైభవాన్ని తలపోస్తూ వర్తమానంలో కనుమరుగైపోయిన భారతమాత ఔన్నత్యాన్ని వివరించే పాట 'ఏవి తల్లీ!' అనే శీర్షికతో 'ఖడ్గసృష్టి'లో అగుపిస్తుందిలా -

"ఏవి తల్లీ? ఏవి తల్లీ?
నిరుడుకురిసిన హిమ సమూహములేవి తల్లీ?
చక్రవర్తి అశోకుడెచ్చట?
జగద్గురు శంకరుండెచ్చట?
కాళిదాస మహాకవీంద్రుని
కవన వాహినిలో కరింగిన
ఉజ్జయిని నేడెక్కడమ్మా?
ఉంది, చూపించూ!
..........................................

రుద్రమాంబా భద్రకాళీ
లోచనోజ్జ్వల రోచులేవీ?
ఖడ్గ తిక్కన కదనకాహళ
కహకహ ధ్వనులెక్కడమ్మా?
.............................. .........
బాలచంద్రుని బ్రహ్మనాయని
ప్రాణ వాయువు లేవి తల్లీ?
పసిడి రెక్కలు విసిరి కాలం
పారిపోయిన జాడలేవి?
ఏవి తల్లీ! ఏవి తల్లీ?

అని ఒకనాటి స్వర్ణకాంతులు, శౌర్యమూర్తులు నేడు కానరాకపోగా, కలత చెందిన భారతదైన్యాన్ని మిశ్రగతిలో వివరించారు.

"మహాప్రస్థానం"లోని 'నిజంగానే' (పుట:39) గేయాన్ని

"నిజంగానే నిఖిల లోకం
నిండు హర్షం వహిస్తుందా?
మానవాళికి నిజంగానే
మంచికాలం రహిస్తుందా?"

అని మిశ్రగతిలో నడిపించారు. ఇందులో 'బానిసత్వపు సంకెళ్లు తెగిపోయే కాలం వస్తుందా? సాధుసత్వపు సోదరత్వపు స్వాదుతత్త్వం జయిస్తుందా? నవ చైతన్యపు నౌక కడలి సుడులనే ఒడుదొడుకులను ఎదుర్కొని తీరాన్ని చేరుతుందా? నిఖిల లోకం నిండు హర్షంతో జీవిస్తుందా?' అనే ఆశాభావాన్ని ప్రశ్నార్థకంగా పలికించారు. నాటి శ్రీశ్రీ ప్రశ్నార్థకం రాను రాను సమాజంలో మార్పు జరిగి అంతో యింతో నేటికి సమాధానార్థకంగా నిలిచిందని చెప్పవచ్చు! కాని వ్యాకరణాల నడ్డి విరగ్గొట్టాలని, ఛందస్సుల సర్పపరిష్వంగాల్ని ఛేదించాలని విరుచుకుపడ్డ శ్రీశ్రీ 'మహాప్రస్థాన'మంతా పాత ఛందస్సుల్ని కాలదన్నలేకపోయింది. కనీసం 'మంజరీ ద్విపద' గణాల్ని కూడ విడనాడలేకపోయింది. శ్రీశ్రీ స్వచ్ఛందంగా రచన సాగించినా కవితలన్నీ మాత్రాబద్ధమై, గణనిబద్ధమైనట్లుగా, అనేక ఖండికల్లో అక్షర సత్యాలుగా నిలిచాయి.

## వింజమూరి శివరామారావు : (1908)

మేనమామయైన దేవులపల్లి కృష్ణశాస్త్రి ఒరవడిలో అందంగా గీతాలల్లడంలో సిద్ధహస్తుడని పేరు తెచ్చుకున్న శ్రీ వింజమూరి శివరామారావు గారు విజయవాడ ఆకాశవాణి కేంద్రం ద్వారా ప్రసారమైన తన అనేక లలితగీతాల్ని 1958లో 'కల్పవల్లి' (గీతికాలతాంతాలు) పేరుతో వెలువరించారు. అందులో మొదట శ్రీహరిని, శివుడిని ప్రార్థించారు యిలా

"నటరాజా! శివ! సాంధ్యనటా!
నమోనమోభవ! గాంగజటా!

ప్రణవాంచిత మందిరవర్తీ!
ప్రణయాశ్రిత సుందరమూర్తీ!"[1]

సంధ్యవేళ నర్తించే నటరాజును 'సాంధ్యనటా!' అని గంగాధరుడైనందున 'గాంగజటా!' అని సంబోధించడం నవ్యంగా వుంది ఓంకార మందిరుడని, శృంగార ప్రియుడని అందమైన పదబంధాలతో కీర్తించడం దివ్యంగా వుంది.

శాంతి, అహింసలతో స్వాతంత్ర్యాన్ని సాధించి పెట్టిన గాంధీ గారిని మనసారా స్తుతించారు (పుట 3)

ఓ నవభారత జాతిపితా!
మానవనుత - లోకైక హితా! ॥ ఓ ॥
శాంతి యహింసలు సూర్యచంద్రులై
కాంతి నొసంగె జగమ్మునకూ...
నరులందరు సోదరులై వరలే
పరమార్థము చాటించి నావయా!... ॥ ఓ ॥

అని గాంధీని లోకైకహితుడని, మానవులంతా సోదరులుగా మసలాలనే పరమార్థాన్ని చాటించాడని, శాంతి-అహింసల్ని సూర్యచంద్రుల కాంతిగా వెలిగించాడని వినుతించారు. అలాగే భారతమాతయగు భారతికి నీరాజనం పట్టారు (పుట : 12)

ఎవరమ్మా-ఎవరెవరమ్మా?
మాటల మూటవు-పాటలపేటివి
............................................... ॥ ఎవ ॥
త్యాగరాజు, మీరాసతి, కంబరు
తులసీదాసు పురందర దాసులు
నీపద వర సంకీర్తనమ్ముతో
గేయసుమమ్ముల పూజలు సల్పిరి! ॥ ఎ ॥
నీ చిరునవ్వది వెన్నెల మడుగై
నీ యలుకే యొక చిచ్చర పిడుగై
పరువమ్ములతో గరువమ్ములతో
నాలుగు దెసలా నేలు గదా! ॥ ఎ ॥

భారతి చిరునవ్వే వెన్నెల మడుగని, ఆగ్రహమే చిచ్చరపిడుగని శ్లాఘించారు. ఆమెను వ్యాస, వాల్మీకి, తిక్కనాది కవులు, త్యాగరాజాది వాగ్గేయకారులు కవితా కల్హారాలతో అర్చించినట్లు అభివర్ణించారు. అంతేగాక

శ్రీ పురాణ ధాత్రికీ! మా పవిత్ర నేత్రికీ!
భారతీయ మాత కిదే వందనం! వందనం! ॥ శ్రీ ॥
గురులకు నాగార్జున శంకరులకు మా వందనం
భక్తులకూ సర్వకళాసక్తులకూ వందనం! ॥ శ్రీ ॥ (పుట:16)

1 కల్పవల్లి - వింజమూరి శివరామారావు పుట 1

అని అభివందనాలందించారు. అదే దారిలో విశాలాంధ్ర అవతరించాక ఆంధ్రమాతనూ కీర్తించారు (పుట : 23)

వందన మాంధ్ర మహాజననీ!...
సుందరతర పౌరాణికావనీ!....
........................................ ॥ వం ॥
వరగోదావరి, కృష్ణ, పినాకిని
ఝరీ సహస్రము తుంగభద్రలూ
నటియించిన చైతన్యము నీయది-
నదియించిన యుజ్జీవము నీదియె ॥ వం ॥
పురాతనమ్మగు సంప్రదాయమూ....
పురోగమించిన సంస్కృతియూ.....
వరమై గౌరవకరమై తిరమై
చిరకాలము లోకము పాలింపుము ॥ వం ॥

కృష్ణ, గోదావరి మొదలగు నదుల నిత్య చైతన్యంతో పురాతన సంప్రదాయంతో చిరకాలం వర్ధిల్లమంటూ ఆంధ్రమాతను కీర్తించిన ఈ గీతం చతురస్రగతిలో చక్కగా సాగిపోయింది.

సాగరాల్ని దాటి ఏ దూరతీరాలకో సాగిపోవాలంటూ ఎలుగెత్తిన గీతం 'పడవనడపవోయ్'! (పుట : 40)

పడవ నడపవోయ్! పూల పడవ నడపవోయ్
చుట్టిన తెరచాపనెత్తి, గట్టిగ చుక్కాని పట్టి
ఒరగనీక సురగనీక తరగలపై తేలిపోవ ॥ ప ॥
ఊరుదాటి యేరుదాటి కడలి నాల్గు కడలు దాటి
చీకు చింతలేని వింతలోకానికి చేరునంట ॥ వ ॥

తెరచాపనెత్తి, తరగలపై తేలిపోయేలా చీకూ చింతాలేని వింత లోకాలకు చేరుకునేలా పడవ నడపాలనడం కడలి నాల్గు కడలు (చివరలు) దాటి పోవాలనడం నవ్యతగా అగుపిస్తుంది.

హేమంతంలో చేమంతులు విరివిగా పూస్తాయి. కాబట్టి

విరిసినవి చేమంతులూ!.....
దరిసినది హేమంతమనగా.....
పూలతోటల చేల బాటల
మేలుకొనె అందాల చిన్నెలు ॥ వి ॥
కన్నె మదిలో కదలు కోర్కెల
తెన్నులందు పసిండి వెన్నెల ॥ వి ॥
చెలియలా సిగలందు బంగరు
చెలువుతో వలపించు రంగుల ॥ వి ॥

పూల తోటల్లోనే గాక చేలబాటల్లోనూ చెలుల సిగల్లో బంగారు చెలువంగానూ ముత్తైదువుల మోముల్లో పసుపు ఛాయగానూ చేమంతులు పూచాయని మనోహరంగా రచించారు గీతాన్ని మిశ్రగతిలో నడిపించారు. ఆమని అందాల్ని వర్ణించిన -

ఆమని తోటల మిసమిసలూ....
ఏమనెనో వినుమా గుసగుసలూ.....
పూవుల రేకుల వన్నె చిన్నెలూ
తావులు తేనెలు నా కొరకేనట! ॥ ఆ ॥
కోయిల కూతల తేటి మ్రోతలూ
తీయదనాలవి నాకొరకేనట!
పైరగాలి వయ్యారి నడకలూ
దోరవెన్నెల నా కొరకేనట! (పుట:43)

ఆమని తోటల మిసమిసలు, చివురాకుల గుసగుసలు, కోయిల కూతలు, తుమ్మెదల మ్రోతలు, దోరవెన్నెల, పైరగాలి అన్నీ తనకొరకేనని ఉప్పొంగి పోయే ఉల్లాస హృదయం ఈ గేయంలో అగుపిస్తుంది. చక్కని చతురస్రగతి కనిపిస్తుంది.

కన్నెపిల్ల మీద కమనీయంగా అల్లన గీతం, `చక్కని చుక్కేదిరా?` (పుట:47)

చక్కని చుక్కేదిరా? ఎక్కడ కనరాదురా!
టక్కరి పడుచేదిరా? పక్కున నవ్వేదిరా?
నవ్వులోన బొండుమల్లెపువ్వులు రువ్వేదిరా! ॥ చ ॥
టక్కరి పడుచేదిరా? మక్కువ చూసేదిరా?.......
అరచూపుల దరిదాపుల మెరపులు దూసేదిరా!.....
..........................................................................
మాటలందు తీయనైన పాటలు చిల్కేదిరా! ॥ చ ॥

తన చక్కని చుక్క నవ్వితే బొండుమల్లెలు దొర్లుతాయంటూ, అరచూపుల్లో మెరుపులు మెరుస్తాయంటూ నడకల్లో వలపులు పూస్తాయంటూ మాటల్లో పాటలే పలుకుతాయంటూ సాఫీగా సాగిపోయిందీ గీతం.

వచ్చెనోయి వసంతమూ!
విచ్చినది మల్లీలతాంతము!
...........................................
నవరసాల కిసాలములలో
నవకములు మనకోసమే!.....
మలయ మారుత వీచికలలో
చలువలవి మనకోసమే!....
పూవు తోటలు తేటిపాటలు
కేవలము మనకోసమే! ॥ వ ॥ (పుట:48)

అని విరిసిన మల్లికా లతాంతాలతో, మావి చివుళ్లతో, మధుపమ్ముల పాటలతో మలయమారుతాలతో విచ్చేసిన వసంతం కేవలం మనకోసమేనంటూ ఎగిరి గంతేస్తూ ఎలుగెత్తిన వైనం ఈ గీతంలో అగుపించి మనసులనలరిస్తుంది. నల్లనయ్యను తలుస్తూ ఓ గోపిక శ్రావ్యంగా స్వరమెత్తిన గీతం, 'నల్లని వాడా!' (పుట : 54)

నల్లనివాడా! నేను గొల్ల కన్నె నోయ్!
పిల్లన గ్రోవూదుము నాయుల్లమురంజిల్లగా!....
.............................................................. ॥ న ॥
ఆకసానమబ్బులనీ-చీకటులే మూగెననీ
నేనెరుంగనైతినోయి, నీ తలపే వెలుంగాయె! ॥ న ॥
మెరుపే నీ దూతికయై - వలపే నా నెచ్చెలియై
తోడితెచ్చె నీ దరికీనాడు, పండెనా నోములు ॥ న ॥

కన్నయ్య మురళి పాటకై ఆకాశంలోని మబ్బుల్ని, అర్ధరాత్రి చీకట్లని లెక్కించక, మెరుపును దూతికగా వలపును నెచ్చెలిగా తోడు తెచ్చుకున్నానంటూ అతని వలపు తలపుల్నే వెలుగుగా మలచుకొన్నానంటూ - గోపిక పారవశ్యంతో పాడుకున్న వైనం ఈ గీతంలో స్పష్టమవుతుంది. ఆ పారవశ్యాన్ని ప్రసిద్ధ గాయని ఆర్. బాలసరస్వతి ఆ రోజుల్లోనే తన శ్రావ్యమైన గానంలో సాక్షాత్కరింపజేసింది.

రకరకాల పూలపై వ్రాలి నెత్తావుల్ని గ్రోలే తుమ్మెదతో ఒక పూలబాలపాడే గీతం, 'ఓయి తుమ్మెదా!' (పుట : 57)

ఓయి తుమ్మెదా! ఇంత మాయ చేతువా?....
నమ్మినాము నిన్నే మది మమ్ము మోసగింతువా?.... ॥ ఓ ॥
అరవిచ్చిన తెలిమల్లియనోయ్! నన్ను
మురిపించగ వలపిచ్చితినోయ్!
నాదరికేతెంచి యిట్టెదౌదవ్వుల కేగినావు
.................................................... ॥ ఓ ॥
సరిలేని గులాబి పూవునోయ్! నన్ను
మురిపించగ బ్రతుకిచ్చితినోయ్!
నా చేరువ నిల్చి యిట్టె యే చాయకొదూకినావు! ॥ ఓ ॥

మల్లె, తామర, గులాబి మనసిచ్చి పిలిచినా తుమ్మెద చేరవచ్చినట్లే వచ్చి మరే దెసకో పారిపోయి మోసగించిందంటూ ఎలుగెత్తిన తీరు ఈ గీతంలో ఎంతో హృద్యంగా మలిచారు, శివరామారావుగారు. అనేకసార్లు ఆకాశవాణిలో ఈ గీతం లలితసంగీతంలో ప్రసారమై శ్రోతల్ని అలరించింది.

ఏలా నవ్వేద వదియేలా?
రాలె నిదిగొ మల్లెల మాలా! ॥ ఏ ॥
నా చెలియా! వలపూరు చూపులో
దాచితివా నెరితావి తీపులూ...... ॥ ఏ ॥

నడిరే సాగిన మింటి పాటలో
గుడిలో మ్రోగిన గంట మ్రోతలో
నీయెలుంగులే వినవచ్చినవీ
నావెలుంగువై కనవచ్చితివీ ॥ ఏ ॥ (పుట : 52)

తన చెలి నవ్వితే మల్లెలు మాలగా దొర్లుతాయంటూ. చూపుల్లో వలపుల నెత్తావులు వీస్తాయంటూ, నడిరేయి సాగే మింటి పాటలో-గుడిగంట మ్రోతలో చెలిస్వరాలే వినవచ్చాయంటూ వెలుగులై కనవచ్చాయంటూ మనోహరంగా రచించారు.

పొంగారి పాడవే బంగారు వీణా!
భోగాల కల్యాణ రాగాలు జాణవై ॥ పొం ॥
పొంచి నాసామి ఆలించు నేమో సుమీ
ఎంతగా హాయిగా గొంతు నెత్తెదవో?.... ॥ పొం ॥
ప్రేమగీతమ్ములో సామగానమ్ములో
పాల మున్నీటిపై తేలించు పాటగా ॥ పొం ॥ (పుట : 57)

ఇందులో ఒక నెరజాణ భోగాల కల్యాణ రాగాలు పాడమంటూ వీణను సంబోధిస్తోంది. తన సామి పొంచి వింటాడేమోనని సన్నగా గొంతెత్తమంటోంది సామగానంలా ప్రేమగీతాన్ని పాడి తనను పాలసంద్రంలో తేలించమంటోంది ఖండగతిలో కమనీయంగా సాగిన గీతమిది. కాని బాపిరాజుగారి 'పాడకే నా రాణి పాడకే పాటా, పాట మాధుర్యాల ప్రాణాలు మరిగెనే!' అన్న పాటను గుర్తుకు తెస్తుంది.

ఇలా అనేక గీతాల్ని అందంగా రసబంధురంగా రచించిన వింజమూరి శివరామారావుగారు లలితగీత విస్తారంకై తన శాయశక్తులా మేలిబాటలు వేశారు.

## కొనకళ్ల వెంకటరత్నం:

జానపదగేయాల బాణీల్లో, ఎంకి పాటల బాటల్లో శ్రీ కొనకళ్ల వెంకటరత్నం గారు బంగారిమామ పాటలు రచించి ఖ్యాతి గాంచారు అయితే రచయిత పేరుకన్నా 'బంగారి మామ' పేరునే పాఠక లోకం బాగా గుర్తుంచుకున్నది. బంగారి మామ పాటలు ఆ రోజుల్లో రికార్డులుగా వెలువడడమేగాక చలనచిత్రాల్లోనూ చోటుచేసుకోవడమే అందుకు నిదర్శనం అనవచ్చు!

'బంగారి మామ పాటలు', 'ఎంకి పాటల' ప్రేరణగా అగుపిస్తాయే తప్ప అనుకరణగా అగుపించవు. అందుకే స్వతంత్ర పంథాలో సాగిపోయి సాహిత్య లోకంలో నిలిచిపోయాయి. నండూరి, కృష్ణశాస్త్రి, తల్లావఝుల, చలంగార్ల అభినందనలందుకున్నాయి.

ప్రథమంగా 1960లో వెలువడిన 'బంగారిమామ పాటలు' జయంతి పబ్లికేషన్స్ ద్వారా 1980లో ద్వితీయ ముద్రణగా ప్రచురితమయ్యాయి

వలచీ నాడమ్మా! మనసు
కలచీనాడమ్మా!.........
................................ ॥ వల ॥
గుండెలోతుల దొలిచే
గోరు వెచ్చని వాని
వాలు కన్నుల లోన
కాలిపోయిన చాలు ॥ వ ॥
మాటలోపల యేదొ
మంత్రమున్నదె! వాని
కవుగిట్లో కడసారి
కన్నుమూసిన చాలు![1] ॥ వ ॥

ఇందులో వలచిన తన ప్రియుడికి కాలిధూళిగా మారినా, గోరువెచ్చని వాలు చూపుల్లో కాలిపోయినా, మంత్రించినట్లుండే వాడి మాటలు వింటూ కౌగిట్లో కన్ను మూసినా చాలని ప్రేయసి తొలివలపు దొంతర్లో తేలిపోతూ భావించడం బాగుంది. ప్రేయసి తన గాఢానురక్తిని తెలియపరుస్తోంది. ఈ పాట పల్లవి మాత్రం 'దాగుడు మూతలు' చిత్రంలో వాడుకోబడింది.

'రావోయి బంగారి మామా' అనే పాటలో (పుట:13)

'రావోయి బంగారి మామా! నీతోటి
రాహస్య మొకటున్నదోయీ!
పంట కాలువప్రక్క-జంటగా నిలుచుంటె
నీడల్లో మనయీడు-జోడు తెలిశొస్తాది ॥ రా ॥
ఈ వెన్నెలల సొలపు - ఈ తుమ్మెదల వలపు
రాత్రి మన సుఖకేళి - రంగరించాలోయి
..................................................................
ఏటి పడవ సరంగు - పాట గిరికీలలో
చెలికాడ మన సొదల్ కలబోసుకుందాము ॥ రా ॥

తన మావతో కలిసి పంటకాలువ ప్రక్కన నిలబడి నీటి అద్దంలో తమ ఈడూ-జోడూ చూసుకుందాం రమ్మంటూ ఓ కోడలు పిల్ల మనసుపడుతోంది. వెన్నెల సొంపును తుమ్మెద వలపును సుఖాలలో రాత్రిపూట రంగరించుకుందా మంటోంది. అవిసె పువ్వులు తురిమి తన సిగలో వుంచాక పడవ నడిపే సరంగు పాటలతో పాటు గొంతు కలిపి ఏకమవుదామంటూ ఎలుగెత్తుతోంది. అయితే 'సుఖకేళి' అనే గ్రాంధిక పద ప్రయోగం ఈ పల్లెపాటలో ప్రయోగించకుంటే మరింత ఔచిత్యంగా వుండేది. ఖండగతి సౌలభ్యం కోసం 'రహస్య' పదాన్ని 'రాహస్యముగా' రచయిత ప్రయోగించారు.

1 బంగారి మామ పాటలు ద్వి ముద్రణ. కొనకళ్ల వెంకటరత్నం · పుట 11

వలచి పిలుస్తున్న తన ప్రేయసిని ఎక్కడ ఎప్పుడు కలుసుకోవాలో చెప్పమంటూ మామ కూడ స్వరమెత్తిన 'ఏ గంటకు?' అనే పాటలో (పుట:15)

ఏ గంటకు రమ్మంటవె కన్నెలేడీ? ను
వ్వేడ కాచుకోనుంటవె వన్నెలాడి?
పుగ తోటకు నీళ్లు పెట్టి
బుగత గారినేమరించి
కోరుకున్న మొగలి పొత్తి
కొండకోన వెతికి తెచ్చి
అలసట తీరే తలికే
అద్ధరేత్తిరవుతాది...... ॥ ఏ ॥
చీకట్లో నీ అందము
చిక్కు విడదునాకంటికి
వెన్నెలలో నీ రూపము
కన్ను చెదర గొడతాది
చీకటి వెలుగుల సందున
చేరరావె చిన్నారీ! ॥ ఏ ॥

తాను పుగతోటకు నీళ్లు పెట్టి చెలికోసం కొండకోన వెతికి, మొగిలిపువ్వు వెతికి తెచ్చే సరికే అర్ధరాత్రవుతుందంటూ, చీకట్లో వస్తే చెలి అందం చూడలేనంటూ వాపోతాడు. ఒకవేళ వెన్నెల్లో వచ్చినా కన్ను చెదిరే ఆమె అందం చూడలేనంటూ చీకటి వెలుగుల సంధివేళలో చేరరమ్మంటాడు. చిలిపి చెల్లిని, పాడుపుకథల తమ్ముణ్ని తప్పించుకొని గుట్టు చప్పుడుగ రమ్మని పిలుస్తాడు. వచ్చాక తీగమల్లె సోకుతో మల్లెచెంత, ఎరుపెక్కిన సిగ్గు బుగ్గతో గులాబీ చెట్టు చెంత దాగి, తనను ఆటపట్టించవద్దని బ్రతిమిలాడడం మనోహరంగా వుంది.

మొక్కజొన్న తోటలో సందెవేళ చీకట్లో తనను కలుసుకొమ్మంటూ కోడలు పిల్ల కొసరిపాడిన 'మొక్కజొన్న తోటలో' పాట (పుట:18) 'అదృష్టవంతులు' చిత్రంలో మారుమ్రోగింది.

సుక్కలన్ని కొండమీద
సోకుజేసుకునే వేళ
పంటబోది వరిమడితో
పకపకనవ్వేవేళ
సల్లగాలి తోటకంత
సక్కలగిలి పెట్టువేళ
మొక్కజొన్న తోటలో
ముసిరిన సీకట్లలో
మంచెకాడ కలుసుకో!
మరవకు మావయ్య ॥ మొ ॥

సుక్కలు కొండ మీద సోకు జేసుకోవడం, పంటబోది వరిమడితో కలిసి పక పకా నవ్వడం, చల్లగాలి తోటకు చక్కిలిగిలి పెట్టడం జొన్న పొట్ట వెకిలిగా నవ్వడం, కంచెమీది నుంచి గుమ్మడి పువ్వు పొంచి పొంచి చూడడం లాంటి సరికొత్త భావాలు, సరసాల రాగాలు ఈ పాటలో చోటుచేసుకున్నాయి.

గోదారి గట్టువెంట గోప్యంగా సరసమాడ రమ్మంటూ కోడలు తన మామను పిలిచే 'గోదారి గట్టంట' పాటలో (పుట : 25)

గోదారి గట్టంట - పోదారి మామా
సిగ్గులో వలపేటొ - భగ్గుమన్నాది
పట్నవాసపు గాలి - పడదస్సలే మనకు
మసక వెన్నెల లింకు ఇసక తిన్నెల కేసి
................................................ ॥ గో ॥

అని పట్నవాసపు గాలి పడని ప్రేయసి మసక వెన్నెల లింకే ఇసక తిన్నెల గోదారి గట్టు వెంట భగ్గుమనే వలపు సిగ్గులో మునిగితేలుదాం రమ్మంటూ పిలుస్తోంది.

వెన్నెల రేయి ఎందుకో ఆ రోజు అంత చల్లని హాయి కలిగిస్తోందంటూ యుగళంగా 'ఎందుకో ఈ రేయి' అనే పాటను (పుట : 28) రచించారు.

కోడలుపిల్ల : ఎందుకో ఈ రేయి ఇంత చక్కని హాయి?
పయనమెందాకాను బంగారి మామా!
వయనాలు తెలుపోయి వయ్యారి మామా!
బంగారిమామ : పైరగాలికి తూగి పంటలచ్చిమి దేవి
పవ్వళించె వేళ పల్లదనమేలె!
నగవాకె వగలాడి నా చిన్నిరాణీ!
కోడలు : ఏరు తగిలిందంటె ఎనకదారిక సున్న
తోట జీబురుమంట తొంగి చూచేను
దవు దవ్వుపోతావు దరికేనిరావు
మామ : సరుకుతోటల వెన్క చందమామడుగోను
కోరడవతల ఒక్కకోరికున్నాది-
చిన్ని ముద్దొకటీవె చిటిమల్లె పూవ!

కోడలుపిల్ల చల్లని హాయినిచ్చే రేయిలో ఎక్కడి కెళ్తున్నావంటూ మామను అడిగితే, పైరగాలికి తూగి పవ్వళించే పంటలచ్చిమి వద్దకు-అంటే పంట తోటకు పోతున్నానంటూ సమాధానమిచ్చాడు. మిసమిసల మిరపతోట కారు చీకట్లో కనబడకుండా కాటుకలా కరిగిపోయిందని కోడలు పిల్ల భయపడుతూ మామను ఆగమనడం, అందుకు ఆ మామ సరుకుతోటల వెనుక చందమామ ఉన్నాడు భయపడకంటూ, చిన్న ముద్దు ఒకటిమ్మంటూ తన కోడల్ని సిరిమల్లెపువ్వులా భావించాడు

'ఎందుకోమరి?' అనే పాటలో (పుట : 44)

ఈయేళ మామయ్య-మా యింటి కొచ్చాడు
ఎందుకోమరి ఎందుకో? ఈ
సందేళ పులమారినందుకో!
మౌనాలనేగాని-మత్తు జల్లని వాడు
కలలోపలేగాని - కనపడని మారాజు ॥ ఈ ॥
చూరు క్రిందుగవాలి - చుక్కల్లు గుమికూడి
గుట్టు తెలిసిందేమొ-గుసగుసలు పొయ్యేను
..............................................................
కన్నుగీటే చుక్క కండకావరమెంత!
ఏరాజు తనరాజు - ఎరుగదోకాసింత! ॥ ఈ ॥

కలలోనే కాని కనపడని మామయ్య యింటికి ఆ రోజు వచ్చినందుకు తెగ మురిసిపోతూ కోడలుపిల్ల స్వరమెత్తింది. మామ వచ్చిన వేళ తేటమజ్జిగ తెప్పిద్దామంటే ఇరుగుపొరుగు మాటు మణిగిందంటూ, గ్రుంకుతున్న చుక్కలు తమ గుట్టు తెలిసి గుసగుసలాడుతున్నాయంటూ, కన్ను గీటుతున్న చుక్కను తన మామ చందమామకాదని తెలియదా? అని గద్దిస్తుంది. చక్కటి ఖండగతిలో సాగిపోయిందీ పాట.

'ఒంటరి పయనం' అనే పాటలో (పుట: 56)

ఒంటరినై పోనా, ఈ
ఓరు గాలిలోన దొరా!....
చిలిపి చిలిపి జగడాలకు
ఒలికే సింగారమెంచి
అలకదీర్చి కలకదేర్చి
పలకరించువారులేక
........................ ॥ ఒంట ॥
ఏటిమనసు తోట సొగసు
ఏకమయిన చోటిక్కడ
సరసనీవు లేని బతుకు
సందర మనిపిస్తదోయి! ॥ ఒంట ॥

చిలిపి జగడాలతో ఒంటరిగా వెళ్లే తనను ఓదార్చి సింగారమెంచి పలకరించ రమ్మంటూ తన దొరను పిలుస్తోంది, ఓ పల్లె పడుచు దొరసాని. వెన్నెలలో అతని విరహాన్ని తాళలేనంటూ, ఏటి పాయ తోట సొగసుతో కలిసి పోయే చోట సరసన తన మామ లేకుంటే బతుకంత సంద్రంలా తోస్తుందని, ఓరుగాలిలో ఒంటరిగా నున్న తనతో జంటగా వెంటనే కులకడానికి రమ్మంటూ పిలిచిందా పిల్ల! త్రిశ్రగతిలో సాఫీగా సాగిపోయిందీ పాట.

తొలికారు మబ్బులు యువతీ యువకుల్లో విరిహాన్ని రేకెత్తిస్తాయి! అందుకే 'మబ్బులు మబ్బులు' అనే పాటలో (పుట : 64)

మబ్బులు మబ్బులు మబ్బులొచ్చినై....
తబ్బిబ్బయ్యేను నా మనసు
తళుక్కుమన్నది నీ సొగసు
ఉరుములురిమినను తరిమి కొట్టితే
మెరుపు తీగ కొరడా ఝుళిపిస్తే
మందవిడిన తువ్వాయికి మల్లే
మనసూరక బెంబేలైపోతది...... ॥ మ ॥

మబ్బులు మామలేని సమయంలో ఉరిమి చూడగా, మెరుపు కొరడాలా దర్శనమీయగా తన మనసు మంద విడిచిన తువ్వాయిలా బెంబేలైపోయిందని చెప్పడం, యీ పాటలోని మనోహర భావనకు మంచి ఉదాహరణ! చతురస్ర గతిలో చమత్కార కల్పన!

'పట్నానికి పయనం' అనే పాటలో (పుట : 73)

పట్నవాస మెందుకులే బంగరి పిల్లా! ను
వ్విష్ట పడితివా స్వర్గం భూతలమెల్లా!...
సరుకుతోట తేనె తేట - సంగీతపు ఝల్లు
కందిచేల నులి వెచ్చని కాసుల ఘల్‌ఘల్లు
అనుకోని రాజ భోగ మమరిన ఈ కోన విడిచి ॥ పట్న ॥
ఒడలొంచితె లొంగిరాని - బడుగునేల కలదే,
పిడుగడినా అడలిపోక - నిలబడి పోవలదే
అలిగిందని కొండవాగు - వలసపోదమంటావు ॥ పట్న ॥
పల్లెపట్టు నీడలలో పరిమళించినాము
కల్లా కపటాల మకిలి డుల్లి పోవలేము
తొడిమ నున్న పంటపూలు - దూసినట్టులయిపోతము ॥ పట్న ॥

అని మామ తన పిల్లతో పట్నవాసం వద్దని చెప్తున్నాడు. పల్లెలో కంది చేల కాసులే తమరాజభోగమంటూ, ఒడలు వంచితే బడుగు నేలయినా బంగారమవుతుందంటూ పల్లెలో తొడిమనున్న జంట పువ్వుల్లా పరిమళించే తాము పట్నం వెళ్తే కాడలేని పువ్వులా రాలిపోతామంటూ రమ్యంగా చెప్పారు. త్రిశ్రగతిలో తీయని పల్లెమనసు విప్పారు. ఈ పాట ఈ మాసపు పాటగా ఆకాశవాణిలోనూ ప్రసారమై శ్రోతల విశేష అభిమానాన్ని చూరగొన్నది!

ఇలా కొనకళ్ల వెంకటరత్నంగారు తన 'బంగారి మామ పాటలు' ద్వారా లలితగీత విస్తారంకై పల్లె పదాల బాటల్లో విలక్షణంగా కృషి చేశారు!

## ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి (1911) :

పద్యాల్ని, పాటల్ని హృద్యంగా రచించుటలో శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారిది అందెవేసిన చేయి. అందుకే 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయి' అని చెప్పగలిగారు. స్నేహమాధుర్యాల గుట్టు విప్పగలిగారు.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి పద్యగేయ సంకలనంగా 1959లో వెలువడిన 'మధువని'లో కొన్ని మధురగీతాలు అగుపిస్తాయి. అందులో 'భారతశ్రీ' మొదటిది.

ఎగుర వేయుము శీత
నగ హిమాచలముపై
గగన సీమలు వెలుగగా-నీజెండ
పగర గుండెల బెదురుగా ॥ ఎ ॥
నీ యశము మందాకినై
నీ మాట ఋషి వాణియై
గుండె ఔన్నత్యమ్ము
కొండ వింధ్యమ్ముగా
..................................
ఫలియించి మార్గ్మగనీ
జలధులన్నీ దాటనీ![1] ॥ ఎ ॥

హిమాలయాలపై మన త్రివర్ణ పతాక నెగుర వేయాలంటూ, మనకీర్తి సురగంగలా, మాట మునివాణిలా, గుండె వింధ్యాద్రిలా, గళము కాళిదాసు కలకండ కవితలా నిలిచిపోవాలంటూ అభిలషించారు.

శిల్పిని, గాయకుణ్ని సంబోధిస్తూ అల్లిన 'దివ్యశిల్పీ'! అనే గేయంలో (పుట-3)

ఓ పురాతన దివ్యశిల్పీ!
ఓ సనాతన గాయకా!....
నన్ను గూడా పాడమంటూ
సన్న జేయుదువా?....
గళము కలిగిన విలువయేమీ?
పలుకు లెరిగిన ఫలితమేమీ?
పలుకు పలుకున గళములో మధు
వొలుక లేదోయీ!..... ॥ ఓ ॥

అని గళమున్నంత మాత్రాన పాడితే ఫలితం లేదంటూ ఆ పాటలో మధురిమలు చిందించలేమంటూ, మూగవోయిన హృదయగానం అలాగే మౌనంగా వుండనిమ్మంటూ హితోక్తి పలికారు. గేయాన్ని ముత్యాల సరాల బాటలో నడిపారు.

రాధను, గోపికల్ని విరహతాపంలో ముంచెత్తే కృష్ణుని మీద అల్లిన 'కృష్ణా' అనే గేయంలో (పుట-4)

రాధకిచ్చిన వరము
బాధయేనా కృష్ణ-
గోపికకు నీ విరహ
తాపమ్మటే ఫలము? ॥ రా ॥

---

1 మధువని - ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి పుట 1

**మోవి తీయదనాలు**
**మోయనేరని మురళి**
**కలత వలపుల కలల**
**కలగునో-కరగునో? ॥ రా ॥**

రాధను బాధించక, గోపికల్ని విరహతాపంతో వేగించక, ప్రక్కనే జాలిగా ప్రవహించే యమునను వలపు లెరిగిన పూలను అడిగి, వెన్నెల రేయిలో వెచ్చని కౌగిలినందించగా మురళి మ్రోగిస్తూ తరలిరమ్మంటూ ప్రార్థించే తీరు ఈ గీతంలో అగుపిస్తుంది. ఖండగతి కమనీయంగా నర్తిస్తుంది.

ఆమనిని వర్ణిస్తూ అల్లిన 'వసంతము' అనే గేయంలో (పుట : 5)

**ఆకుపచ్చని కోరికలతో**
**లోకమే పులకించెనే!...**
**కోకిలమ్మ గళమ్ములో, మధు**
**కోశములు విడబారెనే!**
**................................... ॥ ఆ ॥**
**పాలవెల్లుల కడుపు పంట**
**పూల వెన్నెల పరచెనే!.....**
**పడుచుటెడదల పొడుచుతీయని**
**భావమేదో గిలిగింతగా! ॥ ఆ ॥**

ఆకుపచ్చని కోరికలతో లోకం పులకించగా, కోకిల గళంలో మధుకోశములు దొర్లిపడగా, పాలవంటి వెన్నెలలు పరుచుకోగా తీయని భావాల గిలిగింతలతో వసంతం వచ్చిందంటూ అభివర్ణించారు.

'రాగమెరుగని వీణ' అనే గేయంలో (పుట : 6)

**రాగమెరుగని వీణ**
**రక్తి నెరుగని గాన**
**మెడదకీలలు రగులగా - రారాజ!**
**ఏ గీతములు పలుకునో?...**
**పాషాణ హృదయాలు**
**పాలించు లోకాన**
**ద్వేషమే పంటకాదా - ఓ రాజ**
**ప్రేమ కరవై సురుగదా!....**

అని రాగమెరుగని వీణ, రక్తి నెరుగని గాన మెదలో మంటల్ని రగుల జేయగా ఏ గీతం పలికించునో? అని ఆందోళన చెందడం, రాతి హృదయం పాలించే లోకంలో ద్వేషమే పండుతుందని, ప్రేమ ఎండుతుందని భావించడం ఈ గీతంలో అగుపిస్తుంది. రారాజు యశములో కొసరి విషము చిందించిన ప్రత్యర్థి కత్తి పదును గూర్చిన ప్రస్తావన బోధపడుతుంది. కావున ఈ గీతికకు సారంగధరుని కథ మూలంగా రాజరాజుకు సంక్రమించిన అపఖ్యాతి నేపథ్యమై యుంటుంది.

'బాల బుద్ధుడు' అనే గేయంలో (పుట : 7)

శాక్య వంశమ్ము మాణిక్యమా, జోజో!
శుద్ధోదన ప్రభుని సుకుమార, జోజో!
.......................................................
పాలసంద్రపు టుయ్యాల పానుపున
పవ్వళించిన వేల్పు బువ్వపుర జోజో!

చిన్నారి బుద్ధుడు శాక్యవంశపు మాణిక్యమంటూ, పాలసంద్రంలో పవళించిన శేషశాయియంటూ, కపిలవస్తుపుర కర్పూరపు వెలుగంటూ అభివర్ణించారు.

మధుమాసాన్ని 'మరలవచ్చె' గేయంలో (పుట : 9) మనోహరంగా వర్ణించారు.

మరల వచ్చె నియ్యదిగో - మానినులారా!
మన వసంత మదనోత్సవము ॥ మ ॥
తరళ తరళ మంజరులు చరచరా
విరిసి పుప్పొడులు కురిసినవి
నవరసాల మృదుకిసలయ కబళము
మేసి కోయిలలు కూసినవి ॥ మ ॥

వసంతోత్సవం గూర్చి అల్లినట్లు అగుపించే ఈ గీతంలో ప్రతి కొమ్మ-పూల రెమ్మలతో విరబూయగా పుప్పొడులు రాలినట్లుగా, మావి చివురుల్ని మేసిన కోయిలలు మధురంగా పలికినట్లుగా మృదుపదాల్ని కూర్చి మరీ చెప్పారు.

పేదల దైన్యాన్ని సూచించే 'పూరిపాక' అనే గేయంలో (పుట : 39)

ఊరవతల పూరిపాక
నోరెత్తదు పాపం!
కూరుచున్న పేదనీడ
కునుకు చేతిదీపం!
.................................
చింపితలా, చిరుగుపైట
చేరువ తంబూరా
వైరాగ్యం పాడి పాడి
వాలిన ఆకలిరా!.....

అని ఊరవతల పూరి గుడిసెలో నివసించే పేదరాలు ధనికుల దౌర్జన్యాలకు నోరెత్తడం లేదని, చిన్నదీపం కూడ వెలుగునీయక కునికిపాట్లు పడుతోందని, చేరువ నున్న తంబూర వైరాగ్యాన్ని పాడి పాడి అలసిపోగా ఆకలివాలిపోయిందని వ్యంగ్యంగా చెప్పారు. ఇందలి 'చింపితలా, చిరుగుపైట' లాంటి పదప్రయోగాలు శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి' ని గుర్తు చేస్తాయి.

ఇంద్రగంటి గారి మరో గేయసంపుటి 'పాటల మంజరి' (1950) ఇది ప్రస్తుతం ఏ గ్రంథాలయాలలోనూ లభ్యం కావడం లేదు. కావున వారి

కుమారుడైన ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారితో, వారి గీతాల్ని పాడిన కోడలు ఇంద్రగంటి జానకీబాలతో సంప్రదించి వ్రాతప్రతి ఆధారంగా కొన్ని ముఖ్యమైన గేయాల్ని సేకరించనైనది.

'పాటల మంజరి'లో ప్రధానంగా పేర్కొనదగిన గీతం, 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయి'. ఈ గీతాన్ని ఆకాశవాణి మద్రాస్ కేంద్రం వారు రూపొందించిన 'హేమమాలి' అనే రేడియో నాటికకై వ్రాయగా, దానిని తర్వాత HMV రికార్డింగ్ కంపెనీ వారి పాటల పోటీకి పంపగా బంగారు పతకం పొందినట్లుగా, పెండ్యాల స్వరకల్పనలో ఆర్.బాల సరస్వతీ దేవి పాడగా, రికార్డుగా వెలువడిన ఆ పాట బహుళ ప్రజాదరణ గాంచినట్లుగా వివరించారు.[1]

సృష్టిలో తీయనిది స్నేహమేనోయి
వ్యష్టి జీవము చేదు పానీయమోయి ॥ సృ ॥
కలువరాణిని విడచి - చలువరేడే లేడు
సోలు పూలను విడడు - గాలి రాజే రోజు ॥ సృ ॥
వెలుగు నీలపు మేడ - విడిచిరానే రాడు
మెరుపు మబ్బుల జంట - చిరకాలమున కేని ॥ సృ ॥
అలదూర తీరాల - ఆకాశమే వంగి
పెదవి కలిపిన చోట - పృథివి పులకించింది ॥ సృ ॥

సృష్టిలో తీయని అనుబంధాన్ని పెంచేది, ఒంటరితనంలోని చేదు అనుభవాల్ని అణచేది స్నేహమేనంటూ నొక్కి చెప్పారు. కలువను విడిచి చంద్రుడు, నింగినీలపు మేడను విడిచి మబ్బులు మనలేనట్లే స్నేహం లేక మనిషి జీవితం మధురంగా మారదంటూ విప్పి చెప్పారు.

ఈ జీవితపు వీణ నీవె పలికింపుమా!
అణువు అణువున కరిగి వలపు పాటై విరియ
..................................................................

అని తన జీవితపు వీణను వలపు పాటగా పలికించమంటూ ప్రేయసి మీద గీతమల్లారు.

దిగిరావె అందాల
దీవినేలిన రాణి
కవిరాజు పెదవిపై
కదలు మధు పాత్రవై
కలలోని కాంతిగా
ఇలలోని సుఖముగా
విరిలోని తేనెగా
కరిగి పోకే సఖీ!
.........................

1 ఇంద్రగంటి శ్రీకాంత శర్మ మరియు ఇంద్రగంటి జానకీ బాలతో ముఖాముఖి - 17.7.97

అని అందాల తన ప్రేయసిని కవిరాజు పెదవి మీది మధుపాత్రలా కదలరమ్మని కాంక్షించారు. కలలోని కాంతిగా, విరిలోని తేనెగా కరిగిపోవలదంటూ అర్థించారు.

నను జూచి నవ్వింది - నవ్వులో మెరిసింది
కనుకొనల పొంగేటి - కలత కోరికలేవొ
మిణుకు మిణుకూమంటు కనికరిస్తాయి
..........................................................

అని ప్రేయసి తనను చూసి నవ్విందంటూ, కలత కోరికలన్నీ కనికరించి తీరుస్తుందంటూ ఆశించారు.

ప్రేయసులిచ్చిన విషసంగీతం
ప్రేమ యొసంగిన ప్రియతమ ఘాతం
వరదానముగా బ్రతుకున నిలిపి
జీవనగానము చేయుమురా! ॥ ప్రే ॥
వెర్రియాశతో వెదకకు దిశలా
మూసికొనుము నీ హృదయ ద్వారము
ప్రేమ పదాంకిత గతి బహుభారం!
ప్రేమ నగరి మార్గమ్మతి దూరం!

అని వంచనతో ప్రేయసులిచ్చే విషసంగీతాన్ని కూడ ప్రేమ యొసంగే ప్రియతమ ఘాతంగా భావించారు. అంతేగాక వరదానంగా - జీవనగానంగా మలచుకొమ్మన్నారు. వెర్రియాశతో వెదకక హృదయ ద్వారం మూసుకొమ్మని, ప్రేమపదాంకితమైన ప్రేమనగరు మార్గమతి దూరమ్మని వాపోయారు.

ఏ పూవు పూచినా - ఏ పాట పాడినా
ఎందుకో ఈ హృదయమింత కలవళపడును ॥ ఏ ॥
నీలాల నింగిలో పూల వెన్నెల మేడ
పైన జాబిలిరాజు పకపకా నవ్వితే
ఈ హృదయమెందుకో ఇంత కలవళపడును ॥ ఏ ॥
ఏ బీదవాని ఆకలి చిచ్చు కన్నీరు
ఏ కష్టజీవి క్రొంజెమట నెత్తుటి బొట్టు
ఏ వలపుటెడద క్రాగిన మంట నిట్టూర్పు
ఈ పేద బ్రతుకులో ఇంకి పోయెనొ గాని ॥ ఏ ॥

అని ఏ పూవు పూచినా, ఏ పాట పాడినా వెన్నెల జాబిల్లి విరిసినా తన హృదయం కలవరపడుతోందంటూ కలత చెందారు. పేదవాని కన్నీరు, కష్టజీవి చెమటబొట్టు, భగ్నప్రేమికుల నిట్టూర్పు ఇంకి పోవాలంటూ ఎలుగెత్తారు. ఖండగతిలో కమనీయంగా స్వరమెత్తారు.

ప్రేమ గూర్చి ప్రేయసి గూర్చేగాక జన్మభూమిపై గూడ చక్కటి గీతమల్లారు యిలా -

నాదు జన్మభూమి కంటె
నాక మెక్కడుంది?
సుర లోకమెక్కడుంది? ॥ నా ॥
అమరేంద్రులు, గంధర్వులు
అచ్చరలు వియచ్చరులు
వేడుకతో వలసవచ్చి
విహరించే హిమ శృంగం! ॥ నా ॥
కాళిదాసు కంటి కొసల
పసిడి కలల పూలమాల
అలకాపురి కాపుర మది
అమర భారతీ నిలయం! ॥ నా ॥

అని త్రిశ్రగతిలో మధుర శ్రుతిలో తన జన్మభూమియైన భారత దేశాన్ని స్వర్గం కన్న మిన్నగా భావించారు. గంధర్వాది అమరులు విహరించే హిమాలయం, కాళిదాసు పసిడి కలల అమర భారతీ నిలయమని అభివర్ణించారు. కాని యిది ''జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి'' - అన్న సంస్కృత శ్లోకానికి ఆంధ్రీకరణంలా తోస్తుంది.

ఇలా ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు అనేక మధురగీతాలు రచించి లలితగీత విస్తారంకై విశిష్ట కృషి చేశారు.

## పైడిపాటి సుబ్బరామ శాస్త్రి :

పిల్లల పాటలు, పల్లె పాటలు రచించినా మల్లెల వంటి మంచి దేశభక్తి గీతాలు రచించుటలో తనకు తానే సాటి యనిపించుకున్న శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు 1957లో 'జాతీయ భారతి - జయ భారతి' పేరున ఒక గేయసంపుటి వెలువరించారు. ఇందులో దేశాన్ని, దేశనాయకుల్ని కవుల్ని తనివి దీరా ప్రస్తుతించారు. నిద్రాణమై యున్న జాతిని తట్టి లేపారు.

కనుమూసెనా భరత-ఖండ ప్రభావాలు!
భారతీయుడ! యిల్లు చేర చేదా పిలుపు!
  పట్ట పగటీ నిదుర లేరా!
  పిట్ట పిడుగూ వోలెరారా!
ఆదికవి వాల్మీకి-అమృత ప్రవాహాలు
కృష్ణయ్యచిందినా గీతా ప్రబోధాలు
  మావేను మావేను అనవేరా!
  లేవేమి మీకేమి అనవేరా!
మా భారత మాతృ కంఠాభరణమై వెల్గు
కాళిదాసుని వంటి కవి యసలె లేడంచు
  హుంకార మొనరించి అనవేరా!

ఢంకా బజాయించి అనవేరా![1]

.............................................

అని పట్టపగేటి నిదురమాని పిట్ట పిడుగులా పమ్మని పలికారు. వాల్మీకి రామాయణాలు, గీతా ప్రవచనాలు, కమ్మని కాళిదాసు కావ్యాలు మనవేనంటూ ఢంకా బజాయించి సగర్వంగా చాటుకొమ్మన్నారు

ఆంధ్రులకు అభిమాన పాత్రమైన 'ఆంధ్రజాతీయ గీతము' (పుట 35) రచించి రాణించారు, పైడిపాటిగారు.

త్రిలింగదేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్
మధురం మధురం మధురం మధురం
ఆంధ్రమ్మంటె అతి మధురం
దేశభాషలా తీరుల్లోకి
ఆంధ్రమ్మంటే అతి మధురం
రాయలు మనవాడోయ్! పండిత
రాయలు మనవాడోయ్!
కలం తిక్కనా ఖడ్గ తిక్కనా
గణపతి దేవులు మనవారోయ్!

.............................................

గోదావరి, కృష్ణా
తుంగభద్ర, పెన్నా
కనిపెంచినవోయ్ తెలుంగు జాతిని
వినిపించినవోయ్ వీణానాదం

............................................. ॥ త్రి ॥

తెలంగాణాలోని కాలేశ్వరం, కోస్తాలోని దాక్షారామం, రాయలసీమలోని శ్రీశైలం ప్రధాన శైవక్షేత్రాలు. వీటి ఆధారంగానే మన తెలుగునేల త్రిలింగ భూమిగా పేరుకెక్కింది. ఆ దృష్టితోటే 'త్రిలింగ దేశం మనదేనోయ్. తెలుంగులంటే మనమేనోయ్' అని పైడి పాటి సుబ్బరామశాస్త్రిగారు పసందైన పాటనల్లారు దేశభాషల్లో ఆంధ్రమే అతి మధురమని, గొప్పవారైన కృష్ణరాయలు, జగన్నాథ పండిత రాయలు, తిక్కనాదులు మనవారంటూ సగర్వంగా స్వరమెత్తారు. అమరావతి, నాగార్జున కొండల్లోని శిల్ప కళలు, గోదావరి, కృష్ణా, తుంగభద్రాది మహానదులు మనల్ని కనిపెంచినట్లుగా తెలుగుభేరీ మోగించారు.

బందరు రేవును బ్రిటిషు ప్రభుత్వం నిరంకుశుడైన నిజాం ప్రభువుకు అమ్మివేస్తున్నట్లు తెలియగానే ఆవేశంతో అల్లిన 'నై-నైజాం' (పుట : 40) గేయంలో

---

1. జాతీయ భారతి జయభారతి (1957) పైడిపాటి సుబ్బరామశాస్త్రి పుట 27

అమ్ముడు పోతున్నామా? ఆంధ్రుల
మమ్ముడుపోతున్నామా?
నిజాము వీటికి- బజారు రేటుకు
అమ్ముడు పోతున్నామా?
చేపల్లా - జెల్లల్లా
కొవ్వి బలిసినా గొర్రెల్లా ॥ అ ॥
నడుంకట్టరండీ - ఎపుడో
బుడుంగు మంటుందీ!........
ప్రతిపాదనలో ఉన్నదానినే
ప్రతిఘటించ రండీ! ॥ అ ॥

అని నిజాంకు అమ్ముడు పోవడానికి ఆంధ్రులు, చేపలు - గొర్రెలు కాదంటూ, ప్రతిపాదన లోనే ప్రతిఘటించాలంటూ తీవ్ర స్వరంతో ఎలుగెత్తారు.

విశాలాంధ్ర అవతరణం సందర్భంగా 'విశాలాంధ్ర' అనే గేయాన్ని (పుట.42) విరచించారు.

విశాలాంధ్రమే విరిసిందీ!
దిశాతటమ్ముల మెరసిందీ!
.........................................
తెలంగాణలో జ్వలించుదీపం
ఆంధ్రావనితో అఖండమై
కోర్కెతీర ముక్కోటి ప్రజాళికి
భాగ్యనగరి సౌభాగ్యము నించెను ॥ విశా ॥

తెలంగాణా ఆంధ్ర ఒక్కటియై భాగ్యనగరు (హైద్రాబాద్) రాజధానిగా ఆంధ్రుల సౌభాగ్యము వెల్లివిరిసిందంటూ అభివర్ణించారు.

సిద్ధారుని గురించి ప్రస్తుతిస్తూ అల్లిన 'గౌతమ బుద్ధుడు' (పుట : 44) అనే గేయంలో -

సిద్ధమూర్తి శౌద్ధోదని
సిద్ధార్థా ! బుద్ధయమీ!
జోహరు జోహరు !
జోహరు జోహరు!
.............................
పరిమళించె విశ్వంభర
పరవశమై నీ జనితో
భరతఖండ కీర్తి ధునీ
పరమయోగి ! ప్రాగ్జ్యోతీ!

గౌతమబుద్ధుని సూక్తులతో అహింసాధర్మ ప్రబోధంతో భరతఖండం ఖండాంతర ఖ్యాతి బడసినట్లుగా కొనియాడారు. అలాగే 'బాలగంగాధర తిలక్' అనే గేయంలో (పుట : 46)

స్వరాజ్యమే మన జన్మహక్కని
నిరాఘాటముగ చాటావు!
పరాయి శక్తుల దౌష్ట్యం కెదురై
పరాక్రమించి నిలిచావు!
పురాణ సంస్కృతి నుద్ధరింప, నీ
నరాల సత్తువ నోడ్డావు
నిర్మలమైన జాతీయతకై
కర్మయోగివై వెలిగావు
.........................................

అంటూ స్వాతంత్ర్య సముపార్జనకై గాంధీ కంటె ముందుగానే 'స్వరాజ్యం మన జన్మహక్క'ని గర్జించిన లోకమాన్యుడగు తిలక్‌ను స్తుతించారు. అలాగే స్వాతంత్ర్యాన్ని సత్యాగ్రహంతోనే సాధించిపెట్టిన గాంధీని కీర్తిస్తూ అల్లిన గేయంలో (పుట : 49)

జాతి మేలుకొలిపి విఖ్యాతి గన్న మా గాంధీ!
జ్యోతి వోలె వెలుగునీకు జోహారు జోహారు!
నీ వలువే కొల్లాయీ
నీ వెలుగే బ్రహ్మాండం
కత్తిలేక సేన లేక
ఎత్తినావు జయపతాక !

అని కత్తిసేనలేకనే జనజాగృతితో, సత్యాగ్రహంతో స్వాతంత్ర్య జయపతాక నెగురవేసిన వైనాన్ని కళ్లకు కట్టినట్లు రమ్యంగా రచించారు. అదే విధంగా నేతాజీ, నెహ్రూజీ, పటేల్ ప్రతిభల్ని ఘనంగా కీర్తించారు. స్వాతంత్ర్య దినోత్సవమైన 15వ ఆగస్టునే గాక రిపబ్లిక్ దినోత్సవమైన జనవరి 26ను జనరంజకంగా నుతించారు. (పుట : 67)

తురగలించె కాంతిరేఖ - భరత జాతి మస్తకమున
పరిమళించె విశ్వంభర - ఇరువది ఆరవ జనవరి
................................................................. ॥ తుర ॥
ఎలుగెత్తెను భారతమ్ము
వెలుగుల శంఖాల నొత్తి
విజయ దుందుభులు మ్రోగెను
ప్రజ కూర్చెను రాజ్యాంగం! ॥ తుర ॥

పల్లవి యందిలి క్రింది పంక్తిలోని చివరి పదాల్ని 'ఇరువది ఆరవ జనవరి' కి బదులుగా 'జనవరి ఇరువది ఆరున' అని స్వల్పమార్పు చేసుకుంటే చక్కటి అంత్యానుప్రాసమేర్పడేది. అలాగే చరణంలోని చివరి పంక్తిని గూడ 'ప్రజ కూర్చెను రాజ్యాంగం' కు బదులుగా, 'రాజ్యాంగం ప్రజకూర్చెను' అని మార్చుకుంటే పై పంక్తికి అంత్యానుప్రాసమేర్పడి వీనుల విందుగా వుండేది.

జ్యేష్ఠ మాసంలో తొలకరి పడగానే ఏరుపారడం, చేలకు నీరు రావడం సహజం. కావున ఆ నేపథ్యాన్ని దృష్టిలో వుంచుకొని 'ఏరువాక' అనే గేయాన్ని (పుట : 70) అల్లారు.

ఏరువాకొచ్చింది, ఏరువాకమ్మ!
కొండలన్నీ దాటి కోనల్లుదాటి!
ఏరువాకమ్మకూ ఎర్రన్ని పూలూ!
బసవన్న కొమ్ములకు పచ్చన్ని పూలు!
.......................................................
సాగిరావమ్మ మా ఏరువాకమ్మ!
తూగి రావయ్యా మా పంట బసవయ్యా!

అంటూ ఏరువాకకు ఎనలేని ఆనందంతో ఖండగతిలో స్వాగతం పలికారు. ఆ తర్వాత 'దసరా' పండుగ గూర్చి (పుట :74) మరొక మంచి గేయమల్లారు.

హనుమన్నవై నీవు రావోయీ!
అర్జునుండై నీవు రావోయీ!
.......................................
హనుమన్న లంఘించె మున్నీరు,
అంతమొందెను సీత కన్నీరు!
.................................................

బంగాళాఖాతం, హిందూ మహాసముద్రం, అరేబియా సముద్రం అనే మూడు సాగరాలు కలిసే చోటును 'మున్నీరు' అని సరికొత్త తెలుగు పదాన్ని ప్రయోగించడమే గాక హనుమంతుడు అంతమొందించె సీత కన్నీరు అని చక్కటి అంత్యప్రాసను ఏర్పరచారు.

పంచవర్ష ప్రణాళికలే దేశ ప్రగతికి రాజమార్గాలని చాటుతూ అల్లిన గేయం, 'భారత ప్రణాళిక' (పుట:79)

నేతలం నిర్ణేతలం!
మన జాతికి మనమే నేతలం!
.............................................
జాతి మతాల విచక్షణ లేనీ
మానవ న్యాయం మనసూత్రం
సమానావకాశాల సృజించే
ప్రజాస్వామ్యమే మన లక్ష్యం!

ప్రజాస్వామ్యంలో ప్రజలే నేతలు - ప్రగతి నిర్ణేతలంటూ అందరికీ సమానావకాశాలు కల్పించడమే ప్రణాళికల లక్ష్యమంటూ వివరించారు. 'నాగార్జున సాగరము' అనే గేయంలో (పుట 86)

ముంచెత్తవే కృష్ణ! ముంచెత్తవే!
పాతకాలపు పూత బౌద్ధ ప్రదేశమ్ము !

పొంగి ఉవ్వెత్తుగా రంగత్తరంగాల
నాగార్జునాచార్య సాగరమ్మై నీవు

...............................................

కేదారములు పుణ్య కేదారములు గాగ
జీవనమ్ములు నింపి జీవనమ్ములై నిల్చి ॥ ముం ॥

అని కృష్ణానదిని ఉప్పొంగి రమ్మంటూ, జీవన కేదారాల్ని సస్యశ్యామలం జేయమంటూ స్వరమెత్తి స్వాగతం పలికారు.

మన దేశానికి తల మానికముగా నిలిచిన 'కాశ్మీరు'ను అభివర్ణించిన గేయంలో (పుట : 88)

కండలో కండరా కాశ్మీరూ!
గుండెలో ప్రాణమ్ము కాశ్మీరూ!

...............................................

అందాల కోన, ఆనందాల దోనెరా!
నాకమే జారిచిన నందనోద్యానమ్ము
భరత మాతృ కిరీట మాణిక్య దీపమ్ము
భారతీ పీఠమ్ము పరమ పూజ్యమురా!

కాశ్మీరును మన కండలో కండగా, గుండెలో ప్రాణంగానే గాక, అందాల కోనగా నాకం జారవిడిచిన నందనంగా, భరతమాత కిరీటంలోని మాణిక్యదీపంగా అభివర్ణించడం అద్భుతంగా వుంది.

విశ్వశాంతిని కోరుతూ 'శాంతి సందేశం' అనే గేయంలో (పుట : 96) అణ్వాయుధాల్ని సృష్టించవద్దంటూ శాసించారు.

ఓరోరి మానవ వినరా! నీ
మారణోద్యోగమ్ము మానవదేరా!

...............................................

హిరోషిమా నగర ఘోరమ్ము కన్నావు
మారణాస్త్రము పైన మనసు విడవేలా?

...............................................

శాంతరసము చిందు సాధుమూర్తులు ఋషులు
శాంతి శాంతి యనిరి సారమ్ముగనరా!

అని శాంతిని ఎల్లెడల నెలకొల్పమంటూ ఎలుగెత్తారు.

మన 'ఖద్దరు' ప్రత్యేకతను చాటుతూ ఒక చక్కటి గీత మల్లారు (పుట: 103) అందులో

వడకవే వడకవే వడకవే కదురా!
వడుకు నూలూబట్ట మడతలందీవే!
మెత్తన్ని పింజలో - నెత్తమ్మి యెడదలో
సాగి దారమ్ముగా - తూగి రాగమ్ముగా...

మెత్తని దూది పింజలో దారంగా సాగి రాగంగా తూగి కదురును వడకమని సంబోధించడం సవ్యంగా వుంది. రాట్నపు సవ్వడిని రాగంగా పోల్చడం హృద్యంగా వుంది.

బాలల్ని 'భావి పౌరులు'గా అభివర్ణించిన గేయంలో (పుట · 123)

భావి భారత పౌరులారా!
తావి చిమ్మే పూవులారా!
పలుకు పలుకున తేనెలొలికే
పాటపాడండీ!
పాటలో ముత్యాల పేటలు
పాటలో వెన్నెలల తేటలు
పాటలో సెలయేటి నీటులు
పరిఢవిల్లగను

బాలల్ని నెత్తావుల్ని విరజిమ్మే పూవులుగా పోల్చారు. అందుకే పలుకు పలుకున తేనెల్ని ఒలికించమన్నారు. పాటల్లో సెలయేటిని ప్రవహింపజేయమన్నారు. ఈ గేయాన్ని 'ముత్యాల సరాల' బాటలో మిశ్రగతిలో నడిపారు.

నవభారతాన్ని వర్ణిస్తూ, ప్రతి పౌరుడి బాధ్యతల్ని గుర్తు చేస్తూ అల్లిన గేయం 'నవ భారతం' (పుట : 136)

నవభారత నిర్మాణంలో
ఎవరెవరిది ఎంతటి పాలో
ప్రతి పౌరుడు యోచించాలీ
ప్రతి గ్రామం ఘోషించాలీ ॥ న ॥
తమ జీవితమే అంకితమై
తమ చేసిన త్యాగం ఫలమై
మన పెద్దలు తెచ్చిన రాజ్యం
మన కందరికీ అనుభోజ్యం ॥ న ॥

అనేకుల త్యాగాలతో సాధించిన నవభారత స్వతంత్ర రాజ్యం మనకందరికీ అనుభోజ్యం అయినట్లుగా, దాన్ని ప్రతి పౌరుడు, ప్రతి గ్రామం గుర్తించాలన్నట్లుగా ప్రబోధించారు. ఇలా రకరకాల గేయాలతో రాణించారు. లలితగీత విస్తారం గావించారు.

## బోయి భీమన్న :

లలితగేయ రచయితల్లో చెప్పుకోతగ్గ, చేవ కలిగిన మంచి రచయిత బోయి భీమన్న. భీమన్న గేయాలుగా వెలువడిన 'రాఖీలు' ను పరిశీలిద్దాం!

'రసోవైసః' భగవంతుడు ఆనంద స్వరూపుడు "రసంహ్యేవాయం లబ్ధానందీ భవతి" ఇతడు రసమునే పొంది ఆనందము కలవాడగును, అని శ్రుతుల వాక్యాలు వివరిస్తున్నాయి. భగవంతుడు రసస్వరూపుడు.

"ప్రకృతి-పురుషుడు" అన్నప్పుడు పురుషుడంటే పరబ్రహ్మ అని అర్థం. కేవలం మగవాడనే అర్థం కాదని బోయి. భీమన్న వాదం. పరబ్రహ్మలోని రసతత్వం స్త్రీ, పురుష భిన్న ప్రవృత్తులు కల ప్రకృతిగా పరిణమించినప్పుడు - ఆ రెండు ప్రవృత్తులు తిరిగి మూల బ్రహ్మలో లీనం కావాలంటే - అవి ఒకదానినొకటి పొంది అనుభవించక తప్పదంటారు భీమన్న. రసస్వరూపుడైన భగవంతుడు రసాన్నే పొంది అనుభవిస్తున్నాడన్న శ్రుతి వాక్యానికి అర్థం, జీవిత పరమార్థం ఇదేనని, తాను నమ్మిన రసవాదానికి 'రసాద్వైత' మని పేరు పెట్టి, తన ఆధ్యాత్మిక సిద్ధాంతానికి అనుగుణంగా రాభీలను రచించారు భీమన్న. ప్రకృతిలోని స్త్రీ సహజమైన రామము, పురుష సహజమైన భీమమును కలిపి రచించిన ప్రేమగేయాలకు 'రాభీలు'గా తాను పేరిడినట్లు ముందు మాటలో వివరించారు. రాభీలలోని రసావేశమంతా మధురభక్తియుతమైనది.

భావుక సహజమైన ఈ రసానందం వేదోపనిషత్తులలో పుట్టి, వైష్ణవ మధుర భక్తితో మిళితమై, సూఫీమతంవల్ల బహుళ ప్రచారాన్ని పొంది, పాశ్చాత్య దేశాలకు ప్రాకి, అక్కడ అవిగోరి, సింబాలిజం పేర్లతో వేషం మార్చుకొని మళ్లీ మనదేశానికే వచ్చింది. ఆధునిక హిందీ బాంగ్లా సాహిత్యాలలో ఛాయావాదం, రహస్య వాదాలనే నినాదం పొంది, తిరిగి సాహిత్యపు శిఖరాలను అధిరోహించింది. ఈ రసవాదంలో మానవ సహజమైన భావ శబలత భాసిస్తుంది. ఎవరు చదివినా ఆ కవితలో రసమే వ్యంజితమౌతుంది.

విప్లవ కవితా శాఖలు వెల్లివిరిసే రోజుల్లో ఆశలు ఆవేదనలు తిరుగుబాటుధోరణులు తెలుగు కవితలో ప్రతిధ్వనిస్తున్న కాలంలో భీమన్నగారు మాత్రం వైయక్తిక ఆనందాన్ని కోల్పోతున్న మానవులకు హృదయ కవాటాలు తట్టి రాగాన్ని, రసాన్ని కురిపించారు.

రాభీలలో మొదటి గేయం 'నమస్తే' (పుట : 1) లో సరస్వతీ స్తుతి చేస్తూ రాభీలకు నాంది పలికారు.

> "నమస్తే శరత్పూర్ణ చంద్రద్యుతీ
> నమస్తే నమస్తే సరస్వతీ....
> **అమృత స్వరూపిణీ! ఆనంద మోహినీ!...**
> **అభికళా రసవాహినీ!**
>
> .....................................
>
> **విజ్ఞాన శారదా! ప్రజ్ఞాన సౌఖ్యదా**
> **సుజ్ఞాన లక్ష్మీప్రదా!"**

సరస్వతి వాగ్దేవి. కావ్యానంద జగత్తుకు రసమే మూలం. అందుకే వాగ్దేవిని భీమన్నగారు - 'అభికళారసవాహినీ', ఆనంద మోహినీ, అమృత స్వరూపిణీ, అంటూ కీర్తించారు. తమ రసాద్వైత సౌందర్య దర్శనాన్ని అమ్మవారిలోనే చూసుకున్నారు. "శుభ శోభనా జీవనా! విజ్ఞాన శారదా! ప్రజ్ఞాన సౌఖ్యదా! సుజ్ఞాన లక్ష్మీ ప్రదా!" అంటూ జ్ఞానలక్ష్మిని ఆరాధించారు. తమ మనస్సులోని

శరత్కాలపు పూర్ణ చంద్రుని వెన్నెలగా భాసించే ఆ వాగ్దేవికి ప్రణామాలు అర్పించి, లేఖినిని రసాద్వైతంలో ముంచెత్తారు.

'నాకోసం' (పుట:4) గేయంలో - జగత్తులోని విరులు-ఝురులు, తోటలు-పాటలు, కోరికలు-సంయోగాలు, కళలూ-కవితలు, అన్నీ తన కోసమే నంటూ రసావేశంతో హృదయంలో ఆశలు మొలకెత్తించారు.

"..............................
నా కోసం
ఈ జగమే నా కోసం
ఈ విరిసే విరులన్నీ
ఈ మెరిసే ఝురులన్నీ
..................................
ఆ ప్రేమలు, ఈ కోర్కెలు
ఈ సంయోగ సుఖాలు
..........................................
ఈ సంపదలన్నిటితో
నేను నేను నీకోసం"

'గుండెనెవరో' (పుట:5) గేయంలో తన గుండెలో ఎవరో ఉండి పండు వెన్నెల కాయించారని పరవశించారు.

"గుండె నెవరో వుండి వుండీ
పండు వెన్నెల కాతురు
పండు వెన్నెల పరుపు మీద
పారిజాతములుంతురు
పాడి పాడీ పాటనగు నను
పాడుకొను చెటోపోదురు!"

అంటూ అవ్యక్త మాధురిని వంపి, కనుమరుగైన అజ్ఞాత మూర్తిని భావుకతలో నింపారు. ఆ అజ్ఞాతమూర్తి ఎవరో తెలీక 'ఎవరదీ?' (పుట :6) అంటూ నిలదీశారు

"ఎవరదీ? ఎవరదీ
ఇంతగనను వెంటాడే దెవరదీ?
దిక్కులేని పేద యింట
దీపము వెలిగించేదీ,
మోడుకు గిలిగింత పెట్టి
మొగ్గలు తొడిగించేదీ" ॥ ఎ ॥

అంటూ చివరకు 'నీవా' (పుట 7) అనే గేయంలో పుట్టుక నుంచీ తనలో పెరిగి, క్షణక్షణం తనలో నుండి తొంగి చూచే రాగరూపాన్ని అందాన్ని ఆస్వాదించగలిగిన మనస్సుని, మనసులోని భావాల్ని, ప్రతిరూపాల్ని నీవా? అని ఆశ్చర్యంగా అవలోకనం చేసుకొన్నాడు కవి.

"ముద్దు ముద్దుగ" (పుట:17) అనే గేయంలో ద్వైతం నుండి అద్వైతంలోకి చేరటానికి పడే తాపత్రయాన్ని వివరించారు.

"ముద్దు ముద్దుగ మొగ్గదొడిగిన
పొద్దు తిరుగుడు పూలతీగ
అన్ని మొగముల విరియుట
నిన్ను చూచుటకే కద?
మావి కొమ్మల నడుమ కోకిల
మధుర మోహన వీణ తానై
అన్ని మెట్లను కట్టుకొనుట
నిన్ను చేరుటకే కద?
..........................................
నింగి బొంగర మట్లు తిరుగుట
నిన్ను పొందుటకే కద?"

అని తన ప్రేయసి కొరకే అన్నీ జరుగుతున్నట్లు భావించారు.

పాడేవారుంటే - పాటలకే కొదువా?...
పసగల పాటుంటే - పాడేవారే కొదువా?...
..............................................................
వీణియలే ఉంటే - వాణిలకే కొదువా?
వాణియే కరుణిస్తే - వేణువులే కొదువా?..."

అంటూ చలింప చేసే శక్తియే ఉండాలేకాని, అచలమైనా చలిస్తుందని కవి హృదయ స్పందనని ఆవిష్కరించారీ గేయంలో.

'జీవన వీణా వాదినీ' (పుట:27)లో -

జీవన వీణా వాదినీ! నా
జీవిత లీలా గాయనీ!
నను లేపే ఉదయారుణ కిరణీ!
నను తనిపే రసవాహినీ!
..........................................
యౌవన మోహన రాగిణీ! నా
జీవన కృతి కల్యాణీ!
నా సుఖ దుఃఖములన్నియు నీవై
నను మనిపే ప్రియదర్శినీ!....."

తన జీవిత వీణను మ్రోయించే లీలాగాయని, తనను మేల్కొలిపే ఉదయ కిరణం, తనను తన్మయం గావించే రసవాహిని, తన జీవన కృతికి కల్యాణి, తనను మైమరపించే ప్రియదర్శిని, ఇవి అన్నీ తన ప్రేయసియే అని భావించారు. తనలో అంతర్లీనంగా దాగిన ద్వైతాన్ని దర్శించటానికి యత్నించారీ గేయంలో.

'మేఘ రంజని' (పుట : 31) గేయంలో -

మేఘ రంజని నీ సమక్షము
మేదినియె నా వక్షము!
రాగరంజని నీ పరోక్షము
రసరమయె నా పక్షము
......................................
సర్వరసరాగములకును నే
స్వామినై మనునప్పుడు! ॥ మే ॥

ఆమె ధారాపాతంగా ప్రేమ కురిపించినప్పుడు తన ఎడద విశాల విశ్వంగా మారి తనివితీరా తడుస్తుందని, ఆమె దూరమై పోగా ఆమె రసమయమై తన ఎడదను ముంచెత్తుతుందని అంటారు. ఏది తనలో సంలీనమై సమక్షంగా భాసిస్తున్నదో, ఏది తనకు దూరమై పరోక్షంగా తలపింప చేస్తున్నదో కవికే అంతుచిక్కలేదు. కారణం ఆమె అద్వైత రూపంలో తన హృదయంలోనే ఉన్నది కనుక. సర్వరసరాగాలకు అతనే స్వామి కాబట్టి ఏ రాగంగానో అది తనలోనే జనిస్తుంది. తనకే ఆనందం కలిగిస్తుంది. రసమై భాసిస్తుంది. ఈ గేయంలో "రసోవైసః"ని, "రసంహ్యే వాయం లబ్ధానందీ భవతి"ని ప్రతిష్ఠాపించారు.

"ఏమున్నదిరా?" (పుట: 58) గేయంలో ప్రేమతత్త్వాన్ని వివరించారు ఆమె అడగాలనుకున్న మాట పెదవిదాటి రాలేకపోతున్నదని, ప్రేమ అని అడుగబోవగా మైమరపు కలుగుతున్నదని, మధురమూర్తిని చూసి చూసి ఆమె మధువుగా మారిపోయి తమకమందినది. అందుకే తనకేమి కావలెనో దానిని మృదు మధురంగా వాచ్యం చేయకుండా వివరించిందిలా-

ఏమున్నదిరా చెప్పడానికి?
ఏమున్నది నీ వెరుగనిది?
కమలము కమలాప్తుని కేమగును?
కలువ కలువరేని నేమి కోరును?
అంతకంటె నేనేమి వలతురా?
అంతరంగమున తావీగదరా?

అంటూ తన అవ్యక్త ప్రేమ పిపాసను ప్రేయసి ప్రియునితో వ్యక్తపరచిందీ గేయంలో-

అద్వైత భావాన్ని సూచించే 'నదీనాం సాగరో గతిః' అన్న సూక్తిని "ఎన్నాళ్లకు చేరితిరా?" (పుట : 66) గేయంలో వివరించారు. జలధారను ప్రేయసిగా, జలధిని ప్రేమికునిగా భావించారు.

"ఎన్నాళ్లకు చేరితిరా
ఈ నీ హృదయ పయోధికి?
..........................................
మంటలలో మసలి మసలి

మబ్బులలో వేచి వేచి
కొండల కొలకులకు దూకి,
నిండు వాగుగా ప్రాకి!
....................................

జల ప్రేయసి జ్వలించి మేఘ రూపాన్ని పొందింది సరసత సింపుకొని, చిరకాలము వేచి కొండలలో ధారగా దూకి వాహినిగా ప్రాకి ప్రవహించింది చివరకు తన ఉనికిని పురుషునిలో సంలీనం చేయాలన్న తపనతో -

"ఎంతకాలము గతించిన
ఎన్ని భంగములు పొందిన
నీ వస్తువు నిను చేరక
నిలువదన్న సత్యముతో"

రసవాహిని ఉరుములు పరుగులతో సంద్రంలో సంలీనమై పోయింది.

'ఇసుక తిన్నెల మీద' (పుట : 69) అనే గేయంలో -

"ఇసుక తిన్నెల మీద వెన్నెల
పసిడి పాదాలాడెనే!
కలువ పువ్వుల కంఠములలో
ఖరహర ప్రియ విరిసెనే!..."

మేఘరంజని రాగంతో (మేఘరంజని గేయం - పుట . 31) రసధారలతో తన ఎడద తడుపుకున్న పురుషునికి ఇసుక తిన్నెలపై కన్నెతో విహరించాలనే తపన జనించింది. అందుకే ఇసుక తిన్నెల మీద వెన్నెల పసిడి పాదాల ముద్రలు పడినాయని, కలువ పూవుల కల కంఠాలలో ఖరహర ప్రియరాగం విరిసిందని, కొండ వాగుల గుండెలలో కోటివీణలు మ్రోగాయని భావించారు. ''శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః'' కాబట్టే -

"కీరమందున నెమరు వేసెడి
ధేనువులు తలలూచెనే!"

అంటూ ఖరహర ప్రియ రాగ వాదనతో మాధురులకు తానొక గోపాలుడై గోపికను ఒడి చేర్చుకొన్నాడు. గోపికా కృష్ణుల ప్రణయ తత్త్వం రసాద్వైతమే!

ఈల చెట్టులు ఎదిగినింగికి
ఈ పసందులు మోసెనే!
బాలచంద్రుడు విరగబడగా
బాల నాయొడి వ్రాలెనే!

అని పసందైన ప్రణయాన్ని పలికించారు.

'నా మనస్సున నీవు' (పుట 71) గేయంలో భావచమత్కారాన్ని, అద్వైత సిద్ధిని ఆవిష్కరించారు.

"నా మనసున నీవు
నీ మనసున నేను

రాగసుధార్ద్రులము!
రాధాకృష్ణులము!
..........................
రతి మన్మథులము
రవి చంద్రికలము
ఆమని మధువులము
అమృత భాండములము"

అని ఒకరి నొకరు విడదీయలేని రాధాకృష్ణులని, రతీ మన్మథులని, రవి చంద్రికలని వెల్లడించారు. అధర పానం చేత ఒండొరులు ఆమని మధువులు, అమృత భాండాలుగా కౌగిలింతలలో కామపూర్ణిమలుగా, మారినట్లు మధుర ప్రేమను వివరించారు. చందనపు పూతలతో, మధురానుభూతిలో మునిగిపోవటాన్ని చక్కెర బొమ్మలుగా వివరించారు. ఈ గేయంలో చక్కని శబ్ద చమత్కారాన్ని కనబరిచారు.

'నీ కోసమె ఈ గానం' (పుట : 108) గేయంలో

"నీకోసమె ఈ గానం - నీ కోసమె యీ గీతం
ఈ కోసమె ఈ నా కమనీయ కళాసర్వస్వం
నిన్నారాధించుటకే ఇన్ని కళల ఆరాధన
నీ ఆత్మను పొందుటకే నా ఈ జీవిత తపన"

అని తన గానం, గీతం, కమనీయ కళాసర్వస్వం అన్నీ ఆమె కోసమే అంటారు. ఇన్ని కళల్ని ఆరాధించేది, జీవితం తపించేది పరమాత్మ ఐక్యతకే నంటారు. పరమాత్ముని కరుణే లభిస్తే ఈ విద్యలన్నీ ఎందుకు, పరమాత్మే తనను స్వీకరించాక "ఇకనేనెవ్వరు ప్రత్యేకం" అని ప్రశ్నిస్తారు. అహం అనే భావనలో నుండి కళాతపస్సు చేసేది కేవలం పరమాత్మ కృపకోసమేనని సమాధానమిస్తారు.

"సూర్యుని చూచిన కంటికి" (పుట : 121) గేయంలో బ్రహ్మతేజ ముందు మరేకాంతి నిలబడలేనట్లే పరమాత్మయే తన చెంత వుంటే మరొక లోకేశ్వరత అవసరమెక్కడి దంటారు.

సూర్యుని చూచిన కంటికి
చుక్కలు కనబడునటరా?
చంద్రుని కౌగిట ఒడలికి
చందన సుఖమేమిటిరా?
..........................................
నీ కృప కల్గిన నాకు
లోకేశ్వరితయె యేలర?...

అనే చక్కటి అలతి అలతి ఉపమానాలతో పరమాత్మ తత్వాన్ని కరతలామలకం చేశారు కవి. అందుకే -

"నీ ఆత్మనై గల నేను
నిన్ను పట్టలేనటరా?"

అని చిదానంద స్వరూపాన్ని సందర్శింప చేస్తారు.

'మాటలాడగదే' (పుట : 149) గేయంలో మౌనదీక్ష మాని తనతో తనివి దీర మాట్లాడమంటూ ప్రణయరాణిని అర్థించారు. అంతర్లీనంగా గుండె లోతులలో మునిగి, తనను అవ్యక్త చేతనలో నింపిన రసవాహినిని, ప్రత్యూష రాగిణిని సుప్రసన్నం చేసుకో యత్నించారు.

"మాటలాడగదే
మౌనదీక్షవీడగదే!...
నా లలాటఫలకముపై
హేలాక్షర మణిమాలా!
నాకర పల్లవ తలమున
శ్రీకర రేఖా లీలా!
నా జీవిత గతి పొడువున
నా గతిలో పదపదమున
నవ వికసిత కల్పకమా!
నవ్య దీప తోరణమా!"

.......................................

అంటూ తన జీవన గతిలో విరిసిన పారిజాతంగా, దీప తోరణంగా, ఉదయ లక్ష్మిగా, అలసిన హృదయానికి అమృత వర్షిణిగా ప్రేయసిని సంభావించారు.

'ఉన్నదీ' (పుట : 163) గేయంలో తనకు తనుగా తెలుసుకొన్న మానవత్వాన్ని, పరమానందాన్ని, ప్రజ్ఞాన బ్రహ్మతత్వాన్ని లోకానికి చెప్పాలనే ఆశను ఏ దుఃఖము లేని చోటికి ఎల్ల జగాన్ని చేర్చాలనే అభిలాషను వెల్లడి చేశారు.

"ఉన్నదీ! మనసున నా కొక కోరిక

.............................................................

మానవతకు లోకాలను
మలచాలని వున్నది!

....................................................

సూర్యరథము త్రిప్పి గతము
చూడాలని వున్నది!

.........................................

ఏ దుఃఖము లేని స్థితికి
ఎల్ల జగము చేర్చాలని
ప్రజ్ఞాన బ్రహ్మనుగా
బ్రతకాలని వున్నది!

అని తనకు ప్రజ్ఞానబ్రహ్మగా బ్రతకాలని వున్నట్లు ప్రకటించారు.

'పాటీ పడి నీ పదములు' (పుట : 168) గేయంలో చమత్కార యుక్తంగా రాగాన్ని-త్యాగాన్ని ఆవిష్కరించారు.

"పోటీ పడి నీ పదములు
పూజింతునురా!
అందమైన దెల్ల నీకె
అర్పింతునురా!
..............................
వెన్నెలలో స్నానమాడి
నన్ను నేనె దోసిట గొని
హారతి పళ్లెమున నీకు
నీరాజన మొదునురా!"

అని ఆత్మ ప్రేయసి తన పరమాత్మ విభునితో అంతరంగాన్ని హారతిగా అర్పిస్తాననడం కవిరాగాత్మకతకే గాక ఆధ్యాత్మికతకూ అద్దం పడుతోంది.

'ఉదయం నీ రూపం' (పుట : 171) గేయంలో నాయిక రూపాన్ని బహువిధాలుగా దర్శించారు.

"ఉదయం నీ రూపం
ఉత్ఫుల్ల సరోజం!
సాయంత్రం నీ రూపం
సంధ్యాగరు దీపం!
నా సన్నిధిలో నీవు
నవ వసంత వధువు!
నా పరోక్షమున నీవు
నందన వన మధువు

అంటూ తన సమక్షంలోని నాయిక తన కంటికి నవ వధువుగా, పరోక్షంలో నందనవన మధువుగా ఉన్నదని, ఆమె వచ్చు మార్గం తన జీవిత పరమార్థంగా, మరలి వెళ్లు మార్గం మహికి రసానందభరితంగా భావించారు కవి. ఉదయం పద్మంలా, సాయంత్రం అగరుదీపంలా సాక్షాత్కరించే తన సౌందర్యరాశి దరికి చేరునప్పుడు పరమార్థాన్ని తెస్తున్నదని, తనను వదలి వెళ్లునప్పుడు జగత్తుకు రసానందాన్ని యిస్తున్నదని కవి మర్మంగానే కాక మధురంగా మలిచారీ గేయాన్ని.

'మారాలి' (పుట : 181) గేయంలో మనిషి మారాలని కోరుకొంటారు. క్షీర సముద్రాన్ని మంధర పర్వతంతో మధిస్తే ముందు హాలాహలం, ఆ తర్వాత అమృతం జనించింది. అలాగే మనుషులలో శాంతి సుధలు నిండాలంటే-

"మారాలి మారాలి
మనిషి మారాలి!
మనిషికి మనిషికి నడుమ

మంథరాలు తిరగాలి,
ద్వేషాగ్నులు చల్లారి
ప్రేమసుధలు ఊరాలి!
.................................. ॥ మా ॥
పొట్ట కూటికై మనిషి
పోరాటం ఆపాలి!
ప్రజలందరి ఆనందమె
ప్రగతికి గురి కావాలి!" ॥ మా ॥

అంటారు. అంతేకాదు పనీ, తీరిక, వేడుక ప్రతి మనిషికీ దక్కాలంటారు.

పూర్తిగా రసాద్వైతం పేరుతో, సుదూర అవాస్తవిక లోకాలలో విహరించే అలవాటు భీమన్నగారికీ లేదు. స్వాప్నిక జగత్తుకన్నా వాస్తవ జగత్తు మిన్న. అందుకే అదే ఆనందం అంటారు భీమన్నగారు.

"పేదవాని కుండలలో
వేద మధువు నిండాలి
వేద మాత గుండెలలో
విశ్వజనిత పండాలి"

అంటూ విశ్వమానవ ప్రేమను ఆకాంక్షించారు. ఈ ప్రేమయే ఆనంద హేతువు. ఆ ఆనందమే పరమానందానుభూతి అవుతుంది. హృదయ విదారకతలేని లోకమే ఆనంద జగత్తు.

'మాటే సౌహార్దం' (పుట : 188) గేయంలో - మాట రూపాన అభివ్యక్తం చేయలేనిదే స్నేహం బలపడదని, మనసనేది లేకపోతే బ్రతుకే భారం అవుతుందని, మనుషులను ఏకం చేసే మనస్సు ఉషస్సు లాంటిదని, చెలిమి-కలిమి లాంటి మాట - మనసు మనుషులలో నిండిపోతే ఆ జగమంతా మధువులా ఉంటుందని అందుకే -

"మాటే సౌహార్దం!
మనసే సౌందర్యం!
  మాటా మనసూ ఉంటే
  మధురం జీవితం!
మాట చెలిమి కలిగి
మనసు కలిమి వెలిగి
మనిషి మెలిగి నంత
మధువే జగమంత"

అని మాట - మనసు ప్రాధాన్యతను వివరించారు.

'ఎత్తవోయీ కేల' (పుట : 213) గేయంలో

ఎత్తవోయీ కేల
ఈ బేల సుమబాల!

ఏ గాలి వడితూలి
ఈ నేల రాలినదొ
ఏ కబరి ముడి సడలి
ఈ ధూళి జారినదొ ॥ ఏ ॥

నేలరాలిన బేల సుమబాల ఏ గాలికి రాలిపడిందో, ఏ కొప్పునుండి జారిపడిందో గాని ఇంకా సంస్కార వాసనలు వదలిపోలేదు. సౌందర్యమూ, మాయలేదు. ఈ బేలను స్వీకరించకపోతే ఏ కొంటె కన్నులో, తుంటరి చేతులో, కొసరి కసరి చివరకు ఎటో విసరిపోతాయని చూపులకది ఒట్టి మామూలు పూవుగాదని, వనలక్ష్మి మనసేనని విరిబాల అందాన్ని, ముగ్ధత్వాన్ని అనుభూతులను నింపుకోవటానికై వెంటనే స్వీకరించమంటారు.

వట్టి విరిగా లేదు
వజ్ర కోరక మేమొ!
వలవంత బడియున్న
వనలక్ష్మి మనసేమొ!

అని నేలరాలిన ఆ సుమబాల వజ్రపు ముక్క లాగుందని, వనలక్ష్మి మనసేనని అభివర్ణించారు.

'శ్రీశైల శంకరా' (పుట : 227) గేయంలో -

"శ్రీశైల శంకరా! కృష్ణగంగాధరా!
భ్రమరా మనోహరా! ప్రబల శక్తీశ్వరా!
కలిమి లేముల మించి కులమతాలను మించి
స్పర్శ సుఖ మందించు-సాయుజ్య సుందరా!"

అని కీర్తించారు. జగద్గురు శంకరాచార్యులవారు ప్రతిపాదించిన మతం అద్వైతం. దేశమంతా తిరిగి శైవబోధలు చేశారు. శైవానికి విపరీత ప్రచారం కలుగ చేశారు. శైవమతం ప్రబలిన తరువాతనే కులమతాలు రూపుమాసి పోయాయి. ఈ కవికి కావలసినది రసానంద అద్వైతమే! కుల మత వర్గ సంఘర్షణలు రూపుమాపి సాయుజ్య మొసగిన శ్రీశైల శంకరుణ్ని - భ్రమరాంబా మనోహరుణ్ని-

"శంకరుని అద్వైత
సాహితీ శశిధరా!"

అని కీర్తించి, అద్వైతానికి ఆయువుపట్టుగా మారిన 'శివోహం'ను జ్ఞప్తికి తెచ్చారీ గేయంలో.

'రావయ్యా ఒకసారి' (పుట : 235) గేయంలో

రావయ్యా! ఒకసారి! నా
బ్రతుకే నీ కోసము జడధారి
ఆ బాల్యముగా పెంచుకొన్న నా
ఆశావనములు స్వప్నవల్లికలు

పూసిన కాసిన పూలూ పండ్లూ
పూజ కొరకు నినుపిలిచేనయ్యా!

.............................................

కన్నీటితో నీ కాళ్లు కడిగి, నా
కున్నదెల్ల వడ్డించితినయ్యా!

అని చిన్ననాటి నుండి పెంచుకున్న ఆశాలతలు పుష్పించి, ఫలించాయని, వాటిని పరమాత్మకు నైవేద్యంగా పెట్టి, తన కన్నీటితో స్వామి పాదాలు కడిగి ఉన్న తన సర్వస్వాన్ని భగవదర్పితం చేశానని, దాన్ని ఆస్వాదించమని, జీవుని ఆరాటాన్నంతా రసధారలుగా మనస్సుకు రుచి చూపించారు కవి. ఇలాంటి భక్తిగీత రచనల్లో భీమన్న కృష్ణశాస్త్రిని తలపింపజేస్తారు.

భీమన్నగారు అద్వైతసిద్ధి సాధనకు ఎంత శ్రమ చేయాలో ఎంత జాగ్రత్తపడాలో 'శోకమయము లోకము' (పుట : 275) అన్న గేయంలో అభివర్ణించారు.

"శోకమయము లోకము!
చూచుకొనుచు అడుగిడుము!
ఎంత పూల తోటైనా
ఎంతమేటి పాటైనా
సోలి పోవు గుణమున్నది
శ్రుతి తప్పే తెరువున్నది!
శోకం గుండా నీవు
సుఖం కేసి నడవాలి
చీకటి కొసనుంచి నీవు
వేకువనే చూడాలి!"

అని విలువైన పొలాన్ని బీడు చేయగల చవుడు, పంటను పాడుచేయటానికి తెగులు, ఉంటాయని, ఎంతటి వెలుగైనా అది ఆరిపోక తప్పదని, అలాగే ప్రేమ కూడా అంతరించిపోయే ప్రమాదముందని హెచ్చరించారు. శోకంలోనుంచి సుఖంవైపుకి పయనించమని, చీకటి కొసనుంచి, వేకువను చూడమని భీమన్నగారు ఆశాపథాన్ని చూపించారు.

'ప్రతి యింట నీ పూజ' (పుట : 300) అనే గేయంలో రాగభావలతల్ని పూయించారు. తన రాభీలలో పండించిన రసాద్వైతాన్ని రసజ్ఞ లోకానికి వడ్డించారు.

"ప్రతి యింట నీ పూజ చేయించనా?
ప్రతి నోట నీ పాట పాడించనా ?

.............................................

ప్రతి సుఖమునకు నన్ను
శ్రుతి చేసుకొని, నిన్ను
రాభీ రమగ నిల్పి
రాగ మొలికించనా?

అని తన రాభీలకు ఎంతటి ప్రచారం కావాలో వెల్లడించారు. గుండె గుండెలలో పాకి అన్ని గొంతులలో తనపాట పరవళ్ళు తొక్కాలని ఆకాంక్షించారు. గేయం కాగితాలలో మరుగున పడిపోవడం కాదు కవికి కావలసింది, ఆ గేయం ప్రజల నాల్కలపై నర్తించడం. అందుకే ప్రతి కోర్కెలో రాభీలు పూయించి ప్రతి గుండెలో పండించాలనుకున్నారు పద్నాలుగు లోకాల్లో రాభీరమ పాద పారాణి శోభిల్లేట్లు చేయాలనుకున్నారు. ప్రతి తలపు రాభీల రసాద్వైతానికి తరలించాలని కలలు గన్నారు.

'లలిత లలిత నవ పల్లవ' (పుట : 329) గేయంలో -

**లలిత లలిత పల్లవ నవ**
**ఫలకముపై తేనె రాచి**
**అంచిత కుసుమాంకురపు**
**కుంచియతో బొమ్మగీచి**
**తెచ్చినదే నవమాసం**
**ఇచ్చినదే బహుమానం**

అంటూ చిగురు పలకలపై మొగ్గల కుంచెలతో బొమ్మగీసి తెచ్చిన మధుమాసం ప్రకృతికి సరికొత్త బహుమానం యిచ్చిందంటూ అల్లిన ఈ గేయం భావన మనోహరంగా ఉంది. సుమ పరిమళ వనాన్నే వీణ చేసి, పక్షుల కిలకిలతో పాటరాసి, ఆమని తెచ్చిన బహుమానాలను వసంతుడు ఆనందంతో అందుకొంటూ-

**"ఈ చిత్రము నీ రూపమె**
**ఈ గేయము నీ నామమె**
**నాదానివె నా కిచ్చిన**
**నవమాసం బహుజాణ!"**

అంటూ తననుండి ఉద్భవించిన రాగద్వైతాన్ని, అద్వైతిగా ప్రకృతి బహూకరించినందున ఆమనిని నెరజాణగా అభివర్ణించారు.

'అలా చూస్తా వెవరి కోసం' (పుట : 348) గేయంలో-

**"అలా చూస్తా వెవరి కోసం?**
**అనుసరిస్తా వెవరి హాసం?**
**అధర మందని అలలలోకి**
**కథల కందని కలలలోకి**
**........................................ ॥ అ ॥**
**తరుణ భావ తరంగ ధారలు**
**తాకి గలగలరాలు తారలె**
**చలువరాలై, కలువపూలై**
**నిలిచి నీ పాదములు కొలువ ॥ అ ॥**

అని సౌందర్యాన్నంతా చూపులతో బంధించి వేసిందని, కాలచక్రగమనాన్ని సైతం ఆపి హృదయచిత్రాన్ని అచలంగా మార్చిందని, నిరంతరంగా ఏ రహస్యాన్నో శోధిస్తోందని తన భావ తరంగ ధారలకి తారలు జలజలరాలి చలువరాళ్లై, కలువపూలై ఆమె పాదార్చన చేస్తాయని అంటారు. తన మనస్సులో భావ చిత్రంగా అచేతనంగా నిలిచిన ఆమె రూపాన్ని ప్రేమతో ఆరాధించారీ గేయంలో

బోయి భీమన్నగారు రాభీలలో తన భావాలకు రసాద్వైతంగా రూపు కల్పించి, అమలిన శృంగారానికి అద్దం పట్టారు. ఇలా రకరకాల గీతాలు రాసి, లలితగీత విస్తారానికి నడుము కట్టారు.

## పుట్టపర్తి నారాయణాచార్యులు :

'సరస్వతీ పుత్ర' బిరుదాంకితులైన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు రచించిన 'శివతాండవం' గేయ కావ్యం. ఇందులో 'శివతాండవం' 'శివాలాస్యం' అని రెండు భాగాలు ఉన్నాయి. తాండవం పురుషులకు, లాస్యం స్త్రీలకు అనుగుణంగా వుంటుంది.

'ఏమానందము భూమీ తలమున....' అని ఎలుగెత్తి పాడినప్పుడు శ్రోత శ్రవణేంద్రియంలో నాదం ఉత్తుంగ నదీతరంగంలా దూకుతుంది. 'శివతాండవం' వరద గోదావరిలా, ఉధృతంగా, 'శివలాస్యం' శరత్కాల నదిలా ప్రశాంతంగా సాగిపోతుంది. వస్తువు శివపార్వతుల తాండవలాస్యాల వర్ణనమే. 'శివతాండవం' గేయ కావ్యమే, కాని లలితగీతాలుగా పాడుకోగల గేయసంపుటి కాదు. కావున నా పరిధిలోకి రానందున దానిని వివరించడం లేదు.

పుట్టపర్తి నారాయణాచార్యులు తన తరుణ యవ్వనంలో అనగా 16-18 యేళ్ల వయసులో తలయెత్తిన భావాల్ని 'అగ్నివీణ'గా వెలువరించారు. ఇందలి గేయాల్ని మాత్రం విపులంగా చర్చిస్తాను. 'అగ్నివీణ'లో మొదటి మూర్ఛన నారాయణాచార్యులు రచించగా రెండవ మూర్ఛన వారి సతీమణియైన కనకమ్మగారు రచించడం విశేషం!

'అగ్నివీణ'లో మొదటి గీతం -

సవరింతునా అగ్నివీణ!
సవరింతునా దిశాం-
చలము రింగులు వార
నవనవాంగార సం
భవకీల-బుసదేర ॥ సవ ॥

................................

తీగెల్లొ దారిద్ర్య
ధూమ్ర ధూమము లాగ
రాగాలలో మరణ
వేగమ్ము చెలరేగ ॥ సవ ॥[1]

1. 'కావ్యద్వయి' ప్రచురణ 1972. పుట్టపర్తి పుట 15

అని ఖండగతిలో కమనీయంగా సాగిపోతుంది. కాని పల్లవి ఒకే పంక్తిగా గాక రెండు పంక్తులుగా పలికితే సమతూకంగా వుండేది. 'అగ్నివీణ'కు మరో ఉద్విగ్న వీణ తోడయ్యేది. కళ్లల్లో రక్తాశ్రువులు, మనసులో మిన్నాగులు కదలాడుతుంటే, అగ్గిసెగలకు నక్షత్రాలు ముడుచుకుపోతుంటే, మేఘాలు భస్మమవుతుంటే, తీగల్లో దారిద్ర్యధూమము, రాగాలలో మరణ వేగము చెలరేగుతుంటే, 'అగ్నివీణ'ను సవరింతుననే కవి దృఢనిశ్చయం పై గీతంలో ప్రస్ఫుటమవుతోంది.

'ఆశ' అనే మరో గీతంలో (పుట : 18)

**ఆకాశమంతాను నేనైతే**
**అంతటా చుక్కలే చెక్కుతానేమో!**

.............................................

సెలయేరులంతా నేనైతే
**అంతటా కన్నీరె చిలుకుతానేమో!**
ఈ లోకమంతాను నేనైతే
**అంతటా నా ప్రేమ నింపుతానేమో!**

అని ఆకాశాన్నంతా చుక్కలతో చెక్కడం, తీగలనిండా పువ్వుల్నే పెంచడం, లోకమంతా ప్రేమల్నే నింపడం తన అభిలాషగా ప్రకటించిన కవి, సెలయేరుగా మారితే అంతటా కన్నీరే చిలుకుతానేమో అని భావించక పంటలే ఫలింపజేస్తానంటే మరింత ఔచిత్యంగా వుండేది. ఇది వారి బాల్యరచన కాబట్టి అలా భావించి వుంటారు.

'స్మృతి' అనే చిన్న గీతంలో (పుట : 20)

కొండలో కోనలో - క్రొందలిరుటాకులో
నీ నటనలే తోచు - నీ మాయలే పూచు

...............................................................

రక్త బిందువులో - రసిక గీతములలో
నీ విభ్రమమెతోచు - నీ మాయలేపూచు

అని తన చెలిని స్మరించడం మనోహరంగా వుంది. రవీంద్రుని 'గీతాంజలి'లోని "Pluck this flower" కు స్వేచ్ఛానువాదంగా రచించిన 'ప్రార్థన' గీతంలో (పుట : 31)

గిల్లుకోవోయి మెలమెల్లగా చెయిజాచి
ఒరిగి పోతుందేమొ, సురిగి పోతుందేమొ

........................................................

కోరలేదది నీదు - హారమ్ములో చోటు
కురులలో జెక్కుమని - సారె యడుగుట లేదు
ధారబోసిన దాత్మ జీవంబు నీ సుధా
ధారలొలికెడు ఒక్క మృదు కర స్పర్శకే ॥ గిల్లు ॥

అని పూవును తెంచుకొమ్మని చెబుతూ అతివ హారంలో చోటును గాని కురులలో స్థానాన్ని గాని ఆ పూవు కోరడం లేదంటూ కేవలం ఆమె అమృత కరస్పర్శనే ఆశిస్తున్నదంటూ అభివర్ణించారు. ఖండగతిని చక్కగా నిర్వహించారు 'బానిసపదము' అనుగేయంలో (పుట 37)

లేవండోయీ బానిసలాలా!
లేవండోయీ పీనుగులాలా

......................................

ఆకలి మంటల హాహాకారము
బ్రదుకే చచ్చిన బానిసలాలా! ॥ లేవం ॥

అని కాలే కడుపులతో కటిక దారిద్ర్యపు చీకట్లో జీవచ్ఛవాల్లా బ్రతుకుతున్న నిరుపేదల్ని బానిసలారా! అని సంబోధిస్తూ విప్లవ పథంలోకి అడుగువేయడానికి ప్రబోధిస్తూ సాగిందీరచన. ఈ గేయంలోని 'యెముకలు చీకిన హిందువులాలా....' అనే చరణం శ్రీశ్రీ 'ఎముకలు కుళ్ళిన-వయస్సు మళ్ళిన సోమరులారా!' అనే పంక్తులకు రూపాంతరంగా తోస్తుంది.

'బానిసలారా!' అనడానికి బదులు 'బానిసలాలా! పీనుగు లాలా!' అని సంబోధించడం కృతకమైన జానపదంగా వుందంటూ డా.యస్వీసత్యనారాయణ తమ 'ఉద్యమ గీతాలు' సిద్ధాంత గ్రంథంలో అభిప్రాయపడ్డారు. అయితే నారాయణాచార్యులు గారు కాపురమున్నది కడపలో కాబట్టి, అన్నమయ్య పుట్టి పెరిగిన రాయల సీమలో కాబట్టి, అన్నమయ్య కీర్తనల్లోని 'కులుకక నడవరో కొమ్మలాలా!' లాంటి పద ప్రయోగాల్ని కావాలనే ప్రయోగించి వుంటారు. కాని అది భక్తి సందర్భం, ఇది విముక్తి సందర్భం! కావున 'బానిసలారా!' లేవండోయ్ అని సంబోధిస్తేనే సవ్యంగా తోస్తుంది. ఆ తర్వాత 'అగ్ని' అనే గేయంలో (పుట .41)

**తొలి సంజరాగాలు - మలి సంజరంగులూ**
**పలుకు తీవెలబూచు - వెలది వెన్నెలచాలు**
**పాడునే నీ ప్రేమ - ప్రౌఢ ప్రబంధమ్ము!**

......................................................................

**మండునే మన సుధా - మధుర జీవితరక్తి!**

అని తొలి, మలి సంజలు చెలి ప్రేమనే ప్రబంధంగా పాడుతున్నట్లుగా పూల పెదవుల గాలి పాటల్ని విన్నంతనే రేరాణి వయ్యారంగా ఆడుతున్నట్లుగా అది కడకు సుధామధుర జీవిత రక్తిగా మండుతున్నట్లు ఖండగతిలో కమనీయంగా వివరించారు. ఇలా పుట్టపర్తిగారు కూడ లలితగీత విస్తారంకై అంతో యింతో కృషి చేశారు.

## ఆరుద్ర :

సమగ్రాంధ్ర సాహిత్య కర్త, అభ్యుదయ కవితా ప్రియులు, విద్వద్విమర్శకులు

అయిన ఆరుద్ర తొలినాళ్లలో మేనమామయైన శ్రీశ్రీ బాటలో నడిచినా, మలినాళ్లలో తనదైన సొంత గొంతుతో కవితా ప్రపంచంలో అనేక ప్రయోగాలు చేశారు. అంత్యప్రాసల ముద్రగా పేరు కెక్కారు. కాని ఆరుద్ర వచన కవితల్లో చేసినన్ని ప్రయోగాలు గేయాల్లో చేయలేదు. అయినా తనవంతు కృషిగా తానూ లలితగీతాలు రాయకపోలేదు

1985లో ఆరుద్ర షష్టిపూర్తి కానుకగా 'ఆరుద్ర రచన' (విపుల కవితా సంకలనం) వెలువడింది. అందులో మొదటి గేయంగా 'పురోగమనం' అగుపిస్తుంది.

జయ జయ ధ్వానాల
విజయ నాదాలతో
ఆకాశ మార్గాలలో
అవని చీకట్లలో
బావుటా ఎగరేసి
కాగడా వెలిగించి
నీలాల నింగిలో
ఎర్రజెండా తోడ
ఎర్ర జెండా తోడ
నీలాల నింగిలో
కదలవే కదలవే
కొత్త మార్గాలకై -[1]

అని ఎర్రజెండా మీద గీతమల్లారు. పునరుక్తి ప్రయోగాల్ని శ్రీశ్రీ నుండి పుణికి పుచ్చుకుని కొత్త మార్గాలలో కదలమంటూ పాత మార్గంలోనే కదలారు. బాధితుల్ని, అనాథుల్ని చైతన్యవంతుల్ని చేస్తూ ఎలుగెత్తిన 'మార్చ్‌న్' గేయంలో (పుట : 15)

ఏమ్రా బానిసలారా!
లేవ్రా బాధితులారా!
మీరే ఒక పట్టు పట్టితే
మీరే ఒక కట్టు కట్టితే
పట్టేందుకు పగ్గాలుండవు
కొట్టేందుకు కొరడాలుండవు
లేవ్రా అనాథలారా!
ఏమ్రా అశాంతులారా!

..........................................

శ్రమఘర్మ సలిలం పోసి
పండించిన సుఖాల పంటకు
కోతలు మినహా అంతా
సిద్ధంగా ఉన్నాయ్రా!

1 ఆరుద్ర రచన (విపుల కవితా సంకలనం) 1985 (పుట 1)

అని కలిసి కట్టుగా కార్మికలోకం ఒక పట్టు పడితే అధికార అహంకారం నేలకొరుగుతుందని, కష్టించే వాడికి ఫలితం దక్కుతుందని బల్లగుద్ది చెప్పారు. అయినా "పతితులార! భ్రష్టులార! బాధాసర్పదష్టులార!" అనే శ్రీశ్రీ గేయాన్ని గుర్తుకు తెస్తారు.

'బాల నాగమ్మ' అనే గేయంలో (పుట 46)

ఎర్రంచుల నీలిచీర
ఆకాశం!
రంకు ముండల ముట్టుగుడ్డ
సాయంత్రం!
..................................
ముసలి దేవతలు
కక్కిన కఫం ముద్ద
చంద్రుడు!

అని ఎత్తగడ హృద్యంగా ఆరంభించినా క్రమక్రమంగా జుగుప్సాధోరణిలో వర్ణించి, అధివాస్తవికతకు అద్దం పట్టారు. ప్రయోగం పేరుతో హీనమైన ఉపమానాల్ని వాడారు.

ఆ తర్వాత కర్షక, కార్మికలోకాన్ని ఉత్తేజపరుస్తూ అల్లిన 'నవోదయం' గేయంలో (పుట : 63)

భూమి ఇచ్చి అప్పు ఇచ్చి
మదుపు పెట్టి మిల్లు పెట్టి
సేద్యగాళ్ల కడుపుకొట్టి
కూలివాళ్ల బతుకు మాడ్చి
జమీందార్లు గొప్పవాళ్లు
లాభాలను గడిస్తారు
లకారాలు గుటిస్తారు!
.......................................

అని కర్షక, కార్మిక స్వేదం తడిసి భూమి పలు పంటల్ని అందిస్తే అవి కాస్తా జమీందార్ల లక్షలుగా మారుతున్నాయని విమర్శించారు.

తెలంగాణా సాయుధ పోరాటాన్ని సమర్థిస్తూ 1948లో అల్లిన 'ఓపెన్‌ఫైర్' అనే గేయంలో (పుట : 97)

అహో అన్నలారా!
ఓహో తమ్ములారా!
నిజాం భూతమండోయ్!
నిజాం ఆపదండోయ్!
మనం చెరుకు గడలం!
నిజాం గానుగండోయ్!

నిజం తెలుసుకోండోయ్!
భుజం కలిపిరండోయ్!

..................................

తెలంగాణ ముక్తీ
విశాలాంధ్ర ప్రాప్తీ
ఒకే ఒక మారోయ్!
ఒకే ఒక్క సారోయ్!
'కరేంగే-య-మరేంగే'
ఇదేనోయ్ నినాదం
విశాలాంధ్ర కోసం
మహాశాంతి కోసం

..................................

అని సాగిపోయే ఈ గీతంలో నిరంకుశత్వపు నాటి నిజాంనవాబును, రజాకర్లను తెగిడి, తెలంగాణా విముక్తికోసం-విశాలాంధ్ర అవతరణ కోసం కదలిరండని కంఠమెత్తి గర్జిస్తూ పిలిచారు.

గేయమంతా త్రిశ్రగతిలో కవాతు చేసినట్లు నడిచినా మొదటి రెండు పంక్తుల్లో 'అహో అన్నలారా! ఓహో తమ్ములారా!' అని ఎత్తుకోవడంతో గతి తప్పుతోంది. కాని 'అహో', 'ఓహో' లకు బదులుగా 'అహో అన్నలారా! ఒహో తమ్ములారా!' అని హ్రస్వరూప పదాలతో మొదలెడితే గేయం త్రిశ్రగతిలో సాఫీగా నడుస్తుంది.

ఆరుద్ర నవజవాన్లను ప్రోత్సహిస్తూ, నవశక్తితో అల్లిన 'ఛలో నౌజవాన్' అనే గేయంలో (పుట : 100)

గట్లు తెగిన నదులారా!
కట్లు తెగిన నరులారా!
పైరి పడే పైరు చెడే
ఈ సమయం పెనుప్రళయం! ॥ గట్లు ॥
పాటలాగ పాములాగ
వేగంగా కోపంగా
ప్రతి ఒకడూ సైనికుడే!
ప్రతి ఒకడూ అతిరథుడే!
ప్రతి ఒకడూ రణయంత్రం
ప్రతి నేత్రం శివనేత్రం
ప్రతి హస్తం మయవేత్రం

..................................

ప్రతి ఒకడూ బ్రహ్మాస్త్రం ॥ గట్లు ॥

అని కదం తొక్కే నవజవాన్లను బుసగొడుతూ పరుగెత్తే పాముల్లాగా రణయంత్రాల్లాగా, ప్రజ్వరిల్లే శివనేత్రాల్లాగా, యమపాశాల్లాగా, అభివర్ణించారు. వీరరసానికి తగిన త్రిశ్రగతిని సవ్యంగా, దివ్యంగా పాటించారు. శబ్దంతో పాటు అర్థాన్నీ అందంగా దొర్లించారు.

ఓటు కోసం నాయకులు ఏం చేస్తారో, ప్రజలు ఏమి ఆశించి ఓటు వేస్తారో చాటి చెప్పడానికి అల్లిన 'వోటు పాట' గేయంలో (పుట 114)

చిచ్చో, చిచ్చో, నా చిట్టి తండ్రీ!
మన కడుపు చిచ్చు ఆరిపోవచ్చు! ॥ చి ॥
పాపాయి నీ మామ కేమికావాలి?
బాధితుల పీడితుల వోట్లు కావాలి!
నీమామ నెగ్గితే ఏమి చేస్తాడు
పక్షపాతం లేక పాలించుతాడు! ॥ చి ॥

అని పిల్లల కోసం అల్లినట్లుగా రచించారు. అందుకేనేమో 'కోడలా! కోడలా! కొడుకు పెళ్లామా!' అనే జానపదగేయ ధోరణి ననుసరించారు.

స్వాతంత్ర్యదినోత్సవాన్ని వర్ణిస్తూ అల్లిన 'పుట్టినరోజు' అనే గేయంలో (పుట: 192)

మ్రోగుతున్నాయి బాజాలు
ఊగుతున్నాయి జెండాలు
పాడుతున్నాయి స్పీకర్లు
పండుతున్నాయి స్వప్నాలు

.............................................

పాడు కష్టం తుదముట్టిన రోజు
నేడు స్వాతంత్ర్యం పుట్టినరోజు
మీలో ఒకడనే గాని నేను
మీ సంతోషం పంచుకోలేను
సరిహద్దులో నిత్యం నిలబడాలి
అరిమూకల్ని నేను అరికట్టాలి

అంటూ కష్టించి సాధించిన స్వాతంత్ర్యాన్ని శాశ్వతంగా నిలబెట్టుకొనేందుకు సరిహద్దుల్ని కాపలా కాచే సైనికుల మనోభావాల్ని వెల్లడించారు.

ఆరుద్ర 'కొత్త విజయాలు' అనే గేయంలో (పుట : 237)

బుద్ధదేవుని కాలమందున
పుట్టలేదని బాధపొందను
గాంధిమెట్టిన ఈ యుగమ్మే
ఘనతరంబని యెంచెదన్!
వ్యాస వాల్మీకాదులను అను
వాదమున అవమాన పర్చక

వారి రచనల నిజము చాటెడి
వర్తమానమె ఉత్తమం!

..........................................

ప్రాతలో గల మంచినంతా
చేతులారా సేకరింతును
గతములోపల గరళముండిన
గళములోనే దాచుకొందును

అని సరికొత్త భావాల్ని ప్రకటించారు. పాతకొత్తల మేలుకలయికగా మన నెంతునంటూ గురజాడ 'ముత్యాల సరాల' మార్గంలోనే పైరెండు చరణాల్ని నడిపించి చూపించారు.

రాకెట్ ప్రయోగం విజయవంతమైన 25.12.1968 నాడు ఆరుద్రగారు పద్యంగా అల్లినట్లు చెప్పుకున్న 'ఓహో' అనే పాటలో (పుట : 248)

వ్యోమనౌక వ్యోమనౌక సాగుచున్నది
భూమి నుండి దూరాలకు పోవుచున్నది
మనిషి యొక్క గొప్పతనం చాటుచున్నది
మరలి వచ్చి మహిమలెన్నొ చెప్పుచున్నది

..............................................................................

తరతరాల శాస్త్రకృషి సఫలమైనది
నరుని మనికి ఇన్నాళ్లకు ధన్యమైనది.

అని ఆధునిక శాస్త్ర విజ్ఞానాన్ని అభినందిస్తూ, ఆనందిస్తూ రచించారు. భవిష్యత్తు ఈనాడే అంకురించినట్లుగా, నవమానవుడు అవతరించినట్లుగా భావించారు.

అయితే 'బుర్రుపిట్ట బుర్రుపిట్ట తుర్రుమన్నది' అనే పిల్లల పాట బాణీలో నడవడం యీ పాట ప్రత్యేకతగా చెప్పవచ్చు.

నీ పద్యం నిరవద్యం
నిఖిల ప్రజకు నైవేద్యం

............................................

బడుగు పేద బ్రతుకు మీద
గొడుగు పట్టు ప్రతినిత్యం!

............................................

గూడులేని కూడు లేని
అనాథలకు ఆతిథ్యం!

..................................

ఆకలితో కేకలిడే
శోక జగతికిడు ఖాద్యం!
ఇంక ముందు ఇట్టి విందు
నీకైనా దుస్సాధ్యం!

అంటూ శ్రీశ్రీ షష్టిపూర్తి సభకై శ్రీశ్రీ మీద 1970లో చాలా హృద్యంగా ఆరుద్రగారీ గీతాన్ని అల్లారు. త్రిశ్రగతిలో చక చకా పదాల్ని అర్థవంతంగా వదిలారు.

అను నిత్యం హింసలతో ప్రతిహింసలతో ప్రజ్వరిల్లే నేటి నక్సలిజాన్ని గూర్చి, నక్సలైటుల అనర్థాల గూర్చి ఆనాడే ఆరుద్ర 'పిలుపు' అనే గేయంలో (పుట : 269) తేల్చి చెప్పారిలా-

నక్సలైటూ కలిసి రావయ్యా!
నవశక్తి యువశక్తి తేవయ్యా!
క్రూర జగతి దళాలు ఈ ఋతువులో రాలు
కొత్త చిగురులు వేయ రావయ్యా!
నీ మనసు శుద్ధమని తెలుసయ్యా!
నీ కినుక సవ్యమని తెలుసయ్యా!
విడిదుడుకు చైదాలు విధ్వంసనోగ్రాలు
విప్లవమ్మని తలచలేనయ్యా!
.................................................
సంఘటిత మవుదాము రావయ్యా!
సౌమ్య సంఘము నిలుపుదామయ్యా!

అని విరసం పుట్టిన మర్నాడే 1970లో భావి గూర్చి ఎలుగెత్తి చెప్పడం, అది నిజమై ఈ నాటికీ నిలువడం, కవి వాక్కు సత్యవాక్కు అనడానికి నిదర్శనం!

నేతలు మతం పేరుతో సృష్టించే అనేక అల్లర్లను దృష్టిలో వుంచుకొని అల్లిన పాట, 'పద్యం కాని పద్యం' (పుట:320)

నినాదాలు మతం కాదు
నీతిలోన హితం లేదు
నీకోసం నాకోసం
నేతలు చెప్పే మాటలు
నిన్నా నేడూ రేపూ
అన్నా-అన్నన్నా వాళ్లే అనుసరించరు

అని మతాన్ని, నాయకులు ఎలా స్వప్రయోజనాలకు, స్వార్థాలకు, వాడుకుంటారో యువతను బలితీసుకుంటారో తేల్చి చెప్పారు.

మనిషి సాధించిన ప్రగతి గూర్చి, కలవారి పెత్తనం గూర్చి ఆరుద్ర 'ప్రగతి' శీర్షికతో ఒక దీర్ఘ గీతమల్లారు (పుట : 330)

.....................................
నీ సృష్టిరా ప్రథమ సేద్యము
నీ చలువరా ఆది వైద్యము
కాయ కష్టము నీ మతమురా

కలిసి బ్రతుకుట అభిమతమురా

.............................................

నీ కాయ కష్టము మీద బతుకును
నిన్ను కలిమి యావును చేసి పితుకును

.............................................

హీనంగ చూడకూ ఎవరినీ స-
మానమని ఎంచరా జనులనీ
మాల మాదిగ లొక్కటనరా!
ఏక బంతిని బువ్వతినరా!

అని హరిజనోద్ధరణ కలిగించి వారిని సమానంగా చూడమంటూ ప్రబోధించారు. ధనికులు బడుగు వర్గాల బతుకును కలిమియావును చేసి పితుకుతారంటూ సూటిగా సుందరంగానే గాక ఖండితంగా ఖండగతిలో తేల్చి చెప్పారు.

'వైతాళికులు' తదుపరి ముద్దుకృష్ణ సంకలనం చేసిన మరో నవ్య కవితా సంకలనం 'నవీన కావ్య మంజరి!' ఇందులో ఆరుద్ర రచనగా ప్రచురితమైన గీతాలు ఏలనో 'ఆరుద్ర రచన' (విపుల కవితా సంకలనం)లో చోటు చేసుకోకపోయాయి. 'నవీన కావ్యమంజరి'లో ఆరుద్రగారి రెండు గీతాలు మాత్రం చక్కగా సాగినట్లు అగుపిస్తాయి. వాటిలో మొదటిది 'ఇన్నాళ్లకు మానవుడే దేవదేవుడు' అనేది, రెండవది 'కన్నుల నిద్దుర రాకపోతే' అనేది.

ఇన్నాళ్లకు మానవుడే దేవదేవుడు
విన్నారా సామాన్యుడు ఆదిదేవుడు
    తన పలుకే నవ వేదం
    తన కరుణే సుధారసం
    మనిషిలోని మంచి తనం
    ఎన్నటికీ పోనిధనం[1] ॥ ఇ ॥

అని ఆరుద్రగారు సామాన్యుడినే దేవదేవుడిగా సంబోధించారు. పలుకునే నవవేదంగా కరుణనే అమృతంగా, మంచితనమే తరగని ధనంగా మనిషికున్న మంచి లక్షణంగా అభివర్ణించారు.

కన్నుల నిద్దుర రాకపోతే
పడ్డావనుకో ప్రేమలో
తిన్నది హితవే కాకపోతే
పడ్డావనుకో ప్రేమలో ॥ క ॥
అడుగులు తడబడి మాటలు పొరబడి
గుండెల దడదడ హెచ్చితే
పదహారేళ్లు దాటిన కన్నియ

1. నవీన కావ్య మంజరి - (1959 ముద్దు కృష్ణ సంకలనం) పుట 146, 147.

ఎదలో సూదులు గుచ్చితే
పడ్డావనుకో ప్రేమలో[1] ॥ క ॥

అని ప్రేమలో పడ్డ కుర్రాళ్లకు కలిగే మానసిక స్థితిగతుల్ని, తడబడు అడుగుల్ని గుండెల దడదడల్ని ఆరుద్రగారు చక్కగా ఆవిష్కరించారు. ఇలా విలక్షణ గీతాలతో ఆరుద్ర గారూ లలితగీత విస్తారానికి చేయూతనిచ్చారు.

## డా॥ దాశరథి :

నిజాం నిరంకుశత్వాన్ని పద్యా'గ్నిధార'తో నిరసించిన దాశరథిగారు తదుపరి 'రుద్రవీణ'ను మీటారు. అనేక పద్య కావ్యాలతో పాటు 'గాలిబ్ గీతాలు' నూ అనువదించారు. అయితే 'గాలిబ్ గీతాలు' తేట గీతులే. కాని గేయాలు కావు. కావున వాటిని స్పృశించక ఆ తర్వాత వెలువరించిన 'నవమంజరి' (లలిత గేయాల సంపుటి) ని మాత్రం విపులంగా పరిశీలించడమైనది.

ముందుగా పద్య, గేయ సమ్మిశ్రితమైన 'రుద్రవీణ' లోని గేయాల్ని వివరిస్తాను. ఇందులో 'రానున్నది' అనే గేయంలో

"రానున్నది యేది నిజం?
అది వొకటే, సోషలిజం!
కలపండోయ్ బుజం బుజం
కదలండోయ్ గజం గజం
అడుగడుగున యెడదనెత్రు
మడుగులుగా విడవండోయ్"[2]

..................................................

అంటూ రానున్నది సమసమాజ భావాలతో కూడుకున్న సోషలిజమని, అదే నిజమని నొక్కి చెప్పారు. ఆ సోషలిజం స్థాపనకై భుజం భుజం కలిపి, అడుగు అడుగు యెడంతో కాక గజం గజం యెడంతో పరుగులా పదమంటూ యువతకు దారి చూపారు. 'గజం గజం' అనే పదం 'భుజం భుజం' కు ప్రాసగా ప్రయోగించినా శబ్దంతో పాటు అర్థమూ రెట్టింపయింది.

తర్వాత కార్మిక-శ్రామిక చైతన్యాన్ని రుధిర పక్షులుగా పోలుస్తూ అభ్యుదయ కవితావేశంతో 'రుధిరపక్షులు' గేయాన్ని (పుట : 25) అల్లినట్లుగా తోస్తుంది.

నీలిమబ్బులు తేలియాడే
నింగినిండా రుధిరపక్షులు
రుధిర పక్షుల రెక్కబరువుకు
కూలిపోయిన గాలిసౌధం

.........................................

పక్షి రెక్కల పదను కోతకు

---

1 నవీన కావ్య మంజరి - (1959 ముద్దు కృష్ణ సంకలనం) పుట 146, 147

2. రుద్రవీణ - శ్రీరామ అండ్ కో., ప్రచురణ 1950 దాశరథి పుట . 24

తెగిన కాలం కొత్త రంగులు!
పేద సాదల స్వేదబిందు
స్వాద రుచితో పొంగురంగులు!

అని నల్ల డబ్బుల నీలిమబ్బుల స్థానంలో నింగి నిండా కార్మిక రుధిర పక్షులు ఎగురుతున్నాయంటూ వాటి రెక్కల ధాటికి కలవాళ్ల గాలిమేడలు కూలిపోవడమే గాక ఆధునిక కాలపు సంపన్నుల కొత్త రంగులు తెగిపడి పేదల స్వేదం ధాటికి వెలిసిపోతున్నాయంటూ అభివర్ణించారు. గాలిమేడలుకు బదులుగా 'గాలిసౌధం' అనే వైరి సమాసాన్ని ప్రయోగించారు. అంతేగాక

నేను మీటే రుద్రవీణకు
స్వరం నేర్పే రుధిరపక్షులు
..........................................
కాల మార్గం మీద నడిచే
'కారు' టైరుకు గాలిపోసే
రుధిర పక్షులు రుధిర పక్షులు

అని కలవారి కారుటైరును నడిపే గాలిని పేదవారితో పోల్చారు. రక్తం చిందించే కార్మికుల్ని రుధిర పక్షులుగా చిత్రించారు.

అనాథుల శ్రీనాథుల మధ్య సంగ్రామం అనాదిగా అనంతంగా సాగుతోందంటూ 'అనంత సంగ్రామం' గేయం (పుట : 39)లో వివరించారు.

అనాదిగా సాగుతోంది
అనంత సంగ్రామం!
..............................
సేద్యం చేసే రైతుకు
భూమి లేదు పుట్రలేదు
రైతుల రక్తం తాగే
జమీందార్ల 'కెస్టేట్లు'
..............................
కర్షకులు కార్మికులు
మథన పడ్డ మేధావులు
తమ శ్రమలకు తగిన ఫలం
ఇమ్మంటే 'తిరుగుబాటు'

అంటూ 'తిరుగుబాట్ల'కు ఆనాడే అక్షర రూపంగా భాష్యం చెప్పారు. జమీందార్లు పెట్టే హింసలకు ప్రతిహింసే అనివార్యమని ఎలుగెత్తారు.

దాశరథిగారు 'ఆకాశవాణి'కై అల్లిన అనేక గేయాల్ని 'నవ మంజరి'గా 1959లో వెలువరించారు. అందులో మొదటి గేయంగా

గగన భాగము నుండి - కదలి దిక్కుల నిండి
జలజలా కురిసింది వానా - వరదలైపారెను బిరానా!

దాన కర్ణుని చేయి - ధనము కురిసిన రీతి
కవిరాజు కలములో - కవిత ఝరిసిన భాతి[1] ॥ గ ॥

వర్షం కురుస్తున్నట్లుగా 'వర్షధార'ను వర్ణించారు. 'కలువల రాజా' అనే గేయంలో (పుట:3) రేరాజును కలువలరాజుగానే గాక చలువలరాజుగా చమత్కరించారు.

కలువల రాజా - రాజా
చలువల రాజా!
మమ్ము బాధించుటలో నీకింతమోజా?
మధుమాస నిశలలో
మా విరహదశలలో
కనికరించక మమ్ము కాల్చేవా?

అని చల్లని వెన్నెలతో ఎడబాసిన ప్రేమికుల ఎదలలో విరహాగ్నిని రేపి కాల్చేవంటూ చంద్రుణ్ని విమర్శించారు.

ప్రేయసికై నిరీక్షిస్తూ ప్రేమికుడు పాడినట్లుగా రచించిన 'రావో?' గేయంలో (పుట:5)

ప్రేమదేవివో ప్రణయజీవివో
ఎంతవేడినా రావో?
ఎంతపాడినా రావో?
చంద్రమండలము చేరబోతివో
నీల గగనమున నివసించితివో
గాలి అలలలో కలిసిపోతివో
కనికరించవో, కానుపించవో ॥ రావో ॥

అని తన ప్రేమదేవిని ప్రణయ జీవిగా వర్ణిస్తూ, చంద్రముఖియని చెప్పకనే చెబుతూ గాలి అలలలో కలిసిపోయినట్లుగా భావించారు.

నీలి గగనంలో నిశ్చింతగా విహరించే తారకను గూర్చి 'తారక' గేయంలో (పుట : 6)

మెరుపులు పూలదండగా
మబ్బులు మెత్తని దిండుగా
గగనము వెచ్చని శయ్యగా
హాయిగ నుందువె తారకా

అని తారకకు మబ్బులు దిండుగా, సూర్యచంద్రులు తిరిగే గగనం వెచ్చని శయ్యగా వున్నాయనడం మనోహరంగా వుంది.

అజ్ఞానాంధకారం తొలగించే జ్ఞానదీపం వెలిగించుమనే ప్రబోధంతో అల్లిన 'నీలో దీపం' గేయంలో (పుట : 8)

---
1 నవమంజరి (1959) - దాశరథి పుట : 1

నీలో దీపం వెలిగించు
నీవే వెలుగై వ్యాపించు!
శాంతి మంత్రమున ప్రేమతంత్రమున
జనకల్యాణము సాధించు ! ॥ నీలో ॥
దైన్యము మాని ధ్యానము పూనీ
దైవసన్నిధిని జీవించు!
హృదయములో అమృతముతో
సదయుడవై విహరించు! ॥ నీలో ॥

అని దీపం వెలిగించుమనడమే గాక ఆ వెలుగు నీవేయై వ్యాపించుమనడం అద్భుతంగా వుంది. హృదయంలో దయామృతం కలిగి జీవించుమనడం, శాంతి ప్రేమల్ని స్థాపించుమనడం యీ గేయ ప్రత్యేకత. అనేకసార్లు ఆకాశవాణి ద్వారా ప్రసారమై శ్రోతల మన్ననలందుకున్న లలిత గీతమిది.

ఒక జానపద జంట 'పూలమేడ' అనే గేయంలో (పుట : 10)

స్త్రీ : పూలమేడ కట్టినాను పూలదివ్వెపెట్టినాను
జాలి తలచి రావేలా నా పూలరంగ!
ఏలుకొనగ రావేలా నా పూలరంగ!
పురు : రతనాల మేడకట్టి రంగైన రైక కుట్టి
నీ కోసం చూచినానె నాపైడి బొమ్మా!
నా కోసం రావేమే నాపైడి బొమ్మా!

యువతి పూలమేడ కట్టి పూలదివ్వె పెట్టినాను రమ్మంటూ పిలుస్తుంది. పూల పూల రైక తొడిగి వాకిట్లో నిలిచినానని చెప్తుంది. జాలితలచి తొందరగా రమ్మంటూ ఆహ్వానిస్తుంది. యువకుడేమో తాను రతనాల మేడకట్టి రంగైన రైక కుట్టి తెచ్చానంటాడు. ఒడ్డాణం చేయించడమేగాక గుండెలనే కోసి కోసి దండలల్లి ఉంచానంటూ రమ్మంటాడు. ఇలా సాగిపోయే ఈ గీతం ఏదో జానపదగేయ ప్రేరణతో అల్లినట్లు అర్థమవుతుంది.

అలాగే శిష్ట వ్యావహారికంలో అల్లిన మరొక యుగళగీతం 'ఓ సకియా' (పుట : 15)

పురు : ఓ సకియా! నీ ఎదపై
వ్రాసెద నొక గీతి!
స్త్రీ : ఓ ప్రియా! నీ మదిలో
నిలిపెద నొక దీపిక

.................................

పు : నవ సమాజ మధుగీతం
పాడుదమే రాధికా!
స్త్రీ : శాంతి నృత్య మాడుదమీ
నవభారత వేదిక!

పల్లవి లోని 'వ్రాసెదనొక గీతి' కి బదులుగా 'వ్రాసెదనొక గీతిక' అని సవరించుకుంటే క్రింది పాదాలకు సమంగానే గాక అంత్యానుప్రాసకు అనుకూలంగా వుంటుంది. స్వాతంత్ర్య నవభారతంలో శాంతి నృత్యం చేద్దామంటూ యువతీ యువకులు ఆనందంగా పాడుకునేందుకు రచించిన గీతంగా తోస్తుంది.

భారతీయతను గర్వంగా గానం చేసేందుకై అల్లిన 'భరత జాతి' గేయంలో (పుట . 16)

భూధరమో సాగరమో
భూతలమో ఆకసమో
భరతధరణి నా గృహం
భరత జాతి నా అహం ॥ భూ ॥
మహా బోధి నీడలోన
మహిమగనిన గౌతముడు
అన్ని దేశముల యందున
అందరిలో ప్రియతముడు ॥ భూ ॥
అహింసతో హృదయాలను
అవలీలగ జయించిన
మహాత్ముడే దేశానికి
మహనీయ దయాజ్యోతి ॥ భూ ॥

అని త్రిశ్రగతిలో భరతభూమిని తన గృహంగా, భరత జాతిని తన అహంగా చాటుకున్నారు. రామునితో అర్జునునితో భారతము ప్రసిద్ధికెక్కగా గౌతముడు అహింసతో ఖండాంతర ఖ్యాతి గాంచినట్లుగా, మహాత్మాగాంధీ దేశంలో దయాజ్యోతిగా వెలుగొందినట్లు అభివర్ణించబడిన యీ గేయం అనేకసార్లు 'లలిత సంగీతం'లో ప్రసారమైంది.

శీతాకాలంలో చలిని దూరం చేయడానికి వేసుకునే 'చలిమంటను' వర్ణించిన గేయంలో (పుట : 17)

చలిమంట వేతాము పొలములో రారే!....
జలజ బాంధవునితో సరసమాడేరే!....
..........................................................
చిరువెచ్చ పవనమ్ము చెలగె తూరుపులో
అరవిచ్చె మల్లెలు తరుణి ఊరుపుతో
..........................................................
చెరకు విల్లు ధరించి అరుదెంచె మరుడు
నందనాంగణములో నడుచునిక నరుడు

అని అప్పుడే ఉదయించే బాలభానుని లేతకిరణాలతో చీకటితో పాటు చలికూడ పారిపోయేలా చలిమంట వేతాము రమ్మంటూ పలికారు. తూరుపులో పవనాలు వెచ్చనవుతుంటే, మగువ నిట్టూర్పుతో మల్లె మొగ్గలు సగం

విచ్చుకున్నాయంటూ చమత్కరించారు. శిశిరాన్ని అణచడానికి మన్మథుడు చెరుకువింటితో వస్తున్నాడు. కాబట్టి సామాన్య నరుడిక తోటల్లోకి ఆనందంగా సాగిపోతాడని వివరించారు.

ఆ తర్వాత 'చైత్రం' అనే గేయంలో (పుట : 21)

చైత్ర మాస నవోదయం
చిత్రముగా వికసించెను!
వదినా! ఒక మాటు నీ
వదన మెత్తి చూడవే!

..................................

మల్లెపూల రైకతో
మోదుగు క్రొంజీరతో
వనకామిని దిశాంతల
వసంతాలు చల్లెలే!....

అని చిత్రంగా వికసించిన చైత్రాన్ని వదనమెత్తి చూడమని తన వదినను అడగడం నవ్యంగా వుంది. తెల్లని మల్లెలు ఎర్రని మోదుగులు విరివిగా వికసించే కాలం కాబట్టి మల్లెల రైకతో మోదుగు క్రొంజీరతో వనకామని వసంతాలు చల్లతూ వచ్చిందని వర్ణించడం హృద్యంగా వుంది. ఆ తర్వాత అదే వదిన మీద మరోగేయమల్లారు. 'వదినమ్మ'అనే ఆ గేయంలో (పుట 23)

వదినమ్మ మాటంటె వంద వరహాలు
వదినమ్మ పాటంటె మధుర వీణల్లు

..................................................

గాలి కంటేను వేగమ్ము మా వదిన
మబ్బు కంటే జాలి మనిషి మావదిన

అని తమ వదిన ఔన్నత్యాన్ని, అనురాగాన్ని వర్ణించారు. అయితే ఇది 'మంజరీ ద్విపద'గానే ప్రతిపాదమూ గణబద్ధంగా వుంది, ఒక్క మొదటి పాదం తప్ప. 'వరహాలు' ను కూడ 'వర్హాలు'గా పేర్కొంటే మొదటి పాదం కూడ మంజరీ ద్విపద గానే మారేది. కావున ఇది గేయం కాదనే చెప్పాలి.

దాశరథిగారు 'వదిన', 'వనరాణి' గూర్చి గేయాలు అల్లినట్లే తనరాణి గూర్చి గూడ గేయరచన చేశారు. 'నారాణి' అనే గేయంలో (పుట : 25)

తలనిండ పూదండ దాల్చిన నారాణి
మొలక నవ్వుల తోడ మురిపించబోకే
మాటల్లొ మాటల్లొ మరిపించబోకే ॥ త ॥
నీ మాట బాటలో నిండె మందారాలు
నీపాట తోటలో నిగిడె శృంగారాలు
నీ మేనిలో పచ్చ చేమంతి అందాలు
నీ నీలవేణిలో నిలిచె ఆకాశాలు ॥ త ॥

అని మొలక నవ్వుల తనరాణి తలనిండ పూదండతో మాట-పాటల్లో మైమరిపింపజేస్తుందని వర్ణించారు. 3వ పంక్తి 'మాటల్లా మాటల్లా' మరిపించబోకే కాక 'మాటల్లా పాటల్లా' మరిపించబోకే' అని వుండాలి. ఎందుకంటే తర్వాతి పంక్తుల్లో ఆమె మాటల్లో మందారాలు, పాటల్లో శృంగారాలు నిండినట్లుగానూ వెల్లడించారు. పసిడిరంగు మేసిని చేమంతులతో నీలవేణిని నీలాకాశంతో మనోహరంగా పోల్చారు.

ఖండగతిలో కమనీయంగా సాగిన గేయమిది. కావున ఘంటసాల గళంలో ఎల్ పి. రికార్డుగానూ మారుమ్రోగింది. మామిడికి మల్లెకు గల ప్రేమను నిర్వచిస్తూ అల్లిన 'మామిడి-మల్లె' అనే గేయంలో (పుట 29)

మామిడి కొమ్మా మల్లియ రెమ్మా
మంతన మాడెనదే!
కోయిల కొమ్మా మన చిలుకమ్మా
పాటలు పాడెనిదే!
.....................................
యువతీ యువజన నవ హృదయమ్ముల
ప్రవిమల రాగమదే!
నవ కిసాలముల మధు రసాలముల
వసంత యాగమిదే!

అని మామిడిని ప్రేమికుడిగా మల్లెను ప్రేయసిగా కలిపి మంతనాలాడినట్లు వర్ణించారు. కోయిల-చిలక పాటలు పాడినట్లుగా ఊహించారు. కానన కాంత కంఠంలో కాంచనమాలలు ధరించి మన్మథరాజుతో కలిసి విచ్చేయగా ప్రకృతి స్వాగతం పలికినట్లుగా చమత్కరించారు. లేత ఎరుపు మావి చిగుళ్లలా యువతీ యువకుల హృదయాల్లో రాగోదయం జరిగినట్లుగా భావించారు. ఇదే గీతాన్ని స్వల్ప మార్పులతో 'రాము' అనే చలన చిత్రంలోనూ వినియోగించారు.

వసంత మాసంలో ఆనందంగా నవవేణువు మ్రోయింపుమంటూ 'నవవేణువు' అనే గేయాన్ని (పుట : 33) అల్లారిలా -

మ్రోయింపుము నవవేణువు
తీయని మోహన వేణువు
నవ జీవన రాగముతో
నాట్యమాడ ప్రతి రేణువు ॥ మ్రో ॥
వనమున కోయిల కూయగ
వలపుల గంటలు మ్రోయగ
మల్లియ తీవియ మాటుగ
మదనుడు బాణము దూయగ ॥ మ్రో ॥

నవ జీవనరాగంతో ప్రకృతిలోని ప్రతి రేణువు నాట్యమాడేలా నవవేణువు నూదమని మాధవుణ్ణి కోరినట్లుగా రచించారు. కోయిల కూయగా, వలపుల

గంటలు మ్రోయగా మల్లెతీగ చాటుగా మదనుడు బాణం దూయగా నవవసంతమే తెంచేలా మురళిని ముద్దుగా మ్రోయింపుమంటూ మనోహరంగా రచించారు. చతురస్రగతిలో చక్కగా నడిపించారు

దాశరథిగారు వలపుదీపం వెలిగించమంటూ యుగళగీతంగా అల్లిన 'వలపు దీపం' అనే గేయం (పుట 34) ఘంటసాల గళంలో ఆకాశవాణి ద్వారా అనేకసార్లు ప్రసారమైంది.

పురు : వెలిగించవే చిన్ని వలపుదీపం
ఎందుకే నామీద యింత కోపం?
స్త్రీ : మనసులో ప్రణయమే కనక దీపం
దాని వెలిగించుకోకున్న పాపం
.......................................... ॥వెలి॥
పురు : గగనంపు మేడలో కలదులే దీపం
అది మలిగి పోయెనా అవనికే శాపం
స్త్రీ : తారకా నవదీప తోరణాలవిగో
జగతిలో వెలుగుకే కారణాలివిగో
.......................................... ॥వెలి॥

అని యువకుడు తన మీద అలక కోపం మాని వలపు దీపం వెలిగించమంటే, మనసులోని ప్రణయమే కనక దీపం కావున ముందుదాన్ని వెలిగించుకుందామంటూ యువతి ప్రత్యుత్తరమిస్తుంది. గగనాల మేడలో వెలిగే చంద్రదీపం ఆరిపోతే అవనికే అంధకారశాపమవుతుందంటాడు యువకుడు. జగతికి వెలుగునిచ్చేందుకు తారా తోరణాలున్నాయిలే అని బదులిస్తుంది యువతి. కడకు ఎదలో అనురాగదీపమొకటుంటే చాలులే అంటాడు యువకుడు. ప్రశ్న-సమాధానాల్లాగా ప్రసన్నంగా సాగిపోయిందీ యుగళ గీతం.

రైతుకు అగ్రస్థానం కల్పిస్తూ, సేద్యం చేద్దాం రమ్మంటూ ఎలుగెత్తిన గీతం 'కాహళం' (పుట 35)

ఒత్తవోయ్ కాహళం - ఎత్త వోయీ హలం
దున్న వోయీ పొలం - శ్రమయే మనబలం
... .. ................................................... ॥ ఒత్త ॥
రైతుదే ఈ దేశం, వినుమాతని ఆదేశం
మానవోయి ఆవేశం, ఇదె గాంధీ సందేశం
........................................................ ॥ ఒత్త ॥

కష్టించి పండించే కర్షకులదే యీ రాజ్యమంటూ శంఖాన్ని పూరించి నాగలితో దుక్కిదున్ని, దుఃఖాన్ని పారద్రోలాలంటూ, కోపావేశాలతో కొట్లాటలకు తావీయక గాంధీ శాంతి సందేశంతో జీవించాలంటూ ఎలుగెత్తి చాటినదీ గీతం. ఈ గీతం కూడ బృందగానంగా 'ఆకాశవాణి' లో అనేకసార్లు ప్రసారమైంది.

స్వతంత్ర భారత త్రివర్ణపతాకను గూర్చి వర్ణిస్తూ రచించిన 'త్రివర్ణ కాంతులు' అనే గేయంలో (పుట 47)

త్రివర్ణకేతన సువర్ణకాంతుల
స్వాతంత్ర భారతి వెలిగెనహో!
యుగాల బానిస భరంబు మాసెను
తరాల చీకటి తొలగెనహో! ॥ త్రి ॥

. . .

నిరాశ విడచి మహోత్సవమున
ధరిత్రి శాంతిని కోరెనహో!
కష్టజీవులను కర్మవీరులను
సుఖసంపదలూ చేరెనహో! ॥ త్రి ॥

అని స్వతంత్ర భారత త్రివర్ణ పతాకం సువర్ణకాంతుల్ని వెదజల్లుతూ అటు హిమాద్రిపై ఇటు సముద్రతటిపై ఎగురుతోందంటూ. యుగాల తరబడి చెలరేగిన బానిసత్వం అణగారిందంటూ ఎలుగెత్తారు ఇక నిరాశ విడిచి మహోత్సవంతో సుఖసంపదలతో తులతూగాలంటూ ఆనందగానం చేశారు

ఇలా కవితా శరధిగా ప్రసిద్ధికెక్కిన దాశరదిగారు అనేక లలిత గీతాల్ని కూడ రచించి లలితగీత విస్తారానికి విశేష కృషి చేశారు

## డా॥సి.నారాయణరెడ్డి :

ఆధునికాంధ్ర సాహిత్యాన్ని మథించి 'డాక్టరేట్' పట్టాను పొందడమే గాక 'నాగార్జున సాగరం', 'కర్పూరవసంత రాయలు', 'విశ్వనాథ నాయకుడు' మొదలగు ప్రౌఢ కావ్యాల్ని గేయంలో రచించి, పద్యానికి గేయమేమాత్రం తీసిపోదని డా.సి.నారాయణరెడ్డిగారు నిరూపించారు. 'అజంతా సుందరి', 'వెన్నెలవాడ' మొదలగు గేయనాటకల్ని అద్భుతంగా రూపొందించారు. 'నవ్వనిపువ్వు' మొదలిడి జ్ఞానపీఠ్ పురస్కారాన్ని సాధించిపెట్టిన 'విశ్వంభర' వరకు అనేక కావ్యాల్ని వెలువరించారు నవ్యగేయ కవిచక్రవర్తిగా గేయం విలువపెంచారు. నారాయణరెడ్డి గారు తొలినాళ్లలో రాసిన గేయాల్లో 'ఎల్లోరా గుహలు' శీర్షికతో అల్లిన గేయం పేర్కొనదగింది

శిలలో మృదుజీవ కళలు నింపిన శిల్పి
ఈవెరూపొందినా వెల్లోర గుహలలో
మందహాసతుషార సౌందర్య వర్షాల
ఎటుల కురిపించినా వెల్లోర గుహలలో

............ ..................................

గాలి తాకిడిచేత - కందే కపోలాల
ఎటుల చెక్కితివయ్యా ఎల్లోర గుహలలో
నల్ల నల్లని రాతి కళ్లలో నునుసిగ్గు
నెటుల చిందితివయ్యా ఎల్లోర గుహలలో[1]

---

1 జలపాతం - సి నారాయణరెడ్డి (అరుణ శ్రీ గ్రంథమాల ప్రచురణ 1953) పుట 36

అని ఖండగతిలో ఎల్లోర గుహలలో గాలితాకిడికే కందిపోగల కోమలి చెక్కిళ్లను. నల్లరాతి నాతి కళ్లల్లో కదలు సిగ్గు దొంతరలను మనోహరంగా చెక్కిన శిల్పిని మనసారా కొనియాడారు శిలలో జీవకళల్ని పలికించిన శిల్పి ఉలిని ప్రస్తుతించారు.

కులమతాల్ని ఎంచే కుమతుల్ని ఆనాడే విమర్శిస్తూ అల్లిన 'ఓ మనిషీ' గేయంలో

వర్తమాన వలయంలో
చిక్కుపడ్డ ఓ మనిషీ!
భవితవ్యపు సుడి గుండం
బారినుండి తప్పేవా?
కులమతాల త్రాసులోన
తెలివిని తూచే కుమతీ!
జ్యోతిలాంటి ఉరుమేధల
నీ తరాజు తూచేనా?[1]

....................................

అని కులమతాల కుటిలాత్మల్ని నిలదీసి ప్రశ్నించడమేగాక బండల్ని భగవంతుడని నమ్మించి మోసగిస్తున్నారంటూ పూజార్లనూ మందలించారు. నిజాం నిరంకుశత్వపాలన నుండి బయటపడి విశాలాంధ్రలో తెలంగాణా విలీనమయ్యాక ఆనందంతో అల్లిన 'రాష్ట్రావతరణం' గేయంలో-

ఆంధ్రరాష్ట్ర మవతరించె నోహో!
అంధయుగం బంతరించె నోహో!

..................................................

నలువైపుల చీకటి నా
గులు ప్రాకిన, ద్వేష విష
మ్ములు దూకిన, నీల నిశా
నిలయంలో నేటి కుష
స్సులు లేచెనహో! సుమన
స్సులు పూచె నహోహో![2]

అని అంతులేని ఆనందాన్ని పద్యాలవంటి వింత విరుపుల నడకలతో గేయాన్ని నడిపారు. చీకటి అంతరించి ఆంధ్రరాష్ట్ర అరుణోదయం అవతరించినట్లు తెలిపారు.

నాగార్జున కొండలలో
రాగధునులు జాలువారె

---

1 జలపాతం - సి నారాయణరెడ్డి (అరుణ శ్రీ గ్రంధమాల ప్రచురణ 1953) పుట 78

2 జలపాతం సి నా రె (1953) పుట 81

అమరావతి గుండెలలో
అమర కళలు సేదదీరె ॥ నా ॥
నన్నయ్యా ప్రసన్న కథా
నందగీతి పాడునేడు
. . . . . . ....
మందారం వోలెతెలుగు
మాటనేడు వికసించెను
............................ ...... ॥ నా ॥

అని శిల్పసంపదలైన నాగార్జునకొండ, అమరావతిని, సాహితీ మూర్తులైన నన్నయాదుల్ని, కృష్ణా-గోదావరి నదుల్ని కొనియాడారు మందారంలా తెలుగుమాట వికసించినట్లు వర్ణించారు మందారం పూదేనె మధురమైనది. మిగతా పూవులకన్నా విరివిగా విచ్చుకునేది కావున అట్టి మందారంతో తెలుగు భాషా వికాసాన్ని పోల్చడం అందంగా, ఔచిత్యంగా వుంది

'వెన్నెలవాడ', 'అజంతా సుందరి', 'సుగాత్రి' మొదలగు గేయనాటికల్లో మధురమైన గేయాలు చోటు చేసుకున్నా ప్రస్తుతాంశమైన లలితగీతాల్ని దృష్టిలో వుంచుకొని వాటిని స్పృశించడంలేదు.

1955లో 'నారాయణరెడ్డి గేయాలు'గా వెలువడిన గేయాల్ని పరిశీలిద్దాం. 'ప్రకృతిలోని ప్రణయిని' అనే గేయంలో

చుక్కలతో నొక్కసారి
సూచింతును నా కన్నియ
నల్లని వాల్జడల సందుల
మల్లియలై మొలవాలని
.......................................
మబ్బులతో నొక్క మాటు
మనవి చేసుకొందును నా
అంగన ఫాలాంగణమున
ముంగురులై మెలగాలని[1]

అని చివరకు ప్రకృతినే తనపడతిగా మారిపొమ్మని ప్రార్థించడం దీని ప్రత్యేకత. తెల్లని చుక్కల్ని తన ప్రేయసి జడలో మల్లెలుగా, నల్లని మబ్బుల్ని ముంగురులుగా, శూన్యాకాశాన్ని నెచ్చెలి నెన్నడుముగా, ఎగిసే సురగంగను కొంగుగా మారిపోవాలని భావించడం మనోహరంగా వుంది. ఈ గేయమే తర్వాత 'ఏకవీర' చిత్రంలో సినీ గీతంగానూ రాణించింది.

'హేమంత విరహిణి' (పుట 22-25) అనే గేయంలో

నేటి చలివేళ న-
న్నేల విదలించితివి

1 నారాయణరెడ్డి గేయాలు (1955) పుట 12

జాణతనమా సఖీ!
ఓ నా పరాఙ్ముఖీ!
.. . ...... ..... ....... ... . .. .
హేమంత సంధ్యలో
ఈ యలుకలేల?
ఇదియటే వలపుల ప
రీక్షలకు వేళ?
.......................... ......
మన మనసులందు వె
చ్చని ప్రణయ దీపికలు
మండినన్నాళ్లు హే
మంతమె వసంతమ్ము!
..................... ..................

అని అలిగిన ప్రేయసిని హేమంతపు చలిలో ఏకాంతం మాని, వెచ్చని తన కౌగిలిలో కరిగిపొమ్మని ప్రాధేయపడడం చక్కగా రచించారు. 'మిసిమి వలపు' (పుట : 26) అనే మరో గేయంలో -

పృథు పయోజ భారము కం
పించిన సహియింతుగాని
పలుచని నడుమల్లాడగ
భరియించగలేను సఖీ!
.....................................
పవలంతయు వికచనేత్ర
పద్మమ్ముల జూతుగాని
నిముసమైన వాలు చూపు
నీడల మనలేను చెలీ!
...................................

భూగోళం లాంటి గుండ్రని భారమైన ప్రేయసి వక్షోజాలు కంపించినా సహించగలను గాని సన్నని నడుము అల్లాడితే భరించలేనని, పద్మాల్లా పగలంతా విప్పారిన నేత్రాల్ని చూతుగాని, రాత్రి పడకగదిలో కోపంగా వాలుచూపు విసిరితే నిమిషమైనా నిలువలేనని నాయకుడు నాయికతో వాపోవడం, తన మిసిమి వలపుల్ని వెల్లడి చేయడం కొత్తగానే గాక మత్తుగావుంది.

'ఎగిసిపో' (పుట : 33, 34) అనే గేయంలో

ఎగిసిపో ఎగిసిపో ఎగిసిపో!
యుగ యుగాల తమోంధ
జగతి నుల్లంఘించి ॥ ఎ ॥
నీ కళ్లల్లో వెల్గలేని యీ తారకలు

నీ గుండెలో విరియలేని యీ చంద్రికలు
నీ చెమట తడియార్పలేని పవనోర్మికలు
బ్రతికినా చితికినా ఫలితమొకటే నేయి || వి ||

అని యుగయుగాలుగా సాగుతున్న అంధ ఛాందసాల్ని కళ్లలో వెలుగని తారకల్ని, గుండెలో విరియని చంద్రికల్ని, చెమట పోగొట్టలేని గాలి వీచికల్ని వదలిపెట్టి దూరంగా వెళ్లిపొమ్మని ఎలుగెత్తారు ముసురులేని వానలు. మంచుకోతలు లేని హేమంతాలు శిశిరంలేని వసంతాలు కాపురముండే చోటికి కదలిపొమ్మన్నారు

'జలద గీతి' (పుట 35, 36) అనే గేయంలో వర్షించే మేఘాన్ని కడు రమణీయంగా వర్ణించారు

సాగుమా ఓ నీల మేఘమా!
గగన వీణా మృదుల రాగమా! || సా ||
చీట వారినచేల-పీయూషములు రాల
గరిక లేని పొలాల-మరకతమ్ములు దేల || సా ||
........... ....................... .......... ........ . .
కవిరాజు నినుజూచి ననవీతమై పోవ
నవనీతమై పోవ-నవగీతమై లేవ || సా ||

అని పచ్చని పంటల్ని మరకతములతో, ప్రియురాలి వలపుల్ని 'జిల్ల' ని పూయు మల్లికలతో పోల్చడమే గాక వర్షామేఘం రాకతో ద్రవించిన కవి నవనీతమైపోవడమే గాక నవగీతమై లేవడం నవ్యంగా వుంది ముక్త పదగ్రస్తంలా మొదటిపాదంలోని చివరి పదాన్ని తిరిగి రెండవ పాదంలోని మొదటి పదంగా గ్రహించి ప్రయోగించడం ఈ లలితగీత ప్రత్యేకతగా భావించవచ్చు! అనేకసార్లు 'లలిత సంగీతం' ద్వారా 'ఆకాశవాణి' లో ప్రసారమైన కమనీయ ఖండగతి గీతమిది.

'సందేహడోల' అనే గేయంలో (పుట 43)

నింగి కడలిని ప్రయా
ణించు నీలి మొయిళ్లు
నన్నువలి దరిజేర్చు
నౌక లేనాడౌనొ?
కనులందు వెల్గువా
కలు చిందు తారకలు
నాదారి చూపు క-
న్నాప లేనాడౌనొ?
అమృత రక్షణ శాల
లైన స్వర్గాలు నా
వాంఛలకు పర్యాయ
పదములేనాడౌనొ?

అని నింగిని కడలితో పోల్చి ఆ కడలిని దాటించడానికి మబ్బులు నావలుగా ఎన్నడు మారునోయని, వెలిగే తారకలు తన కనుపాపలుగా నిలిచి ఎప్పుడు దారి చూపునోయని, ఆకాశపు యేటి ఇసుక తిన్నెల మీద తన పద ముద్రలు ఎప్పుడు పటంలా నిలుస్తాయోయనేగాక, అమృతాన్ని రక్షించే స్వర్గం తన వాంఛల్ని తీర్చేదెన్నడో యని సందేహంతో సతమతమయ్యే కవి చిత్తవృత్తి యీ గీతంలో స్పష్టమవుతుంది

అలాగే 'వింత మానవుడు' అనే గేయంలో (పుట 47)

బ్రతుకంతా అగ్ని శిఖా
చితపథాల ప్రయాణించి
జ్వలనమ్మనగా నేమో
తెలియక వికి వికి నవ్వేడు
నేను వింతమానవుడను

...................................

బ్రహ్మజ్ఞులు నిర్గుణుడే
పరమాత్ముండనగ వినక
రాతి బొమ్మలకు గంధపు
పూతలు పూసెడు వాడను
నేను వింత మానవుడను

అని ఉత్తమ పురుషలో ప్రథమ పురుష లక్షణాల్ని, లోకనైజాన్ని ఎత్తి చూపారు పరిమళించే పారిజాతాల్ని వదలి మోదుగు పూలను తలచేవాడినని, ఇరులను చీల్చే దీప కళికల్ని వదలి మిణుగురులకై అన్వేషించే వాడిననే గాక చివరలో బ్రహ్మసమాజం ప్రతిపాదించిన నిర్గుణ, నిరాకార పరబ్రహ్మతత్వాన్ని వదలి, రాతి బొమ్మల్ని పూజించే వింతమానవుడినంటూ వ్యంగ్యంగా సంఘంలోని చాదస్తపు మనిషిని ఎత్తి పాడిచారు

'తిక్త సమస్యలు' అనే గేయంలో (పుట 75) చేదు నిజాల్ని తేల్చి చెప్పారు

పొగ పోలిక జడలు విప్పి
జగత్తులో వ్యాపించెడు
చీకటులకు చిన్ని తటి
ద్వేషమే ప్రబల శత్రువు!

... . .... ... .....

తేనె తేనెగా బ్రతుకును
గానమ్మును చేయు మనిషి
తిక్త సమస్యల దాడికి
తికమక పడటం సహజం!

ఎంత చిన్న గాలికైన
ఎండు టాకులే మ్రోగును
పచ్చని ఆకులు ఝుంఝా
పవనానికి మాట్లాడవు
... . . .

అని పొగలాగా వ్యాపించే చీకట్లకు చిరుమెరుపైనా శత్రువేయని, తేనెలాంటి బ్రతుకు గానం చేసే మనిషి చేదుసమస్యలకు సతమతమవడం సహజమని, ఎంతచిన్న గాలికైనా ఎండుటాకులే చప్పుడు చేయగలవు తప్ప పచ్చని ఆకులు కావని త్రిశ్రగతిలో విప్పి చెప్పారు

భావిని గూర్చి మంచి భావుకతతో అల్లిన గేయం, 'రేపటి ఉదయం' (పుట 80)

రేపటి ఉదయం నాలో
లోపల గుసగుసలాడెను
మనిషీ నీ భవిష్యత్తు
మహోజ్వలంగా వుందని
రేపట్లో విశ్వపటం
రూపం పూర్తిగ మారును
రేపట్లో శాస్త్ర మహిమ
రేల పగళ్లుగ మార్చును!
ప్రజ్ఞా శూన్యులికెన్నడు
పదవులు పాలించలేరు!
సృజనాత్మక శక్తిలేని
భజన కీర్తనలు చెల్లవు

అని శాస్త్ర పరిజ్ఞానంతో రేలుపగళ్లుగా మారుతాయని, అప్రాజ్ఞులు అందలా లెక్కలేరని, భజన పరుల స్తోత్రాలు పనికిరావని ఆనాడే సి.నా.రె. గారు భావిని గూర్చి రేఖామాత్రంగా చెప్పినా, అవి నేటికీ వేళ్లు దన్నుకొని విపరీతంగా వ్యాపించడం గమనార్హం!

'మెరుపు బొమ్మలు' అనే గేయంలో (పుట : 84) సరికొత్త భావాలు మెరుపుల్లా స్ఫురిస్తాయి.

మనస్సులోకి తొంగి చూస్తే
కనుపించే మెరుపు బొమ్మలు
కళ్లతో పల్కడం తప్ప
నోళ్లతో చూడవు!
.. ...............................
చీకటి ప్రౌఢాంగన వలె
ఆకారం మలచుకుంటే

చుక్కలు జడలో పువ్వులు
సుధాంశు బింబం తిలకం!

......................................

మబ్బుల చెరసాలలోన
మెరుపు కటకటాల మధ్య
కుసుమ శృంఖలాలు దాల్చి
కూర్చుంటే బాగుండును

శిశిరుడు 'డిండిము'డి వోలె
'జెంబా'లను కొడుతుంటే
మధుపతి 'శ్రీనాథుం'డై
ఎదుర్కొంటే ఎంత హాయి!

అని మనసులో కదలే భావాల మెరుపు బొమ్మల్ని ఆలోచించి ఆవిష్కరించే ప్రయత్నం చేశారీ గేయంలో. ఎత్తుగడలో 'మనస్సులోకి' అని గాక 'మనసులోకి' అంటేనే తాళగతి సవ్యంగా వుంటుంది. సాధారణంగా చరణాల్లో మొదటి రెండు పంక్తుల్ని 13 మాత్రలతో మిగతా రెండు పంక్తుల్ని 13,9 లేక 12, 10 మాత్రలతో నడిపించారు. ఒక విధంగా చెప్పాలంటే త్రిశ్ర, మిశ్రమ గతుల్ని యథేచ్ఛగా హెచ్చు తగ్గులతో ప్రయోగించారు. 'గౌడడిండిమ భట్టు' లాంటి శిశిరాల్ని శ్రీనాథుడే మధుపతియై ఎదుర్కొంటే ఎంతో హాయిగా వుంటుందని పరిచిత కావ్యవస్తువుల్ని ప్రవేశపెట్టారు. ఈ గేయం గేయంలా కాక వచన గేయంలా నడుస్తుంది.

డా॥సి.నా.రె.గారి 'తెలుగు గజల్ల'ను కూడా 'లలితసంగీతం'లో కొందరు గాయనీ గాయకులు గానం చేశారు. కాని అవి 'గజల్' ప్రక్రియలో చేసిన గేయరచనలు కాబట్టి వాటిని ఈ లలితగీత పరిధిలో పరిశీలించడంలేదు. 'రామప్ప', 'వెన్నెలవాడ' మొదలగు గేయనాటికల్లోని గేయాలు కొన్ని లలిత గీతాలుగా చాలాసార్లు ఆకాశవాణిలో ప్రసారమై శ్రోతల మన్ననలందుకున్నాయి. వాటిని గూర్చి 'ప్రసారం' విభాగంలో వివరిస్తాను.

## కందుకూరి రామభద్రరావు :

లలితగీత లతల్ని విస్తరింపజేయడానికి కృషిచేసిన కవులలో కందుకూరి రామభద్రరావుగారు కూడ అగ్రశ్రేణిలో నిలుస్తారు. 1905లో జన్మించిన వీరు బాల్యంలో గాంధీజీ బోధనల ప్రేరణతో దేశసేవాసక్తిని పెంపొందించుకొని అనేక దేశభక్తి గేయాల్ని, రవీంద్రుడు, కృష్ణశాస్త్రి గార్ల బాటలో అనేక మధుర ప్రణయ, ప్రకృతి గీతాల్నీ రచించారు. వీరు ఉత్తమ ఉపాధ్యాయులు, ఉపన్యాసకులేగాక ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో దశాబ్దం పాటు విద్యాకార్యక్రమ ప్రయోక్తగానూ ఉద్యోగం చేసి అనేక లలితగీతాల్ని అల్లారు. ఆ గీతాల్నే వారి కుమారుడు 'గేయమంజరి' పేరున ప్రచురించి వెలువరించారు.

అందులో ప్రథమంగా అగుపించే గీతం, 'తెలుగు తోట'

ఎంత చక్కని దోయి! ఈ తెలుగు తోట
ఎంత పరిమళమోయి! ఈ తోట పూలు
..........................................................
ఏయమృత హస్తాల - ఏ సురలు సాకిరో?
ఏ యచ్చరల మురువులీ తీరుదిద్దెనో?
ఈ పూల పాలలో నింత తీయందనము
ఈ లతల పోకిళ్లకింత ఒయ్యారమ్ము
..........................................................
నా యెడందను రేపు నా తెలుగు తోటలో
పాడుకొన నిండోయి! పలవింప నిండోయి![1]

అంటూ మన తెలుగు రాష్ట్రాన్ని ఒక తోటగా, మధురమైన తెలుగు భాషను 'పూలపాల'నే మకరందంగా భావించారు. ఆ తోటలోనే అనవరతం తనను పాడుతూ పరవశింపనీయండంటూ అర్థించారు. మాతృభాషాభిమానాన్ని ఎలుగెత్తి ప్రకటించారు.

'మురళిరవము' (పుట : 4) అనే గేయంలో మురళీ కృష్ణుణ్ని ప్రస్తుతించారిలా -

ఆపరా ఒకసారి - ఆ మురళి రవము!
తీపి వేదన నింక - ఓపలేనుర కృష్ణా!....
.......................................................... ॥ ఆ ॥
సుమబాల యీ బాల - సోలి వ్రాలు పదాల
ఆపి వేణువొకింత - అదుముకో నన్నెదకు ॥ ఆ ॥

అని కృష్ణుని మోహన మురళీరవ మాధుర్యాన్ని ఓపలేనంటూ, యిక అతని పాదాలపై సుమబాలగా సోలిపోతానంటూ, ఎదకు అదుముకొమ్మంటూ గోపిక అర్థించే తీరును రమ్యంగా రచించారు. అయితే ఈ గీతం కృష్ణశాస్త్రిగారి

మ్రోయింపకోయ్ మురళి
మ్రోయింపకోయి కృష్ణ!
..........................................
తీయతేనియ బరువు
మోయలేదీ బ్రతుకు

అనే గీతాన్ని గుర్తుకు తెస్తుంది. ఆ గీత ప్రేరణతో అల్లినట్లుగా తోస్తుంది. ఆమని గూర్చి అల్లిన మరో గీతం, 'నవ వసంతము' (పుట : 13)

అరుణారుణ కిసలయముల
చరణామల రాగమురల
నవ వసంత మరుగుదెంచె
నవ జీవము జగతి నించె

1. గేయమంజరి - కందుకూరి రామభద్రరావు పుట . 1

నాని నాని వానపోత
నవసి నవసి మంచు మూత
చివుకు చీకులెల్లరాల
చివురించెడు చేతనములు

కోయిల మావి చివురులను మేసి మధురంగా స్వరమెత్తగా ఆమని వచ్చిందనే మామూలు భావాన్నే '.........కిసలయముల చరణామల రాగమురల' అనే సరికొత్త ఎత్తుగడలో ప్రకటించారు. వానలో తడిసి, మంచులో నవసి కృశించిన ప్రకృతికి నవచైతన్యం చేకూరిందని చెప్పారు.

వసంతర్తువు ఆగమనంతో వన్నెలొలికే పూల పాత్రలో ప్రియునితో కలిసి మధువునాను మధుపాంగన మనసు మనసులో లేదంటూ 'ప్రణయము' (పుట:20) అనే గేయాన్ని పసందుగా రచించారు.

వేళకాని వేళయింత
పూలకారు సొగసులేల?
కుదురులేక ఎడదయింత
చెదరిపోవు నిలువలేక
.................................
కులుకు లొలుక ప్రియుని తోడ
కుసుమ పాత్రలోన జేరి
మధువునాను మధుపాంగన
మనసు మనసులోన లేదు

ఈ గీతాన్ని త్రిశ్రగతిలో చక్కగా నడిపారు. సామాన్యంగా పూవును ప్రేయసిగా భ్రమరాన్ని ప్రియుడిగా పోలిస్తే, వీరు మాత్రం కుసుమ పాత్రలో మగతుమ్మెదతో జేరి కులుకుతూ మధువును గ్రోలుతున్న ఆడతుమ్మెద (మధుపాంగన) మనసు మనసులో లేదనడం నవ్యంగా వుంది.

'విరియ నిమ్ము' (పుట : 37) అనే మరో గేయంలో

విరియనిమ్ము! విరియనిమ్ము!
విరుల మంజరులు స్వామి!
.........................................
దళము దళము నందు చిందు
తరుణ కాంతుల పసందు
పూవు పూవు నుండి లేచి
తావి తెమ్మెరలు వీచు
ఒకరు కేల త్రుంచనీ
ఒకరు తల ధరించనీ
వెలితి లేని వికసనంపు
వలపులే ఫలింపనీ!

అని విరులన్నీ దళము దళములో తరుణకాంతులు పసందుగా చిందులేయగా పరిమళాలు వెదజల్లగా వికసించాలని, వాటిని ఒకరు త్రుంచగా మరొకరు తలను ధరించగా, వలపులు ఫలించగా విరివిగా పూయనీయి స్వామీ! అని వేడుకోవడం హృద్యంగా వుంది. ఇందులో ఆది, అంత్యాను ప్రాసంతో పదాలు వీనుల విందును కలుగుజేయడం విశేషం!

'కళాసుందరి' (పుట : 39) అనే గేయంలో -

**ఓ కళాసుందరీ! ఓ మధురగాయనీ!**
**ఈ యెడద వీణపై తీయకే నీచేయి!**
**మునివేళ్ల స్పృశియింప మూర్ఛనలు పోయేను**
**అంగుళుల పలికింప అమృత మొలికించేను**

.........................................................................

అని కళాసుందరి మధురగానంతో మునివేళ్లతో తాకగానే ఆ వీణ అద్భుత అమరనాదాల్ని పలికిస్తుందని మనోహరంగా భావించి రచించారీ గీతాన్ని.

గోదావరి నదిని వర్ణించే 'గోదావరి' (పుట : 42) గేయంలో -

**పొంగుతూ వచ్చిందిరా గోదారి**
**రంగుతో మెరసిందిరా!**
**తరగ చేతులపైని నురగ సొమ్ములు వెల్గ**
**ఆటలే ఆడిందిరా! మధురముగ పాటలే పాడిందిరా! ॥ పొం ॥**
**అత్తింటి కని పోవు ఆడపడుచును బోలి**
**పసుపు కుంకుమలందెరా! సిగ్గుతో మిసిమి నవ్వులు నవ్వెరా!**
**పడుచు ప్రాయపు పొంగు పట్టలేకెదలోన**
**పరుగెత్తి పోయిందిరా! జలధితో ప్రణయైక్యమందిందిరా! ॥ పొం ॥**

అని గోదావరి తన తరంగాలనే చేతులకు నురగల్నే సొమ్ములుగా ధరించిందని అత్తింటికి వెళ్లే ఆడపడుచులా పసుపు కుంకుమ లందుకొని సాగరునితో ప్రణయైక్య మందిందని ఖండగతిలో అభివర్ణించారు.

మల్లెపూవు ఉపమానంగా కవులు అనేకులు గీతాలల్లితే ఈ కవి మల్లెపూవును వస్తువుగా చేకొని పలుగీతాల్ని అల్లారు. మచ్చుకు 'మల్లెపూవు-1' గీతాన్ని (పుట :50) పరిశీలిద్దాం.

**ఓపలేనే మనసు - ఓ మల్లెపూవ!**
**దాచలేనే వలపు - వేచునాయెదలోన ॥ ఓ ॥**
**మలిన మెరుగని బ్రతుకు - తెలినగవుతో కులుకు**
**పరిమళపు పిలుపుతో పరవశుని జేసేవు!**

.........................................................................

**ఒక ప్రొద్దె నిలిచినా - ఒక పూటె వలచినా**
**బ్రతుకొక్క నగవుగా పరిమళించుమనె చాలు ! ॥ ఓ ॥**

మల్లెల పరిమళం మనసుకు మత్తెక్కిస్తుంది. మల్లె తెల్లదనం చూపు నాకర్షిస్తుంది. అందుకే మల్లె వలపులకు ప్రేరణ కలిగించే పూవుగా గుర్తింపు పొందింది. కావున సందె పొద్దు మాత్రమే నిలిచి గుబాళించే మల్లెలా, బ్రతుకొక్క నవ్వుగా పరిమళించిన చాలని భావించడం మనోహరంగా వుంది.

బసవరాజు అప్పారావుగారిలాగే కందుకూరి రామభద్రరావుగారు కూడ 'పాపాయి' (పుట : 62) పైన ఒక గీతమల్లారు.

పవ్వళించిన దోయి - పాపాయి తొట్టిలో
పాల బుగ్గల మిసిమి - పూలు పూచినవోయి

..............................................................

నిదురబోయిన పాప - వదన మండలములో
ఎందుకో వికసించు నీ భావ చిత్రాలు
కనునేమొ స్వప్నాలు వెనుక జన్మల గాథ
వినునేమొ భావిజీవిత శీల నవబోధ ॥ ప ॥

అని ఊయలలో నిదురించే పాప గతజన్మగాథల్ని కలగంటూ, భావి జీవిత బోధనను వింటూ యోగనిద్రలో వున్నదని సంభావించారు.

మలిసంధ్యవేళ మహేశ్వరుడు చేసే తాండవాన్ని వస్తువుగా చేసుకొని అల్లిన గీతం, 'సంధ్యానృత్యము' (పుట : 89)

ఓహో మహాదేవ! ఓహోహో నటరాజ!
సాగించినావయ్య, సాంధ్య నృత్యమ్ము! ॥ ఓ ॥
నొసలి జేగురుకంట - మసలి రేగిన మంట
పశ్చిమాంగణమంత - ప్రసరించునెరసంజ
శిరసు మెట్టిన గంగ - చిందు త్రొక్కికలంగ
వినువీధి చుక్కలై - మినుకు మినుకని మెరయు ॥ ఓ ॥

పశ్చిమదిశలో సాయంకాలం అగుపించే అరుణ వర్ణం పరమేశుని నొసటి కంటిమంట వలన ఏర్పడిందని, నింగిలో మినుకు మినుకుమని వెలిగే చుక్కల్ని శివుడు చిందులేస్తుంటే తలనున్న గంగ ఒలుకగా దొర్లిన నీటి చుక్కలని భావించడం నవ్యంగా వుంది.

కందుకూరి రామభద్రరావుగారు దేశభక్తి గేయాల్ని కూడ అనేకం వ్రాశారు. 'గేయమంజరి'కి అనుబంధంగా వెలువరించారు. అందులో 'జయపతాక' అనే గీతంలో

ఈ త్రివర్ణ జయపతాక - ఈ త్రయీపథపతాక
గగన వీధి నెగసెరండు! కరము మోడ్చి మ్రొక్కరండు! ॥ ఈ ॥
అరుణాశయ గణవిశాల - హరితాంచిత భాగ్యజాల
ధవళ కదిత స్వచ్ఛచరిత - ధర్మచక్రమార్గ భరిత[1] ॥ ఈ ॥

1 దేశభక్తిగేయాలు - కందుకూరి రామభద్రరావు పుట 7

విశాల ఆశయాల్ని అరుణవర్ణంగా, భాగ్యసీమల్ని హరిత వర్ణంగా స్వచ్ఛమైన చరితను ధవళవర్ణంగా, అశోక చక్రాన్ని ధర్మ మార్గంగా ఎంచుకొని ఎగరేసిన మువ్వన్నెల మన జాతీయ పతాకానికి మనసారా చెయ్యెత్తి మ్రొక్కగా రారండంటూ ప్రబోధించిన వైనం బాగుంది.

అలాగే భారతమాతను ప్రస్తుతించే గీతం, 'జయహే! జయహే! జయ భారత జననీ!' (పుట : 16)

జయహే! జయహే! జయ భారత జననీ!
జయ ప్రియసుత హృదయరాగ రంజిత పదనళినీ! ॥ జ ॥
నవ స్వతంత్ర కేతన రుచి చుంబిత సుందరగగనా!
నవ భావోదయ మరీచి శోభిత మృదు హృదయా!
నిఖిల శత్రు భయకారణ కిరణాంచిత నయనా!
సకల మిత్ర బాంధవ జన సదయామృత వచనా! ॥ జ ॥

ఇందలి పదాల కూర్పు, భావాల చేర్పు చూస్తే కృష్ణశాస్త్రిగారి

జయ జయ జయ ప్రియభారత జనయిత్రీ దివ్యధాత్రి!
జయ జయ జయ శతసహస్ర నరనారీ హృదయనేత్రి

..............................................................................

అనే గీతం ప్రేరణతో రచించినట్లు అనిపిస్తుంది. అయినా తత్సమ పదగుంభనలతో పాట పసందుగా పలితల నాకర్షిస్తుంది.

కొత్త పథకాలతో బడుగు బ్రతుకుల్లో సరికొత్త వెలుగుల్ని నింపే నవీన ప్రభుత్వ మార్గాల్ని దృష్టిలో వుంచుకొని అల్లిన గీతం, 'నవ జ్యోతి' (పుట : 35)

వెలిగింది ఒక క్రొత్త జ్యోతి
బీద సాదల బ్రతుకు పెన్నిధిగ-సన్నిధిగ ॥ వె ॥
ఉనికిలో, మనికిలో - ఊహపథమ్ములో
కాంతి నిండింపగా - క్రాంతి పండింపగా
తోడుగా నీడగా వాడవాడలు గలిపి
మంటిలో మానవులు- మానికాలై మెరయ ॥ వె ॥

పేదల బ్రతుకు తెరువుల్ని బాగుచేసి మట్టిలోని మాణిక్యాలుగా వెలిగింపజేసే సరికొత్త నవజ్యోతి వెలిగిందంటూ తమ ఆశాభావాన్ని ఖండగతిలో కమనీయంగా వ్యక్తీకరించారు.

చివరగా భారతమాతకు మంగళహారతి పడుతూ అల్లినగీతం, 'మంగళమ్' (పుట : 39)లో

భారత మాతకు మంగళమ్
శూర ప్రసూతకు మంగళమ్ ॥ భా ॥
నిగమ విహారిణి - జగదుపకారిణి
సదయ హృదంతర ముదిత దిగంతర
మిత్ర ప్రకాశిక - శాత్రవ కాళిక
వినుత మహాగుణ - జనపరితోషణ ॥ భా ॥

అని భారతమాతను వీరులనుగన్న 'శూరప్రసూత'గా, వేదవిహారిణి, జగదుప కారిణియైన భారతిని 'మిత్ర ప్రకాశిక- శత్రువుల పాలిటి కాళిక' గా చతురస్రగతిలో అభివర్ణించడం నవ్యంగానే గాక దివ్యంగా వుంది.

ప్రతిభతో ఇలా అనేక రకాల గీతాల నల్లిన కందుకూరి వారు కూడ ద్వితీయదశలో లలితగీత విస్తారంకై అద్వితీయంగా కృషి చేశారు. అల్లుడైన మరో లలితగీత రచయిత 'శశాంక'కు మార్గదర్శకుడయ్యారు. ప్రముఖుల మార్గాలలో సాగి ప్రసార లలితగీత రచనల్లోనూ ప్రధానపాత్ర వహించారు.

శశాంక :

లలితగీత రచయితల్లో అందెవేసిన చేయిగా అందమైన గీతాలల్లిన వారు శ్రీశశాంక గారు. వారి లలిత గీతాలనేకం ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. కవితలు 'స్వరలహరి'లో ప్రచురితమయ్యాయి.

'స్వరలహరి'లో వాన మీద 'వాన చాన' పేరుతో ఒక గేయాన్ని రచించారు.

క్రొమ్మించు బొమ్మంచు కోక కట్టుకొని
తళుకు ముత్తెపు బెళుకు రైక తొడుగుకొని
చికిలి చూపులలోన వలపు నిలిపికొని
చిలిపి లే యెదలోన నెనరు నించికొని
వెదకులాడెద వెవరినే వానచాన!
ఎండి బీటలు పడిన యీ నేలలోన

.........................................................

నీ ప్రేమ బీజమై దినదినము నెదిగి
కోర్కెలీరిక లెత్త గోముగా పెరిగి
నవనవోన్మేషమౌ చివురాగు దొడిగి
బ్రతుకెల్ల పండించు భాగ్యాన బరగి
కలకాల మిట్టులే మా కనులలోన
కాపురము చేయగదవే వాన చాన[1]

అని బీటవారిన బీడులో కురిసే వానను చానగా భావించి యీ గీతమల్లారు. హరివిల్లును నొసట బొట్టుగా దిద్దుకొని మొయిలు మేలిముసుగులో తన హొయలు అగుపించగా భూమిపైకి వయ్యారంగా దిగివచ్చిన వానచానతో ఆమె ప్రేమబీజంగా తాను దినదినం పెరిగి, నవనవోన్మేషంగా చివురాకు తొడిగి వలపు బ్రతుకెల్ల పండిపోవాలంటూ అభిలషించారు.

'జయంతి' అనే గేయంలో (పుట : 8) రవి చంద్రుల్ని మించిన కవిని తానంటూ సగర్వంగా చాటుకున్నారు.

కర్మసాక్షి సహితమూ
కాంచలేడు నావలె!
చుక్కలరేడైన సరే

1. స్వరలహరి (1971) శశాంక పుట 4

శోభింపడు నావలె!
పవలురేలు మారినచో
పలుకరు రవి విధులు
అహర్నిశలు నా యోచన
అవనికి ప్రతినిధులు!

.....................................

ఆకాశాన్నధిగమించి
సారింతును మేధ
తారాతోరణము దూరి
దర్శింతును వసుధ

'రవిగాంచనిచోటు కవిగాంచు'ననే నానుడి ఆధారంగా పై గీతమల్లినట్లు తోస్తుంది. సూర్యుడు పగటికి, చంద్రుడు రాత్రికి మాత్రమే ప్రతినిధులు కాగా, అహర్నిశలు యోచించే, భూమ్యాకాశాల్ని దర్శించే తాను మాత్రం నిరంతర కావ్య సృష్టికి కర్తనంటూ స్వరమెత్తారు.

భారతిని శ్లాఘిస్తూ రచించిన 'జ్యోతిర్గీత' గేయంలో (పుట : 10)

వెలిగించు భారతీ! వెలిగించు జ్యోతి!
వెలిగింపు మెల్లెడల నీ విభవదీప్తి!
రేబవళ్లను మింట దీపమ్ములున్న
తులువచీకటి తొలగి తలగుటేలేదు
చుక్క చుక్కను ప్రక్క చొక్కి నక్కేను
బ్రదుకు లోపలి సుకము మ్రుచ్చులించేను! ॥ వె ॥

అని క్రమ్మే చీకట్లన్నీ కదలిపోయి వెలుగు వెల్లువ జగతి యంతా నిండేలా, నరకమయ్యే భువి నందనమయ్యేలా ఆనంద జ్యోతుల్ని వెలిగించమంటూ భారత భారతిని కీర్తించారు.

'వినతి పత్రము' అనే గేయంలో (పుట : 12) శార్వరికి తన విజ్ఞప్తి తెలిపారు.

చిగురు జొంపు కెంపు
సిందూర పుం బొలుపు
చెలగి యెల మావితో
చేజేతులను కలిపి
చెలిమి కూర్పవె శార్వరీ!
వాసంత శ్రీల నిలుపవె శార్వరీ!

.....................................

పొదరు పొదరున కొదమ
తుమ్మెదల యుద్ధమున
పూలు మధుసిక్తమై

పొరలె పుప్పొడి ధూళి
రణ మరణము మాన్పుమా
శార్వరీ! రాగమయ మొనరింపుమా!

శార్వరిని సంబోధిస్తూ లేత ఎరుపు చిగురు జొంపాల్ని కెంపులుగా, గోర్వంకల్ని సర్దార్లుగా, చిలుకల్ని వజీర్లుగా పోలుస్తూ ఆమనిలో అధికంగా మధువుల్ని వెదజల్లే పూల మీద తుమ్మెదలు వాటికై పోరుచేయరాదని చెప్పమంటూ కవి వాసంతికి విన్నవించిన వైనం ఇందులో అగుపిస్తుంది.

'స్వైర గీతి'లోని భారత వీరము స్వైర విహారం చేయాలంటూ అభిలషించారు (పుట : 20)

పొంగవే పొంగవే పొంగవే గంగా
పూత భారత జాతి చేత ముప్పొంగ
వర కురుక్షేత్రమై వసుధ వీరము పార
భరత యోధుల శౌర్య పటిమ మోసులు వార ॥ పొం ॥
కదలవే! కదలవే కదలవే సింధూ !
గరువంపు పంజాబు యువ వీర బంధూ!
.......................................................................
ఉరుకుముద్రేకమున ఉవిద కావేరి!
పొరలు మావేశమున తరుణి గోదారి!
.......................................................................
స్వైర ప్రవంతియై సకల భారత జాతి
సర్వతంత్ర స్వతంత్ర సంరంభమున పొంగ ॥ పొం ॥

ఉత్తుంగ తరంగయైన గంగ, సింధు, కావేరి, గోదారి మొదలగు దేశంలోని ప్రధాన నదుల్లా భారతజాతి వీరావేశంతో ఉప్పొంగి, తన సర్వతంత్ర, ప్రతిపత్తిని నిలుపుకోవాలంటూ స్వరమెత్తారు.

'మాతృవందనము' అనే గేయంలో (పుట:30) మాతృభూమిని స్తుతించారు.

రావమ్మ! స్వాతంత్ర్య భారత సవిత్రీ
రమ్మహో! శాంత సంగీత శుభగాత్రీ!
.......................................................................
నదనదీ జలములే కాలువల మలగి
వనరు బీడులె పంట భూములై వెలయ
వరనందనోద్యాన వాటియై భూమి
నవనవానందమున నరుల నలరింప ॥ రా ॥
హిమనగము వలె ఉన్నతాశయములమర
గంగాజలమ్మువలె కరుణపొంగార
కోటి కోటుల కొక్కటే గొడుగుబట్టి
సకల మానవకోటి సాకు జనయిత్రి ॥ రా ॥

ఆర్తనాదాలు తొలగి అవని ఆనందగీతాలు పాడాలని, పేదలకడగండ్లు తొలగి బీళ్లు పచ్చగా పండాలని, హిమాలయంలాంటి ఉన్నతాశయంతో, గంగా జలం లాంటి కరుణతో మానవ కోటిని సర్వదా రక్షించి పోషించగా తరలి రమ్మంటూ భారతమాతను కీర్తించారు.

'ఎవరోహో' అనే గేయంలో (పుట:38)

నీలాల మేడలో నెలవంక కొక ప్రక్క
చూడ చక్కని చుక్క ఎవరోహో!
కొలను గుండియ కలచి కలువ చెలువము దోచు
చలువ చుక్కల రాజు ప్రియురాలే!

.........................................................

చివురాకు తెరచాటు సిగ్గుదొంతరలలో
మురియు చిన్నారి చిలుక ఎవరోహో!
ప్రేమ పూదోటలో పలుకు పలుకున తేనె
లొలికించు గొరవంక ప్రియురాలే!

ప్రశ్న-జవాబుల మాదిరిగా సాగిన పాటయిది. నెలవంక పక్కనున్న చుక్కను కలువ ప్రేమను కాజేసిన చంద్రుని ప్రియురాలని చెప్పడం, చివురాకు తెరచాటు సిగ్గుపడుతున్న చిలుకను ప్రేమతోటలో విహరించే గొరవంక ప్రియురాలని వివరించడం, సెలయేరును గిరిరాజు ప్రియురాలిగా, లలితాంగిని విశ్వమంతా ప్రేమపేరున నిండిన ప్రియురాలిగా అభివర్ణించడం యీ గేయ ప్రత్యేకతగా తోస్తుంది. నవ్యతగా నిలుస్తుంది.

మధుమాసంలో విరబూసిన తోటల్ని చూసి పూలకారు పుడమిపైన యాత్ర చేస్తోందంటూ అభివర్ణించిన గేయం రమణీయంగా కొనసాగిందిలా-

నేల నవ్వుతోందా?
రాగాల రువ్వుతోందా?
పూలకారు పుడమిపైన
యాత్ర సాగుతోందా? ॥ నే ॥
గున్నమావి కొమ్మలపై - సన్నాయిలు మ్రోగు
చిగురాకుల పల్లకిపై - చిలక కలికి సాగు
గుండెలోన పన్నీటిని - గోరువంక చిమ్మ
ఒడలంతా పులకింతై ఒదుగును చిలకమ్మ ॥ నే ॥

విరబూసిన తోటల్ని నేలనవ్వులుగా, పూలకారు పుడమిపైన యాత్రకు బయల్దేరినట్లుగా భావించడం నవ్యంగా వుంది. రాగానుగుణంగానే గాక రమ్యంగా త్రిశ్రగతి ప్రధానంగా రచన జరిగింది.[1]

కళాకేళి ప్రచురణగా వెలువడిన శశాంకగారి మొదటి గేయ సంపుటి

1 పాలగుమ్మి విశ్వనాథంతో ముఖాముఖి - 24 7 1997

'నయా జమానా' లో లలితగీతాలుగా రాణించేవి కొన్ని మాత్రమే అగుపిస్తాయి. అందులో 'వసంతగీత' మొకటి!

అనురాగ జలధిలో మీనమవుతాను
ఆనంద పాథోధి లీనమవుతాను!
సంతస వసంతవన
సంతకుల పరిమళము
లాను యెలదేటివలె
పారు సెలయేటివలె
ఈ ప్రేమ వనములో పరుగులిడుతాను
ఈ కడలి యొడలిలో కరిగిపోతాను!
సనజాజి కనుగీటి
కవ్వించు నన్ను
మల్లె మనసును విచ్చి
మాటాడు నాతో
తావినై ప్రేమైక జీవినై లోకైక
భావినై తీయనగు పాట పాడిగిస్తాను[2]

అనురాగ సాగరంలో మీనం (చేప) గా గెంతుతూ ఆనంద సముద్రంలో లీనమవుతానంటూ సరికొత్త ప్రాసను ప్రయోగించారు, పల్లవిలోనే. వసంతంలో విరిసే లతాంతాల పరిమళాల్ని కొల్లగొట్టేందుకు చెలరేగే తుమ్మెదల్లా, దూకే సెలయేటి పాయల్లా ప్రేమవనంలో పరుగెడతాననడమే గాక కడలి ఒడిలో కరిగిపోతాననడం బాగుంది. సనజాజి, మల్లె, మనసారా పిలువగా వాటిలోని తావిలా, ప్రేమైక జీవిలా, లోకైక భావిలా తీయనగు పాట పాడిగిస్తానంటూ ఎడతెగని మృదు పద ప్రయోగాలతో చరణం ముగింపుకో బిగింపు తీసుకువచ్చారు. చక్కటి యమకాలంకారాన్ని పాటించారు. ఖండగతిలో గేయాన్ని కమనీయంగా నడిపించారు.

అలాగే 'అనంత స్వప్నం' అనే గేయం (పుట : 39) రచించారు.

రండి రండి నరులారా! రండి వియచ్చరులారా!
రండీ లోకం లోపలనే కొలువుండండీ!
ఆకాశమ్మే ఛత్రము
అవనియె సింహాసనమ్ము
అంబుధి రత్నాగారము
అనిలమె వింజామరమ్ము
రండి రండి జనులారా! రండి నిరంజనులారా!
రండీ లోకంలోపలనే ప్రసరించండీ!
తూరుపు దిశ నుంచి మొదలు

1 నయాజమానా (1954) శశాంక - పుట 9

పడమర దిశవరకు ప్రాకు,
అరుణ కిరణ స్వర్ణకాంతి
నవ మానవ మహాగీతి!
రండి రవిచ్ఛవులారా! రండి జగచ్ఛవులారా!
రండీ నూతన జీవితమే విరచించండీ!....

అని నరులనూ, వియచ్చరులనూ (దేవతలనూ) సంబోధిస్తూ, ఆకాశం గొడుగుగా అవని సింహాసనంగా, కడలిని రత్నాగారంగా, గాలిని వింజామరగా మలచుకొని నిరంజనంగా నిలిచిపోదామంటూ ఆహ్వానించారు. తూర్పు-పడమర వరకు అరుణ కిరణ స్వర్ణకాంతిలో నవమానవ మహాగీతి రచించడానికి స్వాగత స్వరమెత్తారు.

ఇలా శశాంకగారు మృదు మధుర పదాలతో చక్కటి భావాలతో గేయరచన చేసి, లలితగీత విస్తారం కోసం తనవంతు కృషిని కొనసాగించారు.

## జె.బాపురెడ్డి :

లలితగీత ప్రక్రియను అభివృద్ధి పథంలో నడిపిన కవులలో శ్రీబాపురెడ్డి గారిని కూడ ప్రముఖంగా పేర్కొనాలి. జె.బాపురెడ్డిగారి లలితగేయాల హేల మూడు మార్గాలలో నడిచి లలితగేయ ప్రక్రియలో ప్రయోగాల మాలగా భాసించింది.

వీరి లలితగేయాలలో ప్రణవశీలత, ప్రణయశీలత, ప్రగతి శీలత అనే మూడు విధాలైన దార్శనికత కనిపిస్తుంది. మొదటిదైన ప్రణవశీల దార్శనికతతో రాసిన గేయాలన్నింటిని ఒక గేయ సంపుటిగా ప్రకటించారు. ఈ గేయాలకు 'శ్రీకార శిఖరం'గాపేరు పెట్టారు. ప్రణయాత్మక దార్శనికతగల గేయాలను 'ప్రేమారామం' పేరిట, ప్రగతిశీల గేయాలను 'నాదేశం నవ్వుతూంది' పేరిట సంపుటాలుగా ప్రచురించారు. ఇవికాక మరికొన్ని గేయనాటికలు కూడ రచించారు.

ప్రణవశీల దార్శనికతలో సర్వం పరబ్రహ్మమయంగా భాసిస్తుంది. త్వమేవాహం, తత్వమసి, సోహం, అహంబ్రహ్మోస్మి లాంటి ఉపనిషద్వాక్యాలన్నీ అన్ని ప్రాణులు జగమంతా బ్రహ్మమయంగా భాసిస్తున్నదనే చెబుతున్నాయి. ఇదే అద్వైత వాదాన్ని సృష్టించింది. అద్వైత ఆధ్యాత్మిక భావం వల్ల ప్రతి వస్తువులోను భగవంతుడే నిండి ఉన్నాడన్న నమ్మకం ఏర్పడుతుంది. దీనివల్ల సమాజంలో అసమానతలు, అహంభావం, అశాంతి, హింస, విధ్వంసాలకు తావులేకుండా పోతుంది. ఇక సమాజమంతా ఐహిక సుఖాన్వితమూ, ఆత్మానందానుభూతితోను నిండిపోయి ఉత్తమోత్తమ జీవన యాత్రకు సుగమ మార్గమేర్పరుస్తుంది అని బాపురెడ్డిగారు భావించారు. తమ ఈ సిద్ధాంతానికి అనుగుణంగా 'శ్రీకార శిఖరం' సంపుటిని తీర్చిదిద్దారు.

'శ్రీకార శిఖరం' సంపుటిలో 'నా మనోభావనలు' (పుట:1) అన్న గేయంలో

నా మనో భావనలు గోపీ జనం
నా క్రియా రంగమే బృందావనం
నా బ్రతుకు ఆనంద కృష్ణార్పణం

అంటూ తనను తాను భగవదర్పితం చేసుకుంటాడు జీవి. జీవుడు జన్మించినది మొదలు మాయలోపడి చంచల బుద్ధిని అలవరచుకొంటాడు. ఏదో సచ్చిదానంద శక్తి ఉందని భావిస్తాడు. నిరంతరం తపనతో పరమాత్మకోసం వెతుకుతాడు. చివరకు వేసారి పరమాత్మ ఉనికిని అనుమానిస్తాడు. "కలడు కలండనెడు వాడు కలడో లేడో" అని పోతన గారు భాగవతంలో చెప్పినట్లు ఈ అస్తినాస్తి విచికిత్సకు కారణం చంచల స్వభావం. అందుకే కవి తాను ఏ స్థితిలో నిలబడి భగవంతుని వెదుకుతున్నాడో ఇలా చెప్తాడు.

**చంచలము నా మనసు**
**చంచలము నా మాట**
**సంచల కర్మ యోగాంచలము**
**నా బ్రతుకు**
**సుందర నాద రోదసిలో శివ**
**సత్యము వెదకు**

అంటూ తానొక గోపికగా తన ఆవేదనలన్నీ అనురాగాలుగా మార్చి తన తీరని సందేహాలకు సమాధానాలు పొందానని కవి తనలోని ఆత్మతాపత్రయాన్ని తనలోని జీవన వేదనని వివరించారు. సుందర శివసత్యంకై అన్వేషించారు.

"ఏడుకొండల మీద " (పుట:17) గేయంలో - చరాచర జగత్తు ఆవిర్భవించడానికి ప్రణాళిక అంతా శ్రీచక్రమేనన్న మంత్రశాస్త్ర అంశాన్ని పొందుపరిచారు.

ఏడు కొండల మీద
ఏమున్నదో కాని
నా గుండె అచటనే
నాటుకొని పోయింది-

..........................................

దివిలోని భువిలోని
దీపమొకటేనని
ఈ చరాచర సృష్టి
శ్రీచక్రగతమని
తత్త్వాలు చెపుతూన్నది
గొప్ప సత్యాలు చెపుతూన్నది

అంటూ ఈ మాయలోకం నుండి ఒకింత ఒంటరిగా వెళ్లి నిశ్శబ్ద శూన్యంలో నుండి భగవంతున్ని వీక్షిస్తాడు కవి.

"ప్రశ్నించుట ఒక భ్రమ
ప్రత్యుత్తరమొక భ్రమ
ప్రశ్నోత్తరములు లేని
పారవశ్యమే ప్రేమ"

దేహి ప్రశ్నోత్తరాలలో పడి కొట్టుమిట్టాడటాన్ని పరిహాస పూరితమైన గతిగా భావించారు కవి. ప్రశ్నించి ప్రశ్నించి అలుపుసొలుపులేగాని సమాధానం దొరక దంటారు. భగవంతుని గూర్చి-

తెలిసిన వాడెవ్వడు
తెలిసికొనేదెవ్వడు
తెలిసిన వాని జాడ
తెలిసిన వాడెవ్వడు?

అందుకు అడిగే ప్రశ్నయే అర్థంగాని ప్రశ్న. ఇక దానికి లభించని సమాధానం మాత్రం అర్థమైనదనుకోవడం, వ్యర్థవేదాంత తర్కం అనవసరమంటారు. బ్రహ్మజ్ఞానం గూర్చి వేదాలు చెప్పాయి. ఉపనిషదాదులు తర్కగోష్ఠిలో పడి భిన్న ప్రమాణాలతో వెదకి వేసారినాయి. కాలం మారినా మనిషి వెతుకులాట మానలేదు. ఆ వెతుకులాట వల్ల అతనికి చేకూరిన ప్రయోజనం ఇదే -

దేహము అడుగడుగున
సందేహముతో తడబడు
ఔనని కాదని లోలో
అయోమయత వినబడు

అంటారు. అందుకే అనవసరపు విచికిత్స వద్దని నమ్మికతో పరమాత్మను కొలువుమని చెపుతారు.

"తాడును పామనుకొని" (పుట: 29) గేయంలో మూర్త, అమూర్త అంశాలలో పడిన జీవుని తత్వాన్ని వివరించారు-

"తాడును పామనుకొని
చచ్చిపోకురా!
పామునే తాడు చేసి
బ్రతికిపోరా!"

అని ఏ విషయంలోనైనా భ్రాంతిని వదలమంటారు. పట్టుదల చూపమంటారు.

రాయిని దేవుని చేసి
మనిషిని బలిచేయకురా
మనిషిని దేవుని చేసి
జడతను తొలిచేయరా-

అంటూ మానవుణ్ణి ఉన్నతికి ఎదగమంటారు. బుద్ధిజీవి అయిన మానవుడు తలుచుకుంటే చేయలేనిది ఏమీ లేదు. జగత్తంతా అనల్ప భావనలోనే

ఆవిర్భవించి, అతని జయాపజయాలవల్ల చావు పుట్టుకలను పొందుతున్నదని చెప్పారు. మూఢత్వంతో రాయిని కొలవడం గాక, మానవత్వంతో మనిషిని ప్రేమించుమని హితబోధ చేశారు.

నీ భావమె నిలిచిపోవుగా భౌతికమై
ఈ భౌతిక మెగసిపోవు నీ భావనయై -

అంటూ పరమాత్మ అంశమైన భావనయే దృగ్గోచరమై భౌతిక సృష్టిగా మారుతున్నదని, జీవాత్మ అంశమైన భౌతికశక్తి తిరిగి పరమాత్మ అంశంగా మారుతున్నదన్న తనదైన తత్త్వాన్ని విడమరిచి చెప్పారు.

'హిమగిరి చెవిలో' (పుట : 75) అనే గేయంలో

హిమగిరి చెవిలో
గంగాఝరి గుసగుసలాడింది
నాకోసం సరిక్రొత్త
ఆకాశం వెలిసింది
..................................
కరిగిపోవు మంచులో
కాలం కనువిప్పుతోంది
పద పదమున భావికి
గతపారం చెప్పుతోంది

గంగాఝరి హృషీకేశము నుండి హరిద్వారము మీదుగా ప్రవహించి శ్వేతగంగ, నీలియమునగా భాసించి, అలహాబాదు చేరి, దేశమంతా పావన క్షేత్రంగా రూపుదాల్చింది. గత చరిత్రల్ని గానం చేస్తూ భక్తిభావన వెదజల్లుతూ మనలో ఐక్యత కలిగిస్తున్నదని, సమతా జలధుల్లో మమతల తరంగాల్ని నినదింప జేస్తున్నదని కీర్తించారు.

'నీ మాట నా నోట' (పుట : 87) గేయంలో

నీ మాట నానోట
పలికించవా స్వామి
నీ కరుణ నా మీద
చిలకించవా స్వామి!

అంటూ భగవంతుని కోసం ఆరాటపడతారు. తెలియజాలని నిన్ను తెలిసికొనుట ఎట్లో అంటారు. భగవంతుని ఉనికి, తన ఉనికిని సూటిగా చెప్పమంటారు. ఉలకని పలకని భగవంతుని చూసి 'చెప్పరానిది చెప్ప సిగ్గేమో నీకు' అంటూ ఆత్మ పరమాత్మల స్థితి పరమ రహస్యమని చెప్పకుండా ఆ భగవంతుడే ఆ జ్ఞానాన్ని అందివ్వకుండా దాచేస్తున్నాడని ఆవేదన వెల్లడి చేస్తారు.

ఇలా 'శ్రీకార శిఖరం' సంపుటిలో అంతా దైవచింతనగల గేయాలే రాశారు. 'ప్రేమారామం' సంపుటిలో అన్నీ ప్రణయ గీతాలను ఆలపించారు. సృష్టి సంపద పెంపుదలకు ప్రణయం మూలాధారం. అందుకే స్త్రీ, పురుషుల మధ్య ఈ భావాన్ని ప్రభవించే తీరుని గేయాలలో తెలిపారు.

'ఓ నిమీల నేత్రీ' (పు:5) గేయంలో

"ఓ నిమీల నేత్రీ
ఓ ప్రమీల గాత్రీ
వచ్చావా నా వలపు తోటకు!
.............................................
గళము గళము కీలించి
గానము చేయుదమా
మనసు మనసు జోడించి
మౌనము పూనుదమా-"

అంటూ ప్రేయసిని ఆహ్వానిస్తారు. గళంలో గళం, మనసులో మనసు కలిపి తనతో రమ్మంటూ లోకాన్ని మరచిపోదామంటూ చెప్తారు.

"ధరణీ ధరము నీవు" (పుట:9) గేయంలో

"ధరణీ ధరము నీవురా
ధరాధరము నేనురా!
.....................................
నా లోకపతివీవు
నీ నాక పథమేను-"

నాయిక ప్రియుణ్ణి తన మౌనభాషగా, తపోరూపంగా, తన సుకృతిగా భావించింది. తాను అతనికి కిరీటంగా, పాటగా, మనోభావంగా, యశోదీపంగా ఊహించింది. ఒకరి కొకరం అంటూ ప్రేమ భావాన్ని తెలియపరచింది.

'అబ్బా ఎన్నాళ్లకు' (పు:13) గేయంలో-

"అబ్బా ఎన్నాళ్లకు నీ
అమృత గళము విననాయె
కోటిరాగ వీణలాకే
మాటు మీటి నటులాయె!"

అంటూ కవి తనలోని జడత్వాన్ని ఒక్కసారిగా కదిల్చివేసిన జవరాలి చెలిమి గురించి వర్ణించారీ గేయంలో. ఇంతకాలానికి తన హృదయాన్ని కదిల్చిన సమీరంగా, కనుల కరగించే కమ్మటి దృశ్యంగా వెలుగుచూపిన దివ్యపథంగా తన చెలిని అభివర్ణించారు. ఆమె చెలిమి అనే వసంతంలో శిశిర ఘాతాలు లేవని, ఆనందంలో జరామరణాలు దరికి చేరవని కవి ఆమెతోడి ప్రణయ మాధుర్యాన్ని అభివర్ణించారు.

'అగ్నికీలవోలె నీవు' (పుట:21) అనే గేయంలో

అగ్ని కీల వోలె నీవు
నగ్న నాట్యమాడవే!
గుండెలో దాగిన, నా
గుట్టు బయట పెట్టవే!

..........................................
వలువలు లేనట్టి వారె
విలువలు బోధింతురేమొ?

అంటూ ఆమె నగ్నత్వంలో తాపసులకు యోగినిగా, అహంభావులకు వట్టి భోగినిగా అగుపిస్తుందని ఆమె సౌందర్యాన్ని తాను నగ్నంగా తిలకించాలని కామిగాక మోక్షగామిగాడన్న విషయాన్ని అపరవేమన్నలా జ్ఞప్తికి తెస్తారు.

'కటిక నేల నడచి నడచి' (పుట: 25) గేయంలో నాయకుని కోసం ఎదురుతెన్నులు చూసి నాయిక పరితాపాన్ని పొందిన తీరుని వర్ణించారు.

కటిక నేల నడచి నడచి
కందిన నా పాదాలు
ఎర్ర గులాబీలై పోయెనురా-

అంటూ నాయిక తన తనువు, మనసుల బాధని వెళ్లగక్కింది. సుకుమారత్వాన్ని ఎర్రగులాబీలతో సూచించింది.

ఈ యౌవన భారము
మోయలేక నా నడుము
తిరిగి తిరిగి కరిగిపోయె కదరా-

అంటూ పైకి తన నడుము కృశించినట్లు చెప్పినా, చిక్కిన నడుమే చక్కదనం అనే సత్యాన్ని చెప్పకనే చెబుతున్నది. అన్నీ 3 పాదాలతో నడిచిన యీ గేయంలో ఇదొక ఉక్తి చమత్కారం.

'ఏమున్నది ఈ భువిలో?' (పుట:30) అనే గేయంలో రాగమనేది లేకపోతే సృష్టియేలేదని అన్నింటికీ రాగమయియైన స్త్రీయే కారణమని చెప్పారు.

ఏమున్నది ఈ భువిలో
నీవే లేకుంటే
ఏమున్నది నా బ్రతుకున
నీవే రాకుంటే-

అని ఆమె అనురాగంతో మట్టికి కూడా ప్రాణం పోసే తరువని, శిలలకు కూడ గానం నేర్పగల జలమని, ఆమె సౌందర్యం చూపులలో చుక్కలను, ఊపిరిలో పూలనెత్తావుల్ని నింపగలదని సృష్టి రహస్యాన్ని చెప్పగల శృంగార దేవత, తన సర్వస్వం ఆమెనేయని తలపోస్తారు.

'పెదవి విప్పి' (పుట:35) అనే గేయంలో కవి ప్రేమతలపులు తెలుపకనే తెలుసుకోవాలంటారు. వలపుల తలుపుల్ని తెరుచు కొమ్మంటారు.

పెదవి విప్పి చెప్పాలా
ప్రేమిస్తున్నానని
ఎడద విప్పి చెప్పాలా
పూజిస్తున్నానని-

అని వాచ్యం చేయకుండానే మనసెరిగి మసలాలంటారు. నింగి-నేలలా కలిసి పోవాలంటారు. కావ్యానందమైనా 'సరే, వాచ్యార్థాని కన్నా వ్యంగ్యార్థమే రసానందాన్ని కలిగిస్తుంది. అలాగే కవి తన హృదయాన్ని విప్పి చెప్పకుండానే కాంతను తెలుసుకోమంటారు.

'సిమ్లాలో చూచాను' (పుట:37) గేయంలో నాయకుడి కొంటెతనం కనిపిస్తుంది. నాయిక తననెలా ఉసిగొల్పిందో ఒకకథగా మలుచుకొన్న గేయమిది.

సిమ్లాలో చూచానొక
చిన్నదానిని
కలల అలల రేపు మత్తు
కనుల దానిని.....

అని ఆ మత్తుకనుల సౌందర్యాస్వాదనలో పడిన ఈ నాయకుణ్ణి చూసి ఆమె-

మాలురోడు మీద అదో
మాదిరిగా నవ్వింది

ఆమె విసిరిన నవ్వుకి అతని మేనంతా-

చల్ల చల్లని లోయల్లో
వేడిగాలి రువ్వింది.....

అని వేడిగాలి తగిలినట్లు నాయకుడు అనుభూతిని పొందాడు. ఆమె వేల మన్మథులను కలచివేయగల శరాన్ని తనమీదకు విసిరినట్లు తలచాడు. ఒంపు సొంపులతో మెరుపులా మెరిసి ఆమె రసపిపాసతని తనలో నాటి వెళ్ళిపోయిందని యీ గేయంలో ఆలంకారిక చమత్కారాన్ని కూడ నింపారు.

'ఇందువదన' (పు:51) గేయంలో-

"ఇందువదన కుందరదన
సుందర తారా నయనా!"

అంటూ ఆమె సౌందర్య తేజమే తన జీవితానికి వెలుగుబాట అయిందని అంటాడు. తానిన్ని నాళ్లు చీకటిలో పుట్టి పెరిగి వాస్తవంలో ప్రేమ దొరకని లోకంలో పడి చీకటిలో కలలు కంటున్నానని, వాపోతాడు. ఈ గేయం పల్లవితో వేటూరి రచనగా ఒక సినిమా గీతం వెలువడడం విశేషం!

"తిమిరాలే తెరువై
తిమిరాలే తేరై
తిరుగాడే నా కళ్లకు
తొలివెలుగే నీ వైతివి
వెలుగు రూపు నాకు చూపి
వెలిగే దేవివి నీవు
నీ-నా చూపులు కలిసిన
నిలువదు ఏ చీకటైన"

అంటూ ఆ ప్రేమ వెలుగుని శాశ్వతంగా తనలో నింపుకోవాలనుకొంటారు. అందుకే ఆ ప్రేయసిని చీకటి ఎరుగని వెలుగు దేవత అంటారు. ఈ గేయంలో కవి 'చీకటి, తిమిరం' అన్న పదాలను పదే పదే ఆవృతం చేసి ప్రేమలేని జీవితం ఈ లోకంలో ఎంత నిరర్థకంగా పరిణమిస్తుందో వివరించారు.

ఈ సంపుటిలోని గేయాలన్నీ ప్రణయతత్వాన్ని, ప్రేమకోసం మనిషిపడే ఆరాటాన్ని వివరిస్తున్నాయి. ప్రణవంతో ప్రారంభమైన వీరి కవితాఝరి ప్రణయలహరిగా మారి, దేశభక్తిగా ప్రవహించింది. ఇతని కవిత తన కంఠంలో మార్దవాన్ని సంతరించుకొని గళమెత్తి మాతృదేశాన్ని కీర్తించింది. ఆ స్తుతియే 'నాదేశం నవ్వుతూంది'గా రూపుదాల్చింది.

మానవుని జీవితంలో ఆధ్యాత్మికజ్ఞానం, శృంగార జీవనం, ఎంత అవసరమో సామాజిక స్పృహ, సామాజిక చైతన్యాన్ని నింపుకోవడం అంతే అవసరమంటారు బాపురెడ్డిగారు. సామాజిక స్పృహ లేని సాహిత్యం మనజాలదు. అందుకే వారు తమ సామాజిక భావచిత్రాలను అన్నింటిని గుదిగ్రుచ్చి 'నాదేశం నవ్వుతూంది' అన్న సంపుటిగా ప్రకటించారు.

నా దేశం నవ్వుతూంది
నందన వనంలా
నా దేశం నవ్వుతూంది
నాదస్వరంలా-

అని కమ్ముకున్న కారు చీకట్లను దున్నుకుంటూ, కాంతిని పండించుకుంటూ మార్పు రథాన్ని తోలుకుంటూ ఆనందాన్ని ఆలపిస్తున్నదని చక్కని భావుకతను వెల్లడించారు.

వాదాలకు పోని ప్రగతి
వాదం వేదం కాగా
భావి భాగ్యముల పాటకు
పల్లెలు పల్లవికాగా........

అంటూ తన దేశపు లక్ష్యాన్ని, లక్ష్యసాధనకు ఎంచుకొన్న ప్రగతివాద మార్గాన్ని సూచించారు.

హిమగిరి శిఖరాల ఎత్తు
హిందూ సాగరపు లోతు
అందరి ఆశయాలకు
ఆదర్శం అవుతుంటే
నా దేశం నవ్వుతూంది
నందన వనంలా-

అని తన ప్రజల ఆశయాలు ఆదర్శాలు ఎంత ఉన్నతమైనవో, ఎంత బలమైనవో చెబుతారు. అందుకే తనదేశం నందనవనంగా మారిందని ఆనందించారు.

'ప్రేమించబడుట కన్న'లో (పు:10) పరోపకారం కావాలంటారు 'సొంతలాభం కొంతమానుక పొరుగువాడికి తోడు పడవోయ్' అన్న గురజాడని గుర్తుకు తెస్తారు.

"ప్రేమించబడుట కన్నా
ప్రేమించుటయే మిన్న
భోగలాలసతకన్నా
త్యాగ శీలతయె మిన్న!
ఇచ్చు కొనుటలోని కలిమి
పుచ్చుకొనుటలో లేదు
పుచ్చుకొన్నదైన తిరిగి
ఇచ్చు కొనుటయే చెలిమి!"

ఈ పంక్తులలో చమత్కారాన్ని పోహళించి స్వార్థానికి చురకలంటించారు. నిస్వార్థత ఏదో, ఎలా ఉంటుందో వివరించిన ఉపమానాలు కూడ ఆహ్లాదకరంగా ఉన్నాయి-

"ఆట పాటలన్ని ఆపి
ఆత్మార్పణ చేయుమబ్బు
ఆకు, పూవు, పండురాల్చి
ఆనందించును మ్రాను!"

అని చుక్కలు వెలుగు నివ్వడం, శూన్యపు వాకిటి బడిలో సూర్యుడు పాఠాలు చెప్పడం కూడ నిస్వార్థ చింతనతోనే అంటారు.

మనిషి కొరకు భూగోళం
మతి పోగొట్టుక తిరుగును
తనకొరకే తాను మనుట
మనుగడ కాదని తెలుపుచు-

అంటారు చమత్కారంగా భూగోళం తిరగటం అనేది భూభ్రమణం, పరిభ్రమణాలను సూచిస్తుంది. దీనివల్ల రాత్రింబవళ్లు, ఋతువులు ఏర్పడతాయి. వీటివల్ల ప్రకృతిలో మార్పులు కలుగుతాయి. ఇవన్నీ మానవునికి ఆనందజనకాలు. అతని మనుగడకు ఆధారాలు కూడ. ఆ భూమి మనిషికి ఉపకారం చేయటానికే మతిపోగొట్టుకొన్నట్లు తిరుగుతుందని చమత్కరించారు. మనిషి కూడ తనకొరకే గాక పరులకోసం పాటుపడాలని ప్రబోధించారు.

''భూదేవి పిలిచింది'' (పుట : 13) గేయంలో కార్మిక, కర్షకుల జీవితాలలో అభ్యుదయం విరిసిందని, 'దున్నేవాడిదే భూమి అన్న సిద్ధాంతం' నిజమైందని జాతికి నిజమైన చైతన్యం వచ్చిందని వివరించారు.

"భూదేవి పిలిచింది
పేదోళ్లను
శ్రీదేవి వలచింది
లేనోళ్లను"

వెదపురుగులాంటి వెట్టిచాకిరి వట్టిపోయిందని, శ్రామికుల చెరలన్నీ వదలిపోయాయని ఆకలి బతుకులన్నీ ఈ రోజు ఆనంద పూరితమైనాయని శ్లాఘించారు.

"కొండ కోనల్లోన
క్రొత్త వెలుతురు పాడె
చేతనము నడిపించ
జాతి-రథమై సాగె!"

అంటూ విరిసిన నూతన చైతన్యాన్ని సమసిన వర్గ సమస్యల్ని వెల్లడించారు.

'మనకు మనం' (పుట:26) గేయంలో కులం, మతం లేని సరికొత్త సమాజాన్ని తీర్చి దిద్ది వేదసంస్కృతిని సమతా వేదికపైన నిలపమంటారు.

"మనకు మనం పులుముకున్న
మలినంరా కులం
మనకు మనం చేసుకున్న
మోసంరా కులం-"

పవిత్రమైన భారతీయ సంస్కృతి, వైదిక మతం అనేవి కులమనే మాలిన్యతతో కుళ్లి పోతున్నాయని ధ్వజమెత్తారు.

"మానవతకు మనమిచ్చిన
మహావిషం కులతత్వం
భరత భూమిలో పండిన
భ్రష్టత్వం కులతత్వం।"

అని కులాన్ని తెగనాడారు కులాన్ని వదలి, ప్రేమతత్వానికి పట్టం కట్టమని ఉద్బోధించారు భావితరంలో కులాన్ని కూకటి వేళ్లతో సహా కనిపించకుండా పెకిలించాలని అభ్యుదయ వాదం ప్రకటించారు.

'ఈ దేశం మనదేశం' (పుట . 27) లో స్వతంత్ర భారతావనిలో వచ్చిన మార్పులు చేర్పులు, ప్రగతికి దోహదపడిన తీరుల్ని వివరించారు.

"ఈ దేశం మనదేశం
ఎంత మారిపోయెరా
ప్రజలు కన్న కలలెన్నో
నిజాలు అయిపోయెరా!"

జలవనరులు ఆనకట్టలు కట్టడం వల్ల పంటలకు ఉపయోగపడ్డాయని, బీడు భూములు సైతం పచ్చగా పరిమళించాయని, ఒకనాటి బళ్లబాటలు, కాలిబాటలు ఈ రోజున రోడ్డు, రైలు మార్గాలుగా మారి రవాణా సౌకర్యాలు మెరుగుపడినాయని, పల్లెపల్లెలో వెలుగులు నింపుతూ విద్యుద్దీపాలు చీకటి పల్లెల్ని కాంతి గ్రామాలుగా మార్చివేశాయని, పారిశ్రామిక జీవనం వచ్చి దేశం సౌఖ్యమనుభవిస్తున్నదని స్వరమెత్తారు

'ఎంత గడుసరి మావి' (పుట 54) గేయంలో భారతావని శాఖోపశాఖలుగా విరిసిన గున్నమావిలా ఎండల్లాంటి తెల్లవారి పరిపాలనను ఎదిరించి గుండెధైర్యంతో ప్రేమతో స్వేచ్ఛను ఎల్లలను కాపాడుకున్న ఉదంతాన్ని ఇలా చిత్రీకరించారు.

"ఎంత గడుసరి మావిగున్న
ఎండలను ఎదిరించెనన్నా!
కోయిల గళాలతో
క్రొత్త పాటలు త్రాగి
రసకేతనములెత్తి
రాగిల్లి పోయినది"

......................................

అని ఎండల్లో అంబుధులు అవిసిపోతున్నా, మంచుకొండలు మరిగి నీరై పోతున్నా మావి మాత్రం తట్టుకొని నీడను, ఫలాలను అందిస్తున్నదని ధైర్యసాహసాలతో నిస్వార్థత్యాగాలతో పోరాడి భారతదేశానికి గల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడుకొమ్మని సూచిస్తున్నదని వివరించారు.

భయము లేకున్నచో
బాధలే లేవురా
చల్లని రసాలవని
సందేశమిదిరా-

అంటూ భయం నిలువునా నీరుగార్చేస్తుందని, భయాన్ని వదలినవాడు ఏ బాధలు దరిచేరవని గున్నమావి సందేశాన్ని విశ్లేషించారు.

'ఏమిటి సాధించాము' (పుట : 63) గేయంలో-

ఏమిటి సాధించాము
ఇంతకాలము?
ఏదో పేరున సాగే
ఇంద్రజాలము -
చెప్పేది చేయకుండ
చేసేది తలపోయక
త్రికరణాలు దేని కది
శుద్ధిగ పాటిస్తున్నాం।

అంటూ వ్యంగ్య చమత్కారంతో ఎద్దేవా చేశారు. స్వార్థాన్ని చేజిక్కించుకొంటున్నారని చెప్తూ -

ఒరులపట్ల మనపట్ల
ఒకే నియమమెందుకని
స్వవిషయంలో కాస్త
స్వార్థం పాటిస్తున్నాం

అంటూ పెద్దమనుషుల్లో పేరుకుపోయిన స్వార్థాన్ని వ్యంగ్యంగా నొక్కి చెప్పారు.

'ఇది మన భారతదేశం' (పుట 11) లో భరతావని కర్మభూమి అని ఇక్కడి ప్రతి వస్తువు. ప్రతిప్రాణి గత ప్రాభవాలకు అద్దాలని, విలువైన అంశాలని అందుకే ఇది సుందర భారతమని శ్లాఘించారు.

ఇది మన భారతదేశం
ఎంతో సుందరదేశం
కలలు పంటలై పండే
కర్మభూమి ఈ దేశం-
ఈ మట్టిని ప్రేమిస్తే
మణులు దొరలి పడతాయి
ఈ రాలను సేవిస్తే
సుధలు ఒలికి పడతాయి

అని రత్నగర్భగా, ఆలయ, శిల్ప, లలిత కళా నిర్మాణాలకు, చారిత్రక సత్యాలకు భారతి నిలువుటద్దం అని, వేల యుగాలుగా ఇక్కడ మన్ననలందిన సంస్కృతిని ఎంత కీర్తించినా తనివిదీరదని కొనియాడారు.

ఇట వెలసిన ప్రతి ఊరూ
చరిత్ర భాండాగారం
ఇట వెలిగిన ప్రతి మనిషీ
పురాసంస్కృతసారం

అంటూ "అచ్చట పుట్టిన చిగురు కొమ్మైన చేవ" అన్న అల్లసాని బాణిలో భరతఖండంలోని ప్రతి ఊరు- పేరు మనిషి యొక్క యుగాలనాటి చరిత్ర పునాదులను చదవవచ్చని ఇక్కడ జన్మించడమే సుకృతమని, దేశభక్తిని, ఆధ్యాత్మికతని కలిపి ఈ గేయానికి కొత్తరుచులు కూర్చారు.

వీరి ప్రణవ, ప్రణయ, దేశభక్తి గేయాలు వరుసగా శక్తి, రక్తి, భక్తికి ఆలవాలములై కవిత్వంలో కొత్త ఒరవడులు దిద్దాయి శైలి, భావనావేగం, అభివ్యక్తి మూడు అంచెల వారీగా ప్రణవ గీతాలకన్నా ప్రణయ గీతాల్లో, వాటికన్నా దేశభక్తి గీతాల్లో మంచి పరిణతిని సాధించాయి. ప్రణవ, ప్రణయ గేయాలకన్నా దేశభక్తి గేయాలలో ఆలోచన, ఆవేదన, ఆవేశం, అభ్యుదయం, సామాజిక-సాహిత్య స్పృహలు పున్నమి వెన్నెల్లా వెల్లివిరిశాయి. లలితగీత విస్తారానికి బాట వేశాయి.

## వక్కలంక లక్ష్మీపతిరావు :

లలితగీత రచయితల్లో అగ్రశ్రేణిలో నిలిచే మరొక మంచికవి, శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావుగారు. వీరి గీతాలు చాలావరకు ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. 'సుమాంజలి', 'కవితాలోకము' అను గేయసంపుటాలుగా వెలువడ్డాయి. 'సుమాంజలి'లోని 'నా దేశం' గేయంలో

ఈ దేశం! నా దేశం!
భారతదేశం నా దేశం
పరులముందు తలవంచని రాణా
ప్రతాపుపుట్టిన దీదేశం!
రుద్రమ దేవుల ఝాన్సీలక్ష్ముల
రూపొందించినదీ దేశం! ॥ నా ॥
కర్మవీరులను, ధర్మవీరులను
కనిపెంచినదిది నా దేశం!
శాంతి దూతలను జగతి కొసంగిన
స్వతంత్రదేశం నా దేశం-[1] ॥ నా ॥

అని దేశభక్తుల్నేగాక రాణాప్రతాప్ వీరుల్ని, బుద్ధుడు, ఆదిశంకరుడు వంటి యోగుల్ని, శాంతి దూతల్ని ప్రసవించిన భారతమాతను ప్రస్తుతించారు.

ప్రశ్న-జవాబుల తీరులో 'ఎందుకు?' అనే గేయాన్ని (పుట:6) విలక్షణంగా విరచించారు

చేతికైదు వ్రేళ్లెందుకు?
పంచభూతముల కలయిక
బ్రతుకస్థిరమనడానికి!
..........................................
పువ్వులకానవ్వేందుకు?
బ్రతికే దొక పూటైనా
హాయిగ గడిపేటందుకు
కడలికి ఆ ఘోషెందుకు?
లోకంలో అన్యాయం
పెచ్చుపెరుగుతున్నందుకు!
..........................................

అని పంచభూతాలకు ప్రతీకగా మనిషి చేతికి అయిదే వేళ్లున్నట్లుగా బ్రతికే కాస్సేపు నవ్వుల్ని పంచేందుకే పువ్వులు పరిమళిస్తున్నట్లుగా, లోకంలోని అన్యాయాల్ని సహించకనే కడలి ఘోషిస్తున్నట్లుగా నవ్యంగానే గాక దివ్యంగా భావించారు.

'మల్లెపూవు' అనే చిన్న గేయంలో (పుట:18)

వికసించె మల్లీలతాంతము
పరిమళించినది నా స్వాంతము
....... ..........................................
మమతలతో మది కవ్వించినది
మధుర భావములు వెలయించినది

1 సుమాంజలి - వక్కలంక లక్ష్మీపతిరావు (1970) పుట 4

ఆలుమగల ఆనందము కోసము
ఆత్మార్పణము కావించినది ॥ ఏక ॥

మల్లె మనసు పడ్డ ఆలుమగల ఆనందం కోసం ఆత్మార్పణమే చేసుకున్నదని భావించడం గొప్పగా వుంది. కాని రెండవ పంక్తిలో 14 మాత్రలు లెక్కకు కానవస్తున్నా గతి తప్పినట్లు తోస్తుంది.

'నేను' అనే గేయంలో (పుట:23) ప్రకృతి ముందు తాను పరమాణువు వంటి వాడనంటూ ప్రకటించారు.

ఈ యనంత విశ్వములో
నేనెంతటి వాడను?
..............................................
పర్వతముల ముందు నేను
పరమాణువునైన కాను!
ఉదధి ముందు నేనిలిచిన
ఒక బిందువునైన కాను
చిన్నవాడనైన నేమి?
చేవయున్న చాలదా?
పరమాణువు చూచినేడు
బ్రహ్మాండము వణకదా?

అంటూ తాను చిన్న పరమాణువు లాంటి వాడైనప్పటికీ పరమాణువు విస్ఫోటనంతో బ్రహ్మాండమే వణికి పోతుందని వ్యాఖ్యానించారు. లోకవాస్తవాల్ని వెల్లడించారు.

'మతమెందుకు?' అనే గేయంలో (పుట:33) కుల మతాల్ని నిశితంగా విమర్శించారు.

మతం పేర కులం పేర
మనసంతా విషమైతే
మానవులను దానవులుగ
మార్చివేయు మతమెందుకు?
ప్రక్కవానిపై ద్వేషం
పడగ విప్పుకొనువానికి
గీతాభాష్యము లెందుకు?
చేతికి జపమాలెందుకు?

అని మతం కన్నా మమత ముఖ్యమని, ద్వేషం కన్నా కారుణ్యం గొప్పదని త్రిశ్రగతిలో తీవ్రంగా స్వరమెత్తారు.

'ఆపివేయవె పాట' అనే గేయంలో (పుట:51) కోయిలను పాడవద్దని పలికారు.

పలుకు తేనియలు నీపాటలో చిలికేవు
కోటి వీణియలు నా గుండెలో మీటేవు
ఏ కొమ్మదాగినావే? కోకిలమ్మా!
ఈ పాట కర్థమేమే? కోకిలమ్మా!

..................................................

నీ పాట కర్థమును నేనెరుంగను కాని
వినగానె నా గుండె-విరహమ్ము పాలాయె
ఆపివేయవె పాట ఓ కోకిలమ్మా
ఓపలేనే మనసు ఓ కోకిలమ్మా

అని కోయిల పాటలో తీయని తన చెలి స్వరాన్ని పోల్చుకొని, ఆ చెలి విరహాన్నిక ఓపలేనంటూ పాటను ఆపివేయమంటూ కోయిలను కోరడం ఇందలి ప్రత్యేకత కాగా, ఖండగతిలో యీ పాట కమనీయంగా నడచింది.

పాకిస్తాన్ దురాక్రమణ సందర్భంగా అల్లిన 'రణభేరి' అనే గేయంలో (పుట:61)

పరసేనల సవ్వడి విని
ఉరిమి చూచె హిమాలయం!
వారిధియై ఘోషించెను
భారతజనతా హృదయం!
నడుము కట్టి ముందుకురా!
నవ భారత యువవీరా!
జయభేరీ మ్రోగింపుము
జగతి యశము నిండారా!

..................................................

అని యువకుల్ని నడుం కట్టి ముందుకు రమ్మంటూ, పరసేనల్ని చీల్చి చెండాడి జగతిలో ఖ్యాతినిండేలా జయభేరి మ్రోగించుమంటూ త్రిశ్రగతిలో గేయాన్ని కదను తొక్కించారు.

"కవితాలోకము" అనే సంపుటిలో ప్రథమ గేయమైన 'మాతృనందనము'లో

భారతీయ సోదరా! వీర శంఖ మూదరా!
కర్మభూమి మనదిరా! ధర్మభూమి మనదిరా!

..................................................

విశ్వశాంతి కాముకులం! విశ్వజన ప్రేమికులం!
మానవతా వాదులమై మంచి పంచు శ్రామికులం![1]

అని మనం సత్యం - అహింసల్ని నిత్యం చాటే విశ్వశాంతి కాముకుల మంటూ, మానవతా వాదంతో మంచిని పంచే శ్రామికులమంటూ స్వరమెత్తారు అదే నలుదిశలా చాటమంటూ వీర శంఖాన్ని పూరించమన్నారు.

1 కవితా లోకము (1970). వక్కలంక లక్ష్మీపతిరావు పుట 1

'కళాసుందరి' అనే గేయంలో ప్రణయకళాభినేత్రిని దర్శించారు (పుట:3)

ఓ కళారూపిణీ!
ఓ జగన్మోహినీ!
ఓ మధుర భాషిణీ!
ఓ మృదుల హాసినీ!
నీ కన్నుల మిలమిలలే
నా కవనపు జిలుగులు!
నీ నవ్వుల తళతళలే
నా లోపలి వెలుగులు!
..........................................

అని కళాప్రేయసి కనుచూపులే తన కవనపు జిలుగులైనట్లుగా, నవ్వులే వెలుగులైనట్లుగా భావించారు. పరమానందంతో పరవశించారు.

'మురళి' అనే గేయంలో (పుట:7) మురళీధరుణ్ని ప్రస్తుతించారు.

మ్రోయింపరా మురళి మ్రోయింపరా!
మోడు బ్రతుకుల పూలు పూయింపరా! ॥ మ్రో ॥
మోవి తీయందనము మురళిలో కనిపింప
గాన మాధుర్యమ్ము కని శిలలు ద్రవియింప ॥ మ్రో ॥
నీలి మేఘము గన్న నెమలినై నిను జూచి
నా యెడద పురివిప్పి నర్తనము చేయగా..... ॥ మ్రో ॥

అని పారవశ్యంతో మాధవుణ్ని మురళి నూదమంటూ, ఆ మురళీ రవళి విన్నంతనే శిలలైనా ద్రవిస్తాయంటూ, తన హృదయమేమో మబ్బును గాంచిన నెమలిలా పురివిప్పి ఆడగలదంటూ ఉన్నతంగా ఊహించారు. భావనలోనేగాక రచనా ధోరణిలోనూ కృష్ణశాస్త్రిని గుర్తుకు తెచ్చారీ గేయంలో

'ఎందుకామౌనము' అనే గేయంలో (పుట : 13) శ్రీ వేంకటేశ్వరుణ్ని స్తుతించారు.

ఎందుకా మౌనము?
ఏమిటా ధ్యానము? ॥ ఎం ॥
అలమేలు మంగమ్మ
అలుకతో నిను వీడ
మనసులో ఇంతగా
మథన పడుతున్నావ? ॥ ఎం ॥
అలనాడు నీ కోస
మగ్ని దూకిన తల్లి
ఈనాడు తనకు తా
నై నిన్ను విడిచేన? ॥ ఎం ॥

మొదటి చరణంలోని భావం దాదాపు కవులందరూ ఊహించేదే! కాని క్రింది చరణంలో రామావతారంలో నీకోసం సీతగా అగ్నిలోనైనా దూకిన సతి ఈనాడు తనకు తానే అలిమేలు మంగగా ఎలా విడిచి వెళ్ళిందో? అని భావించడం నవ్యంగా వుంది.

'మల్లీ' అనే గేయంలో (పుట:18) మల్లిక త్యాగ-అనురాగ గుణాల్ని ప్రస్తుతించారు.

ఇంత చిన్ని మనసులో
ఎంత వలపు దాచితివే
ఇంతలేత వయసులో
స్వాంతము లెటు దోచితివే
ఆపుకోలేనటే ఆ వలపుమల్లీ!
ఓపలేనే మనసు ఓ సుగణ వల్లీ!
........................................ ॥ ఇం ॥
గుండె కోత భరించి
కులుకు లేనవ్వుతో
గుండె గుండెకు క్రొత్త
వలపులందించేవు
త్యాగమయివే నీవు
ఓ మల్లెపూవా!
రాగహృదయములేలు
ఓ వలపు ప్రోవా ॥ ఇంత ॥

సూదులతో మాలగాగుచ్చి ధరించే మగువలకు, వలచే మగవారికి ప్రీతి గూర్చే మల్లిక త్యాగాన్ని మనోహరంగా వర్ణించారీ గేయంలో

'మనిషీ-మనసూ' అనే గేయంలో (పుట:20) మనసులు కలిసిమసలితేనే మానవలోకానికి సుగతి-ప్రగతి యని సూచించారు.

పూవూ పూవూ విరిసిననాడే
బృందావని విరబూసేది!
మనసూ మనసూ కలిసిన నాడే
మానవలోకం మురిసేది!
........................................ ॥ పూ ॥
అన్ని మనసులూ పూలైనప్పుడు
జగమే బృందావనము గదా!
సుమనోహాసము జగతి నిండగా
భువియే దివియై పోవుగదా! ॥ పూ ॥

అని అందరి మనసులు సుమాలుగా వికసిస్తే జగమే బృందావన మవుతుందని, భువియే దివిగా మారుతుందని ఆశించారు.

'మధురానుభూతి' అనే గేయంలో (పుట:37) తన మనసు దోచిన చెలిని మధురంగా వర్ణించారు.

చెప్పాలని ఉన్నది!
చెలి చెవిలో రహస్యముగ
చెప్పాలని ఉన్నది!
నా ప్రేయసి కెమ్మోవిని-నర్తించెడు హాసమునకు
మరునాటికె వాడిపోవు మల్లెపూలు సరికావని ॥ చె ॥
నా లతాంగి ఫాలమ్మున-నాట్యమాడు ముంగురులకు
**అంతలోనె కాంతి చెదరు - అంబుదములు సరికావని ॥ చె ॥**

మొదటి చరణంలో మరునాటికే వాడిపోవు మల్లెపూలు తన చెలి మందహాసమునకు సరిరావనడం సవ్యంగా వుంది. క్రింది చరణంలో క్షణంలోనే కాంతి చెదరే మబ్బులు తన లతాంగి నుదుట కదలే ముంగురులకు సరితూగవని చెప్పడం బాగున్నా ఈ చరణం చదవగానే డా.సి.నారాయణరెడ్డిగారి 'నా అంగన ఫాలాంగణమున ముంగురులై మొలవాలిని' ఉందంటూ రచించిన పంక్తుల్ని స్ఫురింపజేస్తాయి.

'ప్రణయిని' అనే గేయంలో (పుట:62) తన ప్రేయసిని ఆరు ఋతువులతో పోల్చి అభివర్ణించడం జరిగింది.

మరువింటి బాణమై మనసు దోచిన జాణ!
పలికింపు యెడదలో పసిడి కిన్నెర వీణ!
వాసంత శోభవై వచ్చి మ్రోడైనవా
బ్రతుకు పువు దోటలో వలపులెగ జిమ్మితివి!
.........................................................................
శ్రావణాంబుదమువై సకియ! నాగాలికే
కరిగి నిలువున నన్ను కరిగించి వైచితివి!
.........................................................................
హిమ శీతలేక్షవై హేమంతమటువచ్చి
నులివెచ్చ కౌగిలింతల నన్ను తేల్చితివి!

వసంత శోభతో వచ్చి తన బ్రతుకున వలపు పూలు పూయించావంటూ, ప్రణయ కోపంతో గ్రీష్మతాపాన్ని కలిగించావంటూ, శ్రావణమేఘంలా - శారదేందిరలా సాక్షాత్కరించి, కరిగించి పండువెన్నెల కురిపించావంటూ, హేమంతంలా వచ్చి నులివెచ్చని కౌగిలింతలిచ్చి, శిశిరమైన బ్రతుకులో ఆమనికి స్వాగతం పలికావంటూ తన చెలిని తనివిదీరా వర్ణించారు. ప్రణయ భావాల్ని వర్షించారు.

లలిత లలిత పదాలతో ఇలా అనేక లలితగీతాల్ని రచించిన లక్ష్మీపతి రావుగారు కూడ లలితగీత విస్తారంకై విశేషకృషి చేశారు.

## వడ్డెపల్లి కృష్ణ :

లలితగీత ప్రక్రియా విస్తారంకై కృషిచేసిన ఆధునిక రచయితల్లో ఈ సిద్ధాంత వ్యాసకర్తయైన వడ్డెపల్లి కృష్ణ కవితాగుణంలో - గణంలో ఎదిగి అగ్రగణ్యుడయ్యాడని ఈయన సాహితీ జీవిత రజతోత్సవం సందర్భంగా వెలువరించిన 'వడ్డెపల్లి గేయవల్లి' ని తేది 3.1.96నాడు ఆవిష్కరించిన జ్ఞానపీఠ్ పురస్కార గ్రహీత డా.సి.నారాయణరెడ్డి గారు ప్రకటించారు. నిదర్శనంగా పలుగీతాల్లోని పసందైన భావాల్ని-శబ్ద చమత్కారాల్ని వివరించారు.

వడ్డెపల్లి కృష్ణ 1968 నుండి పత్రికల ద్వారా 1969 నుండి ఆకాశవాణి ద్వారా అనేక లలితగీతాల్ని వెలువరించాడు. 1971లో (భారత్-పాకిస్తాన్ యుద్ధం సమయంలో) 'కనరా నీ దేశం' పేరున తొలి గేయసంపుటిని 'రాగరథం' పేరున 1981లో మలి గేయ సంపుటిని ప్రచురించాడు. వీటిలోని ముఖ్యగీతాల్ని తిరిగి 'వడ్డెపల్లి గేయవల్లి' అను సమగ్ర గేయసంపుటిలో చేర్చాడు. ఇందలి వందల గీతాలు ఆకాశవాణి, దూరదర్శన్‌లో ప్రసారితాలు!

ఆకాశవాణిలో జనవరి 1969లో ప్రసారమైన ఇతని ప్రథమ లలితగీతం 'కనరా నీ దేశం'!

కనరా నీ దేశం!
వినరా సందేశం!
................................ ॥ క ॥
నిత్యము దారిద్ర్యమ్మే
నర్తించెను నేడు!
సత్య, శాంతి, సంపదలను
స్థాపించగ చూడు![1] ॥ క ॥

అంటూ దేశంలోని స్థితిగతుల్ని ఎత్తి చూపుతూ, అందుకు తన సందేశమేమిటో తేల్చిచెప్పాడు.

మతం పేరున మారణహోమాలు జరుగుతున్న నేటి వర్తమానంలో 'మమకారంతో వెలిగే' మంచినే మతంగా స్వీకరించమన్నాడు. హితం కూర్చమన్నాడు (పుట : 4)

మమకారంతో వెలిగే
మంచి మతం కావాలి!
మతమే ద్వైతేమి గాని
మనకు హితం తేవాలి! ॥ మ ॥
................................
అందరినీ ప్రేమించే
అనురాగం పెరగాలి!

1. వడ్డెపల్లి గేయవల్లి - వడ్డెపల్లి కృష్ణ పుట · 245

మనిషి మనిషిలో నిండుగ
మానవత్వ మెదగాలి! ॥ మ ॥

అని అందరినీ ప్రేమించే అనురాగం కలిగి మానవత్వంతో ఎదగమన్నాడు.

వనమంతా వికసించే
వసంతమే వసంతం!
జనమంతా సుఖియించే
స్వతంత్రమే స్వతంత్రం!
........................................
కూడు, గూడు ప్రతివాడు
కలిగివున్న మరునాడు
దేశమ్మే దేశం!
సౌఖ్యాల నివాసం! (పుట : 7)

అని వనమంతా వికసిస్తేనే వసంతం, జనమంతా సుఖిస్తేనే స్వతంత్రం; ప్రతివాడు కూడు, గూడు కలిగుంటేనే దేశం సౌఖ్యాల నివాసం కాగలదంటూ నొక్కి చెప్పాడు. 'అందం' అనే గేయంలో (పుట : 23)

చదువుకు అందం సంస్కారం
మనసుకు అందం మమకారం
మనిషికి అందం సహకారం
మనుగడ కందం ఉపకారం ॥ చ ॥
........................................
మోవికి అందం మృదుహాసం
మ్రోడుల కందం మధుమాసం
..................................................
ఉదయము కందం రవికిరణం
హృదయము కందం సంస్కరణం ॥ చ ॥

అని చదువుకు సంస్కారం, మనిషికి సహకారం, మోవికి మృదుహాసం, మ్రోడుకు మధుమాసం, ఉదయానికి రవికిరణం అందం - ఆభరణం కాగలదంటూ హృదయానికి సంస్కరణమే లక్ష్యం కావాలని చక్కటి చతురస్రగతిలో చాటాడు.

జాతీయ సమైక్యతను ప్రతిపాదిస్తూ 'నదులకు నామాలెన్నున్నా' అనే గేయాన్ని (పుట:32) నవ్యంగా రాశాడు.

నదులకు నామాలెన్నున్నా
కడలిలోన కలిసే వరకే!...
జనులకు మతాలు ఎన్నున్నా
జాతీయత నిలిపే కొరకే!.... ॥ న ॥
తెలుగూ-ఉర్దూ-హిందీ అంటూ

పలికే భాషలు ఎన్నున్నా
భావం ఒకటే యనగా
భ్రాతృత్వం నెలకొనగా
ఐక్యతనే చూపించాలి!
అభ్యుదయం సాధించాలి! ॥ న ॥

అంటూ ఉన్నతమగు ఉపమానాలతో జాతీయతా భావాల్ని సమైక్యతా బీజాల్ని జాతి గుండెల్లో నాటాడు.

ఆమనిలో మధురంగా స్వరమెత్తే కోయిల మీద 'కోయిలా నీవలా పాడితే' అనే గేయాన్ని (పుట:49) రాశాడు.

కోయిలా నీవలా పాడితే....
నా మనసు నాట్యమే ఆడితే....
వచ్చింది అని తెలుసు మధుమాసం,
వనరాణి అధరాన మృదుహాసం! ॥ కో ॥
కొమ్మ కొమ్మకు ఆకు - కొసరి మొలిచిందంటే
రెమ్మరెమ్మకు మొగ్గ - రేకు విప్పిందంటే
అరుదెంచె ననుకొమ్ము ఆమనీ!...
అందాలు వర్ణింతు నేమనీ?.... ॥ కో ॥

కోయిల తీయగా పాడితే తన మనసు నాట్యమాడుతుందని, మధుమాసం వనరాణి మృదుహాసంగా వికసిస్తుందని ఖండగతిలో కమనీయంగా చెప్పాడు.

ప్రతి మనిషి ఆయా ఋతువుల్లోని గొప్పదనాన్ని మాత్రం పరిగ్రహించి ప్రకృతి ఆకృతిగా నిలిచి పోవాలనే భావాన్ని 'ప్రకృతి ప్రతిబింబం' గీతంలో (పుట:61) చూస్తాం!

మేఘంలా మనిషి మనిషి
మమతను వర్షించాలి!
మానవత్వ బీజాలను
మహిలో పండించాలి!
.................................. ॥ మే ॥
శిశిరంలా శివమెత్తే
స్వార్థమ్మును రాల్చాలి!
వసంతమ్ములా నవ్వుల
పువ్వులలో తేల్చాలి!
.......................................... ॥ మే ॥
గ్రీష్మంలా మండి పడుచు
భీష్మించిన అవినీతుల
అంతమ్మును చూడాలి!
సంతసాన పాడాలి! ॥ మే ॥

అంటూ సౌఖ్యాల్ని శరత్ చంద్రికలతో, మంచులాంటి చల్లని మనసుల్ని హేమంతంతో, స్వార్థాన్ని శిశిరంతో, నవ్వుల్ని పువ్వుల వసంతంతో, అవినీతి అంతాన్ని మండిపడే గ్రీష్మంతో పోల్చి ఆ ప్రకృతి ప్రతిబింబంగా మసలుమని, మమత-మానవత్వాన్ని మేఘంలా వర్షించమని ప్రబోధించడం ఈ గీతం ప్రత్యేకత!

'నా మదిలో నటియించే' అనే గీతంలో (పుట:93)

నా మదిలో నటియించే - నవ్య భావ కవితా!...
నవరాగం పలికించే - నా జీవన సరితా!.... ॥ నా ॥
సెలయేరుల గలగలలను
తెలినవ్వుల దాచుకొని
చుక్కల తళుకులనన్నీ
చెక్కిలితో దోచుకొని
పారిజాత ప్రసూనమై
పరిమళించగా రావే!
.......................................... ॥ నా ॥

అని కవి తన భావకవితనే ప్రేయసిగా, ఊహల ఊర్వశిగా సంబోధించి సెలయేటి గలగలల నవ్వులతో చుక్కల తళుకులీను చెక్కిళ్లతో, నెలవంకలాంటి సన్నని నెన్నడుముతో, రాయంచల నడకలతో పారిజాత పరిమళాలతో కదలిరమ్మని కమ్మగా స్వరమెత్తాడు.

తన మనసు దోచిన చిన్నారిని తన్మయత్వంతో 'నవ్వకే నాదేవి' (పు:99) అని అందంగా అభివర్ణించాడు.

నవ్వకే నా దేవి - నలుగునే కెమ్మోవి!
నవ్వితేనే చాలు - నవరత్నాలు రాలు!
.......................................................... ॥ న ॥
సిగ్గుతో నీ బుగ్గ - సింగారమై పోవ
మరులుగొను నా మనసు - అంగారమై లేవ
....................................................... ॥ న ॥

నింగి-నేల కలిసినట్లు అగుపించే దూర తీరాల్ని ప్రేయసీ ప్రియులుగా సంబోధిస్తూ అల్లిన 'ప్రేయసికై చేయిసాచి' అనే గీతం (పు:117)లో

ప్రేయసికై చేయిసాచి
నింగి వంగుతోందా?
కౌగిలికై పైకిలేచి
కడలి పొంగుతోందా? ॥ ప్రే ॥
అసూయతో నీలిమబ్బు
అడ్డగించుతోందా?
కనువిందగు ఆ అందం
కవిత లేపుతోందా? ॥ ప్రే ॥

అని నింగి వంగడాన్ని ప్రేయసికై చేయి సాచినట్లుగా కడలి పొంగడాన్ని కౌగిలికై పైకి లేచినట్లుగా, మధ్యలో మసలే మబ్బు అసూయతో అడ్డగించుతోందని భావించడం నవ్యంగా వుంది. త్రిశ్రగతిలో నడచింది.

భరతమాతను స్తుతిస్తూ అల్లిన 'వందనమమ్మా భారత జననీ' అనే గేయంలో (పుట: 149)

వందనమమ్మా భారత జననీ!
సుందరమగు మా బంగరు ధరణీ! ॥ వం ॥
హిమాలయమ్మే మణి మకుటముగా
వింధ్యగిరీంద్రమె ఒడ్డాణముగా
విరాజిల్లు ఓ విమల సుగాత్రీ!
విశ్వశాంతినే కోరు ధరిత్రీ! ॥ వం ॥
గంగ, కృష్ణ, గోదావరి, యమునా
నదులన్ని రక్తనాళమ్ములుగా
రూపొందిన ఓ తనూ విలాసిని!
మా పాలిటి మృదు మధుర సుహాసిని! ॥ వం ॥

అని హిమాలయాన్ని తెల్లని కాంతులీను మణిమకుటంగా, దేశం మధ్యలో నున్న వింధ్యాద్రిని ఒడ్డాణంగా, కాశ్మీరాన్ని వదనంగా, కన్యాకుమారిని పాద పీఠంగానే గాక గంగాదినదుల్ని భరతమాత రక్తనాళాలుగా అభివర్ణించి స్తుతించడంలో కొత్తదనం అగుపిస్తుంది.

అలాగే కవి-కవితను గూర్చి అల్లిన 'కవియంటే వెలిగే దీపం' అనే గేయంలో (పుట:159)

కవి యంటే వెలిగే దీపం
కవితంటే కాంతికి రూపం
ఆ దీపాలన్నీ వెలగాలి
ఈ తిమిరాలన్నీ తొలగాలి ॥ క ॥
విద్యా విజ్ఞానంతో యిలలో
విద్వత్తును సాధించాలి!
విశాల విశ్వం ఆవరణంలో
విద్యుత్తుగ వెలుగొందాలి! ॥ క ॥

అని కవిని దీపంతో - కవితను కాంతితో పోల్చి, అవినీతుల అంధకారాన్ని చీల్చడానికి కవి దీపాలు దేదీప్యంగా వెలగాలని ఆశించాడు

మల్లెవంటి మలినంలేని తెల్లని మంచి మనసుల్ని మనిషి మనిషిలో పూయిస్తానంటూ అల్లిన గేయం, 'మల్లె మనసు పూయిస్తా!' (పుట 179)

మమతల మగ్గాలపైన
సమత వస్త్రముల నేస్తా!
.... ............ ...... ..........

దేశీయతతోనే దే-
దీప్యంగా వెలిగిస్తా!

..................................

గుండె గుండెనే తలగడ
దిండులుగా మారుస్తా!
మనిషి మనిషిలో వాడని
మల్లెమనసు పూయిస్తా! ॥ మ ॥

మమతల్ని మగ్గాలుగా చేసి సమతా వస్త్రాల్ని నేసి, అందరికీ వాటినే కట్టించి దేశీయతను వెలిగించి, గుండె గుండెను తలగడ దిండుగా మార్చి మనిషి మనిషిలో వాడని మల్లె మనసు పూయిస్తాననడం మనోహరమైన భావనగా తలచి డా.సి.నారాయణరెడ్డి గారు ప్రశంసించారు.[1]

అమ్మను అమృతరూపంగా భావించి అల్లిన 'అమృత రూపమే అమ్మరా!' అనే గేయంలో (పుట : 185)

అమృత రూపమే అమ్మరా!
అనురాగాల కొమ్మరా!

...............................

మధుర ఫలాలను అందించే
మానవ భూజము అమ్మరా! ॥ అ ॥
సహనంలో భూదేవిరా!
సకల కళల శ్రీదేవిరా!
కాలిపోయినా వెలుగిచ్చే
కర్పూరాలా దీవిరా! ॥ అ ॥

అని అమ్మను అమృతరూపమైన అనురాగాల కొమ్మగా, మధుర ఫలాల్ని అందించే మానవ భూజంగా అభివర్ణించడమేగాక పాలిచ్చి పోషించే కామధేనువుతో, కాలిపోయినా వెలుగిచ్చే కర్పూరపు దీవితో పోల్చడం గొప్పగా వుంది.

గోదావరి పుట్టు పూర్వోత్తరాలను దృష్టిలో వుంచుకొని అల్లిన 'వందనం! వైభవ గోదావరీ' అనే గీతం (పుట : 197) కూడ మన దృష్టిని ఆకట్టుకుంటుంది.

వందనం! వందనం! వైభవ గోదావరీ!
వందనం! వందనం! గౌతమ గోదావరీ!
గోముఖ స్యందినీ! నాసికా నందినీ!
త్ర్యంబకేశ్వర దేవ పాదనాద శింజినీ! ॥ వం ॥
బాసర భారతిని కొలచి - భద్రాచలమును వలచి
ఉభయ గోదావరిగా పైరులెన్నొ పండించి
'అన్నపూర్ణ' యను బిరుదును - ఆంధ్రమాత కందించి
రాజమండ్రితీరంలో - రాజిల్లే రమ్యఝరీ! ॥ వం ॥

---

1 *'కనరా నీ దేశం' (గేయసంపుటి) పుట VII*

మహారాష్ట్ర పుట్టిల్లుగా, ఆంధ్రప్రదేశ్ మెట్టిల్లుగా కలిగిన గోదావరి బాసరవద్ద సరస్వతిని కొలిచి భద్రాచలం వద్ద రాముణ్ణి వలచి, ఉభయ గోదావరి తీరాల్లో పైరులెన్నో పండించి రాజమండ్రి ప్రాంతంలో రాజిల్లినట్లుగా అభివర్ణించడంలో నది నైసర్గిక స్వరూపం నయనాలకు కట్టినట్లుగా అందంగా అగుపిస్తుంది.

యువకుల్ని సంబోధిస్తూ అల్లిన 'దేశానికి యువతరం' అనే గేయంలో (పుట : 228)

దేశానికి యువతరం
కావాలీ ఒక వరం!
మంచిని సాధించనెంచి
కలపాలీ యిక స్వరం!
...................................... ॥ దే ॥
కేవలం నినాదాలకు
'సోషలిజం' రాదు నిజం!
కనులు తెరచి జనమంతా
కలపాలీ భుజం భుజం! ॥ దే ॥

అని యువత దేశభవితకై ఎలా పాటు పడాలో చక్కగా ప్రబోధించాడు. కాలం విలువ గూర్చి చెప్పి, 'కాసుకంటె విలువైనది కాలం' అనే గేయంలో (పుట -15)

కాసుకంటె విలువైనది కాలం!
కనులు తెరచి మెదలుము కలకాలం! ॥ కా ॥
కష్టానికి కాలమెపుడు - కలిసొస్తే అదృష్టం!
కలసిరాని కాలానికి మారుపేరు దురదృష్టం!
కాసుకన్న విలువైనా-కాలంనూ పొదుపు చేయి!
పరిశ్రమను పెంచి పెంచి - ప్రగతిలోకి అడుగువేయి! ॥ కా ॥

కాసుకంటె కూడ కాలమే ఎంతో విలువైనదని, అట్టి కాలాన్ని వృథా చేయక పరిశ్రమంచి ప్రగతి సాధించాలని 'ఎంతో మధురంగా-అమృతం నిండిన అధరంగా వడ్డెపల్లి కృష్ణ రచించినట్లుగా మహాకవి డా.దాశరథిగారు అతని మలికృతి 'రాగరథం' (లలితగీతాలు) పీఠికలో అభినందించారు.[1]

ఇలా డా. దాశరథి, డా.సి.నారాయణరెడ్డి గార్ల అభినందనలతో, ఆశీస్సులతో అనేక లలిత గీతాల్ని అల్లిన వడ్డెపల్లి కృష్ణ కూడ లలితగీత విస్తారంకై విశేష కృషి చేశాడనడంలో అతిశయోక్తి లేదు.

## ఆచార్య తిరుమల :

లలితగేయాలకు ప్రాచుర్యం కల్పించిన ఆధునిక కవులలో ఆచార్య తిరుమల కూడా చెప్పుకోతగిన కవి. తిరుమల గారు రాసినగేయాలను అనేకమంది

1 రాగరథం (లలిత గీతాలు) వడ్డెపల్లి కృష్ణ . పుట XIII

గాయనీ గాయకులు పాడగా కావలసినంత ప్రచారం కలిగింది. రేడియో, దూరదర్శన్ ద్వారా ఎన్నో గేయాలు ప్రసారమయ్యాయి. వీరి గేయాలను 'గేయ నందిని' సంపుటిగా ప్రకటించారు.

'గేయనందిని' సంపుటిలోని ప్రథమ గేయం, 'వాణీ! నిగమాగమరూపిణీ!' ఈ గేయంలో చదువులతల్లి సంస్తుతి చేశారు.

**వాణీ! నిగమాగమ రూపిణీ!**
**కరుణించవే చదువులిడి నలువ చెలి!!**
**మధుర గానములలో సాగి**
**అమర కావ్యములలో నూగి**
**హృదయవేది నలరించగ రావే**
**నీవె కావె మము బ్రోచు దైవతము!!**[1]

గేయానికి సాహిత్యము, రాగ మాధురి రెండూ ప్రధానాంశాలే, అందుకే గానంగా, కావ్యంగా హృదయానందం కలిగించగ మృదుహాసంతో మదమరాళమును అధిరోహించి రమ్మంటూ వాగ్దేవికి తన గేయాన్ని హారంగా అర్పించారు.

**చేకొన గదమ్మ నుతిమాలిక**
**వరదాయి! నీవె శరణమ్ము మాకిక**

అని వీణా పాణిని వినుతించారు

'పలికే శారద' అనే గేయంలో (పుట : 13)

**పలికే శారద చంద్రబింబమా!**
**మౌనమా!**
**నా లోగిలిలో**
**శశి కురంగమని**
**మధులతాంగివని**
**నాహృదయముపై**
**నడచు కమలమని**
**తలచి తలచి చేరిన వేళ**

అని తన భావనలోని రసమాధురిగా, వసంతంలోని ఎలకోయిలగా, తన కావ్యానికి ప్రణయ నాయికగా, తన హృదయముపై నడచే కమలంగా, తన కౌగిలిలోని మధులతాంగిగా తలచి, ప్రియుడు తన చెలి సన్నిధి చేరాడు. ఆమె పలికే శారద! చంద్రబింబమువంటి ఆ సౌందర్యరాశిని ప్రియుడు సరసంగా చెంతకు చేరినా, ఆమె మాత్రం మౌనంగా వుందంటూ రాగాలాపన చేసిన వైనం యీ గేయంలో అగుపిస్తుంది.

'దేశమే దేవాలయం' (పుట 47) గేయంలో కులమతాల వదలి ప్రగతి పథంలోకి నడవమంటారు కులమతాలు వీడి, ప్రజాశాంతికి, ప్రగతి కాంతికి విజయకేతనంగా నిలువుమంటారు

దేశమే దేవాలయం
జ్ఞానమే దైవం!
చీకటన్నది లేదురా-రా
రమ్ముముందుకు సోదరా!
కులాలో కొండలో-మతాలో మహానదులో
వేటినైనా దాటి రారా! సమత వీణను మీటరా-

తలపులనే స్వచ్ఛమైన పూలతో జాతి అనే మాలను కట్టి దైవానికి అర్పించమంటారు. త్యాగాన్ని పెంపొందించమంటారు. అప్పుడే ధర్మానికి మార్గం ఏర్పడుతుందని, సత్యానికి శంఖారావం, ప్రగతికి కాంతిపథం కలుగుతుందని అదే విజయసంకేతమని ప్రబోధిస్తూ కులమత వైషమ్యాలు లేని సమసమాజాన్ని నిర్మించాలంటారు.

'కొత్త వెలుగు వస్తోంది' (పుట:51) లో నిరాశ నిస్పృహలు తొలగిపోయి, వేదనరోదనలు చెదరిపోయాయని, చీకటిని పారద్రోలి కొత్తవెలుగు నిండుతున్నదని ఆశావాదాన్ని వినిపించారు.

"కొత్త వెలుగు వస్తోంది
తొలగవమ్మ చీకటి
ఇలలో నీకింక ఇంత
చోటుండదు-మాటుండదు
..........................................
దిక్కుల కన్నెల కన్నుల
మక్కున దారిని సాగి
ఆనందపు రసవీథుల
అనుభూతిని వూరేగి"

సూర్యకాంతి రథం మీద సుకవితా పథంపైన దరహాసాలతో 'ప్రగతి' బయలుదేరింది. ప్రగతి కాంతులు ప్రసరించాక చీకటికిక తావే ఉండదు. అన్ని దిక్కులలోను ఆనందమే రసప్రవాహమై అనుభూతులు నింపుతుందని భావించారు.

'నవ్వవే ఓ మల్లీ' (పుట:75) గేయంలో ఎవరికీ పనికిరాని వెయ్యేళ్ళ జీవితం కన్నా మల్లె లాంటి పరిమళం వెదజల్లగలిగే జీవితం ఒక్కరోజైనా చాలునంటారు.

"నవ్వవే ఓ మల్లీ
జాబిల్లి కన్న తెల్లగా-చల్లగా
మొగ్గనై-నువ్వు దాచిన తీయని సిగ్గునై
పలుకాడక చేరి అలరించక
మదిని మురిపించక దాగనా?
చిరుగాలిని కోరి రారమ్మని
దివిని మరపించగా ఆడనా?"

ఆ మల్లియను చూడగానే తన వలపు వాగై ప్రవహించిందని, సమభావం, నవజీవం కలిసి తనను పెనవేశాయని అందుకే-

వెయ్యేళ్ల బ్రతుకేల? ఎవ్వరికి పనికిరాక
నీవలె ఒక్కరోజైనా నిలిచివున్న చాలదా?

అని తాను స్వచ్ఛమైన మల్లెగా ఎదను నవ్వుల దివ్వెగా మార్చి, మనసులోని కారు మేఘాలను చెల్లాచెదురుచేసి, శాంతియుతంగా భక్తి భావనతో బ్రతుకు గడపాలనుకొంటారు. అందుకే

'గుడి లోపల స్వామి పదసన్నిధి
శాంతి చివురించగా నిలువనా?'

అని తన బ్రతుకును సార్థకం చేసుకోవాలనుకొంటారు.

'నయనాలకు సుందరబిందువు' (పుట:91) అనే గేయంలో జీవన కావ్యవిషాదాన్ని, లీలా వినోదాల్ని వివరించారు.

"నయనాలకు సుందర బిందువు
హృదయాలకు ప్రమోద సింధువు
ఆ సింధువు సత్య వికాసం
ఆ సత్యం భవ సంకాశం
అణువణువున అగ్నీ హిమము
అన్నిట ఇహ-పరములు సమము
చైతన్యం నిత్య నర్తనం
సౌజన్యం భవ్య కీర్తనం"

జీవితం ఒక సుందర బిందువు, అది నిత్య వికాసం. ఆ జీవితంలో అడుగడుగున అగ్ని, హిమములా కష్టాలు-సుఖాలు నిండి వుంటాయి. అన్నింటా ఇహము, పరము సమానంగా వ్యాపించి ఉంటాయి. వలపు, కన్నీటి చీకటి అడుగులతో కలిసిన జీవితం ఒక విషాద కావ్యం. ఇదంతా భగవంతుని లీలా వినోదం. అందుకే కడలిని సెలయేటి వలపు, పూలను తుమ్మెద పిలుపు ఆకర్షిస్తుంది.

"ఇది జీవన కావ్య విషాదం
ఇదంతా లీలా వినోదం
.......................................
అంతరంగ సాగర మథనం
జాగృతికే మంగళ కథనం"

మానవ అంతరంగం ఒక సముద్రం. అందులో హాలాహలము, అమృతము రెండూ ఉన్నాయి. ప్రతివ్యక్తి తనకు తానుగా ఆత్మవిమర్శ చేసుకొంటే పరిశుద్ధాంతఃకరణవల్ల అమృతమే మిగులుతుంది. ఇది జాగృతికి మంగళదాయకం అవుతుంది అని కవి భావం!

'లేవరా! సోదరా!' (పుట:110) గేయంలో తెలుగు గడ్డపై విరిసిన కీర్తిని, వైభవోన్నతమైన గత చరిత్రను దశదిశలా చాటమంటారు.

"లేవరా! సోదరా!
విజయ శంఖ మూదరా!
తెలుగుదేశ అభ్యుదయం
దశదిశలా చాటరా!!
ఘన కృష్ణ, గోదావరి
నదులు పారు పుణ్యభూమి
తిరుమలగిరి, శ్రీశైలం
నరలు మహిత ధర్మభూమి!"

ఇది పుణ్యభూమి, ధర్మభూమి. అమరావతి, నాగార్జున కొండ శిల్పకళాఖండాలకు నెలవు. ఈ భువిలో ఆంధ్రభోజుడైన శ్రీకృష్ణదేవరాయలు, తిమ్మరుసుమహామంత్రి వంటి ధీరులు, నన్నయ, వేమన్నలవంటి కవులు, త్యాగయ్య క్షేత్రయ్య వంటి పద కవులు, అమరజీవి పొట్టి శ్రీరాములు లాంటి దేశభక్తులు జన్మించిన భూమి ఇది. ఇది రత్నగర్భ, వీరధాత్రి. ఇటువంటి మాతృభూమి కీర్తిని దశదిశలా చాటమని విజయశంఖమూదమని ప్రబోధించారు.

'ఎదను కుదుపునది గానమే' (పుట:185) అనే గేయంలో హృదయానికి ఆనందం కలిగించేది గానమేనని ఆ గాన మాధుర్యాన్ని ఆ గానానికి గల ఆధారాన్ని వివరించారు.

"ఎదను కుదుపునది గానమే
స్వరములలరు మధుపానమే
అది కోయిల జీవనమేగా
అది కోమల భావన కాగా
ఈ జగతిని లే వలపులు కురియా
మీ బతుకులలో మెరుపు విరియా!!"

కోయిల రాగాలతో, కోమల భావాలతో ఈ జగతిని ఆనందడోలికలలో ఊగించేది గానమే! పూలకు మధువుల్ని, మధురిమల్ని, వానగా, వాగుగా, నావగా సాగే కోరికలకు తీరాల్ని, గగనానికి తారకల్ని, శ్రుతులకు ప్రమోదాన్ని కలిగించేది గానమే!

ఏటి కన్నె పరుగులలో
తేటిపాట నడకలలో
హాయలై లయలై రేగే
మువ్వయై మురళియై మ్రోగే-
మురిపాలకు వెల్లువయై
లేనవ్వుల మల్లికయై

విలాసాన్ని, వినోదాన్ని వికాసాన్ని కలిగించేది కూడ ఆ గానమే అని తిరుమలగారు ఎంతో మధురంగా వివరించారు.

'ఒక్కటే ఒక్కటే యువత' (పుట.199) గేయంలో శాంతి సౌఖ్యాలను, సమసమాజ ప్రగతిని పెంపొందించటంలో యువత అంతా ఏకమై ఒకే తాటిపై నడవాలంటారు ఆచార్య తిరుమల.

"ఒక్కటే ఒక్కటే యువత
నవ వికసిత మానవతామృత! ॥ ఒ ॥
శాంతి సౌఖ్యం-భోగ భాగ్యం
సర్వ సంపన్నమై-
.......................................
జనత వర్ధిల్లగా - ॥ ఒ ॥
కష్టం చేసి నష్టం పొందే
దుష్ట ఘడియలు పోయి
అజ్ఞానులపై - అమాయకులపై
దోపిడీ ఆటకట్టి
సమత వర్ధిల్లగా.... ॥ ఒ ॥

యువత ఏకమై జగమంతా కాంతి వెదజల్లేటట్లు చేయాలని జాతి ఖ్యాతిని ఎల్లెడల మారు మ్రోగించాలని, అమాయక కష్టజీవులకు న్యాయం జరిగేలా చూడాలని ఆశించారు.

'కోటి గొంతులు ఒక్కటైతే' (పుట:209) గేయంలో ఏకతా భావంలో ఉన్నబలం మరెక్కడా లేదంటారు.

కోటి గొంతులు ఒక్కటైతే కొత్తపాట!
కోటి అడుగులు ఏకమైతే వెలుగుబాట!! ॥ కోటి ॥
కులం వర్ణం - మతం వర్గం
దాటి నడిచే శక్తి భాష వుంటే
భాష యిదియను-ప్రాంత మిదియను
భావమే రానీయకుంటే
త్యాగధనుల చలువ చూపుల
రాగమాలికలల్లుకుంటూ ॥ కోటి ॥

కోటి గొంతులు ఏకమైతే కొత్తపాట వినిపిస్తుందని అందరిదీ ఒకే మాట అయితే అదే ప్రగతి బాట అవుతుందని వివరించారు. కులం, వర్ణం, మతం, వర్గం అన్నీ వదిలి, త్యాగధనులను అనుసరిస్తూ ఉత్తమ మార్గంలో నడవాలని ప్రబోధించారు స్వార్థాన్ని, లోభాన్ని, వ్యక్తిలాభాన్ని కూలగొడితే సమసమాజం ఆవిర్భవిస్తుందని అందంగా యీ గీతమల్లారు.

'ఓరోరీ రైతన్నా' (పుట:229) గేయంలో దేశానికి రైతే వెన్నెముక అంటూ శ్రమకు తగ్గ ఫలితం ఆ రైతుకు దక్కేరోజు వస్తుందంటూ ఈ ప్రగతి గేయాన్ని రా శారు

"ఓరోరి రైతన్నా!
మనసు వెన్న నీదన్నా
జోహారు జోహారు
మనిషి వెన్ను నీపేరు!!
నాగేటి చాలులేల? యంత్రాలు లేవా!
నీవు తాక బీడులైన మాగాణి కావా!
మదిని నీవు అనుకుంటే మహానదులె ఏల
మేరువే కరిగిపోదా! సిరుల ఏరులుప్పొంగవా!"

వెన్నలాంటి మనసున్న రైతే మన దేశానికి వెన్నెముక! అట్టి రైతు కాయకష్టానికి శ్రమతగ్గటానికి ఆధునిక యంత్రాలు అనేకం వచ్చాయి. కావున రైతు శ్రమ వృధా కానీయకుండా చూడమంటారు. ఆ రైతు చేయి తాకితే ఎంతటి బీడు భూమి అయినా పులకరించి మాగాణిగా మనల్ని పలకరించగల దంటారు. చివరిపంక్తి మాత్రం గతి తప్పినట్లుతోస్తుంది.

"నీ గుండెల తలుపు తట్టే - లేమి నిలవదింక
నీ చూపుల లోగిలి మెట్టే బాధ బ్రతుకదింక
ముందు యుగం నీదేనోయ్
నీకు తోడు నిలిచామోమ్"

అంటూ శ్రామిక వర్గానికి తోడుగా నిలిచారు.

"కళ్లంలో ధాన్యం నినుగని
కల కల మని నవ్విందోయ్. నీ
కళ్లల్లో దైన్యం తుడిచే
కాలం చివురించిందోయ్!
నీవు పడే శ్రమకు ఫలం
నీదేనోయ్ నీదేనోయ్"

అంటూ కర్షకుల శ్రమకు తగ్గ ఫలితం లభించే రోజు వచ్చిందంటూ ఆనందంగా రైతుల గుండెల్లో ఆశాజ్యోతుల్ని వెలిగించారు. ఇలా జ్యోతుల్లాంటి అనేక లలిత గీతాల్ని ఆచార్య తిరుమలగారు సాహితీ లోకానికి అందించారు.

## తిరుమల శ్రీనివాసాచార్య :

ఆధునిక లలితగీత రచయితల్లో డా తిరుమల శ్రీనివాసాచార్యగారు కూడ ప్రథమ శ్రేణి రచయితగా పరిగణనలోకి వస్తారు. వారి 'గంగా తరంగాల'లో ఓలలాడిన ప్రతి పాఠకుడూ అది నిజమని ధృవీకరిస్తాడు. గేయనాటికలమీద పరిశోధన జరిపి పి.హెచ్‌డి. (ఉస్మానియా) పట్టా పొందిన శ్రీనివాసాచార్యులు గారు 'తెలుగు రుబాయిలు' కూడ రచించి ఖ్యాతిగాంచారు.

'గంగా తరంగాలు' (లలితగీతికా సంపుటి) లో మానవతా వాదం, జాతీయ భావం, ఆకాశం లాంటి విశాల దృక్పథం అంతర్వాహినిగా తరగెత్తినట్లు తోస్తాయి.

మొదటిగేయంలో గంగను ఉత్తుంగ భావాలతో 7 చరణాల గీతంగా అభివర్ణించారు.

**అభివందనం ఓ అమర తరంగిణీ!**
**అభివందనం ఓ అఖిల నదీమణీ!**
**పాతక హారిణీ! భీతి నివారిణీ!**
**పావన జీవన దాయినీ!**
**స్వర్గ విహారిణీ! భూ సంచారిణి**
**పాతాళాంతర గామినీ!**
**.................................... ॥ అభి ॥**
**మూడు లోకముల ముడివేసే ఓ**
**సమైక్య మూర్తీ! వందనం!**
**పవలూ రేలూ పయనించే చై**
**తన్యస్ఫూర్తీ! వందనం! ॥ అభి ॥[1]**

అని గంగను ముల్లోకాల్ని పావనం చేసిన పాతక హారిణిగా, పావన జీవన దాయినిగా తనివి దీర అభివర్ణించారు.

అలాగే మన జాతీయ పతాకాన్ని గూర్చి 5వ గేయంలో (పుట:14)

**ప్రణామాలు గైకొమ్మా పతాకమా!**
**ప్రమోదాలు మాకిమ్మా పతాకమా!**
**ఆకసాన అంతెత్తున నీవాడాలి!**
**అవనిపైన సంతసాన మేం పాడాలి! ॥ ప్రణా ॥**

అని త్రివర్ణ పతాకం ఆకాశంలో మన స్వాతంత్ర్య సంతోషాలకు సంకేతంగా ఆడాలంటూ, జెండాలోని కాషాయపు రంగు ధైర్యం- త్యాగానికి, తెలుపురంగు, శాంతి సత్యాలకు, ఆకుపచ్చరంగు పాడిపంటల ప్రగతికి చిహ్నామంటూ భావించారు. గీతాన్ని త్రిశ్రగతిలో చక్కగా నడిపించారు.

నీతి, నియమాలకు నీళ్లొదులుతున్న నేటి వర్తమానాన్ని, దేశస్థితిగతుల్ని గూర్చి 12వ గేయంలో (పుట:24)

**ఏమవుతుంది ఈ దేశం?**
**ఎటుపోతుంది మనదేశం?**
**ఎక్కడ దాగెను సమైక్య భారత**
**వీరజాతి సందేశం? ॥ ఏ ॥**
**నీతీ నియమం నేలకురాచి**
**నేతలు గంతేస్తే**
**వాక్చాతురితో అరచేతుల్లో**
**వైకుంఠం చూపిస్తే ॥ ఏ ॥**

---

*1. గంగా తరంగాలు (యువభారతి రజతోత్సవ ప్రచురణలు : 1992) డా. తిరుమల శ్రీనివాసాచార్య పుట - 3*

అని వాగ్దానాలతోనే కాలం వెళ్లబుచ్చే నేతల్ని, జ్ఞానామృతం పంచే గురువుల్ని బానిసలుగా చూస్తున్న లోకాన్ని, కళల పేరుతో ఆడపడుచుల్ని కాసుల కమ్మే సమాజాన్ని నిశితంగా విమర్శించారు.

కుల, మతాల కతీతంగా జీవించాలంటూ ప్రబోధించిన 22వ గేయంలో (పుట:38)

**కులం కులం అంటేనే మనం కాకులం**
**గుణం గుణం అంటేనే మనం లోకులం**
**అంబరానిదవుతుందా అగ్రకులం?**
**అంబురాశికీవుందా అల్పకులం? ॥ కులం ॥**

అంటూ కులం పేరుతో కాకుల్లా అరుస్తున్న, తోటివారిని కరుస్తున్న ప్రస్తుతపు కుల వ్యవస్థను విమర్శించడమే గాక

**నేల మీది గులాబీల దేకులం?**
**నీటిలోని కమలాలది ఏ కులం?**
**..................................................**
**మంచికీ పలకాలి స్వాగత గీతం**
**చెడును చించివేయుటే మన మతం**

అని ఉన్నత లక్ష్యాల్ని ప్రకటించారు.

మనిషి కష్టిస్తే స్వర్గమైనా చేతికందుతుందనే భావంతో 32వ గేయంలో (పుట:53)

**మనసుంటే చాలులే**
**మార్గం ఉంది-నరుడు**
**సాధనతో సాగితే**
**స్వర్గం ఉంది!**
**శిలను తొలిచి ప్రతిమగా వెలయించాడు**
**ప్రతిమలోన పరమాత్మను పలికించాడు**
**.................................**
**శశిబింబం పైన ధ్వజం స్థాపించాడు**
**రవిబింబం లోని శక్తి గ్రహించాడు ॥ మ ॥**

అని మనిషి శిలను మలిచి శివునిగా పలికించడమే గాక చంద్రమండలంపై కాలుమోపాడని, 'సోలార్‌శక్తి'ని సూర్యుని వల్ల పొందాడని ఆధునిక విజ్ఞానాన్ని అభినందించారు. చివరి పంక్తిలో ఒక మాత్రలోపించి గతి తప్పుతున్నందున 'గ్రహించాడు' ను 'గ్రహియించాడు'గా సవరించుకుంటే సరిపోతుంది.

జీవితమే ఒక సంగ్రామం అనే సత్యాన్ని చాటుతూ 38వ గేయాన్ని (పుట:61) రచించారు. అందులో

**జీవితమే ఒక రణం**
**ఘర్షణ తప్పదు అనుక్షణం!**

చీకటితో పోరాటం సలిపే
జీవికి ఎక్కడిది మరణం? ॥ జీవి ॥
ఆకాశంలో సాగుతుంది
చీకటితో ఒక సమరం!
ఆ రవి, చంద్రులు సమర యోధులు
వారి జీవితం అమరం! ॥ జీవి ॥

అని చీకటిని చిత్తుచేసి, వెలుగు పంచే జీవితాలు అమరమైనట్లుగా అభివర్ణించారు. నిత్య జీవన సమరంలో మానవుడు మంచి కోసమై కాంతి సమరం చేయాలని కాంక్షించారు.

మనస్సు వికసిస్తే మనిషి మహర్షిగా మారడమేగాక మార్గదర్శి అవుతాడని 59వ గేయంలో (పుట : 83) వెల్లడించారు.

పల్లవి : మనస్సు వికసిస్తే, మనిషి మహర్షి అవుతాడు!
మనస్సు ప్రవహిస్తే, మనిషి మార్గదర్శి అవుతాడు! ॥ మ ॥
చరణం : ఈసును తుంచి ప్రేమను పంచిన
ఏసు దేవుడే అయ్యాడు!
మానవులను సేవించిన గాంధీ
మహాత్ముడయ్యాడు!

అని ప్రేమను పంచిన ఏసు కరుణామయుడుగా, మానవత్వాన్ని చూపిన గాంధీ మహాత్ముడుగా అవతరించినట్లుగా వెల్లడించారు. లోకంలోని సత్యాలను చాటి చెప్పారు. చరణంలో మొదటి పంక్తిలోని 'ఈసును తుంచి'ని...'తుంచీ'గా సవరిస్తే చక్కగా చతురస్రగతి అలవడుతుంది. చివరి పంక్తిలో నిడివి తగ్గినందున 'మహిలో మహాత్ముడయ్యాడు' అని 'మహిలో' అనే పదం అదనంగా చేర్చుకుంటే సమంగా గతి సాగిపోతుంది. లేకుంటే వెలితిగా తోస్తుంది.

అందరి కోసం పాటుపడడమే సుందరమైన జీవితం అంటూ 80వ గేయంలో (పుట:113) గూఢార్థాల్ని గుప్పించారు.

గాలివీచేది ఎందుకో?
కవిత పూచేది ఎందుకో?
మేఘం కురిసేదెందుకో?
కోకిల పాడేదెందుకో?
తరులు పండేది ఎందుకో?
నీరధి నిలిచే దెందుకో?
అందుకే నా జీవితం!
అందరిదీ నా జీవితం!

అని తన మానవ జీవిత పరమార్థాన్ని వివరించారు.

ఇలా రకరకాల భావాలతో అనేక లలిత గీతాల నల్లిన డా.తిరుమల శ్రీనివాసాచార్యగారు కూడ విస్తార ప్రవాహంలో తానూ ఒక తరంగంలా నిలిచారు.

ఇంకా లలితగీత విస్తార క్రమంలో శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మగారి "పొగడపూలు", ఎం.కె. రాముగారి "గీతారామం", పాలగుమ్మి విశ్వనాథంగారి "అమ్మదొంగా", పి.బి. శ్రీనివాస్‌గారి "ప్రణవం", చొడూరి గోపాలరావుగారి "మల్లిపాటలు", మలయశ్రీ గారి "రాగవల్లరి", "రాగశిఖ", గిడుగు రాజేశ్వరరావుగారి "రాగవీచికలు", కోకారాఘవ రావుగారి "నవ్యశిల్పి", వై. హరేరామమూర్తిగారి "స్వరలహరి", సుద్దాల అశోక్ "బతుకు పాటలు", వోలేటి పార్వతీశంగారి "ఊహనుంచి ఊపిరికి", శేషం లక్ష్మీనారాయణాచార్యగారి "స్వరభారతి", వై.రామకృష్ణారావుగారి "రాగధుని", కొరుప్రోలు మాధవరావుగారి "రాగధార" శ్రీమతి శారదా అశోకవర్ధన్‌గారి "భావరాగిణి", డా.ఎం. పద్మినీ దేవిగారి "స్పందన", మల్లాది అలివేలుమంగగారి "గేయమురళి", లక్ష్మిగారి "హృదయరవళి" మొదలగు ఆధునిక లలితగీత సంపుటాలు అనేకం వెలువడ్డాయి. సమకాలీన ఆధునిక రచయితల లలితగీతాలపై మరొక ప్రత్యేక పరిశోధనా సిద్ధాంత వ్యాసం రావలసిన ఆవశ్యకత వుంది. పైగా ప్రస్తుత 'విస్తార' విభాగ పరిధి యిప్పటికే మించిపోయినందున పైన పేర్కొన్న గేయ సంపుటాల్ని లోతుగా పరిశీలించి చర్చించలేకపోతున్నాను. అయినా 'ప్రసార' విభాగంలో ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రసారమైన గీతాల గూర్చి మున్ముందు ప్రస్తావిస్తాను.



# 7. లలితగీత ప్రసారం

మొట్టమొదట గీతాలు పత్రికాముఖంగా ప్రచారంలోకి వచ్చాయి. ఆ తర్వాత ఆకాశవాణి ప్రసారం ద్వారా అశేషంగా శ్రోతల నాకర్షించాయి.

ద్రావిడ భాషలైన తెలుగు, తమిళం, కన్నడం, మలయాళ భాషాగీతాల్ని వివిధ నాటకాల్ని ప్రసారం చేయడానికి ప్రప్రథమంగా 16.6.1938లో 'ఆకాశవాణి' మద్రాస్ కేంద్రాన్ని ప్రారంభించారు. అందులో తొలిసారిగా అప్పటి బ్రిటిషు గవర్నరగు 'లార్డ్ఎర్స్‌కిన్' ప్రారంభోత్సవ సందేశాన్ని ప్రసారం చేశారు.[1]

ఆకాశవాణి మద్రాస్ కేంద్రం ప్రారంభించబడిన వారం రోజుల్లోనే ప్రప్రథమంగా ఆచంట జానకీరామ్‌గారు దేవులపల్లి కృష్ణశాస్త్రి, విశ్వనాథ, ఊటుకూరి సత్యనారాయణ, వింజమూరి వెంకటలక్ష్మీ నరసింహారావు, పిలకా గణపతిశాస్త్రి, ముద్దుకృష్ణల రచనల నుండి ఏర్చి కూర్చిన పాటలతో 'అనార్కలి' అను పాటలతో కూడిన నాటకాన్ని ప్రసారం చేశారు. అందులో సలీం పాత్రను కృష్ణశాస్త్రి గారే వేయడం విశేషం! సంగీతపు వరుసలు వింజమూరి అనసూయాదేవి, సీతలు సమకూర్చగా సమయానికి వారు రాలేని కారణాన బాలాంత్రపు రజనీకాంతరావుగారు సహకరించారు. ఈ గీతాలను వావిలకొలనులీల, సరస్వతి (పన్యాల రంగనాథరావు భార్య) ఆలపించారు.[2]

'అనార్కలి' రేడియో నాటకంలో ప్రథమ గీతంగా కృష్ణశాస్త్రిగారి

రారమ్మ రారమ్మ మందారమా!
రక్త కర వీరమా!
మాలతీ, మల్లికా, మాధవీ కన్యకా! శేఫాలికా! ॥ రా ॥
తోట తోటల నేలు మేటికాదే పిలుపు
పాటించునోయేమొ ప్రభువు లోకపు మాట!
తోటలన్నీ ముంచు మేటికాదే వలపు
దాట గలడే ప్రియుడు దానిమ్మ పూ పాట!
.................................................... ॥ రా ॥

అనే పాట ప్రసారమైనట్లుగా దానికి సంగీతంతో పాటు గాత్రం కూడా తామే అందించినట్లుగా వింజమూరి సీతగారు వివరించారు.[3]

అందులో అనార్కలి ఆడుతూ పాడే

తారుణ్యోజ్జ్వల రాజకుమారా!
త్రాగుము జీవన నవమధువు!

అనే పాటను పిలకా గణపతి శాస్త్రిగారు రచించినట్లుగా, అనార్కలి మరణించాక చివరలో ఆలపించే

---

1 *Golden Jubilee Souvenir, A.I.R. Madras 1938-1988.*

2 *బాలాంత్రపు రజనీకాంతరావుగారితో ముఖాముఖి 12.7.1997*

3 *వింజమూరి సీతతో ముఖాముఖి - 1.4.1997*

పోయినది దానిమ్మ పూవు,
తీయ తీయదనాల ప్రోవు!

అనే పాటను దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించినట్లుగా రజనిగారు వివరించారు. మొత్తానికి ఆరుగురు రచయితల రచనల్లోని మేటి పాటల్ని ఎన్నుకొని ఆయాసందర్భాల్లో వాటిని ఉపయోగించుకొని ఆచంట జానకీరామ్‌గారు 'అనార్కలి' నాటకాన్ని రూపొందించి జూన్ 1938 మూడవ వారంలో ప్రసారం చేసినట్లు రూఢి అవుతోంది. మొదట్లో గీతాలు 'లలిత సంగీత గీతాలు'గా కాక నాటక గీతాలు గానే ప్రసారమైనట్లు అవగతమవుతోంది.

ఆ తర్వాత 1939లో మద్రాస్ కేంద్రం ద్వారా ప్రసారమైన పూర్తి సంగీత నాటకం, మల్లవరపు విశ్వేశ్వరరావుగారి 'బిల్హణీయం!' దీని సంగీత నిర్వహణ శ్రీబి.వి. నరసింహారావు గావించారు. రేడియో గాయక, నటుడిగా శ్రీరజనీకాంతరావు పాల్గొన్న సంగీత నాటకం, శ్రీశ్రీ రచించిన 'మోహినీ రుక్మాంగద'! రజని తానే రచించి నాయకుడిగా పాల్గొని, సంగీతం కూడ సమకూర్చిన పూర్తి సంగీత నాటకం 'చండీదాసు'! ఇది 1941లో ప్రసారమైంది. దీనికి వాద్య బృంద నిర్వహణ శ్రీసాలూరు రాజేశ్వరరావు. కృష్ణశాస్త్రిగారి 'అతిథి శాల' (ఉమర్ ఖయ్యాం) నాటకంలో రజని సంగీతం కూర్చి గానం చేసిన పెర్షియన్ సంగీత ధోరణులకు ఆకర్షితులై బి.ఎన్.రెడ్డిగారు తాము అప్పట్లో తీస్తున్న 'స్వర్గసీమ' సినిమాకు రజని చేత 'ఓహో పావురమా!' (Middle Eastern Tune) మొదలయిన అయిదారు పాటల్ని వ్రాయించుకున్నారు. వాటికి సంగీత నిర్వహణ చిత్తూరు నాగయ్యగారు చేయడం విశేషం.[1]

లలితగీతాలు మొదట్లో 1938 నుండి నాటకాల ద్వారా, 1941-42 నుండి 'గీతావళి' కార్యక్రమాల ద్వారా, ఆ తర్వాత 1954 నుండి 'లలితసంగీతం' కార్యక్రమాల ద్వారా ప్రసారమై విస్తృత ప్రచారంలోకి వచ్చాయి.

"1954 ప్రాంతంలో 'సిలోను రేడియో' నుంచి వినిపించే సినిమాసంగీతం నుంచి మనదేశపు శ్రోతల దృష్టిని మళ్లించి, అంతకంటె ఉత్తమస్థాయిలో లలిత సంగీతం ఆకర్షణీయంగా రేడియో కేంద్రాలలో తయారు చేయడానికని మద్రాసు, విజయవాడ, హైదరాబాద్ కేంద్రాలలో రజని, బాలమురళీకృష్ణ, పాలగుమ్మి విశ్వనాథంలను లలిత సంగీత ప్రయోక్తలుగా నియమించారు. వివిధ భారతి కేంద్రాలు వచ్చే వరకు మన శ్రోతలు సిలోన్ వినడం తగ్గలేదు గాని, కవుల భావగీతాల్ని విరివిగా సేకరించడం, ప్రయోక్తలు రేడియో కేంద్రాలలో లలిత సంగీత నిర్మాణం చేయడం ఒక యజ్ఞంలా కొనసాగింది.

ఈ శతాబ్ది మొదటి నుంచీ కూడా తెలుగువారి లలిత సంగీత వాహిని రెండు పాయలలో ప్రవహిస్తూ వచ్చింది. వాటిలో మొదటిది తెలుగువారి సొంతమైన కర్ణాటక సంగీత ఛాయల ననుసరించి సాగింది, రెండవది ఇతర

1 'తెలుగులో లలిత సంగీతం' - రజని (అముద్రిత వ్యాసం)

ప్రాంతీయ సంగీత ఛాయలను యథేచ్ఛగా చేర్చుకుంటూ విస్తరించింది. అటు శాస్త్రీయ సంగీతపు విద్వత్ప్రౌఢిమనుదూరంగా వుంచి, సాంప్రదాయికమైన రాగధోరణులను రసవంతంగా స్వీకరించి, ఇటు జానపద సంగీతంలోని బాణీల కంటె పై స్థాయికి చెందిన మధ్య తరగతి సమాజపు తెలుగుజాతి నుడికారాల సొంపుతో సహజ సుందరమైన దేశి రాగాల మాధుర్యంతో కూడిన పూజాగృహపు పాటలూ, కోవెల సేవా సంకీర్తనలూ, స్త్రీల వేడుక - పెళ్లి పాటలూ చేర్చుకొని లలితసంగీతం కొత్తగా తరగెత్తింది."[1]

అందుకే తాళగతి తప్పకుండా తేలికగా రాగయుక్తంగా, రసభరితంగా పాడుకోగల ప్రతి భావగీతం లలితగీతం! "సంగీత స్వర విన్యాసంతో సశాస్త్రీయంగా పాడేది శాస్త్రీయ సంగీతం, సాహిత్య ప్రధానంగా సరళంగా పాడగలిగేది లలిత సంగీతం!" అని రజనిగారు వ్యాఖ్యానించారు.[2]

తొలినాళ్లలో 1940లో ఆచంట జానకీ రామ్‌గారి నేతృత్వంలో ఆర్. బాలసరస్వతీ దేవిగారు బసవరాజు అప్పారావుగారి

1. దిన దినమూ పాపణ్ని దీవించిపొండి!
2. కావ్య పానము చేసి కైపెక్కినానే
3. సుమ కోమల తనులీలా- కమనీయ బాలా

అనే గీతాల్ని ఆకాశవాణి మద్రాస్ కేంద్రంలో సాలూరి రాజేశ్వరరావుగారి సంగీత నిర్వహణలో పాడినట్లు చెప్పారు.[3]

మొదటి గీతం బాలసరస్వతిగారు పాడగా మిగతా రెండింటిని యస్. రాజేశ్వరరావు ఆర్. బాలసరస్వతి కలిసి యుగళంగా పాడారు.

ఆ తర్వాత కూడ బసవరాజుగారి

తలుపుతీయు నంతలోనె
తత్తర మది ఏలనోయీ?

మొదలగు గీతాల్ని కూడ ఆలపించారు. ఆ తర్వాత కృష్ణశాస్త్రి గారి

1. కోయంచు కూయకే - కూయకే కోయిలా!
   కూసి నా గుండియలు - కుళ్లి పోనీయకే!
2. ఏనాటికీ రాడు ఏలాటి ప్రియుడే
   ఈలాగు వేచి, నేనెన్నేళ్లు సైతునే?....
3. రెల్లు పూలా పానుపు పైనా
   జల్లు జల్లుగ ఎవరో పోసి నారమ్మా
   వెన్నెల పోసినారమ్మా!
4. కన్నారా నిన్ను చూడనా?
   నా మనసే చీకటైపోదా?
   నా బ్రతుకే భారమై పోదా?

---

*1. 'తెలుగులో లలిత సంగీతం' - రజని (అముద్రిత వ్యాసం)*
*2. రజని గారితో ముఖా ముఖి 12.7.1997*
*3. ఆర్. బాలసరస్వతి తో ముఖాముఖి. 26.2.1997*

అనే గీతాల్ని 1940 ప్రాంతంలో ఆకాశవాణిలో పాడినట్లు చెప్పారు. తదనంతరం వింజమూరి శివరామారావుగారు రచించిన

1. వినవే చెలీ! పిలుపు అల్లదిగో
2. నల్లని వాడా! నే గొల్ల కన్నెనోయీ
   పిల్లన గ్రోవూదుము!

అనే గీతాల్ని, శ్రీశ్రీగారి

1. పాడకోమామా! నా గుండె కుదిపే
   పాట పాడకు!

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి రచించిన

1. సృష్టిలో తీయనిది స్నేహమేనోయి
   వ్యష్టి జీవము చేదు పానీయమోయి

ఆరుద్ర రచించిన

1. చలిగాలి వీచింది-తెలవార బోతోంది
   ఇకనైన ఇలుచేరవా?
2. ఈ చల్లని రేయి తిరిగి రానే రాదు
   నీ చక్కని మోము చూడ తనివి తీరదు
3. ఒకే ఒక్కసారి ఎగాదిగా చూసి
   లెక్కలేని ప్రేమలలో చిక్కుకుంది ప్రేయసి
4. నడిరేయి దాటింది - వదిలేయి నా చేయి
   వస్తానులే రేపు ప్రియతమా!.......
5. జారచోర నీ కొరకు-జాగరము చేసితిని
   జాలమిక సేయక బేలదరిరావే?....
6. చెప్పలేదా నీతో ఎప్పుడైనా
   నువ్వే నా ప్రాణమనీ-నీ తోటిదే లోకమనీ....

అనే గీతాల్ని, దాశరథి రచించిన

1. నిండు పున్నమి పండు వెన్నెలలో
   నిను చేరగ నే నెటుల రాగలనో?...

అనే గీతాన్ని, కొనకళ్ల రచించిన

1. ముసురేసిందంటే పైనా
   అసలే మతి పోతది మామో!...
   శశి చెడినట్లుంటది లోలోనా
   ఓ ముద్దుల మామో!....

అనే గీతాన్ని ఆర్. బాలసరస్వతి గారు ఆకాశవాణిలో పాడినట్లుగా వివరించారు.[1]

1. ఆర్. బాలసరస్వతి దేవి గారితో ముఖాముఖి. 26 2.1997

1942 నుండి లలితగీతాలు 'గీతావళి' కార్యక్రమంలో ప్రసారమయ్యేవని ఆ తర్వాత హిందీ 'సుగమ్ సంగీత్'కు తెలుగులో పర్యాయపదంగా 'లలిత సంగీతం' అని రూపొందించగా అది ఆకాశవాణిలో 1954 నుండి ప్రచారంలోకి వచ్చినట్లుగా బాలాంత్రపు రజనీ కాంతరావుగారు వివరించారు. వీరు 1.7.1942 నుండి ఆకాశవాణి మద్రాస్ కేంద్రంలో నెలసరి తాత్కాలిక జీతంతో ఆ తర్వాత 8.5.1944 నుండి రెగ్యులర్ ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా ఉద్యోగాన్ని నిర్వహించారు.[1]

మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తేది 14.8.1947 అర్ధరాత్రి 12 గం. 1 ని.కు 'ట్రస్ట్ విత్ డెస్టినీ' అనే ఆంగ్ల ప్రసంగాన్ని నెహ్రూగారు ప్రధానికాగానే ప్రసారం చేశారు. ఆ తర్వాత రాత్రి 12.30 నుండి 1 గం. వరకు తమిళ, తెలుగు, కన్నడ, మలయాళ గీతాల్ని ప్రసారం చేశారు.

అందులో మొదటి గీతంగా సుబ్రహ్మణ్య భారతి తమిళంలో రచించిన 'ఆడువోమే-పాడువోమే' అనే గీతాన్ని డి.కె. పట్టమ్మాళ్ పాడగా ప్రసారమైంది. తర్వాత తెలుగులో బాలాంత్రపు రజనీకాంత రావు రచించిన

1. మ్రోయింపుము జయభేరి - వాయింపుము నగారా!...
   తేలింపుము నభోవీథిని - త్రివర్ణాంచిత పతాకా!...
   భారతదేశ స్వేచ్ఛా సూర్యునాచ్ఛాదించు రాహూచ్ఛాయ
   అంతర్ధానమాయే! అంతర్ధానమాయే....
2. ఉదయమ్మాయెను స్వేచ్ఛా భారత
   ఉదయమ్మాయెనహో!.....

అనే గీతాలు టంగుటూరి సూర్యకుమారి పాడగా ప్రసారమయ్యాయి. తేది 15.8.1947 ప్రప్రథమ భారత స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా ఉదయం 6గం.కు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించిన

ప్రాభాత ప్రాంగణాన మ్రోగేను నగారా!...
ఈ భారత భువి పొంగెను ముక్త జీవధారా!....

అనే గీతం సాలూరి రాజేశ్వరరావు స్వర కల్పనలో ఆర్. బాలసరస్వతీ దేవి పాడగా ప్రసారమైంది.

తర్వాత 15.8.1948 ద్వితీయ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా 'రజని' రచించి స్వరకల్పన గావించిన

మాదీ స్వతంత్రదేశం
మాదీ స్వతంత్ర జాతి

అనే గీతం టంగుటూరి సూర్యకుమారి పాడగా ప్రసారమైంది. ఆ తర్వాత కొన్నాళ్లకు సాలూరి రాజేశ్వరరావు గానంలో మల్లవరపు విశ్వేశ్వరరావు రచించిన

1. యాత్రికుడా! ఓ యాత్రికుడా!

.....................................................

అనే గీతం,

1. బాలాంత్రపు రజనీకాంతరావుగారితో ముఖాముఖి 12.7.1997

2. మ్రోగిందోయ్! మ్రోగిందోయ్!
భారతభేరీ మ్రోగిందోయ్
రాజ్యము లెల్ల ఒకే కుటుంబమని
రారాదికపై పోరాటములని

అనే 'రజని' గీతం ప్రసారమై ఆకాశవాణి శ్రోతల నలరించాయి.

ఆ తర్వాత ఆంధ్రావతరణం సందర్భంగా 1.10.1953 నాడు సినీనటి గాయని శ్రీమతి పి. భానుమతి పాడిన

1. పసిడి మెరుంగుల తళతళలు
మిసిమి వెలుంగుల మిలమిలలు

..................................................

2. స్వరంబెత్తి పాడరా! సోదరా!
ఆంధ్రోదయ వేళ!.................

అనే 'రజని' గీతాలు మద్రాస్ కేంద్రం నుండి ప్రసారమయ్యాయి.

ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ అవతరించిన 1.11.1956 నాడు 'రజని' రచించిన

ముక్కోటి కంఠాలు ఒక్క పొంగున ఊగాయి!
ఒక్కటే జయనాదంతో దిక్కులు మార్మోగాయి!

అనే గీతం టంగుటూరి సూర్యకుమారి పాడగా విజయవాడ కేంద్రం ప్రసారం చేసింది. అదే ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం ద్వారా రిలే అయ్యింది.[1]

నాటి ప్రముఖ గాయని, సినీనటి యస్. వరలక్ష్మి కూడా కృష్ణశాస్త్రి గారి 'గణగణ గంట....' మొదలగు గీతాల్ని ఆకాశవాణిలో పాడినట్లు, 1958 వరకు 'గీతావళి' పేరుతో కొనసాగిన లలిత సంగీత కార్యక్రమంలో బెజవాడ రాజరత్నం, మాలపల్లి సుందరమ్మ, మల్లిక్ ప్రభృతులు ప్రధానంగా ఎంకి పాటలు, బంగారి మామ పాటలతో పాటుగా కృష్ణశాస్త్రి, అడివి బాపిరాజు, బసవరాజు గార్ల గీతాల్ని పాడే వారని ఆకాశవాణి లలిత సంగీత ప్రయోక్త శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారు వివరించారు. కృష్ణశాస్త్రిగారికి గురువులాంటి వాడైన వాగ్గేయకారుడు, శ్రీ వల్లూరి జగన్నాథరావు రచించి గానం చేసిన

1. అన్నాడే- వస్తానన్నాడే!
నీ నేస్తమ్ము విడవనన్నాడే!
వలపు విస్తారమ్మని అన్నాడే!

..................................................

2. అడవిలో నా యిల్లు
అడివోడు నా మగడు
అది యేమి పర్వాలేదన్నాది!
రాకున్నా - పోకున్నా
రహదారి లేకున్నా
గోరంత చీటంపమన్నాది!

1. బాలాంత్రపు రజనీ కాంతరావుతో ముఖాముఖి. 12.7 1997

అనే గీతాలు ప్రసారమైనట్లు పాలగుమ్మిగారు వాటి వరుసల్ని కూడ పాడి వినిపించారు.[1]

15.8.1947 నాటి స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంలోనే శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి రచించిన

1. పూల దోసిళ్లెత్తరా!..........
   ......................................
2. భరతసుతా! నీ స్వప్న లోకములు.
   ఫలియించిన వోయీ....
3. ఎగిసి ఎగిసి వినువీథుల నెగురుము
   విజయ పతాకా! నవ భారత వీర పతాకా!

అనే గీతాలు ఆకాశవాణిలో ప్రసారమైనట్లుగా, ఆ తర్వాత 1950 ప్రాంతంలో ఆర్.బాలసరస్వతి పాడగా 'హేమమాలి' నాటకం ద్వారా

4. సృష్టిలో తీయనిది స్నేహమేనోయి
   వ్యష్టి జీవము చేదు పానీయ మోయి

అనే గీతం ప్రసారమైనట్లు ఇంద్రగంటి శ్రీకాంత శర్మగారు వివరించారు.[2]

ఆ తర్వాత హనుమచ్ఛాస్త్రిగారు రచించిన

1. ఓ తెనుగు దేశమా!
   నా అనుగు దేశమా!
2. నాదు జన్మభూమి కంటె
   నాక మెక్కడుంది? సురలోక మెక్కడుంది?
3. ఏ పూవు పూసినా- ఏ పాట పాడినా
   ఎందుకో ఈ హృదయమింత కలవళపడును!...
4. చక్కని చుక్కల సఖ్యము మరిగిన
   చందమామ రావోయీ!....

మొదలగు గీతాలతో పాటు 'ఎమర్జెన్సీ' సందర్భంగా అల్లిన

1. రజత గిరిని కొలువుండిన
   రస గంగాధరుని చూడు!
2. కొత్త ఆమని వచ్చెరా!
   సరికొత్త ఆశలు తెచ్చెరా!
   గుత్తముగ పొగమంచు ముసుగున
   మత్తుగా నిదురించు నేలకు ॥ కొత్త ॥

మొదలగు లలితగీతాలు ప్రసారమయ్యాయి.

ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం ద్వారా శ్రీఎం. చిత్తరంజన్‌గారు 1954 లో పాడినట్లు చెప్పిన లలితగీతాల్లో దాశరథి రచించిన

---

1 పాలగుమ్మి విశ్వనాథం గారితో ముఖాముఖి 15 3 1997

2 ఇంద్రగంటి శ్రీకాంతశర్మ గారితో ముఖాముఖి 16 7 1997

1. పూల దీపమెత్తరావె-పున్నాగవేణీ!
   జాలి మాటలాడి పోవె-సఖీ! మంజు వాణీ! ॥ పూల ॥

సి. నారాయణరెడ్డి రచించిన

1. ఏలా యీ మధుమాసము?
   ఇంకేదీ ప్రణయ విలాసము?
   నీ చూపులు వెన్నెలలైసాగక
   నీ నవ్వులు వీణియలై మ్రోగక
   మసక చీకటులు ముసిరిన నాకా
   మల్లెపూల దరహాసము! ॥ ఏ ॥
2. జాణ తనమా సఖీ?
   ఓనా పరాఙ్ముఖీ!
3. ఓహో నా కలువ కన్నెలారా!
   ఓహో నా వలపు వన్నెలారా!
   ('వెన్నెల వాడ' గేయనాటిక)

అనే గీతాలు ప్రధానంగా పేర్కొనదగినవి.[1]

## ఆకాశవాణి లలితగీతాలు :

ఒక వరుస క్రమంలో పరిశీలించి చూస్తే తొలినాళ్లలో కృష్ణశాస్త్రిగారి గేయాలే అధికంగా లలితగీతాలుగా ప్రసారమైనట్లుగా అగుపిస్తాయి. వాటిలో

1. జయ జయ జయ ప్రియ భారత
   జనయిత్రీ! దివ్యధాత్రి!
   జయ జయ జయ శత సహస్ర
   నర నారీ హృదయనేత్రి!
2. ప్రభు! ప్రభు! దీనబంధు
   ప్రాణేశ్వర దయాసింధు!
3. లేదోయి నిదురలో - లేదోయి సుగతి!
   చూడవా కనువిచ్చి చూడవా జగతి?
4. ఈ గడ్డి పూవులే- ఈ దారి పొంతనే
   అలసి పోనీవోయి దేవా! దేవా!
5. ఈ దారి నా స్వామి నడిచేనా?
   పాదాల జాడలివి విడిచేనా?
6. మ్రోయింపకోయ్ మురళి!
   మ్రోయింపకోయ్ కృష్ణ!
   తీయతేనియ బరువు
   మోయలేదీ బ్రతుకు

1 ఎం. చిత్తరంజన్ గారితో ముఖాముఖి 10.4.1997

7. రామ చరణం! రామచరణం!
రాను చరణం! మీకు శరణం!
8. నీ పదములె చాలు రామా!
నీ పదధూళులె పదివేలూ!
9. శివ శివ శివ అనరాదా
శివ నామము చేదా?
10. తెరవండీ తలుపులు! వీధి తలుపులు!
పురాణమీ దివాణం! చెడి బూజు పట్టకుండ!
11. మల్లైనమ్మా! మల్లెనే!......
......................................
దారి పజ్జను గడ్డి సెజ్జను
దాగి వుండే బీదను-నిరుపేదను!
12. శీతవేళ రానీయకు- రానీయకు
శిశిరానికి చోటీయకు - చోటీయకు
13. నదీ సుందరి-సుధా స్యందిని
నగాధీశ్వర నందినీ!
14. తోట పిలిచె-తోపు పిలిచె!
ఏటి తరగల పాట పిలిచె!
15. కడలి దరిదాకా- నడచెదముగాక!
చదలొరుగుదాకా-కదలెదముగాక!
16. ఎత్తండీ! ఎత్తరేం స్వాతంత్ర్యపు జెండా?
ఎత్తవోయ్! ఎత్తు ఎత్తు, ఆకాశం నిండా!....
17. నారాయణ నారాయణ అల్లా అల్లా!
మా పాలిటి తండ్రీ! నీ పిల్లలమేమెల్లా!
18. కొత్త కోవెల కొత్త కోవెల
నాల్గు దిక్కుల నడిమి ఈఇల
19. ఐలెస్సా అంటూనావ-అలల మీద వదలాలి!
ఓ లెస్సా అంటూ నావ- గాలి దారి కదలాలి!
20.మొయ్యిర అమ్మోర్ని మొయ్!
మెల్లగ ఆ! మెల్లగ
మేనా పల్లకి మొయ్యిర!
21. నవ్వంటే జాబిల్లి- పువ్వంటే మల్లి!
నవ్వేటి పువ్వంటే-నా చిట్టి తల్లి!

మొదలగు గీతాలు ప్రధానంగా ఆకాశవాణి శ్రోతల నిమితంగా నలరించినట్లు తోస్తాయి. పై గీతాలన్నింటినీ 'వికాసం' విభాగంలోనే విపులంగా చర్చించినందున మళ్ళీ వివరించలేదని గమనించాలి. అలాగే నండూరి ఎంకి పాటల్లో

1. గుండె గొంతుక లోన కొట్లాడుతాదీ
   కూకుండ నీదురా కూసింతసేపు
2. మెల్లంగ వస్తాది నాయెంకీ!....
   సల్లంగ వస్తాది నా యెంకీ!...
3. యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి
   యెంకి నా వొంకింక రాదోయి రాదోయి
4. వుత్త మాటలు నీవి పొమ్మందిరా!
   యెంకి - కొత్త పాటలు పాడు కొమ్మందిరా!...

మొదలగు గీతాలు ప్రధానంగా ప్రసారమైన వాటిలో వినబడతాయి. అడివి బాపిరాజుగారు రచించిన గేయాల్లో

1. రావోయి సిన్నవాడా
   మావాడ! రావోయి సిన్నవాడా!
2. ఉప్పొంగి పోయింది గోదావరి, తాను
   తెప్పున్న యెగిసింది గోదావరి
3. వెన్నెలలో వెలుగుధార
   వన్నెలలో స్నానమాడ
4. పాడకే నా రాణి - పాడకే పాట
   పాట మాధుర్యాల ప్రాణాలు మరిగెనే!...
5. పలికిస్తివయ్యా నీ బంగారు వీణా....
   ఒలికిస్తివయ్యా మా కమృతంపు వానా!....
6. ఆంధ్రుల ప్రతిభా - ఆంధ్రుల కీర్తి
   ఆఖరు కాదని - ఆరిపోవవనీ...
7. లేపాక్షి బసవయ్యా! లేచిరావయ్యా!...
   కైలాస శిఖరిలా కదలిరావయ్యా!....

మొదలగు గీతాలు ఆకాశవాణి శ్రోతల్ని విశేషంగా ఆకర్షించాయి. ఆ తర్వాత మల్లవరపు విశ్వేశ్వరరావు రచించిన గీతాలు చా వరకు ప్రసారమయ్యాయి. వాటిలో

1. ఒక పువ్వు నీ సిగకు నగయై సుమించినది
   ఒక పులక నా యెదకు నగయై భ్రమించినది
2. తెప్పవోలిక చంద్రబింబం-తేలిపోతేవుంది నింగిని
   అందులో నా ముద్దుల ప్రేయసి- వుంది కాబోలు!
3. వచ్చె చైత్ర మాసము
   వాసంత విలాసము
4 ఆరబోసిన వెన్నెలలో
   ఆడుకుందము ప్రేయసీ!

. . ..............................

మొదలగునవి శ్రోతల్ని ఆకట్టుకున్నాయి.

గురజాడ రచించిన గేయాల్లో ప్రధానమైన

దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టి పెట్టోయ్
గట్టి మేల్ తలపెట్టవోయ్

అనే గేయం ఆకాశవాణిలో అనేకసార్లు ప్రసారమైంది. 'పుత్తడి బొమ్మ పూర్ణమ్మ' మాత్రం సంగీత రూపకంగా ప్రసారమై పలువురి మన్ననలందుకున్నది.

ఆ తర్వాత రాయప్రోలు సుబ్బారావుగారు రచించిన వాటిలో-

ఏ దేశమేగినా ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనినా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

అనే మంజరీ ద్విపద లలిత గీతంగా సుమధుర బాణీలో ప్రసారమైంది. ఆ తర్వాత

శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలు పారిన భాగ్యసీమయి
వ్రాలినది యీ భరతఖండము
భక్తి పాడర తమ్ముడా!

అనే రాయప్రోలుగారి గేయం లలితగీతంగా ప్రసారమై అందరి హృదయాల్ని దోచుకున్నది! పైన పేర్కొన్న లలితగీతాలు ఆపై సినీ గీతాలుగానూ వెండితెరకెక్కాయి.

శ్రీశ్రీ రచించిన 'మహాప్రస్థానం' నుండి

1. మరో ప్రపంచం మరో ప్రపంచం
   మరో ప్రపంచం పిలిచింది!

   ............................................

2. నేను సైతం ప్రపంచాగ్నికి
   సమిధ నొక్కటి ఆహుతిచ్చాను
3. చూడు చూడు నీడలు - పొగమేడలు
   యుగ యుగాల దోపిడిలో - నరనరాల రాపిడిలో

   ........................................................

4. ఆనందం అర్ణవ మైతే
   అనురాగం అంబరమైతే
5. ఏదేశ చరిత్ర చూసినా
   ఏమున్నది గర్వకారణం?

   ................................ ...

మొదలగునవి మాత్రమే ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి.

వింజమూరి శివరామారావు రచించిన 'కల్పవల్లి' నుండి చాలావరకు గేయాలు 'లలితసంగీతం'లో ప్రసారమయ్యాయి. వాటిలో

1. ఓ నవభారత జాతిపితా!
   మానవ నుత లోకైక హితా!...
2. శ్రీపురాణధాత్రికీ! మా పవిత్రనేత్రికీ!
   భారతీయమాతకిదే వందనం! వందనం!
3. వందన మాంధ్ర మహాజననీ!........
   సుందర తర పౌరాణికావనీ!....
4. పడవ నడపవోయ్! పూల పడవనడపవోయ్!
5. చక్కని చుక్కేదిరా? ఎక్కడ కనరాదురా!
   టక్కరి పడుచేదిరా? పక్కున నవ్వేదిరా!
6. వచ్చెనోయ్ వసంతమూ!...
   విచ్చినది మల్లీలతాంతము!...
7. నల్లని వాడా! నే గొల్ల కన్నెనోయ్!
   పిల్లన గ్రోవూదుము, నా యుల్లము రంజిల్లగా...
8. ఓయి తుమ్మెదా! ఇంత మాయ చేతువా?...
   నమ్మి నాము నిన్నే మది మమ్ము మోసగింతువా?...
9. ఏలా నవ్వేద వదియేలా?
   రాలె నిదిగో మల్లెల మాలా!....

మొదలగు అనేక గీతాలు శ్రోతల్ని అలరించాయి.

శ్రీ కొనకళ్ల వెంకటరత్నం రచించిన 'బంగారి మామ పాటలు' కూడ చాలావరకు ప్రసారమైనవే! వాటిలో

1. వలచీ నాడమ్మా! మనసు
   కలచీ నాడమ్మా!....
2. రావోయి బంగారి మామా! నీ తోటి
   రాహస్య మొకటున్న దోయీ!...
3. ఏ గంటకు రమ్మంటవె కన్నెలేడి? ను
   వ్వేడ కాచుకోనుంటవె వన్నెలాడి?
4. సుక్కలన్నికొండమీద - సోకుజేసుకునేవేళ
   పంటబోది వరిమడిలో - పక పక నవ్వేవేళ
5. ఎందుకో ఈ రేయి ఇంత చల్లని హాయి
   పయన మెందాకాను బంగారి మామా?
6. ఈ యేళ మామయ్యా మా యింటి కొచ్చాడు
   ఎందుకోమరి ఎందుకో?
7. ఒంటరినై పోనా....ఈ
   ఒరు గాలిలోనదొరా!....ఓ దొరా!...

8 మబ్బులు మబ్బులు మబ్బులొచ్చినై....
తబ్బిబ్బయ్యేను నా మనసు
తళుక్కుమన్నది నీ సొగసు....
9. పట్నవాస మెందుకులే బంగరి పిల్లా! ను
వ్విష్ట పడితివా స్వర్గం భూతల మెల్లా!

అనే పాటలు పలువురి మన్ననలందుకున్నాయి. జానపదబాణీల్లో జనహృదయాల్ని దోచుకున్నాయి.

ఆ తర్వాత పైడిపాటి సుబ్బరామశాస్త్రి రచించిన 'జాతీయ భారతి' లోని గేయాలు కూడ చాలావరకు ప్రసారానికి నోచుకున్నవే! వాటిలో

1. త్రిలింగదేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్
మధురం మధురం! మధురం మధురం!
ఆంధ్రమ్మంటే అతి మధురం!
2. విశాలాంధ్రమే విరిసిందీ!
దిశాతటమ్ముల మెరసిందీ!
3. జాతి మేలు కొలిపి విఖ్యాతి గన్న మాగాంధీ!
జ్యోతివోలె వెలుగు నీకు జోహారు జోహారు!
4. జయ భారత మాతా! జైజై
జయ భారత మాతా!...

మొదలగు గీతాలు ప్రధానంగా పేర్కొనదగినవి.

బోయి భీమన్న రచించిన 'రాభీలు' లోని గేయాలు చాలావరకు ప్రసారమైనవే! వాటిలో....

1. గుండె నెవరో వుండి వుండీ
పండు వెన్నెల కాతురు
పండు వెన్నెల పరుపు మీద
పారిజాతములుంతురు.
2 ఎన్నాళ్లకు చేరితిరా!
ఈ నీ హృదయ పయోధికి!
3. ఇసుక తిన్నెల మీద వెన్నెల
పసిడి పాదాలాడెనే!...
4. నీ కోసమె యీ గానం- నీ కోసమె యీ గీతం!
నీ కోసమె ఈ నా కమనీయ కళాసర్వస్వం!
5. ఉన్నదీ! మనసున నా కొక కోరిక
...............................................
మానవతకు లోకాలను
మలచాలని వున్నది!

6. మారాలి! మారాలి! మనిషి మారాలి!
మనిషిమనిషికి నడుమ మంధరాలు తిరగాలి!
7. ఎత్తవోయీ కేల - ఈ బేల సుమబాల!
ఏ గాలి వడి తూలి ఈనేల రాలినదో!...
8. రావయ్యా! ఒకసారి, నా
నా బ్రతుకే నీ కోసము జడధారి!
9. ప్రతియింట - నీ పూజ చేయించనా?
ప్రతినోట నీ పాట పాడించనా?
10. లలిత లలిత పల్లవ నవ ఫలకముపై తేనెరాచి
అంచిత కుసుమాంకురపు-కుంచియతో బొమ్మగీచి
11. అలా చూస్తా వెవరికోసం?...
అనుసరిస్తా వెవరికోసం?....
12. మోహన రాగ రాగిణీ! మోహవాహినీ! స్నేహమోహినీ!
పూవులెన్ని వున్నగాని నీవు లేక వసంతమా?
13. చూచే కొలదీ సుందరమూ-రసబంధురమూ...
చందన శీతల మార్దవమూ...నీ చరణాబ్జ శ్రీమందిరమూ....
మాటే రసమయ మానసము - నీ పాటే ప్రణయోపాసనము!

మొదలగునవి ప్రధానంగా ఆంధ్రశ్రోతల్ని ఆనందతరంగాల్లో తేలించాయి. చివరి క్రింది గీతాల్లో పదమాధుర్యం ప్రసన్నంగా ప్రస్ఫుటమవుతోంది.

ఆరుద్ర రచించిన గేయాల్లో-

1. చలిగాలి వీచింది - తెలవార బోతోంది
ఇకనైన ఇలుచేరవా? ప్రియా?....
2. ఒకే ఒక్కసారి ఎగాదిగా చూసి
లెక్కలేని ప్రేమలలో చిక్కుకుంది ప్రేయసి
3. ఇన్నాళ్లకు మానవుడే దేవదేవుడు
విన్నారా సామాన్యుడు ఆదిదేవుడు
4. నడిరేయి దాటింది-వదిలేయి నా చేయి
వస్తానులే రేపు ప్రియతమా!
5. వేదంలా గోదావరి ప్రవహిస్తోందే చెల్లీ!
వెన్నెల వలె కృష్ణ వేణి విహరిస్తోందే తల్లీ!

మొదలగు గేయాలు మాత్రమే ప్రసారమై శ్రోతల్ని విశేషంగా ఆకర్షించాయి. స్వాతంత్ర్య సమరయోధునిగా, మహాకవిగా ఖ్యాతిగాంచి, ఆ తర్వాత ఆకాశవాణిలో ఉద్యోగ బాధ్యతల్ని నిర్వహించిన దాశరథి గారు పలుప్రసారయోగ్యమైన గీతాల నల్లారు. వాటిలో

1. మెరుపులు పూవుల దండగా
మబ్బులు మెత్తని దిండుగా

గగనము వెచ్చని శయ్యగా
హాయిగ నుందువె తారకా....

2. నీలో దీపం వెలిగించు
నీవే వెలుగై వ్యాపించు

3. కలువలరాజా! చలువల రాజా!
మమ్ము బాధించుటలో నీ కింత మోజా?...

4. భూధరమో - సాగరమో
భూతలమో - ఆకసమో
భరత ధరణి నా గృహం
భరత జాతి నా అహం

5. తలనిండ పూదండ దాల్చిన రాణి
మొలక నవ్వులతోడ మురిపించబోకే

6. మామిడి కొమ్మా మల్లియ రెమ్మా
మంతన మాడెనదే!

7. మ్రోయింపుము నవవేణువు
తీయని మోహన వేణువు

8. వెలిగించవే చిన్ని వలపు దీపం!
ఎందుకే నా మీద యింత కోపం?

9. ఒత్తవోయ్ కాహళం - ఎత్తవోయీ హలం
దున్నవోయీ పొలం - శ్రమయే మన బలం

10. మనదేశం భారతదేశం! మనరాష్ట్రం ఆంధ్రప్రదేశం!
శుభచరితా! సుగుణోపేతా! జనవినుతా! మహిమోపేతా!
మాతా! మన భారతమాతా!.....

మొదలగు గీతాలు చిరస్థాయిగా గుర్తుండిపోతాయి.

తొలినాళ్లలో లలితగీత రచయితగా మలినాళ్లలో సినీగీత రచయితగా వర్ధిల్లిన డా.సి.నారాయణరెడ్డిగారు అనేక లలిత గీతాలే గాక గేయనాటికలూ, సంగీత రూపకాలూ రచించారు.

'రామప్ప' అనే సంగీత రూపకం రచించగా అది 1959లో ఆకాశవాణి అన్ని కేంద్రాల ద్వారా ప్రసారమై అఖండ ఆదరణకు నోచుకున్నది. సంగీత రూపకానికి రచించినా, విడిగా ప్రత్యేక లలితగీతాలుగా ప్రాచుర్యం పొందిన

రాల లోపల పూలు పూచిన
రామ మందిరలీల! ఆరామ సుందరహేల!
రాలలో హృదయాలు విరిసిన
రాసకేళీశాల! ఆ రామమందిర లీల! ॥ రా ॥
నిన్నటిదా? మరి మొన్నటిదా?....
ఎన్ని జన్మల గాథ!

కళాదేవతల కడాని చూపుల
కాలం బందీ కాదా?..... ॥ రా ॥

అని రమణీయంగా సాగిన గీతం,

ఈ నల్లని రాలలో
ఏ కన్నులు దాగెనో?
ఈ బండల మాటున
ఏ గుండెలు మ్రోగునో?...

అని కమనీయంగా సాగిన మరో గీతం శ్రోతల్ని రసగంగా తరంగాల్లో ఓల లాడించింది. అలాగే ఆకాశవాణి సంగీత రూపకానికే రచించిన గోపెమ్మ గీతం,

కన్నయ్య జన్మించె విన్నావటే!
వెన్నుడై వ్రేపల్లె వెలిశాడటే!

అనేది కూడ అనేకరకాలుగా శ్రోతల్ని అలరించింది. ఆ తర్వాత అనేక సందర్భాలలో అల్లిన డా.సి. నారాయణరెడ్డి గారి గేయాలలో

1. నాగార్జున కొండలలో
రాగధునులు జాలువారె!
అమరావతి గుండెలలో
అమరకళలు సేదదీరె!
2. చుక్కలతో నొక్కసారి
సూచింతును నా కన్నియ
నల్లని వాల్జడల సందుల
మల్లియలై మొలవాలని
3. నేటి చలివేళ నన్నేల విదలించితివి?
జాణ తనమాసఖీ? ఓ నా పరాఙ్ముఖీ!
4. ఎగిసిపో! ఎగిసిపో! ఎగిసిపో!
యుగ యుగాల తమో అంధ జగతి నుల్లంఘించి
5. సాగుమా ఓ నీలమేఘుమా!
గగన వీణా మృదుల రాగమా!
6. సమైక్య భారతదేశం-ఇది సమగ్ర భారతదేశం!
నిరంతరంగా వినూతనంగా పురోగమించిన మహేతిహాసం!
7. ఎంతహాయి ఎంత హాయి! ఎచటిదీ వింతగాలి?
వాడిన మదిలో కోటి పరిమళాల రాసకేళి!
8. చిరునవ్వును పలికించే స్వరకల్పన లెన్నెన్నో...
హృదయాలను ఒలికించే మృదు చిత్రనలెన్నెన్నో...

మొదలగునవి లలితగీతాలుగా ప్రసారమై పలువురి ప్రశంసలందుకున్నవి నార్ల చిరంజీవి రచించిన వాటిలో

1. తెల తెల వారకముందే
కోవెల గడి తీయకముందే
ఎదలోపలి సొదలేవో వినుకోనీ! వినుకోనీ!...
మంచు ముసుగు తొలగించక ముందే
మల్లియ నవ్వులు కురియక ముందే
...................................................... ॥ తె ॥

(ఫిబ్రవరి 1969లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)

2. తెల్లవారక ముందె మేలుక
ఎల్ల వారలు పాడుచుందురు
వేదగాన సమాన నామము
కృష్ణ కృష్ణా! మాధవాయని

3. మంచి గంధము చెక్క మా ఊరు
చూడ వస్తిర మీరు శుభము పలికేరు
మల్లెపువ్వుల బోలు మా మంచివూరు
కల్ల కపటం నాస్తి - కనికరం మా ఆస్తి!

అనేవి లలితగీతాలుగా ప్రసారమై శ్రోతల్ని అలరించాయి.
శశాంక రచించిన లలిత గీతాల్లో

1. నేల నవ్వుతోందా? రాగాల రువ్వుతోందా?
పూలకారు పుడమిపైన యాత్ర సాగుతోందా?....

(మార్చి 1969లో 'ఈ మాసపు పాట' గా ప్రసారితం)

2. సాగాలిరో నేడు చక్కగ దేశం
చాటాలిరో యన్న శాంతి సందేశం

3. తోడెవరూ లేరా? సరి జోడెవరూ రారా?
పంజరాన బందీవై పలవరించే చిలకా!

4. నడిపించవో తండ్రి! నడిపించవో?
నాపై దయా వృష్టి కురిపించవో?...

5. కారుమబ్బు పట్టాలీ! హోరుగాలి రేగాలీ!
తొలకరించి నింగి - నేల పులకరించగా...

6. శిరసెత్తు గగనమ్మదాక - చిరయశము దశదిశలప్రాక
ఓ భారత పతాక-ప్రాగ్దిశా సౌభాగ్య రేఖ!

7. ఏమి చిత్రమేమిచిత్రమీ చైత్ర విలాసమహో!
ఇతర ఋతుచ్ఛాయ కూడ ఈ వసంతమందెతోచు!

8. రావమ్మ స్వాతంత్ర్య భారత సవిత్రీ!
రమ్మహో! శాంత సంగీత శుభగాత్రీ!

మొదలగు గీతాలు ప్రసారమైన వాటిలో ప్రధానంగా పరిగణనలోకి వస్తాయి. అక్కడక్కడ వీరి గీతాల్లో కృష్ణశాస్త్రిగారి ఛాయలు అగుపిస్తాయి.

కందుకూరి రామభద్రరావుగారు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో పనిచేస్తూ పలు పసందైన గేయాలల్లారు. 'గేయమంజరి' గా గేయసంపుటిని వెలువరించారు. ఇందలి గీతాలనేకం లలిత సంగీత కార్యక్రమాల్లో ప్రసారమయ్యాయి. వాటిలో-

1. ఎంత చక్కనిదోయి ఈ తెలుగు తోట!
   ఎంత పరిమళమోయి ఈ తోటపూలు!
2. ఆపరా ఒకసారి ఆ మురళి రవము!
   తీపివేదన నింక ఓపలేనుర కృష్ణా!
3. ఓ వసంత ప్రియా! ఒక కౌగిలింతకే
   ఒడలంత పులకింప, ఎడద కింతటి పొంగు!
4. ఈ వసంతుని రాకతో - ఈ వనేందిర బ్రతుకులో
   ఏదో ఒక చైతన్య మేరుగ ప్రవహించెనే!...
5. ఓపలేనే మనసు ఓ మల్లెపూవ!
   దాచలేనే వలపు వేచు నాయెదలోన!
6. పవ్వళించిన దోయి-పాపాయి తొట్టిలో
   పాలబుగ్గల మిసిమి పూలు పూచినవోయి!
7. ఎంత చిత్రము స్వామి ఈ పడవ నడక
   బ్రతుకు సంద్రము పైని పయనించు నెచటికో?
8. పసిడి కిన్నెర వీణ పాడుకొను చున్నావు!
   పసనెరుంగని నేను పలికింపనేలేదు!
9. భారత జనయిత్రీ! హే భారత జనయిత్రీ!
   హే బుధ సన్నుత గాత్రీ! భారత జనయిత్రీ!
10. మా పురాణధాత్రివమ్మా! మహిమాన్విత చరితవమ్మా!
   నీ పద కంజాతములకు నిఖిలలోక పూజలమ్మా!....

మొదలగు గీతాలు రసవంతములై రసజ్ఞుల మనసుల్ని ఆనందింపజేస్తాయి.
ఆ తర్వాత జె.బాపురెడ్డిగారు రచించిన గేయాల్లో

1. నీ మాట నా నోట పలికించవా స్వామి?
   నీ కరుణ నా మీద చిలికించవా స్వామి?
2. ఓ నిమీల నేత్రీ! ఓ ప్రమీల గాత్రీ!
   వచ్చావా నా వలపు తోటకు?
3. ఏడుకొండల మీద ఏమున్నదో కాని
   నా గుండె అచటనే నాటుకొని పోయింది
4. ధరణీ ధరము నీవురా! ధరాధరము నేనురా!...
   నాకు పీఠము నీవు - నీ కిరీటము నేను
5. కొమ్మలలో కోకిలమ్మ కుహూకుహూమన్నదే!
   నిన్ను నన్ను జంటకూడి నేడే రమ్మన్నదే!
6. చెలియ పంపె ఒక పత్రం-దాని వెంట తన చిత్రం!
   చిత్రంలో పత్రంలో చిత్రించిందొకటేను

7. నా దేశం నవ్వుతూంది నందనవనంలా
నా దేశం నవ్వుతూంది నాదస్వరంలా
('ఈ మాసపు పాట' గా ప్రసారితం)
8. భూదేవి పిలిచింది పేదోళ్లను
శ్రీదేవి వలచింది లేనోళ్లను
9. ఈ దేశం మనదేశం ఎంతమారిపోయెరా!...
ప్రజలు కన్న కలలెన్నో నిజాలు అయిపోయెరా!...
10. ఎగిసిపోయే నా హృదయమా! ఎంతదూరము పోదువే?
ఈ దిగంతాలన్ని దాటి ఏ జగాలకు పోదువే?
('ఈ మాసపు పాట'గా ప్రసారితం)
11. వచ్చింది వచ్చింది వాసంతము!
వాసంతమూ-విజయ భాస్వంతము
12. ఇది మన భారతదేశం-ఎంతో సుందరదేశం
కలలు పంటలై పండే కర్మభూమి యీ దేశం
('ఈ మాసపు పాట'గా ప్రసారితం)

మొదలగు గీతాలు ఆకాశవాణిలో ప్రసారమై శ్రోతల్ని ఆకట్టుకున్నాయి. వక్కలంక లక్ష్మీపతిరావు రచించిన వాటిలో

1. వికసించె మల్లీ లతాంతము
పరిమళించినది నా స్వాంతము
2. మతం పేర కులంపేర-మనసంతా విషమైతే
మానవులను దానవులుగ మార్చివేయు మతమెందుకు?
3. భారతీయ సోదరా! వీరశంఖ మూదరా!
కర్మభూమి మనదిరా! ధర్మభూమి మనదిరా!...
4. మ్రోయింపరా మురళి మ్రోయింపరా!...
మోడు బ్రతుకుల పూలు పూయింపరా!...
5. పూవూపూసి విరిసననాడే-బృందావని విరబూసేది
మనసూ మనసూ కలిసిననాడే మానవలోకం మురిసేది

మొదలగు గీతాలు ప్రసారమై పలువురినాకర్షించాయి.

ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రంలో లలితసంగీత ప్రయోక్తగా పనిచేస్తూ 'అమ్మదొంగా'...అనే గేయసంపుటిని శ్రీపాలగుమ్మి విశ్వనాథంగారు రచించి ప్రచురించారు. ఇందలి గేయాలు చాలావరకు ముందే ఆకాశవాణిలో ప్రసారమై ప్రాచుర్యం పొందాయి. అందులో

1. అమ్మదొంగా! నిన్ను చూడకుంటేనాకు బెంగ!...
కొంగట్టుకుతిరుగుతూ-ఏవో ప్రశ్నలడుగుతూ...
2. కొమ్మా రెమ్మా ఊపేనే ఉయ్యాల
బంగరు బొమ్మా నీకేనే యీ జోల

3. కలవరమెందుకు? కలతను చెందకు!
మరు దినమున నీమనుగడెటులని-
4. కోసి కొమ్ము ఈ కుసుమము-వేచివుంది నీ కోసము!
చేసితివా ఆలస్యము, ఎపుడు రాలునో ఈ సుమము!
5. పంట చేల గట్ల మీద తెరగాలి!
ఊహలేమో రెక్కలొచ్చి ఎగరాలి!
6. ఎంత సుందరమైనదీ జగతీ!
భగవాను డొసగిన బహుమతీ!...
7. అరెరే లేవండిరా! అరెరే రారండిరా!
తొరతొరగా పోతోంది కృష్ణమ్మా!...
8. ఆ మాట వింటే...ఆదారి వెంటే
మనము పోతిమంటే, బంగారపు పంటే!...

మొదలగు గీతాలు శ్రోతల హృదయాల్ని దోస్తాయి. మొదటి రెండు గీతాలు మంచి జోలపాటలుగా నిలుస్తాయి.

ఆకాశవాణి విజయవాడ కేంద్రం ఉద్యోగియైన శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మగారు సుకుమార భావాలతో సుందర పదబంధాలతో అనేక లలిత గీతాలల్లారు. వాటిలో

1. శ్రుతి చేసిన వీణయిదే
సుధలొలికే గాన మిదే
ఆలపించు ప్రియతమా!
2. గడపలోనే ఆగి కలియ జూచేవేర!
కదలి నా దరిజేరి కౌగిలీయగ రార!
3. తనువే వేణువుగా-తలపే రాగముగా
ఒదిగే భావనలోనే మెదిలే గీతికవో
4. తరలిరావ మెరుపులా-మరుని హాస రేఖలా...
నీవె రాగాల తూగాడు వీణలా...
5. హేమంతపు వాకిటిలో పూచిందొక బంతి!
పుట్టింటికి పిలుపొస్తే కులికిందొక యింతి!
6. ఆకాశ వీణపై ఉదయరాగం!
హృదయాకాశ వీణపై ప్రణయరాగం!
కనగలిగే కనులుంటే-వినగలిగే మనసుంటే
7. తేనెల తేటల మాటలతో-మన
దేశమాతనే కొలిచెదమా!...
8. ఏలతొందర గాలికి - ఈ వేళ విరియు సుమాళికి?
చివురు బంతుల పల్లకిని విచ్చేయు నవమాధవునికి!
9. ఎత్తండీ కేతనం-త్రివర్ణకేతనం!
స్వాతంత్ర్యోద్యమ దీక్షా పూర్ణ సుధానికేతనం!

మొదలగు గీతాలు ప్రసారమయ్యాయి. 5, 6, 8 గీతాల్లో పదగుంభనం మరీ మార్దవంగా సాగింది.

ఈ సిద్ధాంత వ్యాసకర్తయైన వడ్డేపల్లి కృష్ణ రచించిన వాటిలో

1. కనరా నీ దేశం! వినరా సందేశం!
   నిత్యము దారిద్ర్యమ్మే నర్తించెను నేడు
   సత్య, శాంతి, సంపదలను స్థాపించగ చూడు!
   (జనవరి 1969లో ప్రసారితం)
2. జగతి రథం జైకొడుతూ - ప్రగతి పథం పై పోనీ!
   ప్రగతి పథంపైన జగతి-పండు వెన్నెలై రానీ!
   (1972లో 'ఈమాసపు పాట'గా ప్రసారితం)
3. అంతులేని ఆశలున్న అంతరంగమా!
   ఊహలలో దేలుతున్న ఓ విహంగమా!
   (1973లో 'ఈమాసపు పాట'గా ప్రసారితం)
4. తేనెలొలుకు తెలుగుపాట పాడుకొందునోయీ
   తెలుగుతల్లి ఒడిలోపల ఆడుకొందునోయీ
5. మళ్లీ జన్మించు ప్రభూ! మానవ కల్యాణముకై
   మమ్ముల దీవించు ప్రభూ! మానవతా సాధనకై
   (12/1983లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
6. పాడయి పోతున్నదోయి-పరిసర వాతావరణం
   మార్చుకో యికనైనా మసలే నీ ఆవరణం
   (12/1986లో 'ఈమాసపు పాట'గా ప్రసారితం)
7. కదలిరావే కారుమేఘమా! వ్యథలుబాపే వరుణరాగమా!
   ఉరుముల సంగీతముతో-మెరుపుల సంకేతముతో...
   (6/1987లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
8. రాగరంజిత ఉషోదయం! రమ్యపులకిత రసోదయం!
   కర్మసాక్షిని కనులగాంచిన-కమలకాంతకు నవోదయం!
   (2/1989లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
9. దివ్యమైన మానవతా దీపికల్ని వెలిగిద్దాం!
   అంధకార అసురత్వపు ఛాయలన్ని తొలగిద్దాం!
   (11/1993లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
10. ద్వేషమే విడనాడితే యీ దేశమే నవనందనం!
    ప్రేమతో మనగలిగితే నీ హృదయమే శ్రీ చందనం!
    (8/1993లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
11. ఎద ఎదలో మానవతా మధురస్వరం పలకాలి
    నలుదిశలా దానవతా దౌర్జన్యం అణచాలి!
    (1994లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)

12. మనమంతా ఒక్కటనే-మంచి మనసు పెరగాలి
జగమంతా ఒక్కటనే-మంచి రోజు రావాలి!

(ఆకాశవాణి అన్ని కేంద్రాలద్వారా 9/1995లో ప్రసారితం)

మొదలగు గీతాలు ప్రసారమైన వాటిలో ప్రధానంగా నిలిచి, పలువురి ప్రశంసలకు పాత్రమయ్యాయి.

శ్రీ నెల్లుట్ల వెంకటేశ్వరరావు రచించిన గేయాల్లో

1. జీవితంలో అలసినాను
శ్రీనివాసా! పిలుచుకో!
పాపములలో వేగలేనిక
పాదముల కడ చేర్చుకో!
2. పూర్ణిమా సుధహాయి-పూర్తి వెన్నెల రేయి!
సొంపులను గని నీరు నింపెనా కనుదోయి!
3. నిండెను నీకు పదహారేళ్లు! నీపైనిలిచెను అందరి కళ్లు
దాచుకోవె నీ సొగసులను దోచుకొందురీ మగవాళ్లు
4. ఏరులన్ని వేరైనా నీరంతా ఒకటేరా!
మతం కులం వేరైనా మనుషులంత ఒకటేరా!....
5. ఆమె ఎలా కలిసిందో తెలియదు నాకు
ప్రేమ ఎలా కలిగిందో తెలియదు నాకు
తేనె బరువు మోయలేక తూగిపోవు కన్నెపూవు!
తేటినెలా మోసిందో తెలియదు నాకు!
6. మాఘ మాస మేఘమా! నీకు కూడ దాహమా?
కాలిపోవు మనసు నాది! నాకు నీకు స్నేహమా?...

మొదలగు గీతాలు ప్రసారమయ్యాయి. క్రింది 5,6 గీతాల రచన విలక్షణంగా సాగడమేగాక కడప కేంద్రంనుండి ఈ మాసపు పాటలుగా 1982లో ప్రసారమై శ్రోతల నలరించాయి.[1]

ఆచార్య తిరుమల రచించిన గేయాల్లో అనేకం ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. వాటిలో

1. అంజలిదే జననీ! కుసుమాంజలిదే జననీ!...
దేవీ! నవ విధ రూపిణి నళిన లోచనీ!....
2. ఏ గీతము నే రీతిగ వినిపించెడుదాన?
నీవు లేక పలుకలేదు నా మానసవీణ!
3. ఎంత కొంటెవి! కృష్ణా! ఎద చేకొంటివి!
రాస కేళికా రాననుకొంటివి!
4. కోయిలా! వనరాణీ! ఎందువే నామాట?
మల్లెలు మొల్లలు మంచి గంధాలు-మలయా నిలము

('ఈ మాసపు పాట'గా ప్రసారితం)

1 ఆకాశవాణి ప్రయోక్త శ్రీ కలగా కృష్ణమోహన్‌తో ముఖాముఖి, 26 8.97

5. రావె ప్రియ రాధికా! రాసరాగ మాలికా!
ఏదీ నీ మధుర సుధాకిరణ వదన దీపిక?
6. వెలిగించు శాంతి దీపం ప్రతి హృదయంలో
ప్రభవించు దైవరూపం ప్రగతి పథంలో
7. దేశము మీదై, తేజము మీదై-ఒకటిగ వుంటే చాలదా?
ప్రగతిని కోరే భారతమంతా వెన్నెల పూతగ మారదా?
8. పూనరా దీక్ష! ఇది మానవతకే పరీక్ష!
కడలిముంచిన పుడమిఅంచున పసిడి వెలుగులు పూయగా
('ఈ మాసపు పాట'గా ప్రసారితం)
9. ఈ ఉదయరాగమందేదో మును చూడని మెరుపు!
నా హృదయంలో ఏదో ఒక కమ్మనైన పిలుపు!
('ఈ మాసపు పాట'గా ప్రసారితం)
10. నయనాలకు సుందరబిందువు ! హృదయాలకు
ప్రమోద సింధువు!
ఆ సింధువు సత్య వికాసం ! ఆ సత్యం భవ సంకాశం!

మొదలగునవి ప్రధానంగా ఆకర్షిస్తాయి. చివరి గీతాల్లో పరిపూర్ణ భావాలు ప్రస్ఫుటమైనట్లు తోస్తాయి.

శ్రీ ఎం.కె. రాము రచించిన వాటిలో

1. ఆలపించనా ఆనంద గీతి
మనసులోని మధుర గీతి
మమత లేవో కురియు రీతి
2. విరివంటి చిన్నదాన - కడగంటి చూపుదాన
చేమంతి నగవుదాన - రాయంచ నడకదాన
నడిచే తీవెవు నవ్వుల పువ్వువు నీవే!
మెరిసే కన్నుల జిలుగు వెలుగువు నీవే!
3. నాట్యమాడవే! నవమోహినీ!
నగుమోముతో నవభంగిమతో
నటరాజు మనములు రంజిల్లగా...
4. క్రొత్తగళం తెచ్చుకోనా! సరి
క్రొత్త పాట పాడుకోనా!
మంచిని పెంచాలనీ-మమతను పంచాలనీ...
5. విరిసింది ఒక మల్లి పూదోటలో...
మరులెన్నో వెదజల్లి ఎలతేటిలో...
6. పది మంది నడిచేది ప్రగతిబాట
ప్రతినోట పలికేది ప్రజలపాట

7. ఆశయమే జీవితానికి గమ్యం
సాధనమే విజయానికి సోపానం
8. రాగమా! ఇది అనురాగమా!
నా గొంతులో పల్లవించేది....

అనే గీతాలు ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. లలిత లలిత పద బంధాలతో శ్రోతల్ని అలరించాయి.

ప్రత్యేకంగా గేయసంపుటి వెలువరించకపోయినా, కొత్త ఒరవడితో కోపల్లె శివరాంగారు కూడ అనేక గీతాల్ని అల్లారు. వాటిలో

1. పరిమళించే మనసువుంటే, విరులు పూయగ నేటికి?
మత్తు గొలిపే మాటలుంటే, మత్త కోకిల లేటికి?
నందనాలే నవ్వులైతే, నవవసంతాలేటికి?
2. ప్రణయానికి చల్లదనం-విరహానికి వెచ్చదనం
పంచి యిచ్చే వెన్నెలా! నీకున్నవి సమశీతోష్ణపు కన్నులా?
3. అంబరాన సంబరాన విహరించే జెండా!
కర్మ ధర్మ సూత్రాలు అండ నిలిచి వుండా!
విస్తరించు మువ్వన్నెలు విశ్వంభర నిండా!
(1/1973లో 'ఈమాసపు పాట'గా ప్రసారితం)
4. ఇది చల్లని తల్లిరా! అనురాగ వల్లిరా!....
భోగభాగ్యాల పసిడి సిరుల చల్లురా!...
5. ఈ గోడ పగుల గొట్టు! సరికొత్త మేడ కట్టు!
6. సుమవనిలో...రసధునిలా...
గుండెలో నిండుగా...వుండనీ వుండనీ!...
(1/1982లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
7. ఎప్పుడైనా ఎదురొస్తే, ఎవరు నువ్వు అనకు!
గతమంతా గుర్తొస్తే, అదిరి కలత పడకు!
(6/1982లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
8. మగ: మానసవీణను మ్రోగించు! మదిలో మమతలు కురిపించు
కాటుక కన్నుల వెలిగించు! చీకటి తెరలను తొలగించు
ఎందుకనీ? ఎందుకనీ?
ఆడ : రేపటి వెన్నెల విందుకనీ!....
(8/1985లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
9. ఎందుకే వచ్చావు ఓ కోకిలా?
ఏమి తిని వచ్చావు వేపాకులా?
10. ఏడుకొండలపైకి ఎక్కాలి! ఎంకన్న పాదాల మొక్కాలి!
గోవింద నామాల పలకాలి! పిలుపులో ఆ సామి కులకాలి!

మొదలగు గీతాలు ప్రసారమై గుండెల్లో నిరంతరం గుర్తుండేలా చేశాయి!

లలితగీతాలు చాలా తక్కువే వ్రాసినా, గుంటూరు శేషేంద్ర శర్మగారు రచించిన వాటిలో

1. గాలి పూల పరాగము మేన పులుముకున్నది!
   ఎద ఎదలో అనురాగము ఎంతో అలుముకున్నది!
2. విసిరేసెను తూరుపు శుక్రతారను!
   పోదాం పద అడవుల్లో పూవులేరను!
3. వచ్చాయి పూల బంధువులు
   తెచ్చాయి తేనె బిందువులు

అనే గీతాలు ప్రసారమై విశిష్ట భావాల్ని వెదజల్లాయి!

మంచి కథకుడిగా ఖ్యాతిగాంచిన మధురాంతకం రాజారాం కూడ కొన్ని మధురమైన లలితగీతాలల్లారు.

1. కలగంటినీ! నేను కలగంటినీ!...
   కలలోన తల్లినీ కనుగొంటినీ!....
2. ఏడే అల్లరి వనమాలీ? నను వీడే మనసున దయమాలీ!...
   నంద కుమారుడు, మురళీలోలుడు-నా గోపాలుడు ఏడే ఏడే?
3. జయ మంగళాకార! జయసుందరాకార!
   జయము శ్రీవేంకటేశ! జయము జయము శ్రీనివాస!

అనేవి ప్రసారమైన వాటిలో ప్రధానంగా నిలుస్తాయి.[1]

డా. అలుకా జైహింద్ రెడ్డి రచించిన గేయాల్లో

1. త్యాగం పెంచిననాడే-అనురాగం పంచిననాడే
   మనిషికి మనిషే మాధవుడు! మరపురాని మహనీయుడు!
2. తలిదండ్రులు భారమని తనయులారా విడవకండి!
   శేష జీవితం వారిది శాంతితోడ గడపనీండి!
3. ఇదే ఓ జాతీయపతాకం- ఇదే మన జాతి కీర్తిగోపురం!
   తల్లి భారతికి పింగళి వెంకయ్య అల్లిన గులాబి మల్లెలహారం!
   (జనవరి 1986లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
4. కాషాయంలో కలడు రాముడు-కలడు తెలుపులో క్రీస్తు దేవుడు
   ఆకుపచ్చలో అల్లాకలడు-ఆరాతీస్తే అందరొక్కటే
5. ఈ దేశం నీదీ నాదీ, భారతీయులందరిదీ!
   ఎద ఎద ఏకత భావం కుదిరిన పదిలం దేశం!
6. ఉరకలేల ఓ నదీ? ఉప్పునీట చేరగా!
   పైరు పాపలెన్నో నీ పాల ఒడిని కోరగా!.....
7. రామాయణంలో అగ్నిప్రవేశం-మహాభారతంలో వస్త్రాపహరణం
   మధ్యయుగంలో సతీసహగమనం-నేటియుగంలో కట్నాలదహనం
   నాతికంట తడి జాతికరిష్టం! ప్రతియుగాన పడతికేనా కష్టం-నష్టం?

---
1. ఎం. చిత్తరంజన్, కలగా కృష్ణమోహన్‌లతో ముఖాముఖి 27.8.1997.

8. ఎక్కడో గ్రంథాలలో వెదకనేల నీతులకై?
ప్రకృతిలో ప్రతి ఒక్కటి పలుకగా' సుభాషితమై!
9. సౌశీల్యమె మా హృదయంగా - సాహసమే మా ఊపిరిగా
తల్లి భారతిని పూజిస్తాం! ఎల్ల జగతిని సేవిస్తాం!

మొదలగు గీతాలు ఆకాశవాణిలో ప్రసారమై వివిధ కోణాల్లో శ్రోతల్ని అలరించి సనాతన సంప్రదాయంలోనే అధునాతన భావాలకు అద్దం పట్టాయి.

డా.బి.ఆర్. శాస్త్రిగారు రచించిన వాటిలో

1. మరచితివా నను పరమేశ్వరి! కరుణ చూడ రావా శంకరి?
భూగోళం, గగనం, దివమూ, చంద్ర,సూర్య,తారాగణమూ..
ఆటబొమ్మలివి నీకమ్మా! తెలియగలరె నీదు మహిమా!
2. అదిగదిగో సంధ్యారాగం! విరజిమ్మెను హృదినిపరాగం!
మ్రోగిందా అంబర రంగం! తూగిందీ భావతరంగం!
3. ఏల యిద్దరి మధ్య ఆ తెర?
ఎందుకోయీ నాకు యీ చెర?
4. ఎపుడూ నా హృది నీ భావనలే! ఆరని మమతగ వెలుగునులే!....
మబ్బు తెరలు విడగానే చంద్రుడు-కలువ కన్నెతో నవ్వునులే!...
5. విజయతాం స్వతంత్ర భారతం!
విజయతాం అఖండ భారతం!
శీతశైల వప్రముకుట రత్నాకర వలయపాలితం!
6. భజరే మానస పరమాత్మానాం!
కరుణాకరమపి ఖలజన హరణం!
గుణవిరహిత మపి సుగుణా భరణం!

మొదలగు గీతాలు ఆంధ్ర శ్రోతల్ని అలరించాయి. గీతాల్లో సంస్కృత పల్లవుల్ని సంధించటం వీరి ప్రత్యేకతగా నిరూపించాయి[1]

1969 ప్రాంతంలో బి. వసంతపాడగా ప్రసారమైన జి. విద్యాసాగర్ రచించిన

1. గాలికి ఊగే తీగల్లారా!...
పక్కున నవ్వే పూవుల్లారా!...
చూశారా మా మోహన మూర్తిని?
2 ఏది స్వామీ! ఏది స్వామీ!
ఊదు మొకపరి మరల మురళీ!...

అనే లలితగీతాలు శ్రోతల నెంతో ఆకర్షించాయి

అలాగే, పి.వి.రోహిణీ కుమార్ (భావనా చారి) రచించిన వాటిలో

1. వేయి తీయని భావనలు-ఈ రేయి విరిసినవే చెలీ!..
హాయిగా అందాల వన్నెలు-అనుభవించే మా మరీ!.

1 ఎం. చిత్తరంజన్ గారితో ముఖాముఖి. తేది 28 8 1997

2. పాడవే కోయిలా!...పాడకపోతే ఈ వేళా
మోడులు వారిన హృదయవనాలు - ముదమున చిగురించేదెలా?
3. మేలుకోరా! మనిషీ మేలుకో!....
4. కలకాలం ఈ విధం కాదోయీ జీవితం!
ఏదో ఒకనాడు వసంతం నీదారిని నిలుచునోయి. ఇదితథ్యం!

మొదలగు లలిత గీతాలు ప్రసారమై పలువురి నలరించాయి. చివరి గీతం నిరాశాపరులలో ఆశల్ని చివురింపజేస్తుంది.

పులికంటి కృష్ణారెడ్డి రచించిన గేయాల్లో

1. తిరుపతి పురవాసా! ఓ వేంకటేశా!
తిరిపెమ్ము నీ సొమ్ము! తిరిగి చూడరామమ్ము!
(1981లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
2. ఏ దేశం మీదంటే భారతదేశం అంటాం!....
ఏ జాతి మీదంటే భారత జాతి అంటాం!....
3. చందమామా! చందమామా! ఓ చందమామా!
రాక రాక వచ్చింది లేనిపోని సందేహం!
తీర్చగలుగుతావేమో తిరిగి చూడు మామా!
4. పౌరులమూ!....దేశ పౌరులమూ!....
5. నీవులేవురా! నేను లేనురా!
అవనిలోన అమ్మలేని మనిషి అసలు లేడురా!...

మొదలగు గీతాలు ప్రసారమైన వాటిలో ప్రధానంగా గుర్తుకు వస్తాయి. లలితగీతాలు తక్కువే వ్రాసినా కొన్ని గుర్తుండే పాటల్ని డా.వేటూరి ఆనందమూర్తి గారు రచించారు. వాటిలో

1. ఎవరికున్నది ఎవరికున్నది ఎవరికున్నది ఇంత శక్తి?
ఓ మహాత్మా! ఓ మహామహితాత్మ గాంధీ!
శాంతి, అహింసలె శ్వాసములుగా-నిత్యప్రార్థనయె తపమ్ముగా
సత్యసాధనలోనె జీవన సారములు వడబోసి చూపగ ॥ఎవరి॥
(10/1974లో ఈ మాసపు పాటగా ప్రసారితం)
2. ఈ తరం మారిందిరా! అంతరం లేదందిరా!....
నవ సమాజం, సమ సమాజం నాంది పాడిందిరా!...

అనేవి మాత్రం ప్రధానంగా దృష్టినాకర్షిస్తాయి.

రచయితలేగాక కొందరు రచయిత్రులు కూడ లలితగీతాలు మృదు మధురంగా రచించారు. వారిలో జొన్నవాడ రాఘవమ్మ గారొకరు. జొన్నవాడ రాఘవమ్మ రచించిన వాటిలో

1. పిల్లన గ్రోవి మెల్లన వూది-ఉల్లము దోచినదెవరో?
కనివిని ఎరుగని కమ్మని పిలుపుతో-కన్నులు మూసిన దెవరో?

2. చెలీ! ఒక మాటు పలికితే ఒలుకునా ముత్యాలు?
ఒక మాటు నవ్వితే తరుగునా చిరునవ్వు?
ఒయ్యారముగ నడచిన వలపంత ఒలికించి ॥ చెలీ ॥
3. శ్రీ శేషాచలవాసా! దయచూపరా వేంకటేశా!
అశ్రిత జన దీనరక్ష! దేవా! అమర వినుత శేషశయనా!....
4. సంక్రాంతి శ్రీలక్ష్మి వచ్చిందోయ్! సస్యముల సంపదల తెచ్చిందోయ్
స్వాగతమ్మని చెలులు పాడండోయ్! సన్నజాజుల పరుపు పరువండోయ్
5. నమో నమో ఉమా! లోకమాతా! కాత్యాయని!
త్రిపుర సుందరీ బాలా! కౌమారీ! రాజేశ్వరీ!
కోమల శ్యామల రూపిణీ! శర్వాణీ!
6. నవ్వకే నెలవంక నవ్వకే! చల్లని నీ కాంత జగతిపై ప్రసరింప
చక్రవాకపు జంట చెలరేగింది మింట,
మిసిమి వెన్నెల సోన వసుధపై కురిపింప
7. ఎవరు పెంచిన కల్పతరులివి! ఎవరుతీర్చిన సోయగములివి?
ఎచట చూచిన ఊహకందని అందమే కనువిందుచేసెను?
8. నిన్ను కానని కనులునాకు ఉండినను ఫలమేమిరా?
ఎన్ని దినములు నీదురాకను ఎదురు చూతుర మాధవా!

మొదలగు గీతాలు ప్రసారమైన వాటిలో పసందుగా తోచి, వీనుల విందు ిస్తాయి.

శ్రీమతి గంగరాజు సుశీలాదేవి రచించిన

1. వెళ్లి రావే తల్లి గౌరీ! వెళ్లి రావే మళ్లి మళ్లీ!
వత్సరమ్మున కొక్కమారు వచ్చి ఉత్సవములను సేయవె!
2. దసరా యిది దసరా! దేశం దశదిశలా రకరకాలా
వినోదాల విలసిల్లిన సరదా! ఇది దసరా!
ఒకచో బొమ్మల కొలువులు! ఒకచో జమ్మికి పూజలు!
3. బ్రతుకంతా ఇది నీకోసం! నా ప్రతి అడుగూ నినుచేరుట కోసం!
తనువున మనసున ప్రణయము ప్రాణము
నిలిపి నిరీక్షణ నీ కోసం!

మొదలగు గీతాలు ఆకాశవాణి ద్వారా ప్రసారమైన వాటిలో ప్రధానంగా ొర్తుంటాయి. చివరి గీతంలో సాహిత్యం చక్కగా చిక్కగా సాగింది.

శ్రీమతి కోడూరి దుర్గానాగరాజు రచించిన గేయాల్లో

1. ఈ జీవనమే దివ్య సంగీతము!
శ్రుతి లయతో గతి తప్పక సాగే
అందాల నర్తకి అభినవ నాట్యము!
2. తెలిమబ్బుల తెరచాటున వికసించిన పున్నమిలో
నీదురూపే అగుపించులే! నీ అందమే కనిపించులే!
(1986లో 'ఈ మాసపు పాట' గా ప్రసారితం)

మొదలగు గీతాలు ప్రసారమయ్యాయి. శ్రీమతి శారదా అశోకవర్ధన్ రచించిన

1. మనసాయెరా! మాధవా!....నిను చూడ
   మదిలోన దర్శించి ముదమార నినువేడ ॥మన॥
2. రామ నిన్నే కోరినాను - నీదు పాదము పట్టినాను
   వదలలేను నిదురనైన నిలువలేను నిమిషమైన
3. ఓ నా ప్రియా! గుండెలో దాగిపో!
   ఈ చక్కని చుక్కని ఏలుకో!...
4. ఈరేయి ఇలాగే నిలిచిపోని!
   ఈ బ్రతుకు నీతోనే గడిచిపోనీ!
5. నా హృదయం ఒక దేవాలయం!
   నీవే అందున వెలసిన దైవం!
6. మనసున నిన్నూ మరువగలేనూ!
   బ్రతుకున తోడై నిలువగలేనూ!
7. ఏమని తెలుపను ఈ తీపి కలయిక!
   ఎలా వుండను ఎవరికి తెలుపక?
   ఎదురుగ వున్నా బదులేరాక
   వేచివున్నా ఎడతెరిపిలేక
   ...........................................
8. కన్నులు కలిసిన వేళ-మదిలో రగిలెను జ్వాల

మొదలగు గీతాలు ఆకాశవాణిలో ప్రసారమై అందర్నీ ఆకర్షించాయి.
శ్రీమతి నాగపద్మినీ దేవి 'పద్మినీ వర్ధన్' పేరుతో రచించిన

1. అమ్మ మనసు సాగరం! అమ్మ మనసు అమృతం!
   అమ్మ మనసులోనే వుంది అనంత విశ్వం!
2. కన్నుల దాగిన కలలెవ్వరివే?
   వెన్నెల గీతిక లెవ్వరివే?
3. వెలుగు వెన్నెల విరియవే దీపమా!....
   ప్రియ బాంధవుడు వచ్చు పథమందు

మొదలగు గీతాలు ప్రసారమైన వాటిలో ప్రధానంగా గుర్తుండిపోతాయి.

డా.ఎం. పద్మినీ దేవిగారు రచించి వెలువరించిన 'పారిజాతాలు', 'స్పందన' అనే గేయసంపుటాల నుంచి చాలావరకు ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి వాటిలో

1. అమ్మా! ఆంధ్రమాతా! అందుకొనుమా అక్షరాంజలి!
   అలరు మనమ్ముల సరములు గూరిచి అర్పణ
   చేసెద నిదే నివాళి ॥ అ ॥
2 మావి కొమ్మల కోయిలమ్మ మలగె పాడెను ఏమని?
   రాగమున భావమ్మ జీవము, రామునికి సీతమ్మ ప్రాణము!

3. విశాల నయనాంచలముల కాంతులు-శంపాలతలై తురగలించగా
   వినీల కచభరమందు మల్లియలు తారకలై వికసించగా...
   ('ఈ మాసపు పాట'గా ప్రసారితం)
4. కనుమా భారతదేశం! నవ నిధుల కాలయం!
   జనులు కలిసి మెలిగితే అగును శాంతి నిలయం!
5. ఇది నా సుందర స్వప్నం! ఇది నా ఆశల హర్మ్యం!
   ఇది నా జీవన లక్ష్యం! మాతృదేశమిది నా సర్వస్వం!
6. గుండెలోని కదలికలకు కొత్త రూపమా!
   ఇది పరవశానతూగు మనసు పలుకు రాగమా?
7. మనసు నిండితే పండుగ! మమత పండితే పండుగ
   మనిషి ఎడదలో మానవత్వం మసలిననాడే పండుగ
8. హృదయ వీణ పలికెరా, మనోహరా!....
   మధుర భావనా మదిలో విరహ వేదనా!....

మొదలగునవి మధుర బాణీలలో ప్రసారమై ఆంధ్ర శ్రోతల్ని అలరించాయి.

శ్రీ అడిదం పాపారావు రచించిన గేయాల్లో

1. దిగులెందుకు వెలుతురు చూస్తే
   ధైర్యంతో నువు లేవాలి!
   బ్రతుకులోని వెతలన్నిటినీ
   కృషితోనే పరిమార్చాలి.
   (3/1990 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
2. వాడ వాడ ఎగరాలి మువ్వన్నెల జెండా
   దాని చిత్తశుద్ధి తెలియాలి నలుదిక్కుల నిండా
3. ఆడనా నీ ఒడిలో పుడమి తల్లీ!
   అందాల పాపగా నే మారిపోనా?
4. ఒక్కక్షణం నవ్వరా! నవ్వరా! నవ్వరా!
   పది మంది గుండెల్లో నినదించు వీణలా
   పరుగెత్తు తరగలా గలగలా నవ్వరా!....

మొదలగునవి ప్రసారమయ్యాయి.

ఆకాశవాణి ప్రయోక్తయైన శ్రీ కలగా కృష్ణమోహన్‌గారు కూడ కొన్ని గేయాలల్లారు. వాటిలో

1. ఉదయమా వస్తావా? అలా వెళ్లిపోదాం!
   నిదురించే హృదయాలను తట్టిలేపివద్దాం!
2. బ్రతుకు చీకటి కొసలలో చిరుదివ్వెను వెలిగించు!
   ఆ వెలుగులో ప్రతి మనసులో చిరునవ్వును వెలయించు!
3. మనసులో మమత పండకపోతే చిరునవ్వులు పూయవు!
   నీ హృదయంపై వసంతాలు సంతకాలు చేయవు!

4. మాట వెనుక మౌనంలా, మౌనంలో గానంలా
కదిలేవు మెదిలేవు మదిని ప్రేమధ్యానంలా....
5. మనసనేది లేనినాడు లేవు ప్రేమ గాథలు
వలపనేది లేకలేవు తీపి గుండె కోతలు

మొదలగు లలితగీతాలు ప్రసారమయ్యాయి. 2,5 గీతాల్లో మంచి భావుకత మల్లెలా పరిమళించింది.

'రాగధుని' లలిత గీతాల సంపుటిని శ్రీవై. రామకృష్ణారావుగారు 1985లో వెలువరించగా అందలి గేయాలనేకం ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. వాటిలో

1. మృదుల భావన మెదిలెనూ-మధురగీతిగ మ్రోగెనూ...
కలల దారుల వలపు వాడల గాలి జాలిగ సాగెను
('ఈ మాసపు పాట' గా ప్రసారితం)
2. నిదురపోయిన మదికి ఉలికి పాటేమో? ఏమో యీ వింత ఏమో?
ఆశలే కుసుమించునేమో - కన్నీటిపాటగా విషమించునేమో?
('ఈ మాసపు పాట' గా ప్రసారితం)
3. ఈ పవనం ఎక్కడిదో? ఈ కవనం పలికిందీ!...
మధుర మధుర మృదు మంజుల నవ వసంత దరహాసం!
4. ఇది మానవతా గీతం! ఇది మా నవతా వేదం!
నవలోకం పయనానికి కదలిన తొలిపాదం!
5. తేటిపాటలా-తేనెవాకలా తీయనైనది
పూల పాన్పులా వలపు తలపులా హాయైనది
6. ఆమనిలో చెలరేగిన తలపుల రూపకల్పనవునీవే!
నా భావ తరంగిణి రావే!
7. మధుర వసంత విభావరిలో హృదయలతాంతం విరిసినదీ!...
నా చెలిపలుకుల మధురిమలో అనురాగమరందము కురిసినదీ
8. నేలతల్లి పాదాలకు పసుపు పూసిరెవరు?
నింగి దాక పసిమికాంతి ప్రసరించే దెవరు?
చేమంతులు-అవే చేమంతులు
ప్రతి వాకిటిలో విరుల శ్రీమంతులు

మొదలగునవి ప్రధానంగా నిలిచి శ్రోతల నలరిస్తాయి. చివరి గీతాల్లో భావాలు సింగారంగా చిందులేసినట్లు అగుపిస్తాయి.

శ్రీ గిడుగు రాజేశ్వరరావుగారు రచించి వెలువరించిన 'రాగవీచికలు' (గేయమాలిక) నుండి కొన్ని గేయాలు 'లలిత సంగీతం'లో ప్రసారమయ్యాయి. వాటిలో

1. ఆమని ఇదిగో వచ్చింది-అందాలెన్నో తెచ్చింది!
నందనవని ఆనందలహరిలో నవజీవనమున తేలగా...
2. పుష్యమాసపు సిరులతో పాలుపొంగు చక్కని రుచులతో
కరుణించి దీవెనలిచ్చు శుభ సంక్రాంతి లక్ష్మికి వందనం!....

3. నన్ను చూసి గలగలమని-నవ్వుదువటె యమునా!....
నిన్న రేయి నీ తటిపై-వీల మేఘ శ్యామునికై...
4. గాలి తరగల తేలివచ్చిన ఈలపాట ఎవరిదో?....
ఈల కాదది వేణురవమున వలపు తెలిపిన పిలుపది!
5. నీ మోవిపై మురళి నిఖిల లోకాలను
రాగ మాధురి తేల్చెరా! రమ్యడోలికలూచెరా!...
6 వెండిలా కరిగింది వెన్నెలా-వెల్లువై పారింది వెన్నెలా
కొండపై, కోనపై - గోరింట పొదలపై....
7. నీ చాటున దాగె నటె నీలిమేఘ మాలికా!
ఏమి జాణతనమొగాని ఎచ్చోటను కానరాదు

అనే గీతాలు రసజ్ఞుల నలరిస్తాయి.

హైదరాబాద్ ఆకాశవాణిలో అసిస్టెంట్ డైరెక్టర్‌గా వున్న కొప్రామల్లికార్జున శర్మగారు రచించిన కొన్ని లలితగీతాలు కూడ ప్రసారమయ్యాయి. వాటిలో

1. ఆషాఢ మేఘమా! ఆగుమా ఇచట!
ఆకసపు వీధిలో హాయి నెరిగింపుమా!
2. గొంతులో భావాలు గుసగుసలు ఆడెను
కొమ్మ మీదా కోకిల కుహు కుహూ పాడెను
3. రావో మోహనా! రావో మురళీధరా!
రాసలోల హే కృష్ణా! రమణి మనోహరా! ప్రియా!
(2/1997లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)

అనేవి మాత్రం దృష్టికి వస్తాయి. శ్రీ కోకా రాఘవరావు రచించిన గేయాల్లో కూడ కొన్ని ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. వాటిలో

1. మేలుకోవయ్యా! మమ్మేలుకోవయ్యా!
శేష శయనంపై శయనించి వున్నావా?
2. నిదురపో నా బాబు! నిదురపో కాస్సేపు
నిదురలో కలగాంచి చిరునవ్వు నవ్వేవు!
3. కవితా! ఓ కవితా! ఎవరవీవు ఓ కవితా!
4. రాధా మాధవ ప్రణయం! గాథలన్నిటను మధురం!
5. ఎన్నాళ్లనుండో పాడాలనుకున్న పాట!
ఇన్నాళ్ల కైనా పాడగలుగుతున్న పాట!
6. అదిగదిగో అరుణరేఖ! తూరుపు తెన్నుల తేలింది!
తరతరాల పాతుకున్న నరనరాల జీర్ణించిన
పాత వూహల బూజు దులిపి, కొత్త రంగులు చూపిందీ!..
7. నినువీడి క్షణమేనిమనలేను దేవీ!
ఈవేళరావేల? ననుచేరరాదీ!

మొదలగు గీతాలు మాత్రం దృష్టికి వస్తాయి.

డా. తిరుమల శ్రీనివాసాచార్య రచించిన 'గంగా తరంగాలు' (లలితగీత సంపుటి) నుండి కూడ కొన్ని ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. వాటిలో

1. అధరాలన్నీ పాడనీ మధురమైన పాట!
   హృదయాలన్నీ ఎదగనీ హిమగిరులై యీ పూట
   (3/1992 లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
2. పువ్వులా కురవాలీ తావులు!
   దివ్వెలా చూపాలీ తోవలు!
   (3/1993లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
3. పలికించవా భారతి మధుగీతి?
   రసికుల హృదయాలు రవళించు రీతి!
   (12/1995లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
4. అందాలకు ఆలయం ఈ విశ్వం!
   డెందాలకు అందించును ఆనందం!
   (5/1995లో 'ఈ మాసపు పాట'గా ప్రసారితం)
5. శ్రీకరమౌ భారతమ్మిది! శ్రీలు పండు నిలయమిది!
   గౌతమాది గాంధి వరకు యోగనిధులు త్యాగధనులు!
6. హిమాచలం శిరసెత్తెను ఈ దేశంలో
   అమరఝరి అలలెత్తను మనదేశంలో
7. పండుగా! జాతికి పండుగా!....
   సత్యం ధర్మం గెలిచిన రోజు
   శాంతి పతాకం ఎగిరిన రోజు....
8. ప్రణామాలు గైకొమ్మా పతాకమా!...
   ప్రమోదాలు మాకిమ్మా పతాకమా!

మొదలగు గీతాలు ప్రధానంగా దృష్టి నాకర్షిస్తాయి. దేశభక్తిని ప్రకటిస్తాయి.

నిమ్మల అర్జున గౌడు రచించిన గేయాలు కూడ అడపా దడపా ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. వాటిలో

1. వందన మిదె భూదానోద్యమ నేతా! దివ్య చరిత!
   వందన మిదె పీడిత జన బాంధవ! కరుణాభరితా!
2. గర్వించరా! నీవు గర్వించరా!
   ఖ్యాతిగాంచిన భరతజాతి పౌరుండనని...
3. మమత పూవులు మల్లెలుగా-మనసు మనసున పూయాలిగా!
   సమత పరిమళ భావాలే మనిషి మనిషిలో నిండాలిగా!
   ('ఈ మాసపు పాట'గా ప్రసారితం)
4. ఈ దేశం మనదేశం దేశభక్తులకు నిలయం!

5. వందనం అభివందనం! నా మాతృభూమికి వందనం!
జన్మనిచ్చిన కన్నతల్లికి! జనని భారతి కల్పవల్లికి!
('ఈ మాసపు పాట'గా ప్రసారితం)
6. మనిషిని మనిషిగ చూసే మంచితనం కావాలి!
వంచనతో సాటివాని హింసించుట మానాలి!

మొదలగు గీతాలు ప్రధానంగా దృష్టికి వస్తాయి.

ఇంకా మలయశ్రీ, శ్రీగాదె శంకరకవి, దమ్మక్రీనివాస బాబు, అందెశ్రీ మొదలగు ఆధునిక రచయితల గీతాలెన్నో ఆకాశవాణి బృందగానాలలో, 'ప్రభాత గీతం', 'లలిత సంగీతం' కార్యక్రమాలలో ప్రసారమయ్యాయి. ఇదే విధంగా దూరదర్శన్ లోనూ లలితగీతాలు కొన్ని చోటుచేసుకున్నాయి.

## దూరదర్శన్ గీతాలు :

హైదరాబాద్‌లో తేది 1.8.1975లో ప్రయోగాత్మకంగా 'శాటిలైట్' ద్వారా ప్రసారాలు ప్రారంభమయ్యాయి. ప్రథమంగా SITE (Satellite Instructional Television Experiment) ద్వారా నాటి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌యైన నండూరి విఠల్ ఆధ్వర్యంలో పాలగుమ్మి విశ్వనాథం గారి సంగీత నిర్దేశకత్వంలో శ్రీ ఎం. చిత్తరంజన్, శ్రీరంగం గోపాల రత్నంగార్ల గాత్రంలో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు రచించిన

1. నీ పదములె చాలు రామా!
నీ పద ధూళులె పదివేలూ!
2. శివ శివ శివ అనరాదా? శివనామము చేదా?
శివపాదము మీదా నీ శిరసు నుంచరాదా?
3. ఒదిగిన మనసున కొదిగిన భావం!
కలిపే దెవ్వరో? కదిపే దెవ్వరో?

అనే లలిత గీతాలు మరియు

1. శ్రీపురాణ ధాత్రికీ! మా పవిత్ర నేత్రికీ!
భారతీయ మాతకిదే వందనం! వందనం!
(రచన : వింజమూరి శివరామారావు)
2. ఏలా ఈ మధు మాసం? ఇంకేదీ ప్రణయ విలాసం?
(రచన: డా.సి.నారాయణరెడ్డి)
3. ఓయమ్మా భూదేవి! నిను నమ్మితి మమ్మా తల్లీ!
నిన్ను నమ్మి నిబ్బరంగ నిద్దుర పోయేమమ్మా!
(రచన : బసవరాజు)

అనే లలిత గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి[1]. ఆ తర్వాత అప్పుడప్పుడు ఎం. నరసింహమూర్తి పాడిన జానపద గేయాలు ప్రసారమయ్యాయి. 1975లోనే శ్రీ పి.వి. సాయిబాబా స్వరాలు సమకూర్చిన

1 ఎం చిత్తరంజన్‌తో ముఖాముఖి 3 9 1997

1. పూల తావులలో - గాలి దారులలో
హాయి హాయిగా జతగావుందామా?
(రచన : శశాంక)
2. గొంతులో కోటిరాగాల పాట!
గుండెలో మేటి భావాల తోట!
(రచన : కోపల్లె శివరాం)

గీతాలు మరియు శ్రీపాలగుమ్మి విశ్వనాథం స్వరబద్ధం చేసిన

1. కారు మబ్బు పట్టాలి! హోరుగాలి రేగాలి!
తొలకరించి నింగినేల పులకరించగా...
(రచన : కొనకళ్ల)
2. తబ్బిబ్బయ్యేను నా మనసు!
తళుక్కుమన్నది నీ సొగసు!
(రచన : కొనకళ్ల).
3. ఓ ప్రభో! కాళిదాస! రసిక హృదయ భవన వాస!
(రచన : కృష్ణశాస్త్రి)
4. వీణ మీటితే 'ఈమని' తరలి వచ్చింది ఆమని!
నా మనసు కోరింది ఏమని? ఆ వీణ పలుకు వినిపించమని!
(రచన : పాలగుమ్మి)

మొదలగు లలితగీతాలు దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి. అలా ప్రయోగాత్మకంగా మొదలైన 'శాటిలైట్' కార్యక్రమాలు 31.7.1976 వరకు కొనసాగాయి. ఆ తర్వాత నాటి భారత రాష్ట్రపతి నీలం సంజీవ రెడ్డిగారు తేది 23.10.1977 నాడు హైదరాబాదులో దూరదర్శన్ ఉపగ్రహ కేంద్రాన్ని ప్రారంభించారు. అప్పటి నుండి క్రమపద్ధతిలో వరుసగా దూరదర్శన్‌లో ప్రసారాలు ప్రారంభమయ్యాయి. మొట్టమొదట రమణీ సన్యాల్, ఎం.సి.వి. శశిధర్ ఆధ్వర్యంలో శ్రీరంగం గోపాల రత్నంగారు పాడగా నండూరి విఠల్ రచించిన

1. పువ్వురా ఈ జీవితం!
2. కలకరిగెనులే! మది చెదరెనులే!

మొదలగు గీతాలు మరియు శ్రీమతి ఆర్. వేదవతీ ప్రభాకరరావు పాడగా డా. అరిపిరాల విశ్వం రచించిన

1. శివపాదము నుంచనేను
శిలనైనను కారాదా?

అనే గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి.[1]

ఆ తర్వాత 1978లో పి.వి. సాయిబాబా స్వరబద్ధం చేయగా, డా.దాశరధి రచించిన

---

1 ఎం.సి వి శశిధర్‌తో ముఖాముఖి 3.9 1997

1. పూల దీపమెత్తరావే! పున్నాగ వేణీ!
జాలి మాట లాడిపోవే! సఖీ మంజు వాణీ!
2. రమ్మంటే చాలుగాని, రాజ్యాలు విడిచిరానా?
నీ చిరునవ్వుల కోసం స్వర్గాలు వదలిరానా?
3. ముళ్ల నీడల్లో పువ్వులున్నాయి!
నాదు కన్నీటా నవ్వులున్నాయి!
4. మినుకు మినుకను దివ్వె వెలిగించు ఒరులింట!
మనసులోనా దివ్వె మలుపబోకే!
5. హృదయాలలో అమృత మువ్పొంగి పొరల
మానవుడు మరల ప్రేమము వైపు తరల
6. మగ : ఓ సఖియా! నీ ఎదపై వ్రాసెదనొక గీతిక!
ఆడ : ఓ ప్రియా! నీ మదిలో నిలపెద నొక దీపిక!

మొదలగు గీతాలు, డా.సి. నారాయణరెడ్డి రచించిన

1. చుక్కలతో ఒక్కసారి సూచింతును నా కన్నియ
వాల్జడల సందున మల్లియలై మొలవాలని
2. మోడు కలవరిస్తున్నది పూవై జీవించాలని
3. ఎవరి సంతకాలో? ఇవి ఎవరి సంతకాలో?
4. ఋతు చక్ర సంగీతమే మానవుల
బ్రతుకుల ముడివేయు అతి చిత్రబంధం!

అనే గీతాలు మరియు బొబ్బిలి భాస్కరరెడ్డి స్వరకల్పనలో

5. గుండె గుండె కొక దీపం వెలిగింది
శిరము శిరము కొక శిఖరం పెరిగింది
6. బాపూ నీ జీవితం, ఆ భగవద్గీత భాషితం!
అది హిమగిరిలా సమున్నతం, సురఝరిలా నిత్యపునీతం!
7. చిరునవ్వును పలికించే
స్వర కల్పన లెన్నెన్నో...

మొదలగు గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి. ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రమయ్యాయి.[1]

ఆ తర్వాత నిర్మల్ కుమార్ సంగీతంలో ఎం. చిత్తరంజన్, ఆర్. వేదవతి పాడిన

1. ఏలనో సుమదళములు చేయి చాచి చూచేనలా!...
ఎడదలో పికరవములు గొంతులెత్తి పాడేనిలా!...
(రచన : కోపల్లె శివరాం)
2. నిదురపోవే తల్లి! నిదురపో నవమల్లి
నిదురపో జాబిల్లి! నిదురపోవమ్మా!....
(రచన · కృష్ణశాస్త్రి)

మొదలగు గీతాలు ప్రసారమయ్యాయి.

1 పి వి సాయిబాబా మరియు బొబ్బిలి భాస్కరరెడ్డి గార్లతో ముఖాముఖి 6 9 1997

శ్రీ విన్నకోట మురళీకృష్ణ మరియు కన్నబాబు స్వరాలు కూర్చగా

1. పూలు చేసెను నను చూసి ఏవో బాసలు!
   గుండెలో వూగెను వుండి వుండి వూసులు!
   (రచన : కోపల్లె శివరాం)
2. వాణీ నిగమాగమ రూపిణీ!
   కరుణించవే చదువులిడి నలువచెలి!
   (రచన : ఆచార్య తిరుమల)
3. శ్రీ వేంకటేశా! శ్రీ తిరుమలేశా!
   కరుణించి కాపాడు శ్రీ శ్రీనివాసా!
   (రచన : ఎం. సి.వి. శశిధర్)
4. ఈశ్వరుడతడే! పరమేశ్వరుడతడే! ప్రాణ కోటికి
   జీవము పోసి ఎల్లరిని కాచేది అతడే!
   (రచన : ఎల్. మాలకొండయ్య)
5. నాదు జన్మ భూమికన్న
   నాక మెక్కడుంది? సురలోక మెక్కడుంది?
   (రచన : ఇంద్రగంటి)
6. ఎవరూ కేక విని రాకపోయినా సరే,
   ఒకడివె పదవోయ్! ఒకడివె పదవోయ్!
   (రచన : బాలాంత్రపు రజనీ కాంతరావు)
7. ఎంత అబలవో సీతమ్మా?
   ఎంత అమాయకవో మాయమ్మా?
   (రచన : జె. బాపురెడ్డి)

మొదలగు గీతాలు ప్రసారమయ్యాయి.

ఆ తర్వాత పి.వి.సాయిబాబా సంగీత నిర్దేశకత్వంలో జె. బాపురెడ్డి రచించిన

1. వన్నె వన్నెల పూలతోట! నింగి నేలలు కలుపు బాట!
   భారతదేశం భారతీయుల తరతరాల వరాల మూట!
2. ఏడు కొండల వేంకటేశా! హేమహాస రమావిలాసా!
3. కోకిల పాటలు వినే కోరిక లేదు
   తారల మాటలు వినే తీరిక లేదు

మొదలగు గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి.

శ్రీ పాలగుమ్మి విశ్వనాథం గానం, సంగీత దర్శకత్వంలో

1. తరలి రారమ్మా! గౌతమీ, నాగావళి, మంజీర, వంశధార
   తుంగభద్ర, పినాకినీ! ఉత్తుంగ భంగ కృష్ణవేణీ!....
   (రచన : కృష్ణశాస్త్రి)
2. మల్లెనమ్మా మల్లెనే! నా ఒళ్ళు సందెల ఝుల్లనే!
   పెళ్లి కూతురు మగనికై కొసవేళ్ల మాలిక లల్లెనే!
   (రచన : కృష్ణశాస్త్రి)

3. ఎన్నిసార్లు అన్నదో! ఎన్నెన్ని తీర్లు విన్నదో
అన్న కొలదీ విన్న కొలదీ అమృత భరితం, రామచరితం!
(రచన : పాలగుమ్మి విశ్వనాథం)
4. నిను కొలుచును యీ జగమ్మంతా!....
నను మరువకుమో హనుమంతా!...
(రచన : పాలగుమ్మి విశ్వనాథం)
5. తలపులూరే కన్నె మనసు! వలపులూరే కోడెవయసు!
ఎంతదాచిన దాగునా? రవ్వంత తెలియకపోవునా?
(రచన : పాలగుమ్మి విశ్వనాథం)
6. ఈ లోకంలో-ఈ నాదేశంలో-ఈనా ఇప్పటి దేహంలో
ఎన్నాళ్లయినా బ్రతకడమిష్టం! నేనెప్పుడు రాలినా యిష్టం!
(రచన : మల్లాది శివరాం)

మొదలగు గీతాలు మరియు ఆర్. వేదవతి గానం చేసిన

1. అమ్మదొంగా! నిన్ను చూడకుంటే నాకు బెంగ!
(రచన : పాలగుమ్మి)
2. చల్లగాలినే పిల్లన గ్రోవిగ
మెల్ల మెల్లగా ఊదే స్వామి!
ఎవరయ్యా? మీరెవరయ్యా?
(రచన : దాశరధి)
3. నడిపించవో తండ్రి నడిపించవో?
నాపై దయా వృష్టి కురిపించవో?
(రచన : శశాంక)

మొదలగు గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమై ఎందర్నో ఆకర్షించాయి.[1] హైమవతి, శేషులత, రాజేశ్వరి, కృష్ణకుమారి బృందగానాలుగా

1. ఏలా పాడేనిక యమునా కల్యాణి?
(రచన : బసవరాజు)
2. ఉప్పొంగి పోయింది గోదావరి తాను
తెప్పున్న ఎగిసింది గోదావరి!
(రచన : అడివిబాపిరాజు)
3. జై మహాంధ్ర జనయిత్రీ! జై ప్రియాంధ్ర జనయిత్రీ!
(రచన : కృష్ణశాస్త్రి)
4. తెలుగు దనాలవి! తెలుగు దనాలు!
తీయని భాషకు మూలధనాలు!
నృత్య సంగీత శిల్ప సాహిత్యవ్యాసంగాల
నికేతనాలు! తెలుగు దనాలు!
(రచన . ఇంద్రగంటి శ్రీకాంత శర్మ)

---

1 పాలగుమ్మి విశ్వనాథంతో ముఖాముఖి 4 9 1997

5. మనసె చల్లని మందిరం! తన మమత పచ్చని తోరణం!
(రచన : శశాంక)

మొదలగు గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమై పలురకాల ప్రేక్షకుల్ని అలరించాయి.

ఈ సిద్ధాంత వ్యాసకర్తయైన వడ్డెపల్లి కృష్ణ రచించిన

1. మంచెమీద కాపున్న మావా! మనసైన నేనున్నరావా?
నెలవంక పొడిసిందిరా! నా వంక సూసిందిరా?
(గానం: సి. పద్మజ, సంగీతం : సి.ఇందిరామణి)
2. చేమంతి సొగసంత చెలిమేనిదే!
సిరిమల్లె మనసంత విరిబోణిదే!
(గానం : రామాచారి)
3. ఓ నీలిమేఘుమా! ఒయ్యారి మేఘుమా!
కాళిదాస కవీంద్రుని కమనీయపు కావ్యమా!....
4. కలల అలల కదలిపోవు మనసా!
కలలు నిజము కావన్నది తెలుసా?
(గానం : సి. పద్మజ)
5. మగ : కోయిల నీవైతే తీయని పాటను నేనౌతా!
ఆడ : కొమ్మవు నీవైతే పూవుల రెమ్మను నేనౌతా!
(సంగీతం, గానం : ఎం. చిత్తరంజన్, జయలక్ష్మి)

మొదలగు గీతాలు మొదట్లో దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి.

శ్రీ ఎం.కె. రాము రచించిన గేయాలు కూడ దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి. వాటిలో

1. అనుకోనా! నేననుకోనా!
కలలో కనిపించే-కవితలో వినిపించే
కమ్మని కాలం కలిసొస్తుందని-
2. నాట్యమాడవే ! నవమోహినీ!
నగుమోముతో-నవ భంగిమతో
నటరాజు మనములు రంజిల్లగా....
3. రాగమా! ఇది అనురాగమా?
నా గొంతులో పల్లవించేది
నా గుండెలో వెల్లివిరిసేది

అనే గీతాలు మాత్రం దృష్టి నాకర్షిస్తాయి.

ఆచార్య తిరుమల రచించిన గేయాల్లో

1. దయా జలధీ! దాశరథీ! మొరవిని బ్రోచే
దొరవని మరి మరి వేడుచుంటిరా! సుగుణ నిధీ!

2. మధు మురళి నూదవేయ్! మాధవా!
   నీ అధర పల్లవము కందిపోవునా?...
3. పలికే శారద చంద్రబింబమా! మౌనమా?
   నా భావనలో రసమాధురివని, ఈ యామినిలో ఎలకోయిలవని
4. పాడనా నే నీ రేయి? మరుమల్లెనైపోయి
5. నవ్వులు చిలికించే మేమంతా ఒక్కటే!
   దివ్వెలు వెలిగించే ధ్యేయం మా కొక్కటే!
6. నేనే ఒక వేణువు! నా పాటకు పరవశించి ఆడును ప్రతిరేణువు!
7. చివురుటాకు చీరలో వనరాణి కెంత అందమో?
   ఏ చూపులైన రాగాలలో పులకించె నీ వేళలో!

మొదలగు గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి.[1]

వై. రామకృష్ణారావు రచించిన గేయాల్లో

1. శ్రీరామా! రఘురామా!
   అఘవిరామా! ఘనశ్యామా!
   (సంగీతం : ఘంటసాల విజయ్‌కుమార్, గానం పి. లీల)
2. జయ జయహే శర్వాణీ! నమోస్తుతే భవానీ!
   మునిజన హృదయ సరోజ నివాసిని
   (సంగీతం : పి.వి.సాయిబాబా, గానం రామాచారి)
3. ఎదురుగ కనిపించరా కృష్ణా! నా
   ఎదలో నివసించరా!
   (గానం : సురేఖా మూర్తి)
4. నీ ఒడిలో - నీ కౌగిలిలో
   అనుపమ కవితానుభూతి!
   సుమధుర మృదుభావగీతి!
   (సంగీతం : విన్నకోట మురళీకృష్ణ. గానం : పి.వి రాజేశ్వరరావు)

మొదలగు గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి.[2]

దూరదర్శన్‌లో 'లలితగీతాలు' శీర్షికతో మొదట్లో లలితగీతాలు ప్రసారమయ్యేవి. శ్రీమతి యార్లగడ్డ శైలజ ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా వచ్చాక లలితగీతాల ప్రసారంలో ప్రత్యేక శ్రద్ధ కనబరచి 'భావవల్లరి' అనే కొత్త శీర్షికను 1985లో ప్రవేశపెట్టారు. ప్రతి గీతాన్ని అందమైన వ్యాఖ్యానంతో ప్రసారం చేశారు. అలాంటి సందర్భంలోనే వడ్డెపల్లి కృష్ణ రచించిన

1. తూరుపు తల్లి లాలనలో-తూగే మమతల ఊయలలో
   ఒక సూర్యుడు ఉదయించాడు-లోకాలను వెలిగించాడు
   (గానం - సి. పద్మజ)

---

1 ఆచార్య తిరుమలతో ముఖాముఖి 3 9 1997

2 వై రామకృష్ణారావుతో ముఖాముఖి 4 9 1997

2. సుమధుర గీతం - సుందర దేహం
స్వర సంగీతం దానికి ప్రాణం
(గానం : సి. పద్మజ)
3. వెన్నెలంత చల్లనిది స్నేహము!
మల్లెయంత తెల్లనిది స్నేహము!
(బృందగానం)
4. భరతభూమి నా గేహం - భరతజాతి నా దేహం!
మంచిని పరిపాలించే మానవతకు దాసోహం!
(బృందగానం)

మొదలగు గీతాలు శ్రీమతి సి. ఇందిరామణి సంగీత దర్శకత్వంలో ప్రసారమై ప్రేక్షకుల ఆదరాన్ని చూరగొన్నాయి. ఆ తర్వాత వి.యస్. నారాయణ మూర్తి గారి ఆధ్వర్యంలో బృందగానాలుగా

1. సమతా మమతా చాటుదాం!
శాంతి స్వరాలను మీటుదాం!
(సంగీతం : కొచ్చర్లకోట సూర్యప్రకాశరావు)
2. జాతిపితా! ఓ జగతిహితా!
అందరినీ ప్రేమించే అహింసావ్రతా!
(సంగీతం : టి.ఆర్. జయదేవ్)
3. భరతుడు రాముడు ఏలిన దేశం!
బంగరు భూముల భారతదేశం!
(సంగీతం ఎస్.పి. రాజారాం)
4. స్వతంత్ర భారత త్రివర్ణపతాక - నింగిని ఎగిసే సమయమిదే!
సమైక్య భావపు స్వేచ్ఛాగీతిక స్వరమున పాడే సుదినమిదే!
(సంగీతం : నల్లూరి సుధీర్ కుమార్)

వడ్డేపల్లి కృష్ణ గీతాలు దూరదర్శన్‌లో ప్రసారమై శ్రోతలను అలరించాయి నూతన సంవత్సర స్వాగత సందర్భంగా ఏర్పాటయ్యే ప్రత్యేక కార్యక్రమాలకై బాణీలకు గీతాల్ని వ్రాయించే ఒరవడిని కూడ యార్లగడ్డ శైలజనే ప్రవేశపెట్టడం విశేషం! ఆ ఒరవడిలో ఆమె వడ్డేపల్లి కృష్ణ మరియు చైతన్య ప్రసాద్‌లచే ప్రథమంగా వ్రాయించారు ఆ సందర్భంగా నల్లూరి సుధీర్‌కుమార్ సమకూర్చిన స్వరాలకు

1. నవ్వుల పువ్వులే మోవిపై - మోముపై
జివ్వున పూయనీ, సరాగమే పరాగమై
(రచన : వడ్డేపల్లి కృష్ణ. గానం ఎస్.పి. శైలజ)
2. 'లచ్చీ'గ-తెలతెల్ల'లిల్లీ'గా అరుదెంచె అందంగ విరబోణి!
తరగల్లె-సందేళ పొద్దోలె పయనించు ఈయాడు యిక రాదు!
(రచన : వడ్డేపల్లి కృష్ణ, గానం : ఎస్.పి శైలజ)

3. అభినయాల అల ఊర్వశివో? ఎదను ఏలు ప్రియ ప్రేయసివో?
ఓర చూపుల ఓ వయారీ! నటన మాడే నా మయూరీ!
(రచన : వడ్డెపల్లి కృష్ణ, గానం : మనో)
4. ఓహో....కొత్తగాలి వీచె, పూలు పూచె
అహో....కొత్త ఏరు పొంగె, నీరు పొంగె
(రచన : చైతన్య ప్రసాద్, గానం : శైలజ)
మరియు టి.ఆర్. జయదేవ్ సమకూర్చిన స్వరాలకు
5. ఓహో...ఓహో వసంతమా! నవమోహన జీవన వికాసమా!...
భావుక పులకిత హృదంతమా! సుమబాల పరీమళ విలాసమా!...
(రచన : చైతన్య ప్రసాద్, గానం : వాణీ జయరాం)
6. ఎదో భావ రాగం! ఎదో నవ్య యోగం!
హృదయవీణపైనా శ్రుతులు పాడెనే!
(రచన : చైతన్యప్రసాద్, గానం విజయలక్ష్మీ శర్మ)

మొదలగు గీతాలు అల్లగా దూరదర్శన్‌లో ప్రసారమై ప్రేక్షకుల మన్ననలందుకున్నాయి. సినీగీతాలతో పోటీపడ్డాయి.

చైతన్యప్రసాద్ రచించిన మరికొన్ని గీతాలు కూడా దూరదర్శన్‌లో ప్రసారమయ్యాయి. వాటిలో

1. పల్లెసీమ పిలిచిందీ! పిల్ల ఎంకి పలికింది!
చలాకీగ కులాసాగ పదం కదిపి కులికింది!
(గానం . వాణీ జయరాం)
2. శ్రమజీవుల హృదయంలో, స్వేద వేదగానంలో
పునీతమై తిరుగుతోందిరా, ధరణీ చక్రం!
(గానం : వాణీ జయరాం)
3. తుహిన గిరి శిఖరాన-గిరితనయ సముఖాన
నర్తించు నటరాజ అభివందనం!
(గానం : రామలక్ష్మీ రంగాచారి)
4. కదిలింది శివదివ్య పాదం!
కదలి మొరసింది మంజీరనాదం!
(గానం : మిత్ర అండ్ శారద)
5. సుందర సుమ స్యందన మా బృందావనం!
వేణుధరుని అధర మధుర అలాపనం!
(గానం : సునంద)
6. ప్రేమించే హృదయానికి ప్రణమిల్లవే మనసా!
వంచన ఎరుగని ఎడదకు వంగి మ్రొక్కవే శిరసా!
(గానం : బి. వసంత)

1 చైతన్య ప్రసాద్‌తో ముఖాముఖి . 8.9.1997

మొదలగు గీతాలు మధురంగా మనసునాకర్షిస్తాయి. కాని 4వ గీతం రోహిణీ కుమార్‌గారి 'శివపాద మంజీరనాదం' గీతం ప్రేరణతో రచించినట్లు తోస్తుంది.

దూరదర్శన్ ఉద్యోగియేగాక ఉత్తమ కవియైన శ్రీవోలేటి పార్వతీశం రచించిన గేయాలు కూడ అనేకం దూరదర్శన్‌లో ప్రసారమై ఆ తర్వాత "ఊహ నుంచి ఊపిరికి" అనే గేయసంపుటిగా వెలువడ్డాయి. వాటిలో

1. నదిలా ఒక కథలా సాగాలీ జీవితం!
   సుడులైనా వ్యథలైనా ఏవీ కావు శాశ్వతం!
2. నీలిమేఘం స్వాతి చినుకులు చిలకరించింది
   పుడమి దేహం అణువు అణువున పులకరించింది
3. శ్రుతి చేయనా రాగవిపంచి - పలికించనా మదినలరించి
   అనురాగ జలధిలో జగతినే మరిపించి
4. అడుగిడితే ఆమని, పరిమళించును మధువని!
   నీవుండే ఎడదలో రవళించును రసధుని!
5. పడగవిప్పి అమానుషం బుసకొట్టింది!
   కన్నతండ్రి మమతల కది వెలకట్టింది!
6. వెన్నెలమ్మ ఒడి వున్నది రేయికి!
   కన్నతల్లి జాడ ఏది తండ్రికి-నా తండ్రికి! జో...లాలీ!
7. పూరిస్తుంటే కోటి గొంతుకల శంఖారావం,
   దద్దరిల్లింది ప్రతిధ్వనులతో ఘనభోంతరం!
8. హేమంతానికి సీమంతం! మాయింట పేరంటం!
   ఇంతులారా రారండి! చేమంతులు కొని తేరండి!

మొదలగు గీతాలు మన మనసుల్ని ఆనందతరంగాల్లో తేలుస్తాయి. ఇలా ప్రముఖ కవులే గాక అత్యాధునిక కవులు కూడా రచించిన ఎన్నో లలిత గీతాల్ని ఇటీవల దూరదర్శన్ ప్రసారం చేసిందంటూ ఒక పట్టికను - లలిత సంగీత ప్రయోక్తగా పనిచేస్తున్న వి.యస్. నారాయణమూర్తిగారు అందించారు. వాటి వివరాలు అనుబంధంలో ఇవ్వబడ్డాయి.

ఇలా ఎందరెందరివో ఎన్నెన్నో గీతాల్ని ఎంచుకొని దూరదర్శన్‌లో చక్కని చిత్రీకరణతో ప్రసారం చేశారు.

అటు ఆకాశవాణి, ఇటు దూరదర్శన్ పైన పేర్కొన్న విధంగా భావుకత గల గీతాల్ని ప్రసారం చేసి లలితగీతరచనలకు మంచి ప్రోత్సాహాన్ని అందించాయి. అటు సినీ గీతాలకు, ఇటు జానపద గేయాలకు మధ్య లలితగీతాలు కూడ తీసిపోకుండా తీగలా ప్రాకిపోవడానికి పందిరిలా నిలిచాయి.

ప్రసారిత లలిత గీతాల మీద ప్రత్యేకంగా సిద్ధాంత వ్యాసమే వ్రాయడానికి అవకాశం వుంది. అయితే పరిధిని, పరిమితిని దృష్టిలో వుంచుకొని, ఇంతటితో 'ప్రసారం' విభాగాన్ని ముగిస్తూ, 'ప్రచారం' విభాగంలోకి అడుగిడుతున్నాను

# 8. లలితగీత ప్రచారం

ప్రస్తుత ప్రపంచంలో 'ప్రచారం' అన్ని రంగాలలోనూ ముందడుగు వేసింది. ఎంతటి విశేష ప్రచారం చేస్తే అంతటి ఖ్యాతి లభించే అవకాశం వుంది. సినిమాలకు, నిత్యజీవితంలో మనం ఉపయోగించే సబ్బులు, టాయ్‌లెట్ పౌడర్లు, క్రిములకే గాక క్రిమిసంహారక మందులకు, తుదకు కూరల్లో వాడుకునే సామాన్యమైన చౌక ధరపు ఉప్పుకు కూడ ఎన్నెన్నో వ్యాపార ప్రకటనలు చిన్న చిన్న పాటల రూపంలో 'జింగిల్స్'గా వెలువడడం గమనిస్తూనే వున్నాం. ఇలాంటి అనేక వ్యాపార ప్రకటనలకు, ప్రచారాలకు ప్రస్తుతం పత్రికలేగాక రేడియో, దూరదర్శన్, సినిమాలు, క్యాసెట్లు ప్రధాన సాధనాలుగా వర్ధిల్లుతున్నాయి. ప్రచారంలో పలువిధాల లాభాల్ని ఆర్జించిపెడుతున్నాయి.

మన భారత జాతీయోద్యమ కాలంలో ఉద్యమ ప్రచారానికి మొదట పత్రికలే ప్రధాన సాధనాలయ్యాయి. పాటలే ప్రత్యర్థులపైకి ఎక్కుపెట్టే ఈటెలయ్యాయి. జాతీయోద్యమానికి బాటలయ్యాయి.

## జాతీయోద్యమం - జాతీయత :

ఆంగ్ల విద్యావ్యాప్తి, పాశ్చాత్య సంస్కృతి-పాలనపై భారతీయుల్లో విముఖత, వ్యతిరేకత ఏర్పడింది. ఇట్టి వ్యతిరేకత వ్యక్తపరిచేందుకు తాము నివసిస్తున్న మాతృభూమిపై, స్వదేశవస్తు, జనబాహుళ్యంపై ప్రేమ పెంపొందించుకోవడాన్ని 'జాతీయత'గా పరిగణించడమైంది. ఆంగ్లంలో Nationality - Nationalism అనే పదాలతో జాతీయత వ్యవహారంలో వుంది.

"Nationalism is a state of mind, in which a supreme loyality of the individual is felt to be due to the Nation state. A deep attachment to one's native soil, to local traditions and to establish territorial authority has escisted in varying strength throughout history"[1] అని 'హన్స్‌కోన్' అనే ఆంగ్ల రచయిత కూడా జాతీయతను నిర్వచించారు.

ఇట్టి జాతీయతను హృదయంగా చేసుకొని, స్వదేశాభిమానం ఊపిరిగా పోసుకొని, ఆంగ్లేయుల వలస పాలనను ప్రతిఘటించిన పద్ధతినే మనం జాతీయోద్యమంగా పేర్కొన్నాము. స్వపరిపాలన సాధనకై జాతియావత్తును చైతన్యవంతం చేయడమే జాతీయోద్యమంగా భావించాము. ఈ లక్ష్యసాధనకై విదేశీవస్తు బహిష్కరణ, స్వదేశీ పరిశ్రమల స్థాపనకై కంకణబద్ధులయ్యాము. ఆ సందర్భంగానే రాట్నంపై నూలువడకడం, ఖాదీ వస్త్రాల్ని తయారు చేయడం, ధరించడంకై భేరీ మ్రోగించడమైంది. వివిధ గీతాల్ని ఉద్రేకపూరితంగా రచించడమైంది.

---

1 *Nationalism - Its meaning and history (Revised Edition) 1965 Hans Kohn*

## పత్రికలు - ప్రచురణలు :

ఇట్టి రచనల్ని "20వ శతాబ్దారంభంలో చిలకమర్తి నడిపిన 'మనోరమ' (1906) 'దేశమాత' (1910) ముట్నూరి కృష్ణారావుగారి 'కృష్ణాపత్రిక' (1907) కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 'ఆంధ్రపత్రిక' (1908) వంటి పలు పత్రికలు ప్రచారం చేశాయి."[1] 'బెంగాల్ విభజన' తరువాత జాతి జనుల నుత్తేజ పరుస్తూ వెలువడిన మొట్టమొదటి భారత జాతీయోద్యమ గీతంగా బంకించంద్రుని 'వందేమాతరం' నిలువగా ఆ వందేమాతరం గీతం ప్రేరణతో డిసెంబర్ 15, 1905 నాటి 'కృష్ణాపత్రిక'లో తెలుగులో 'దిక్రై ఆఫ్ మదర్ ఇండియా' శీర్షికన

**హిందువులారా! ఎన్నాళ్లీ గతి**
**మందమతులరై మాటికి జెడెదరు**

.........................................

అనే గీతం ప్రచురించబడింది.[2] కాని ఆంగ్లేయుల అధికారానికి భయపడో, మరే కారణం చేతనో ఆ గీత రచయిత ఎవరో వెలుగులోకి రాలేదు. ఇదే దారిలో 'మేలు కొలుపు పాట', 'మాలవాంద్రపాట' కూడ 'ఆంధ్ర భారతి' (1919) పత్రికల్లో అజ్ఞాత కర్తృత్వంతో వెలువడడం చేత గురజాడ 'దేశభక్తి' గీతమే (1910) ప్రథమ గీతంగా ప్రాచుర్యంలోకి వచ్చినట్లు 'అవతరణం'లో ఇదివరకే వివరించడమైంది. ద్వితీయ గీతాలుగా రాయప్రోలు 'జన్మభూమి', 'తమ్ముడా' విపులీకరించడమైంది.

ఈ జాతీయోద్యమమే క్రమంగా స్వాతంత్ర్యోద్యమంగా రూపుదాల్చింది. అట్టి స్వాతంత్ర్యోద్యమంలో కవులనేకులు పాటల్నే తూటాలుగా పేల్చారు. అలా పాటల్ని తూటాలుగా పేల్చిన వారిలో శ్రీగరిమెళ్ల సత్యనారాయణగారు అగ్రగణ్యులు. వారు 1921లో సహాయ నిరాకరణోద్యమ సందర్భంగా రచించిన

**'మా కొద్దీ తెల్లదొరతనము - దేవ**
**మా కొద్దీ తెల్ల దొరతనము**
**మా ప్రాణాలపై పొంచి**
**మానాలు హరియించె'[3] ॥ మా ॥**

అనే గీతం ఊరూరా వాడ వాడ ప్రజల గొంతుల్లో ప్రతిధ్వనించింది. అఖండ మౌఖిక ప్రచారంతో స్వాతంత్ర్య సమర శంఖారావంగా పరిణమించింది. ఆ తర్వాత 'దేశమాత'ను స్తుతించే-

**వందన మిదె గైకొనుమీ భారత జననీ!**
**భారత జననీ-మా పాలిటి రాణీ!**
**ముప్పది కోట్ల జనమునకు మూలమాతవు!**
**మూల మాతవు -మా పాలినేతవు ॥ వం ॥**

*1,2 ఉద్యమ గీతాలు డా.ఎస్వీ సత్యనారాయణ పుట 43, 45*

*3 స్వరాజ్య గీతములు - గరిమెళ్ల సత్యనారాయణ*

అనే గేయం కూడ అధిక ప్రచారాన్ని అందుకున్నది ఇలాగే దేశమాతను స్తుతిస్తూ, స్వరాజ్య సాధన ప్రచారానికి ఉపయుక్తంగా శ్రీవడ్డాది సీతా రామాంజనేయులు పూడిపెద్దితో రచించిన

'దండాలు దండాలు భరతమాత
అవి అందుకొని దీవించు భరతమాత'

మరియు విడిగా రచించిన

'నమో హిందు మాతా!
సుజాతా! నమో జగన్మాతా!
గోలుకొండ నీ రత్న కేశమట
కోహినూరు నీ జడలో పువ్వట-'[1]

అనే గీతాలు అధిక ప్రజాదరణ పొందాయి. ఆ తర్వాత వేదుల సత్యనారాయణశాస్త్రి గారి

జయము హిమగిరి మణి కిరీటా!
జయము సింహళ పాదపీఠా!
జయము విజయాంకిత లలాటా!
జయము ప్రియజననీ!

అనే గీతంతోపాటు, కవికొండల రచించిన

హిమగిరి శిఖరము - వింధ్య వనీంద్రము
కన్యా కుమారి పదడిండీరము

అనే గీతం మన దేశీయుల నుత్తేజ పరిచాయి.

మన బానిసత్వపు సంకెళ్లను బ్రద్ధలు చేయడానికి శ్రీ మిక్కిలినేని భగవంతరావుగారు

భరత వీరులం - పరవిదార శూరులం!
స్వారాజ్య యుద్ధమునకు సిద్ధమైన ధీరులం!
బానిస సంకెళ్లు బోవ ప్రాణమైన యొగ్గుతాం![2]

అని ప్రతిజ్ఞ చేయగా, 1930లో ఉప్పు సత్యాగ్రహోద్యమ సందర్భంగా

వీరగంధము దెచ్చినారము
వీరుడెవ్వడో దెల్పుడీ!
పూసిపోదుము, మెడను వైతుము
పూలదండలు భక్తితో

అని త్రిపురనేని రామస్వామి చౌదరి వీరగీతాలాపన చేశారు.

ఆ తర్వాత

బ్రహ్మాపురము మందేరా!
పర్లాకిమిడి మందేరా!

---

1 జాతీయ గీతాలు - గురజాడ రాఘవ శర్మ
2 జాతీయ గీతాలు - మిక్కిలినేని భగవంతరావు

కాదని వాదుకు వస్తే
కటకం దాకా మందేరా![1]

అని 'మందేరా' గేయంలో ఆవేశంతో గర్జించాడు.

బసవరాజు అప్పారావుగారు

భారతదేశపు దాస్యము బాపగ
పయనమాయె మా మోహనగాంధీ!
చావో జయమో తేలందే యీ
జన్మకు మళ్లీ కనబడడండోయ్!

అని ప్రజల్ని సత్యాగ్రహ సమరానికి పురికొల్పారు.

శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం గారి

'నా మాతృభూమికై- ప్రాణ మొడ్డెదను
నన్నడ్డు పెట్టకే - నను గన్న తండ్రి
దేశమునకై జన్మ - ధారబోసెదను
నను నిల్పబోవకే - నను గన్నతండ్రి'[2]

అనే గీతం మంజరీ ద్విపద గణాలతో సాగి మాతృదేశాభిమానాన్ని చాటింది. శ్రీ దామరాజు పుండరీకాక్షుడు గారి

'శ్రీ గాంధి నామం - మరువాం మరువాం
సిద్ధము జైలుకు వెరువాం వెరువాం'[3]

అనే గీతం చతురస్ర గతిలో సాగి, లాఠీ దెబ్బలకు బెదరక గాంధీజీ చూపిన మార్గంలో స్వరాజ్యం సాధిస్తామనే లక్ష్యాన్ని ప్రకటించింది. ఆ తర్వాత 'క్విట్ ఇండియా' ఉద్యమ రథ సారథి జయప్రకాశ్ నారాయణను స్తుతిస్తూ 'కరుణశ్రీ' గారు.

'కుటిల జటిల శృంఖలాల 3+3+3+3=12
పెట పెట పెట ఫెటా త్రెంచి 6+3+3=12
వెలువడింది వెలువడింది,
విప్లవ సింహ కిశోరం'[4]

అంటూ ఉద్యమానికి కావలసిన ఉత్తేజాన్ని పదగుంభనం లోనూ త్రిశ్రగతిలో ప్రతిఫలింపజేశారు. అనంతరం నేతాజీ 'ఆజాద్ హింద్ ఫౌజ్' సమర నేపథ్యంలో

'కదనోద్ధత కర్మవీర 6+3+3=12
వదనోద్గత రుధిర పూర 6+3+3=12
బలిపులకిత నవభారత
జగతీ జాగరణాంజలి
తరుణ తరుణ బాష్పాంజలి'[5]

---

1 సూత్రాశ్రమ గీతాలు - కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి
2 జాతీయ గీతాలు - శిష్ట్లా సత్యనారాయణ
3. జాతీయ గీతాలు - గురజాడ రాఘవశర్మ
4,5. అరుణ కిరణాలు - కరుణశ్రీ

అని జాగరణాంజలి ఘటించారు.

'అస్పృశ్యత'పై అల్లిన శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారి

**అంటరాని వారెవరో కాదు**
**మా**
**వెంటరానివారే!**

అనే గీతం మానవతా మార్గంలో సాగనివారే నిజమైన అంటరాని వారంటూ మారుమ్రోగింది. దేశంలోని మారుమూలలదాకా అత్యంత ప్రచారం పొందింది.

స్వాతంత్ర్యోద్యమంకై స్వరమెత్తిన 'అస్పృశ్యత' రూపుమాపుటకై కూడ ఎలుగెత్తారు. 'హరిజనుల పాటలు' అను గ్రంథమే వెలువరించారు.

**ఎవరెన్ని చెప్పిన హిందూదేశవాసు**
**లేక సోదరులేనండి!**
**అంటు దోషము చాటుదామురండి!**
**ఈ కుంటి వాదనలు గూటిలో పెట్టండి!**

అంటూ భారతీయులంతా ఒక్కటనే భావాన్ని నొక్కి చెప్పారు. శిష్ట్లా సత్య నారాయణగారు

**మాల మాదిగలు కారు! భారత**
**మాత కన్న సుకుమారులు మీరు ॥ మాల ॥**
**అంటరాని తనమేదో? మా**
**కంటికి కనబడలేదే!**

అని 'జాతీయ గీతములు' ఎన్నో ఆలపించారు. జాతీయోద్యమ కాలంలో అంటరానితనాన్ని నిరసించడం నాయకుల ప్రచారాల్లో ప్రధానాంశాలుగా వుండేది. 'కరుణశ్రీ' గారు నాలుగు అగ్రవర్ణాలను అన్నయ్యలుగా, అయిదవ చిన్నవాడైన హరిజనుణ్ని (పంచముడు) తమ్ముడిగా, భారతిని తల్లిగా చేసి అల్లిన 'తప్పులేని తమ్ముడు' అనే గీతం 'అరుణకిరణాలు' గ్రంథంలో కరుణార్ద్రంగా కనిపిస్తుందిలా-

**..................................**
**అన్నలంతా గూడి 5+5=10**
**నన్ను కేటా జేసి 5+5=10**
**..................................**
**జట్టులో రానీక**
**నెట్టివేశారంచు**
**..................................**
**కడగొట్టు తమ్ముడని**
**గారాబు తమ్ముడని**
**కని కారమే లేని**
**కటిక రక్కసులార!**
**ఏ తప్పు జేశాడురా?**

**మీ సొమ్ము**
**ఏమి కాజేశాడురా?**

ఖండగతిలో భారతి గుండెను పిండినట్లు పలికిన వైనం, దళితజాతి దైన్యంతో పాటు చివరలో నిలదీసి ప్రశ్నించడమూ గోచరిస్తుంది. బసవరాజు అప్పారావుగారు కూడ

**గాంధి మహాత్మ...గాంధి మహాత్మ**
**...............................................**
**ఈ గోరమేమి? మా నేరమేమి?**
**మాల మాదిగలం మనుషులంగామా?**

అంటూ తమను కాచి రక్షించమంటూ గాంధీజీని అవతారపురుషునిగా కీర్తించారు.

**సిగ్గు లేదా? నీకు శెరము లేదా?**
**సీతాకోక చిలుక లాగ - సీమగడ్డ కట్టి తిరుగ**

అని విదేశ వస్త్రధారులను, బహిరంగంగానే మందలించారు. "జాతీయ గీతాలు"లో

**జయభేరి మ్రోగింది - జనులార లేవండి**
**జయము పొందెడు దాక - శాంతమూ లేదండి**

అని మల్లాది చంద్రశేఖరరావు సమరానికి జనాన్ని సమాయత్తం చేస్తూనే

**లెండోయి లెండోయి - తండోపతండాలు**
**రండోయి రండోయి - జండాలు చేబూని**

అని ఖండగతిలో విప్లవాహ్వానం పలికారు.

**జయ జయ జయ ప్రియభారత**
**జనయిత్రీ దివ్యధాత్రి!...**

అని కృష్ణశాస్త్రిగారు జాతీయోద్యమంకై దేశమాతను స్తుతించారు.

| | |
|---|---|
| **జయము జ్ఞాన ప్రభాకరా!** | **3+3+3+3=12 మాత్రలు** |
| **జయము శాంతి సుధాకరా!** | **3+3+3+3=12 మాత్రలు** |
| **జయము మోహ తమోహరా!** | **3+3+3+3=12 మాత్రలు** |
| **జయ జయ కరుణాకరా!** | **4+4+3=11 మాత్రలు** |

అని బ్రహ్మ సమాజ ప్రచారానికై జ్ఞాన ప్రభాకరుడైన ఈశ్వరుడొక్కడే అన్న నినాదంకై కమనీయ పల్లవులెన్నో అల్లారు. మూఢ విగ్రహారాధన విడనాడడానికి ప్రచారగీతంగా పనికి వచ్చేలా, 'శిథిలాలయమ్ములో - శివుడు లేడోయి' అని

**ప్రతి కోవెలకూ పరుగిడకు**
**ప్రతి బొమ్మకు కైమోడ్చకు**

అని రకరకాలుగా అద్భుతరచన చేశారు.

ఇలా బ్రహ్మసమాజ ప్రచారానికి, జాతీయోద్యమానికి అనేక గీతాలు వెలువడినట్లే, ఆంధ్రరాష్ట్ర అవతరణకూ అనేక కవులు తమ కలాల్ని కదను

దొక్కించి నూతన చైతన్యాన్ని రగలింపజేశారు 'ఆంధ్రజాతీయ గీతాల్ని' ప్రభవింపజేశారు.

## ఆంధ్రోద్యమ గీతాలు :

ప్రజాశక్తి ఆఫీసు 1945-46లో పుచ్చలపల్లి సుందరయ్య నేతృత్వంలో నిర్వహించిన 'ఆంధ్రజాతీయ గీతాల' రచనల పోటీలో

| | |
|---|---|
| పాడరా ఓ తెలుగువాడా! | 3+4+3+4=14 మాత్రలు |
| పాడరా ఓ కలిమిరేడా! | 3+4+3+4=14 మాత్రలు |
| ...................................... | |
| ఐదు కోటుల తెలుగుబిడ్డల | 3+4+3+4=14 మాత్రలు |
| ఐక్య కంఠము లొక్క పెట్టున | 3+4+3+4=14 మాత్రలు |
| జయము జయమని తెలుగుతల్లికి | 3+4+3+4=14 మాత్రలు |
| విజయగీతిక లాలపింపగ | 3+4+3+4=14 మాత్రలు |

అని కొండేపూడి లక్ష్మీనారాయణగారు మిశ్రగతిలో రచించిన యీ గీతానికి ప్రథమ బహుమతి లభించింది.[1] అయితే కొండేపూడి గీతంతో పాటు ఆంధ్రావని అంతటా అఖండ ప్రచారాన్ని - ప్రజాదరణను పొందిన గీతంగా శ్రీవేములపల్లి శ్రీకృష్ణగారి

చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి గలవోడా!
సాటిలేనీ జాతి - ఓటమెరుగని కోట
నివురు గప్పినేడు - నిదుర పోతుండాది
జైకొట్టి మేల్కొలుపు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి గలవోడా![2]

అనే గీతాన్ని పేర్కొనవచ్చు! ఇందులో బాలచంద్రుని, తాండ్రపాపారాయుని, కాకతి రుద్రమ్మ, మాంచాలల తెలుగువాడిని-వేడిని కీర్తించడం జరిగింది. అలాగే

వెనుక తరముల వారి
వీర చరితల సిరులు
నార్వోసి త్యాగంపు
నీర్వెట్టి పెంచరా
విరిసి సుఖములు పండురా!
పలనాడు
వెలలేని మాగాణిరా![3]

1 తెలుగులో ఉద్యమగీతాలు - డా॥ యస్వీ. సత్యనారాయణ పుట 176
2 ఆంధ్రజాతీయ గీతాలు - ప్రజాశక్తి ప్రచురణ
3 ఆంధ్రజాతీయ గీతాలు - ప్రజాశక్తి ప్రచురణ

అని పలనాటి ఉజ్జ్వల చరిత్రను ఉద్వేగంగా శ్రీపులుపుల వెంకటశివయ్య రచించారు. పై రెండు గీతాలూ ఖండగతిలో నడిచి అఖండ ప్రచారాన్ని పొందినవే!

1947-50 మధ్య కాలంలో జరిగిన సభల్లో, ముందుగా 'దేశమును ప్రేమించుమన్నా', 'చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా', 'పలనాడు వెలలేని మాగాణిరా' అనే పాటల్ని బి. గోపాలం గొంతెత్తి పాడేవాడని, ఆ తర్వాతనే సభలు ఆరంభమయ్యేవని తమ 'చేరాత'ల్లో డా. చేకూరి రామారావు రాశారు.[1] అనగా అవి ఎంతటి ప్రచారానికి ఉపకరించాయో అర్థమవుతోంది.

ఆ తర్వాత ఆంధ్రజాతీయ గీతంగా కాంగ్రెస్‌పార్టీ సభల్లోనూ, సమావేశాల్లోనూ శ్రీబెజవాడ గోపాలరెడ్డిగారి ప్రోత్సాహంతో మార్మోగిన పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు రచించిన

**త్రిలింగదేశం మనదేనోయ్! 4+4+4+2=14**
**తెలుంగులంటే మనమేనోయ్! 4+4+4+2=14**

**................................................**

**దేశభాషలా తీరుల్లోకి**
**ఆంధ్రమ్మంటే అతిమధురం!**
**రాయలు మనవాడోయ్-పండిత**
**రాయలు మనవాడోయ్!**
**కలం తిక్కనా - ఖడ్గ తిక్కనా**
**గణపతి దేవులు మనవారోయ్!**
**అమరావతి నాగార్జునకొండా**
**సిద్ధహస్తులా శిల్పాలోయ్!**

**........................................**

అనే గీతం ఆంధ్ర సంస్కృతిని అభివర్ణించడమేగాక, ఆంధ్రరాష్ట్రావతరణకు ఉత్తేజాన్ని కలిగించింది. కరపత్ర గీతంగా విశేష ప్రచారాన్ని పొందింది.[2] జగణం తో ఆరంభమైన పల్లవి జయభేరిగా మ్రోగింది. అక్కడక్కడ మధ్యలో మిశ్రగతి తొం చూసినా చతురస్రగతిలోనే ప్రధానంగా సాగింది.

అదే కాలంలో అనేక రాజకీయ, సాంస్కృతిక సమావేశాల్లో ప్రార్థనా గీతంగా ప్రాచుర్యం గాంచిన మరోగీతం, శ్రీశంకరంబాడి సుందరాచార్య రచించింది. అది -

**మా తెలుగు తల్లికీ మల్లెపూదండ = 5+5+5+2=18**
**మా కన్న తల్లికీ మంగళారతులు = 5+5+5+2=18**
**కడుపులో బంగారు-కనుచూపులో కరుణ = 5+5+5+5=20**
**చిరునవ్వులో సిరులు-దొర్లించు మాతల్లి = 5+5+5+5=20 ॥మా॥**

1 *ఆంధ్రజ్యోతి దినపత్రిక తేది. 10.10.1987*

2. *'ఆంధ్ర జాతీయ గీతము' శీర్షికతో కరపత్ర గీతంగా వేటపాలెంలోని 'సారస్వత నికేతనము' గ్రంథాలయంలో ఈనాటికీ భద్రంగా వుంది*

గల గలా గోదారి - కదలిపోతుంటేను = 5+5+5+5=20
బిరబిరా కృష్ణమ్మ-పరుగులిడుతుంటేను = 5+5+5+5=20
బంగారు పంటలే పండుతాయీ........... = 5+5+5+2=17
మురిపాల ముత్యాలు దొర్లుతాయీ....... = 5+5+5+2=17 ॥మా॥
రుద్రమ్మ భుజశక్తి-మల్లమ్మ పతిభక్తి = 5+5+5+5=20
తిమ్మరుసు ధీయుక్తి-కృష్ణరాయలకీర్తి = 5+5+5+5=20
మా చెవుల రింగుమని-మారుమ్రోగేదాక = 5+5+5+5=20
నీ పాటలే పాడుతాం-నీ ఆటలే ఆడుతాం =5+2+5+5+2+5=24
జై తెలుగు తల్లీ-జై తెలుగు తల్లీ[1] = 5+4+5+4=18 ॥మా॥

అనే గీతం 'కడుపులో బంగారు-కనుచూపులో కరుణ' అంటూ ఆంధ్రమాతను కనక గర్భగా - దయామయిగా అభివర్ణిస్తూ, సిరుల చిరునవ్వుల్ని చిందించే ఆ తల్లికి మల్లెపూదండను వేద్దామని కీర్తిస్తూ, త్యాగయ్య, తిక్కయ్య, రుద్రమ్మ, తిమ్మరుసు, కృష్ణరాయాదులు గడించి పెట్టిన కీర్తి తమ చెవులలో మారుమ్రోగాదాక ఆడుతూ పాడుతూ కలకాలం తెలుగుతల్లికి జై కొడుతూ జీవిద్దామనే భావన ఈ గీతమంతా సిరిమల్లెలా పరిమళించింది. అందుకే 1974లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం చేత ఆంధ్రుల జాతీయ గీతంగా ప్రకటించబడి పాఠ్యపుస్తకాలలోనూ విధిగా ప్రచురించబడింది. ప్రముఖ గాయని టంగుటూరి సూర్యకుమారి ఈ గీతానికి ఖండాంతరకీర్తి నార్జించి పెట్టింది. నాటినుండి నేటివరకు ఇంతటి ప్రచారాన్ని పొందిన మరొక గీతం లేదనే చెప్పవచ్చు!

ఈ గీతం ప్రధానంగా 20 మాత్రల పంక్తులతో ఖండగతిలో సాగింది. పల్లవి మాత్రం 18 మాత్రల పంక్తులతో 'మంజరీ ద్విపద'లా

**మా తెలుగు । తల్లికీ। మల్లెపూ।దండ**
**మా కన్న । తల్లికీ । మంగళా।రతులు**

నడిచింది. మధ్యలో 'బంగారు పంటలే'...అనే పంక్తులు 17 మాత్రలతోనే నిలిచాయి. అయితే చివరలో దీర్ఘంగా సాగదీసి పాడితే పూరణ జరుగుతుంది. అలాగే చివరి రెండు పంక్తులు 24,18 మాత్రలతో విరిగాయి. కాని అవి భావావేశ ప్రకటనకు అనుకూలంగా గొంతెత్తడానికి వీలయ్యాయి.

ఈ గీతం ముందు గ్రామఫోన్ రికార్డుగా తర్వాత చలన చిత్ర గీతంగా, క్యాసెట్ గీతంగానూ ప్రచారాన్ని పొందడం విశేషం!

ఆంధ్రరాష్ట్ర అవతరణ విషయంలో అటు కేంద్రప్రభుత్వానికిగానీ, ఇటు గాంధీజీకి గానీ శ్రద్ధలేదనే భావంతో

**రాదురా రాదురా రాష్ట్రం ఆంధ్రుడా!**
**వృథా కంఠశోష**
**......................**

1. స్వేచ్ఛాపథం (గేయ సంకలనం) - విశాలాంధ్ర ప్రచురణ

అసలీ ఆంధ్రుల విషయం శ్రద్ధ
ముసలి వానికే లేదూ!
అయినవారికి ఆకుల కూడూ
కాని వారికి కంచాలూ!

....................................

లేరా తమ్ముడ! తేరా రాష్ట్రం!
పరాపేక్ష వద్దూ![1]

అని పైడిపాటి ఆగ్రహంతో ఎలుగెత్తి, కర్తవ్య బోధ చేశారు.

తెలుగుబాలల హృదయాలలోనూ చైతన్యదీప్తుల్ని ప్రసరింపజేసిన నార్ల చిరంజీవి

దేశమేదన్నచో - తెలుగుదేశమనుము
జాతియేదన్నచో - తెలుగుజాతియనుము
వంశమేదన్నచో - తెలుగు వాడననుము
తెలుగు కీర్తిని చాటుము తెలుగుబిడ్డా![2]

అని ప్రబోధించారు.

తెలుగుదేశము నాది
తెలుగు వీరుడ నేను
తెలుగు జెండా ఏదిరా?
సోదరా?
తెలుగుజెండా లేదురా!

....................................

తెలుగు శౌర్యము నాలో
జీర్ణించి పోయింది!
తెలుగు ధైర్యము నాలో
జీవించి మెరిసింది
తెలుగు వీరుని కత్తి
తేజమొలికెడు నాడు

.................................

బానిసత్వము మాకు కలదా?
పారుబోతులు మాలో కలరా?[3]

అని జంపన చంద్రశేఖరరావు వీరావేశంతో ఆంధ్రజ్వాలల్ని రగిలింపజేశారు.

ఓ తెలివి మాలిన తెలుగువాడా!
దండలు చరిచే దండుగ వాడా!

..................................................

---

1. జయభారతి (గీతావళి) - పైడిపాటి సుబ్బరామశాస్త్రి
2 తెలుగు పూలు - నార్ల చిరంజీవి
3. ఆంధ్ర జ్వాల - జంపన చంద్రశేఖర రావు

దాసుడనంటూ దణ్ణం పెట్టేయరా!
నీ ఎదానకింకా
ఆంధ్రదేశం మాటలు ఎందుకురా?[1]

అని అడివిబాపిరాజు వ్యంగ్యంగా ఎత్తిపొడిచారు. ఆంధ్రోద్యమంలో శాంతి యత్నాల వల్ల ఫలితం లేదంటూ, నడుం బిగించడమే తక్షణ కర్తవ్యమంటూ

ఆంధ్ర యువక వీరులార!
ఆలసింపనేల నోయ్?

..............................

ఏక్-దో-తీన్-చార్
ఏకథాటిగాను నడిచి

..................................

నడుములు బిగియించి లెండు!
నదురు బెరుదు లేకరండు![2]

అని త్రిశ్రగతిలో శ్రీజాస్తి వెంకట నర్సయ్య పోరాటపు బాట చూపారు. మరోవైపు 'నిజాం రాష్ట్రం'లో రాచరికపు వ్యవస్థపై పోరాడుతున్న తెలంగాణా ప్రజానీకాన్ని మేల్కొలుపుతూ

తెలుగుబిడ్డా! మేలుకోవోయ్!
నైజాము
తెలుగుబిడ్డా లేచిరావోయ్! ॥ తె ॥
దున్ని చెమటోడ్చి ఈ
మన్ను బంగరు జేసి
కరువుతో చచ్చేటి
గతి ఏమి పట్టినది? ॥ తె ॥

అని సుంకర సత్యనారాయణగారు సూటిగా ప్రశ్నించారు. అంతేగాక

బిరాన లేచిరండు తెలుగు
బిడ్డలార ఒక్కటిగా
దురాగతాలు సేయుదేశ
ద్రోహి నణచి వేయగా ॥ బి ॥
ప్రజా విరోధి యెవ్వడైన
బ్రతుకలేడు నిశ్చయం - నిశ్చయం
ప్రజా బలాల ధాటి నాప
బ్రహ్మతరము గాదుపో!
................................ .. ॥ బి ॥

---

1 'మాతృభూమి' (8మే 1949) సంచికలోని గేయం

2 నవగీతాలు - జాస్తి వెంకటనర్సయ్య

పరాక్రమించి ప్రతిఘటించు
ప్రజల కెదురు లేదురా - లేదురా![1]

అని సమరశంఖం పూరించారు. చైతన్య శక్తుల్ని మండించారు.

కలమును కత్తిలా ఝళిపించి నిజాము నెదిరించి నిద్రాణమైన తెలంగాణాన్ని మేల్కొలిపిన దాశరథిగారు

| | |
|---|---|
| కోటిన్నర నోటి వెంట | 6+3+3=12 |
| పాటలుగా మాటలుగా | 3+3+3+3=12 |
| దిగిపొమ్మని - దిగిపొమ్మని | 6+6=12 |
| ఇదేమాట అనేస్తాను! | 3+3+3+3=12 |

వద్దంటే గద్దె ఎక్కి
పెద్దరికం చేస్తావా?
మూడు కోట్ల చేతులు నీ
మేడను పడదోస్తాయి!
మెడనే విడదీస్తాయి
నీకు నిలుచు హక్కులేదు
నీ కింకా దిక్కులేదు[2]

అని త్రిశ్రగతిలో తీవ్రస్వరంతో నిజాం నిరంకుశత్వపు రాచరికాన్ని నిలదీసి నిందించారు. 'విశాలాంధ్ర లో ప్రజారాజ్యం' నినాదం శీర్షికతో శ్రీశ్రీగారు

శక్తి కోసమే నడు!
ముక్తి కోసమే మను!
విముక్తి కోసమే మను
విశ్వశాంతి క్రాంతి కోస
మే మనస్సు లేకమై
నడూ నడూ! భయం గియం విడూ![3]

అని ప్రజారాజ్య స్థాపనకు ప్రతిఘటించుమని పిలుపునిచ్చారు.

అవంత్స సోమసుందర్‌గారు నిజాంరాజును నిలదీస్తూ

ఖబడ్దార్! ఖబడ్దార్
నైజాం పాదుషాయే!
హిందూ ముస్లిం పీడిత
శ్రమజీవులు ఏకమైరి!

అని హెచ్చరించారు. ఆ తర్వాత

ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు

1 'జయగీతి' (ప్రబోధ గేయాలు) - సుంకర సత్యనారాయణ
2. దాశరధి కవిత - మహాంధ్ర ప్రచురణలు
3. స్వేచ్ఛాపథం (గేయసంకలనం) - విశాలాంధ్ర ప్రచురణాలయం

ఒక నెత్తుటి బొట్టులోనె
ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు[1]

అని చారిత్రక సత్యాల్ని చాటి చెప్పారు ప్రజాకవిగా ఖ్యాతిగాంచిన సుద్దాల హనుమంతు

ఈ భూమి నీదిరా!
ఈ నిజాం ఎవడురా?

అని గర్జిస్తూ

రణభేరి మ్రోగింది తెలుగోడా!
రావోయి ముందుకూ మొనగాడా!
ఆంధ్రవీరులు బాలచంద్రులై లేవాలి
మగువలందరు రుద్రమాంబలై కదలాలి[2]

అని స్వరమెత్తడమే గాక సమరమే సాగించారు.

1948 లో విశాలాంధ్ర మాసపత్రికలో అచ్చయి. నిజాంకు వ్యతిరేకంగా అదే బాటలో వెలువడిన గీతాలలో 'యాదగిరి' గానం చేసిన

నైజాము సర్కరోడా!
నాజీల మించి నోడా!
.................................... ॥ నై ॥
మిషీను గన్నులు గాని
తుపాకి బాంబులు గాని
నీవెన్ని తెచ్చిన గాని
మేం లొంగిరాము కొడుకో!

.........................................
గోలకొండ ఖిల్లా కింద-నీ
గోరి కడతాం కొడుకో!
నైజాము సర్కరోడా- ॥ నై ॥

అనే గీతం అత్యంత ప్రచారాన్ని పొందింది. ఇట్టి గీతాలే తర్వాతి కాలంలో 'గద్దర్ పాటల'కు ఊపిరులయ్యాయి. అయితే నా ఈ అంశం లలితగీతాలకే పరిమితమైనందున ఉద్యమాల్ని ఉద్రూతలూగించిన ఆ గీతాలనన్నీ-పాటలనన్నీ విపులంగా చర్చించడం లేదు.

## విజయాంధ్ర గీతాలు:

ఆశించిన ఆంధ్రరాష్ట్ర అవతరణలో ప్రశంసాగీతాల్ని పలికించిన కవులనేకులున్నారు. వారిలో దామరాజు పుండరీకాక్షుడు

---

1 వజ్రాయుధం - సోమసుందర్ - విశాలాంధ్ర ప్రచురణాలయం

2 సుద్దాల హనుమంతు పాటలు

ఆడవే పాడవే అఖిలాంధ్ర జెండా!
ఎగురవే ఎగురవే ఓ తెలుగుజెండా!
ఆసేతు వింధ్యాద్రి - వేదాద్రి భద్రాద్రి
సింహాద్రి శిఖరాల - జైజైల వెలిశావు[1]

అని తెలుగు జెండాను కీర్తించారు. 1.11.1956 నాడు ఆంధ్రప్రదేశ్ అవతరించగానే ప్రజాకవి కాళోజీ నారాయణ రావుగారు

ఏమానందము - ఏమానందము
ఏమానందము ఈనాడు
..................................
అందరి పాలిటి అమర తరువుగా
ఆంధ్రదేశము ఈనాడు
అవతరించినది అవతరించినది
అవతరించినది ఈనాడు
......................................
ముక్కోటాంధ్రుల మొక్కులు చెల్లగ
ఒక్కటె ఆంధ్రము ఈనాడు[2]

అని పరవశించి పరమానందాన్ని చతురస్రగతిలో ప్రకటించారు.

.................................
చిమ్మ చీకటి రాత్రి
శిథిలమై పోయింది
తూర్పు వాకిట మరల
తొలిప్రొద్దు పొడిచింది[3]

అని పల్లా దుర్గయ్యగారు నవోదయాన్ని ప్రస్తుతించారు. రుద్రవీణల్ని మీటిన దాశరథిగారు దరహాసంతో

| | |
|---|---|
| ఎన్నాళ్లకు తెల్లవారె | 6+6=12 |
| ఎన్నాళ్లకు కన్నుదూరె | 6+6=12 |
| వెలుగు వెలుగు-వెలుగు వెలుగు | 3+3+3+3=12 |
| తెలుగు తెలుగు- తెలుగు తెలుగు! | 3+3+3+3=12 |

ఏది కాకతి? ఎవరు రుద్రమ?
ఎవరు రాయలు? ఎవడు సింగన?
అన్ని నేనే! అంతనేనే!
వెలుగు నేనే! తెలుగు నేనే![4]

---

1. విజయాంధ్ర గీతాలు (1954) దామరాజు పుండరీకాక్షుడు
2. గేయాంజలి - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌరసంబంధశాఖ
3. పాలవెల్లి - పల్లా దుర్గయ్య (తెలంగాణా రచయితల సంఘం)
4 దాశరథి కవిత - మహాంధ్ర ప్రచురణలు, మద్రాసు

అంటూ ఆనందోత్సాహాన్ని త్రిశ్రగతిలో వెల్లడించారు అంతా తానై పరవశించారు.

| | |
|---|---|
| ఆంధ్రరాష్ట్ర మవతరించె నోహో! | 3+3+3+3+4=16 |
| అంధయుగం బంతరించె నోహో! | 3+3+3+3+34=16 |
| సిందూరం వోలె తెలుగు | 6+3+3=12 |
| సీమ నేడు విలసించెను | 3+3+6=12 |
| మందారం వోలె తెలుగు | 6+3+3=12 |
| మాట నేడు వికసించెను | 3+3+6=12 |
| సంగీతం వోలె తెలుగు | 6+3+3=12 |
| నింగి నేడు నినదించెను | 3+3+6=12 |
| 'జలపాతం' వోలె తెలుగు | 6+3+3=12 |
| జాతినేడు ప్రవహించెను | 3+3+6=12 ॥ ఆంధ్ర ॥[1] |

అని శ్రీ సి. నారాయణరెడ్డిగారు త్రిశ్రగతిలో ఆంధ్రరాష్ట్ర అవతరణాన్ని అందంగా ఒకే తూగులో అభివర్ణించారు. తెలుగు మందారంలా వికసించిందని, సంగీతంలా నినదించిందని, జలపాతంలా ప్రవహించిందని పదాల్ని కూడ, ప్రవాహంలా పరుగెత్తించారు. పల్లవిలోనే 'ఆంధ్రరాష్ట్రమవతరించె' అనే పాదాలకు 'ఓహో' అని చివర అదనంగా చేర్చారు. అందుకే అవి 16 మాత్రల పంక్తులయ్యాయి.

ఈ విధంగా ఆంధ్రావతరణ సందర్భంగా వెలువడిన ఆనందగీతాలే గాక ఆ తర్వాత 'జై తెలంగాణా' (1969), 'జై ఆంధ్రా' (1972) వేర్పాటు వాద ఆందోళనల్లో అనేక ఆవేశగీతాలు, ఆ తర్వాత మళ్లీ సమైక్యాంధ్ర గీతాలు తలయెత్తాయి. విప్లవ ఉద్యమాలతో 'విరసం' గీతాలూ-గద్దర్ పాటలూ వ్యాప్తి చెందాయి. కాని అవన్నీ ఉద్యమగీతాలైనందున, వాటిపై ప్రత్యేకంగా పరిశోధనా గ్రంథమే వెలువడినందున వివరంగా పేర్కొనడంలేదు. ఈ గీతాలన్నిటికీ ప్రధానంగా పత్రికలే ప్రధాన వేదికలుగా నిలిచి ప్రచారాన్ని కలిగించాయి. ఆ తర్వాత వివిధ సంస్థలు ప్రచురించిన కావ్యాలూ దోహదం చేశాయి.

## గ్రామఫోన్ లలిత గీతాలు :

ప్రచురిత గ్రంథాలు, పత్రికలేగాక అనేక లలితగీతాలకు తొలినాళ్లలో గ్రామఫోన్ రికార్డులు అధిక ప్రచారాన్ని కలుగజేశాయి. ఈ గ్రామఫోన్ రికార్డుల్ని ఇ. బెర్లినర్ అనే శాస్త్రవేత్త 1887లో కనుగొన్నారు. గ్రామఫోన్ రికార్డు మీద చిన్నసూదిలాంటిది తిరుగుతూంటే అందులోంచి ధ్వనులన్నీ తిరిగి వినబడే వీలవుతుంది.

1 స్వేచ్ఛాపథం (గేయ సంకలనం) విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2

"Gramphone is an instrument, invented by E. Berliner in 1887 for reproducing sounds by means of a needle moving along the grooves of a revolving disc."[1]

మొదట్లో గ్రామఫోన్ రికార్డుల ద్వారా లలితగీతాలకు విశేష ప్రాచుర్యం కలిగించిన వారిలో రావుబాలసరస్వతీదేవి, యస్. రాజేశ్వరరావుగార్లు అగ్రగణ్యులు!

1935వ సంవత్సరంలోనే రావుబాలసరస్వతి ఆరేళ్ల బాలగాయనిగా, కొప్పరపు సుబ్బారావు రచించినట్టి

**పరమ పురుష పరంధామ**
**పతిత పావనా దేవ!**

అనే భక్తిగీతాన్ని పాడగా హెచ్.ఎం.వి. కంపెనీ రికార్డును విడుదల చేసింది.[2] మొదట్లో ఈ రికార్డింగ్ బెంగుళూర్‌లో జరిగింది.[3]

వయసుతో పాటు స్వరమాధుర్యమూ పెరిగాక రావుబాలసరస్వతి గాన సరస్వతిగా - లలితగీత సామ్రాజ్ఞిగా గణుతికెక్కింది. శ్రీయస్. రాజేశ్వరరావు స్వరపరచిన, శ్రీనివాస్ రచించిన

**ఆ తోటలో ఒకటి - ఆరాధనాలయము**
**ఆలయములోని అందగాడెవరే?**

అనే గీతాన్ని గోపికలా మధురభక్తితో మధురంగా పాడింది. శ్రీ కొనకళ్ల రచించిన

**ముసురేసిందంటే అసలే మతిపోతది మామో**
**మామా శశి చెడినట్లుంది లోలోన - ఓ బంగరు మామో!**

అని అమాయక పల్లె పడుచులా గొంతులో విరహార్తిని పలికించింది. సన్యాసిరాజు రచించిన,

**రావే రావే కోయిలా!**
**రాగము తీయవె కోయిలా!**

అనే పాటను యస్.రాజేశ్వరరావుతో కలిసి కలకోకిలలా స్వరమెత్తింది. ఈమె శ్రుతి పక్వమైన సుమధుర గానంలో వెలువడిన

**1. తుమ్మెదా ఒకసారి మోమెత్తి చూడమని**
**చెప్పవే నా మాట రాచిలకతోడ** (సన్యాసిరాజు)
**2. కోపమేల రాధా! దయచూపవేలనాపై?** (రజని)
**3. పొదరింటిలో నుండి**
**పొంచి చూచెదవేల?**

మొదలగు యుగళగీతాలు ఎన్నిసార్లు విన్నా మళ్లీ వినాలనిపించే మధురగీతాలే!

---

1. *Chambers 20th Century Dictionary (1983) Page : 545*
2. *'లలితగీతాల సామ్రాజ్ఞి - రావు బాలసరస్వతీదేవి 'వసుంధర' (ఈనాడు) 24.8.1993*
3. *రావు బాలసరస్వతీదేవితో ముఖాముఖి తేది. 26.2.1997*

1936లో ఈమె 'సతీ అనసూయ' చిత్రంలో గంగాదేవిలా నటించి పాటపాడింది. 1945లో వివాహం కావడంతో జమీందారీ పరదాల మాటున నిలిచి, నటనకు స్వస్తి పలికి, సి.ఆర్. సుబ్బరామన్ సంగీత దర్శకత్వంలో అనేక సినీ నేపథ్యగీతాల్ని కూడ పాడింది. సినిమాలలోనే గాక విడిగా పాడిన 'సృష్టిలో తీయనిది స్నేహమే నోయి, వ్యష్టి జీవము చేదు పానీయమోయి' అనే లలిత గీతం అత్యంత ప్రజాదరణ పొందింది. అందుకు కారణం స్నేహాన్ని అంతబాగా నిర్వచించడమే కావచ్చు! 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయి' అనే గీతాన్ని శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు రచించి మద్రాస్ హెచ్.ఎం.వి.రికార్డ్సు కంపెనీ వారు 1949లో నిర్వహించిన ఉత్తమగీతాల రచనల పోటీలో పాల్గొని ప్రథమ బహుమతి గడించినట్లుగా వారి కుమారుడైన శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారు నాతో చెప్పారు.[1] బసవరాజు అప్పారావు గీతాల్ని కూడ ఎక్కువగా పాడిన ఘనత ఈమెదే! 1945లో మంచాళ జగన్నాథరావు రచించిన

**బంగారు పాపాయి - బహుమతులు పొందాలి**
**పాపాయి చదవాలి మామంచి చదువులు**

అనే గీతాన్ని ఖండగతిలో ఆర్.బాలసరస్వతి మృదుమధురంగా గానం చేయగా రికార్డుగా వెలువడింది. 1946-48 లో సదాశివ బ్రహ్మంగారి-

**1. గోపాల కృష్ణుడు నల్లన - గోకులంలో పాలు తెల్లన,**

వడ్డాది గారి జావళియగు

**2. సరగున రారా! సమయమిదేరా!**
**సరసుడవని నీ సరసకు చేరితిరా!**

సన్యాసి రాజుగారి

**3. నిను నమ్మితి నోయీ రావో రావే?**
**4. ఆ తోటలో ఒకటి ఆరాధనాలయము**
**5. ప్రేమ జగమిదే! కడుప్రీతియగునదే!**
**6. పున్నమి చంద్రుడు ఉదయించెనుగా...**

రజని గారి

**7. 'ఓవిభావరీ! ఓహో విభావరీ!'**

మొదలగు గీతాల్ని ఆర్.బాలసరస్వతి వీనుల విందుగా గానం చేసింది.[2] శ్రీ రజనీ కాంతరావు రచించి స్వరపరిచిన

**పసిడి మెరుంగుల తళతళలు**
**మిసిమి వెలుంగుల మిలమిలలు**
**గౌతమి కృష్ణల గలగలలు**
**గుడి జేగంటల గణగణలు**

అనే గీతాన్ని సినీనటి, గాయని, పి. భానుమతితో కలిసి పాడడం విశేషం! ఆ రోజుల్లోనే శాంతకుమారిగారు కూడ

---

*1 ఇంద్రగంటి శ్రీకాంతశర్మతో ముఖాముఖి తేది. 13 2.1997*

*2. రావు బాలసరస్వతితో ముఖాముఖి 26 2.1997*

ముజ్జగమ్ములు మోహించగ
మురళిని మ్రోయింపుమురా! కృష్ణా!...

అని కృష్ణుని మీద అల్లిన భక్తిగీతాన్ని శ్రావ్యంగాపాడగా రికార్డు వెలువడింది.

విజయనగరం సంగీత కళాశాలలో ద్వారం వెంకటస్వామి నాయుడు గారి వద్ద గాత్రం నేర్చుకొని, మధుర స్వర సాగరంగా, లలితగీత తరంగంగా పేరుగాంచిన డా. సాలూరు రాజేశ్వరరావుగారు మొదట్లో అనేక భావగీతాల్ని పాడారు. ఆ తర్వాత స్వరాల్ని కూర్చారు. 'సితార' కోసం వారిని ఈ వ్యాసకర్త ఇంటర్వ్యూ చేయగా తెలిసిన విషయాల ఆధారంగా 1945లో వీరు పాడిన

1. కలగంటి కలగంటి తుమ్మెదా!
(రచన : సాలూరు సన్యాసిరాజు, రాజేశ్వరరావుతండ్రి గారు)
2. ఓ విభావరీ! ఓహో విభావరీ!
(రచన : బాలాంత్రపు రజనీ కాంతరావు)
3. చల్లగాలిలో యమునా తటిపై....
(రచన : బాలాంత్రపు రజనీకాంతరావు)
4. యాత్రికుడా! ఓ యాత్రికుడా!
(రచన : మల్లవరపు విశ్వేశ్వరరావు)

అనే లలితగీతాలు ఎల్.పి. రికార్డ్స్‌గా విడుదలయ్యాయి. విశేష ఖ్యాతిని కలిగించాయి. రావు బాలసరస్వతిచే వీరు 'ఆ తోటలో ఒకటి ఆరాధనాలయము', 'పాదరింటిలో నుంచి పొంచి చూచెదవేల?' అను లలితగీతాల్ని మధుర బాణీల కూర్చి పాడించారు. దాదాపు తెలుగు సినిమా టాకీ యుగపు ఆదిమదశ నుండి ఆధునిక దశ వరకు అనేక అమర బాణీలను సమకూర్చిన సాలూరు రాజేశ్వరరావుగారు, ఆపాత మధుర స్వరాలతో 'రసాలూరు' రాజేశ్వరరావుగా లలితసంగీతగాయక, దర్శకులుగా రాణకెక్కారు.[1]

టంగుటూరి సూర్యకుమారిగారు తొలినాళ్లలో గ్రామఫోను రికార్డులకై అనేక లలితగీతాల్ని పాడారు.

1. మామిడి చెట్టును అల్లుకున్నదీ
మాధవీ లతొక్కటీ!............
2. ఒంటిగా నుయ్యాల లూగితివా?
నా ముద్దు కృష్ణా!...........

అనే గీతాల్ని టంగుటూరి సూర్యకుమారిగారు,

1. గుత్తొంకాయ్ కూరోయ్ బావా!
కోరి వండి నానోయ్ బావా!
2. పన్నెండేళ్ల చిన్నాడే
పైట కొల్ల గొన్నాడే!

---

1. 'మధురస్వరసాగరం డా. సాలూరురాజేశ్వరరావు' - వడ్డేపల్లి కృష్ణ -సితార 25.7.1993

3. ఎల్లాగెక్కువా?
ఇంకెల్లాగెక్కువా?

అనే గీతాల్ని బందా కనక లింగేశ్వరరావు భావ యుక్తంగా పాడి గ్రామఫోను రికార్డుల ద్వారా పై గీతాల రచయితయైన బసవరాజు అప్పారావుగారికి అధిక ప్రచారాన్ని కలుగజేశారు. శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి

**మా తెలుగు తల్లికీ - మల్లెపూదండ**
**మా కన్నతల్లికీ - మంగళారతులు**

అనే గీతాన్ని శ్రావ్యంగా గానం చేయడం చేత ఆ గీత రచయితయైన శ్రీ శంకరంబాడి సుందరాచారిగారికి ఒకే పాటతో అఖండ అపూర్వఖ్యాతి లభించింది. బసవరాజు రచించిన

**లేపనైనా లేపలేదే!**
**మోము**
**చూపనైనా చూపలేదే!**

అనే గీతాన్ని, రాయప్రోలు రచించిన

**నమో మంగళశ్రీ మహా మాతృభూమే**
**నమో భారతాఖ్యా సవిత్రీలలామే**

అనే మాతృభూమి గీతాన్ని కూడ టంగుటూరి స్వాతంత్ర్యయుగోదయానికి ముందే శ్రావ్యంగా పాడారు.

బాలాంత్రపు రజనీకాంతరావు రచించిన

**1. శతపత్ర సుందరీ! ఓహో శతపత్ర సుందరీ!**
**2. మాదీ స్వతంత్రదేశం**
**3. ఎత్తవోయి నీ జేజెండా!**
**4. హే భారత జననీ!**
**స్వేచ్ఛా గగన వీథీ విహారిణీ!**
**5. ఉదయమ్మాయెను స్వేచ్ఛాభారత**
**ఉదయమ్మాయెనహో!....**

అనే గీతాల్ని పాడగా, రికార్డులుగా వెలువడ్డాయి.

**పాడవే రాట్నమా! ప్రణవ భారతగీతి**
**కదలాడునన్నాళ్లు కరువులే లేవాయె!**

అని సహాయ నిరాకరణోద్యమ ప్రచారానికి పనికి వచ్చేలా రికార్డు వెలువడింది. తర్వాత చెప్పుకోదగిన ప్రసిద్ధగాయకులలో ఎం.ఎస్.రామారావుగారు ఎన్నదగినవారు. వీరు నండూరి రామమోహన్‌రావుగారు రచించిన

**వెళ్లిపోయే వెన్నెలయ్యా!**
**మళ్లివచ్చే దెన్నడయ్యా?**

అనే గీతాన్ని మధురంగా ఆలపించారు. వీరే స్వయంగా రచించి గానం చేసిన

ఓ జహాపనా!...
ఈ ప్రశాంత నిశాంత
ఏకాంత సౌధములో
నిదురించు ఓ జహాపనా!

అనే 'తాజ్‌మహల్' గీతం రికార్డుగా వెలువడి బహుళ ప్రచారం పొందింది ఆ తర్వాత వీరు పాడిన

ఓహోహో పిల్లదాన!
వగలమారి పిల్లదాన!

అనే గీతం కూడ జానపద బాణీలో అందర్నీ ఆకర్షించింది. ఆ తర్వాత

పడవ నడపవోయి!
పూల పడవ నడపవోయి!

అనే లలిత గీతం ప్రాచుర్యాన్ని పొందింది. గాన గంధర్వుడిగా పేరుకెక్కిన ఘంటసాల, ప్రప్రథమంగా పేకేటి శివరాం ప్రోత్సాహంతో H.M.V. రికార్డింగ్ కంపెనీకై 1946-47లో రత్నాకరరావు రచించిన

గాలిలో నా బ్రతుకు
తేలిపోయిన దోయి!

అనే గీతాన్ని ఆలపించారు.[1] ఆ తర్వాత తోలేటి రచించిన

1. అమ్మా! సరోజినీ దేవీ!
   పరిపూర్ణ సువర్ణ కళామయజీవీ!
2. స్వాతంత్ర్యమె నా జన్మహక్కనీ చాటండీ!

అనే గీతాల్ని ఆలపించి వారి రచనలకు మంచి ప్రచారం కలిగించారు. ఆ తర్వాత కొనకళ్ల వెంకటరత్నం జానపద ధోరణిలో రచించిన

చింత చిగురు చిన్నదానా!
లేత వయసు వగరుదానా!
రాయే నా చెంతజేర
రాయే నీ సోకుమాడ

అనే గీతాన్ని, సముద్రాల రచించిన ('మనదేశం' చిత్రంలో కూడ తర్వాత చేర్చబడిన)

నిన్ను నేను మరువలేనురా!
ఓ పోలీసెంకటసామి!
నిన్ను నేను మరవలేనురా!

అనే గీతాన్ని చక్కటి భావప్రకటనతో పాడగా అధిక ప్రచారం చేకూరింది. శ్రీ రావులపర్తి భద్రిరాజు రచించిన

1. నమో వేంకటేశా! ఈశా!
   నమో శ్రీనివాసా!

1. *పేకేటి శివరాం గారితో ముఖాముఖి - తేది 8.10.1997*

2. ఏడు కొండల స్వామీ!
ఎక్కడున్నావయ్యా?
ఎన్ని మెట్లెక్కినా
కానరావేమయ్యా?
3. నీ కొండకు నీవే రప్పించుకో!
ఆపద మొక్కులు అన్నీ యిప్పించుకో!

అనే గీతాల్ని భక్తి భావ గర్భితంగా ఆలపించి, అఖిలాంధ్రుల మన్నన లందుకున్నారు.

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు రచించిన
చక్కని చుక్కల సఖ్యము మరిగిన
చందమామ రావోయీ!

అనే గీతాన్ని శ్రీమతి కమలా చంద్రబాబు కమనీయంగా గానం చేయగా రికార్డు వెలువడింది.

## సినిమాల్లో లలిత గీతాలు :

చలన చిత్రాల్లో సాహిత్యపు విలువలుగల అనేక భావగీతాలు అగుపిస్తాయి. అయితే వాటి మీద ప్రత్యేకంగా మూడు పరిశోధనా సిద్ధాంత వ్యాసాలు వెలువడినందున నా పరిధిలోకి రావని ఇదివరకే మనవి చేయడమైంది. కాని లలితగీతాలుగా ముందే ప్రచారం పొంది, తర్వాత సినిమాలలో చోటుచేసుకున్న కొన్నింటిని మాత్రం విధిగా పేర్కొనాల్సివుంది. కావున వాటిని మాత్రం వివరిస్తాను.

అడుగుజాడ గురజాడదిగా - సినిమాల్లో ఎన్నో దేశభక్తిగీతాలు రావడమే కాదు- ఆయన రచించిన

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
..............................................

అనే గీతాన్ని 'సొంతలాభం కొంతమానుకు పొరుగువాడికి తోడుపడవోయ్' అనే చరణం వరకు 'జ్యోతి' చిత్రంలో ఉపయోగించుకున్నారు. రాయప్రోలు 'జన్మభూమి' లోని

ఏ దేశమేగినా - ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా -ఎవ్వరేమనినా
..............................................

మొదలగు పంక్తుల్ని 'కాలచక్రం' (1940) 'అమెరికా అబ్బాయి' (1987) చిత్రాల్లో ఉపయోగించుకున్నారు. భావగీతాలే మొట్టమొదటి సినిమా పాటలుగా వచ్చిన ఖ్యాతి కూడా బసవరాజు అప్పారావుదే!

గూడవల్లి రామబ్రహ్మం దర్శకత్వం వహించిన చిత్రాల్లో వరుసగా బసవరాజు పాటలు చోటు చేసుకోవడంవల్ల ఆనాడు లలితగీతాల (భావగీతాల) కెంతటి

ప్రాశస్త్యముందో తేటతెల్లమవుతోంది. అట్టి గీతాల వివరాలు

I 'మాలపిల్ల' (1938) చిత్రంలో

1. నల్లవాడే గొల్లపిల్లవాడే
2. చిలిపి చేష్టలు జేయ చెట్టునకు గట్టిరా!
3. ఆ మబ్బు ఈ మబ్బు ఆకాశమధ్యాన....
4. కొల్లాయి గట్టితేనేమి? మా గాంధి కోమటైబుట్టితేనేమి?

II 'రైతుబిడ్డ' (1939) చిత్రంలో

1. కోయిలొక సారొచ్చి కూసిపోయింది
2. రాబోకు రాబోకురా చందమామ<br>రాహువు పొంచున్నాడురా తోవలోన

III 'ఇల్లాలు' (1940) చిత్రంలో

1. వాడిన పువ్వున కేటికి మరలను<br>పరిమళ మొసగెదుదేవా?
2. కావ్య పానము చేసి కైపెక్కినానే!
3. దినదినము పాపణ్ణి దీవించిపొండి!

IV 'అపవాదు' (1941) చిత్రంలో

1. ఈ మావిపై నుండి ఈవు కూకూయంచు
2. రావాలంటే త్రోవే లేదా?<br>దేవదేవుడౌ నా నాథునకు
3. పానకమ్ములో పుడకనేటికిటు<br>పడవేసితివో దేవా?
4. పదిమందిలోన పాటపాడమని<br>బలవంతము చేయకు నాథా!

V 'పంతులమ్మ' (1943) చిత్రంలో

1. కోయిలా కోయిలా కూయబోకే<br>కూసి నా గుండియలు కోయబోకే

(మాతృక : గుండెలూ బద్ధలూ చేయబోకే)

గూడవల్లి మరణానంతరం ఇతరుల చిత్రాల్లో కూడ బసవరాజు గీతాలు ప్రవేశించాయి. అందుకు ఉదాహరణగా -

VI 'ఏది నిజం'? (1956) చిత్రంలో

1. గుత్తొంకాయ్ కూరోయ్ బావా!<br>కోరి వండినానోయ్ బావా!

VII 'మాయపిల్ల' (1951) చిత్రంలో

1. దాసిగా నుంటకైన తగనా ప్రాణేశ?

VIII 'కన్యాశుల్కం' (1955) చిత్రంలో

1. నీ పుట్టదరికి నా పాప లొచ్చేరు

పాప పుణ్యముల వాసనేలేని
బ్రహ్మ స్వరూపులౌ పసికూనలోయి!
కోపించి బుస్సలు కొట్టబోకోయి!

ఇలాంటి లలిత గీతాలెన్నో సముద్రాల వంటి వృత్తి కవులు వ్యావహారిక భాషలో సినిమా పాటలు రాస్తున్న కాలంలో కూడ వెండితెర కెక్కడం విశేషమే!

'కన్యాశుల్కం' (1955) సినిమాలో బసవరాజు 'నాగుల చవితి' గేయంతో పాటు గురజాడ 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ' కవిత, 'మహాప్రస్థానం'లోని శ్రీశ్రీ 'అద్వైతం' కవిత యథాతథంగా ఉపయోగింపబడ్డాయి.[1]

బసవరాజు తర్వాత బావగీతాలు సినిమా పాటలుగా రాణించిన కవుల్లో దేవులపల్లి అగ్రగణ్యులు! వారి పాటల్లో అనేకం ముందుగా ఆకాశవాణిలో ప్రసారమైనవే! వీటిలో కొన్ని ఆయన బ్రతికివుండగా వస్తే ఎక్కువగా మరణానంతరం వచ్చాయి.

1. మనసున మల్లెల మాలలూగెనే.......(మల్లీశ్వరి)
2. ఏమిరామకథా శబరీ శబరీ.......(భక్త శబరి)
3. పదములె చాలును రామా!............(బంగారు పంజరం)
4. గట్టుకాడ ఎవరో? సెట్టు నీడఎవరో? (బంగారు పంజరం)
5. పాటు పోటు సూసుకొని, ఏరుదాటి రావాలా (బంగారు పంజరం)
6. పువ్వునమ్మా పువ్వును - గడ్డి పువ్వును

మొదలగు గీతాలు కృష్ణశాస్త్రి జీవితకాలంలో సినిమా పాటలుగా వచ్చిన లలితగీతాలు. వీటిలో 'పదములె చాలును రామా!' అనే పాటను రేడియో బాణీలోనే సినిమాలో ఉపయోగించారు. కృష్ణశాస్త్రిగారు 'మల్లీశ్వరి' చిత్రానికి రాసిన ప్రతిపాట లలితగీతంగా నిలిచిపోయేదే!

1. కొలువైతివా రంగశాయి! (ఆనంద భైరవి)
2. జయ జయ జయ ప్రియభారత
   జనయిత్రీ దివ్యధాత్రి! (రాక్షసుడు)

(ఈ గీతాన్ని 1933లో పి.ఆర్. కళాశాల (కాకినాడ) లో తెలుగు అధ్యాపకుడిగా పనిచేస్తున్న రోజుల్లోనే కృష్ణశాస్త్రి విద్యార్థులకోసం రాయగా ఆ తర్వాత సీత, అనసూయలు పాడగా ఆకాశవాణిలో విస్తృత ప్రచారం పొందింది.[2])

3. వెన్నెలల వేళలోనే వేణువూదేనా
   వేణువూదిన వేళలోనే వెన్నెలాయేనా?
   (ఒక అమ్మాయి కథ)
4. మధుమురళీ! మృదు మురళీ!
   (పెళ్లి మీకు అక్షింతలు మాకు)
5. ఆకులో ఆకునై - పువ్వులో పువ్వునై (మేఘ సందేశం)

---

1. తెలుగు సినిమా పాట - పైడిపాల పుట 222, 223
2. వింజమూరి సీతతో ముఖాముఖి 27 12 1995

6. సిగలో అవి విరులో (మేఘ సందేశం)
7. ముందుతెలిసెనా ప్రభూ (మేఘ సందేశం)
8. శీతవేళ రానీయకు (మేఘ సందేశం)

మొదలగు లలితగీతాలు కృష్ణశాస్త్రి మరణానంతరం చలన చిత్ర గీతాలుగా చలామణి అయ్యాయి. ఒకే కవి రాసిన నాలుగు లలిత గీతాల్ని ఒకే చిత్రంలో (మేఘ సందేశం) ఉపయోగించిన ఘనత ప్రముఖ దర్శక-నిర్మాత దాసరికే దక్కుతుంది. బహుశ అతనికి వెన్నెముకగావున్న పాలగుమ్మి పద్మరాజుగారి ప్రోద్బలమే కారణం కావచ్చు!

కృష్ణశాస్త్రి 'రాజమకుటం' చిత్రం కోసం రాసిన

సడిసేయకే గాలి-సడిసేయబోకే
బడలి ఒడిలో రాజు పవళించెనే!

అనే లలిత గీతం ఎన్నదగినది.

లేపకే నా యెంకి- లేపకే నిదురా
ఈపాటి సుకము నేనింతవరకెరుగనే!

అనే పాట 'ఎంకిపాట' స్ఫూర్తితో అవతరించినట్లు అగుపిస్తుంది.

ప్రణయ గీతాల్లో నండూరి ఎంకి పాటలకున్న ప్రత్యేకతను గమనించిన సినిమా కవులు వీలున్న చోటల్లా ఆ బాణీలను ఉపయోగించుకోగా 'ఎంకి-నాయుడు బావ' పేరుతో ఒక చిత్రమే రావడం విశేషం!

ఎంకివంటి పిల్ల లేదోయ్ లేదోయ్
ఎంకి నా వంకింక రాదోయ్ రాదోయ్

అని నండూరి రాసిన పాట ప్రేరణతో, పల్లెటూరి పిల్ల (1950) సినిమాలో

శాంతవంటి పిల్ల లేదోయ్ లేదోయ్
జగమంత వెదికిన లేదోయ్ లేదోయ్

అని తాపీ ధర్మారావు అనుకరణ రచన చేశారు. అలాగే

దూరాన నా రాజుకే రాయిడౌనో
ఈరోజు నా రాత లేరాలపాలో

అనే ఎంకి పాటకు 'పల్లెపడుచు' చిత్రంలోని

నను చేరడేలనే నారాజు
గడువేల మీరెనే ఈ రోజు

అనే పాట అందమైన అనుసరణగా తోస్తుంది.

'దాగుడు మూతలు' చిత్రంలో ఆత్రేయ

ఎంకొచ్చిందోయ్ మామా!
ఎంకొచ్చింది...
ఎంకొచ్చి నీ కోసం
ఏమో తెచ్చింది

అని కథానాయికను ఎంకితో పోల్చి పాట రాశారు. ఇలా నండూరి

ఎంకిపాటలు కూడ రకరకాల అనుసరణ, అనుకరణతో 'వెండితెర' కెక్కాయి. అలాగే త్రిపురనేని రామస్వామి చౌదరి ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా రాసిన

వీరగంధము తెచ్చినారము
వీరుడెవ్వడొ తెల్పుడీ
పూసి పోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో
..................................

అనే గీతం కూడ స్వల్పమార్పులతో 'జయం మనదే' చిత్రంలో

వీరగంధము తెచ్చినామయా
వీరులెవరో లేచి రండయా
శూరులెవరో లేచి రండయా
వీరగంధము పూసుకొంటాం
వీర రక్తము ధారపోస్తాం

అని 'కొసరాజు' రచనగా ప్రచారం పొందింది.

1952 నాటికి ఆంధ్రోద్యమం తీవ్రరూపం దాల్చగా ఆ సంవత్సరమే విడుదలైన 'పల్లెటూరు' చిత్రంలో

చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి గలవాడా!

అని అంతకుముందే ప్రచారంలో నున్న వేములపల్లి శ్రీకృష్ణగీతం ఘంటసాల బాణీలో మారుమ్రోగింది.

గూడవల్లి రామబ్రహ్మంగారి వల్ల బసవరాజు భావగీతాలు సినిమాల్లో ప్రవేశించినట్లే, ఆమంచర్ల గోపాలరావు 'కాలచక్రం' చిత్రం (1940) తో శ్రీశ్రీ 'మహాప్రస్థానం'లోని

మరో ప్రపంచం మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు పదండి త్రోసుకు
పోదాం పోదాం పైకి

అనే గీతం కొన్ని మార్పులు, చేర్పులతో అభ్యుదయ గీతంగా సినీరంగంలో అడుగుపెట్టింది. ఇలా స్వల్పమార్పులతో కొన్ని, యథాతథంగా కొన్ని శ్రీశ్రీ 'మహాప్రస్థానం' లోని అనేక కవితలు సినిమాల్లోకి ప్రవేశించి ప్రచారం పొందాయి[1]. వాటి వివరాలు-

1. అనురాగం అంబరమైతే (మరదలుపెళ్లి)
   ఆనందం సాగరమైతే
   స్వర్గానికి నిచ్చెన వేస్తాం
   మరణానికి ప్రాణం పోస్తాం

('ఆనందం అర్ణవమైతే...' గీతికి స్వీయానుసరణ)

1. తెలుగు సినిమా పాట - పైడిపాల పుట - 37

2. నేను సైతం విప్లవాగ్నికి (స్వరాజ్యం)
సమిధనొక్కటి ఆహుతిస్తాను
('నేను సైతం ప్రపంచాగ్నికి' - అనుకరణ)
3. చూడు చూడు నీడలు- నీడలు పొగమేడలు (స్వరాజ్యం)
యుగయుగాల దోపిడిలో - తరతరాల రాపిడిలో
..........................................................................
4. ఏ దేశ చరిత్ర చూసినా (రణభేరి)
ఇంతేలే వీరుల గాథ!
(ఏమున్నది గర్వకారణం - మూలం)
5. పదం పాడుతూ కదం తొక్కుతూ (సిపాయి కూతురు)
నిరంకుశత్వం సాగదు!
(హృదంతరాళం గర్జిస్తూ - మూలం)
6. ఏవి తల్లీ నీదు ఆశల పసిడి స్వప్నాలు (ప్రజాస్వామ్యం)
ఏవి తల్లీ నీవు తలచిన భావిస్వర్గాలు
ఏవి తల్లీ? ఏవి తల్లీ?
('ఖడ్గసృష్టి'లోని 'ఏవి తల్లీ' గీతికి అనుసరణ)

'ఆకలిరాజ్యం', 'యుగకర్తలు', 'సంకల్పం' చిత్రాల్లో దాదాపు 'మహాప్రస్థానం' కావ్యమంతా సన్నివేశానుగుణంగా అక్కడక్కడ ఉపయోగించబడింది. తద్వారా అధిక ప్రచారం పొందబడింది.

శ్రీశ్రీ 'వెలుగు నీడలు' చిత్రంలో రాసిన
1. పాడవోయి భారతీయుడా!
ఆడి పాడవోయి విజయగీతికా!
2. కలకానిది-విలువైనది, బ్రతుకు
కన్నీటిధారలలోనే బలి చేయకు!
3. తెలుగువీర లేవరా! దీక్షబూని సాగరా! (అల్లూరి సీతా రామరాజు)

మొదలగు గీతాలన్నీ లలిత గీతాలుగా రాణించేవే! శ్రీశ్రీ తర్వాత చెప్పుకోదగిన అభ్యుదయ కవియగు ఆరుద్ర గీతాలు కూడా సినిమా పాటలుగా రాణించాయి. అందులో-
1. పడుచుదనం రైలుబండి పోతున్నది (పెంకి పెళ్లాం)
వయసు వాళ్ల కందులో చోటున్నది
2. సిగ్గులు చిగురించెనే (వీరకంకణం)
బుగ్గలు ఎరుపెక్కెనే

అనే గీతాలు ముందుగా ఆకాశవాణి మదరాసు కేంద్రం ద్వారా 1955లో 'తమాషాలూ- తారాజువ్వలూ' కార్యక్రమంలో ప్రసారమైన లలితగీతాలే![1]

ఆ తర్వాత ఆరుద్ర రాసిన,

1. ఆరుద్రతో ముఖాముఖి 10.4.1995

'వేదంలా గోదావరి ప్రవహిస్తోందే తల్లీ!
వెన్నెల వలె కృష్ణవేణి విహరిస్తోందే చెల్లీ!'

అనే లలితగీతం 'ఆంధ్రకేసరి' చిత్రంలో ప్రవేశించి మరింత ప్రచారానికి నోచుకున్నది. ఆరుద్ర 'ఉయ్యాల-జంపాల' చిత్రంకై రాసిన సినిమాపాటలు చాలవరకు లలిత గీతాల పాదులో వికసించినవే! ఆ తర్వాత శంకరంబాడి సుందరాచారి రచించిన

మా తెలుగు తల్లికీ మల్లెపూదండ
మా కన్నతల్లికీ మంగళారతులు

అనే లలితగీతం ముందుగా 'పరాశక్తి' చిత్రంలో, తర్వాత 80వ దశకంలో వచ్చిన 'బుల్లెట్', 'తెలుగు వైభవం' చిత్రాలలోనూ చోటుచేసుకొని విశేష ప్రచారం గాంచింది.

అనేక గేయాలూ, గేయకావ్యాలూ రచించి లబ్ధ ప్రతిష్ఠులైన డా.సి.నారాయణ రెడ్డిగారి లలితగీతాలు కూడా సినిమాలలో ప్రవేశించి అధిక ప్రచారాన్ని పొందాయి.

ఈ నల్లని రాలలో - ఏ కన్నులు దాగెనో?
ఈ బండల మాటున - ఏ గుండెలు మోగెనో?

.......................................................................

అనే లలితగీతం 'అమరశిల్పి జక్కన' చిత్రంలో అద్భుతంగా అమరింది. అలాగే

మబ్బులో ఏముంది?
నా మనసులో ఏముంది?

.........................................

అనే యుగళ లలితగీతం 'లక్షాధికారి' చిత్రంలో సలక్షణంగా చోటుచేసుకుంది! "మొదట 'ఆకాశవాణి'కి పాలగుమ్మి విశ్వనాథం కూర్చిన లలిత స్వరాలకన్నా 'జముకల కథ' లోని అచ్చమైన జానపదుల బాణీ ఆధారంగా శ్రీతాతినేని చలపతిరావు కూర్చిన స్వరాల వైశిష్ట్యం వల్ల పాట మిక్కిలి ప్రజాదరణ పొందింది"అని డా.సి.నా.రె. గారు పేర్కొన్నారు.[1]

కలువపూల చెంతజేరి
కైమోడుపు సేతును నా
కలికి మిన్న కన్నులలో
కలకలమని విరియాలని

.....................................

అనే గేయాన్ని 'ఏకవీర' చిత్రంలో పద్యంలా హృద్యంగా ప్రవేశపెట్టారు. 'ఏకవీర' చిత్రం లోని ప్రతిగీతం, 'పూజాఫలం' చిత్రంలోని 'పగలే వెన్నెల-జగమే ఊయల','నిన్నలేని అందమేదో' పాటలు లలితగీతాల కోవలోనివే! అపార్థాలతో 'ఆంధ్ర', 'తెలంగాణా' ప్రాంతీయ వైషమ్యాలతో కొట్టుకు చస్తున్న తెలుగుసోదరుల్ని ఉద్దేశిస్తూ, సమైక్యతను ప్రబోధిస్తూ అల్లిన

1. పాటలో ఏముంది. నా మాటలో ఏముంది? డా సి నా రె పుట 23

**తెలుగుజాతి మనది - నిండుగ వెలుగు జాతి మనది**
**తెలంగాణా నాది, నెల్లూరు నాది**
**అన్నీ కలసిన తెలుగు నాడు మనదే మనదే మనదేరా!**

అనే గీతం అప్పటి ప్రముఖ దినపత్రికలో ప్రచురించబడినట్లుగా సి.నా.రె. గారు, 'తల్లా-పెళ్లామా'? చిత్రం తీస్తున్న సందర్భంగా శ్రీ ఎన్.టి.ఆర్‌కు తెలియజేయగానే, వారు ఉత్సాహంతో దానికి సన్నివేశం లేకున్నా కల్పించి, ఆ పాటనందులో ప్రవేశపెట్టారు. తెలుగువారందరికీ సమైక్యతా పథాన్ని చూపెట్టారు.[1]

అదే బాటలో ముందుగా పత్రికలో, తర్వాత కావ్యంలో ప్రచురితమైన

**నా దేశం భగవద్గీత! నా దేశం అగ్నిపునీత, సీత!**
**నా దేశం కరుణాంతరంగ! నా దేశం సంస్కారగంగ!**

అనే గేయం 'బంగారు మనిషి' చిత్రంలో చోటుచేసుకోగా,

**వందేమాతరం! వందేమాతరం!**
**వందేమాతర గీతం వరసమారుతోంది!**
**తరం మారుతోంది! ఆ స్వరం మారుతోంది!**

అనే గీతం 'వందేమాతరం' చిత్రంలో ప్రవేశించి, సన్నివేశానికి తగిన సత్తువ చేకూర్చింది. ఇలా డా.సి. నారాయణరెడ్డిగారి గేయాలు సినీగీతాలుగానూ ప్రచారం పొందాయి.

సాంస్కృతిక సంస్థల ద్వారా ప్రచారమై - అవి ప్రచురించిన పాటలు సంపుటాలలో ప్రచురితమై తదనంతరం స్వల్పమార్పులు - చేర్పులతో వెండితెర కెక్కిన గీతాలుకూడా వున్నాయి. వాటిలో

1. **మారిపోతుందోయ్ కాలం**
   **మారిపోతుందీ**................(గజ్జెల మల్లారెడ్డి- 'ప్రజాశక్తి')
2. **మానవత్వమున్న మహనీయులారా!(మల్లిక్-'జనం-మనం)**
3. **ఎన్నాళ్లు? ఎన్నేళ్లు**
   **ఈ పాట్లు పడతావు?** (అదృష్టదీపక్- 'విప్లవశంఖం')
4. **భద్రం కొడుకో! నా కొడుకో కొమరన్న జెర**
   **భద్రం కొడుకో** (అంజయ్య - 'రంగుల కల')
5. **పసులగాసే పోరగాడా!**
   **పాల బుగ్గల జీతగాడా** (సుద్దాలహన్మంతు-'మాభూమి')
6. **కాలేజీ కుర్రవాడా-కులాసాగ తిరిగినోడ**
   **విలాసాల మాట మరువరో - ఓ విద్యార్థి!**
   (గుండవరపు సుబ్బారావు - 'స్వరాజ్యం')
7. **అక్కో అక్కో అక్కో** (భానూరి - 'నవోదయం')

అనేవి ప్రధానంగా చెప్పుకోతగినవి.

---

1. *పాటలో ఏముంది, నా మాటలో ఏముంది? డా.సి.నా.రె. పుట: 261*

దాశరథిగారు 'నవమంజరి'లో ప్రచురించగా, ఆకాశవాణి ద్వారా ప్రసారమైన

మామిడి కొమ్మా-మల్లియరెమ్మా
మంతన మాడెనదే!....
కోయిల కొమ్మా మన చిలకమ్మా
పాటలు పాడెనిదే!

అనే లలితగీతం 'రాము' చిత్రంలో చోటుచేసుకోవడం విశేషం!
దాశరథి రచించిన

1. ఏ దివిలో విరిసిన పారిజాతమో? (కన్నె వయసు)
   ఏ కవిలో మెరిసిన ప్రేమగీతమో?....
2. నడిరేయి ఏజాములో స్వామి (రంగుల రాట్నం)
   నిను జేర దిగివచ్చునో.....
3. మేలుకో! సాగిపో! బంధనాలు తెంచుకో (పదండి ముందుకు)
   బరువులూ బాధలూ - అందరితో పంచుకో!

అనే సినీ గీతాలు కూడ లలితగీతాల ప్రతిబింబాలుగా నిలిచేవే!
ఆత్రేయ రచించిన

1. కారులో షికారు కెళ్లే (తోడి కోడళ్లు)
   పాల బుగ్గల పసిడి చాన!
2. ముద్దబంతి పూవులో (మూగమనసులు)
   మూగకళ్ల ఊసులో
3. మనసు గతి యింతే (ప్రేమనగర్)
   మనిషి బ్రతుకింతే
4. నా గొంతు శ్రుతిలోన (జానకి రాముడు)
   నా గుండె లయలోన

మొదలగు సినీగీతాలు,
సముద్రాల రచించిన

1. జగమే మాయ - బ్రతుకే మాయ (దేవదాసు)
   వేదాలలో సారమింతే నయా!
2. శ్రీ సీతారాముల కల్యాణం (సీతారామ కల్యాణం)
   చూతము రారండీ!
3. అందమె ఆనందం! (బ్రతుకు తెరువు)
   ఆనందమె జీవిత మకరందం!

మొదలగు సినీ గీతాలు,
పింగళి నాగేంద్ర రావు రచించిన

1. లాహిరి లాహిరి లాహిరిలో (మాయాబజార్)
   ఓహో జగమే ఊగెనుగా!
2. జలకా లాటలలో (జగదేకవీరుని కథ)
   కల కల పాటలలో

3. మౌనముగా నీ మనసు పాడిన
వేణుగానమును వింటిలే! (గుండమ్మ కథ)

..........................................

మొదలగు పాటలు,
మల్లాది రచించిన

1. కనుపాప కరవైన కనులెందుకు (చిరంజీవులు)
తనవారె పరులైన తనువెందుకు?
2. తెల్లవార వచ్చె- తెలియక నాసామి (చిరంజీవులు)
మళ్లీ పరుండేవు లేరా!
3. మన స్వతంత్ర భారతం (దేశ ద్రోహులు)
మహామహుల త్యాగఫలం

..............................................

మొదలగు పాటలు,
వేటూరి సుందరరామ్మూర్తి రచించిన

1. ఝుమ్మంది నాదం- సైయంది పాదం (సిరిసిరిమువ్వ)

...............................................................

2. మానసవీణా మధుగీతం (పంతులమ్మ)
మన సంసారం సంగీతం
3. కిన్నెర సాని వచ్చిందమ్మా (సితార)
వెన్నెల పైటేసి
విశ్వనాథ పలుకై - అది
విరుల తేనె చినుకై

మొదలగు సినీ గీతాలు,
సీతారామశాస్త్రి రచించిన

1. విరించినై విరచించితిని ఈ కవనం (సిరివెన్నెల)
విపంచినై వినిపించితిని ఈ గీతం
2. తెలవారదేమో స్వామి నీ (శ్రుతి లయలు)
తలపుల మునకలో అలసిన
దేవేరి అలివేలు మంగకు
3. నా పాట పంచామృతం (అల్లుడు గారు)

మొదలగు గీతాలు లలితగీతాల ఒరవడిలోనివే!
అలాగే వడ్డెపల్లి కృష్ణ రచించిన
ముద్దుల జానకి పెళ్లికి - మబ్బుల పల్లకి తేవలెనే! (పెద్దరికం)
ఆశల రెక్కల హంసలు - పల్లకి మోసుకుపోవలెనే!
మురిపాల తేలించ మునిమాపులో
దివి నుండి రేరాజు దిగివచ్చులే!

అనే గీతం, గోపి రచించిన
మళ్లీ మళ్లీ పాడాలి ఈ పాట (మట్టిలో మాణిక్యం)
నీ బతుకంత కావాలి పూలబాట!
అనే గీతం, మల్లెమాల రచించిన
తెల్లావారకముందే పల్లె లేచింది (ముత్యాల పల్లకి)
తనవారినందరినీ తట్టి లేపింది
అనే గీతం, కోపల్లె శివరాం రచించిన
గలగలమని నవ్వకే సొగసు కరిగిపోతుంది (గాలివాన)
చిలిపి కళ్లు మూయకే చీకటి పడిపోతుంది
అనే గీతం, వెన్నెల కంటి రచించిన
కొండా, కోనల్లో- లోయల్లో (స్వాతి కిరణం)
............................................
ఝుమ్మని తుమ్మెద తియ్యంగా
కమ్మని రాగం తీయంగా
అనే గీతం, గురుచరణ్ రచించిన
ముద్దబంతి నవ్వులో మూగబాసలు (అల్లుడుగారు)
మూసివున్న రెప్పలపై ప్రేమలేఖలు
అనే గీతం, సాహితి రచించిన
జాబిలికీ వెన్నెలకీ పుట్టిన పున్నమిలే! (చంటి)
గంగలలో తేనెలలో కడిగిన ముత్యములే!
అనే గీతం, రాజశ్రీ రచించిన
కురిసింది వాన, నా గుండెలోన (బుల్లెమ్మ-బుల్లోడు)
నీ చూపులే జల్లుగా........
అనే గీతం, దాసరి రచించిన
తొలిసంజ వేళలో-తొలిపొద్దు పొడుపులో (సీతారాములు)
వినిపించే రాగం భూపాలం-ఎగిరొచ్చే కెరటం సిందూరం
అనే గీతం, అదృష్ట దీపక్ రచించిన
మానవత్వం పరిమళించే (నేటి భారతం)
మంచి మనిషికి స్వాగతం
అనే గీతం, జొన్నవిత్తుల రచించిన
చినుకు చినుకు అందెలతో (మాయలోడు)
చిటపటమను సవ్వడితో
వానజాణ ఆడింది వయ్యారంగా
అనే గీతం, రసరాజు రచించిన
అంధమైన వెన్నెలలోన-అచ్చతెలుగు పడుచువోలె (అసెంబ్లీ రౌడి)
మల్లెపూల పందిరిలోకి - నడిచి రావె సరిగమలా!

అనే గీతం, జాలాది రచించిన

పుణ్యభూమి నాదేశం నమో నమామి! (మేజర్‌చంద్రకాంత్)
ధన్యభూమి నాదేశం సదా స్మరామి!

అనే సినీగీతాలు కూడ లలితగీతాల రూపాంతరాలుగానే నిలుస్తాయి. కాని నా ప్రస్తుత పరిశోధనాంశం, ముందు లలితగీతాలుగా ప్రసారమై/ప్రచురితమై తర్వాత వెండి తెరకెక్కి ప్రచారం పొందిన వాటిని ప్రస్తావించడమే! కావున పైన పేర్కొన్న రచయితలు సినిమాపాటల్ని కూడ సిసలైన భావగీతాలుగా రచించిన వెన్నో వున్నా వాటి నన్నిటినీ వివరించక, కేవలం స్పృశించి వదిలేస్తున్నాను.

## క్యాసెట్ లలిత గీతాలు:

తొలినాళ్లలోని గ్రామఫోన్ రికార్డుల మాదిరిగా వర్తమానంలోని క్యాసెట్లు కూడా లలితగీతాల విస్తృత ప్రచారానికి ప్రధానంగా తోడ్పడుతున్నాయి. భక్తికీ-రక్తికే గాక మద్యపాన నిషేధానికీ రాజకీయ ప్రచారానికీ ప్రధాన భూమికగా నిలుస్తున్నాయి.

నవంబర్ 1992లో H.M V. వారు 'Unforgettable songs of Ghantasala' అనే పేరుతో ఘంటసాల గానం చేసిన ప్రసిద్ధుల పాత గీతాలను 'క్యాసెట్'గా విడుదల చేశారు. అందులో మొదటి గీతం-

స్వాతంత్ర్యమె నా జన్మహక్కనీ చాటండీ!
నిరంకుశంబగు శక్తులెదిరిన
నిర్భయముగ ఎదిరించండీ!
పరుల దాస్యమున బాధలు పొంది
బ్రతికిన చచ్చిన భేదమె లేదు ॥ స్వా ॥

అని పారతంత్ర్యాన్ని ప్రతిఘటిస్తూ, స్వాతంత్ర్యమె జన్మహక్కని ప్రబోధిస్తూ సా..గింది. ఆ తర్వాత గీతం

అమ్మా! సరోజినీ దేవీ!
...పూర్ణ సువర్ణ కళామయజీవీ!
ప... ...్తి శిరోమణి వమ్మా!
స్త్రీ జ... గులాబీ రెమ్మా! ॥ అమ్మా ॥
మా జాతి ... పరిపూర్ణ కళామయజీవి - సరోజినీ దేవిని స్తుతిస్తూ

అని భారత కోకిల, ... 'గుణశ్రీ' పుష్ప విలాపం పద్యాలు కాగానే కొనసాగింది. ఆ తర్వాత, 'క...

బహుదూరపు బాటసారి,
ఇటురావో ఒక్కసారి!
అర్ధరాత్రి పయనమేల నోయీ?
పెనుతుపాను రేగనున్న దోయీ?..... ...ే ముప్పును తెలియపరుస్తూ

అని బాటసారిని హెచ్చరిస్తూ, ముంచుక్రా... గీతం ఆలపించబడింది. ఆ తర్వాత

రావోయీ బంగారి మామా!
నీతోటి రాహస్య మొకటున్నదోయీ!
.................................................
అవిశె పువ్వులు, రెండు అందకున్నాయి నాకు
తుంచి నా సిగలోన తురిమి పోదువుగాని ॥ రా ॥

అని ఒక పల్లెపడుచు వసిడి పొలాల్లో నున్న తన బంగారు మామను రమ్మంటూ అందని అవిశె పువ్వుల్ని తుంచి తన సిగిలో తురిమి పొమ్మంటూ గానం చేయబడింది. 'రహస్య' మనే పదం ఖండగతిలో ఒదగడానికి 'రాహస్యం'గా మార్చుకోబడింది.

ఆ తర్వాత

..............................
నీకు వచ్చింది కోరమీసం
నాకు నచ్చింది దోరవయసూ
ఇద్దరి మనసు ఒక్కటయితే
ఎనక చింతా లేని బతుకే ఎంకటసామి!
నిన్ను నేను మరువలేనురా!...
ఓ...పంచదార వంటి పోలీసెంకటసామి
నిన్ను నేను మరువలేనురా!.....

అని ఓ మరదలు తాను వలచిన పోలీసెంకటసామి కోరమీసాన్ని, పంచదార వంటి తీయని మనసునూ పొగడుతూ తన కొచ్చిన దోరవయసును చూపుతూ కైపు రేపుతున్న వైనం కనబడుతుంది గీతంలో. అసలు యీ గీతాన్ని ఘంటసాల కాక అమ్మాయి పాడితే ఔచిత్యంగా వుండేది. 'అత్తలేని కోడలుత్తమురాలు' అనే జానపదగేయం తర్వాత

తలనిండ పూదండ దాల్చిన రాణి
మొలక నవ్వులతోడ మురిపించబోకే!

అనే దాశరథి రచించిన లలిత గీతాన్ని మధురంగా ఆలపించారు ప్రేయసిని స్మరించారు.

ఆ తర్వాత ఒక యుగళగీతంలో
వెలిగించవే చిన్ని వలపు దీపం!
ఎందుకే నామీద ఇంత కోపం?
అని నాయకుడు తనప్రైగల కోపానికి కారణమేమిటని ప్రశ్నిస్తే
మనసులో ప్రణయమే కనకదీపం
దాన్ని వెలిగించుకోకున్న పాపం!
అని నాయిక సమాధానమిస్తుంది తిరిగి నాయకుడు
నీ మోముపై కుంకుమే నాకు దీపం
అది చూచినంతనే కలిగేను తాపం

అని నాయిక ఎర్రని కుంకుమబొట్టునే దీపంగా భావించినట్లు వెల్లడిస్తాడు. ఆ తర్వాత కరుణశ్రీ 'కుంతీ కుమారి' పద్యాలతో క్యాసెట్ ముగుస్తుంది.

ACE (SEA) రికార్డింగ్ కంపెనీ జగ్గయ్య వ్యాఖ్యానంతో సాలూరి రాజేశ్వరరావు సంగీతంతో వెలువరించిన 'భక్తిసుధ' క్యాసెట్ గీతాలన్నీ శ్రీ రోహిణీ కుమార్‌గారు భావయుక్తంగా రచించారు. అందులో

**శ్రీ వేంకటా చలపతీ!...**
**నీ చరణాలే సద్గతీ!**
**నిను నిత్యం పూజించే**
**మనిషి మనసు తిరపతీ!**

అనే గీతాన్ని ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల గార్లు రాగయుక్తంగా గానం చేశారు. ఆ తర్వాత గీతంలో

**శ్రీనివాసం నీ హృదయం**
**చిద్విలాస వికాసమయం!**
**నిను తలచినచో ప్రతి ఉదయం**
**పుడమి జనులకూ అభయం అభయం!**

వేంకటేశ్వరుని హృదయం లక్ష్మీదేవికి నివాస స్థలం కాబట్టి 'శ్రీనివాసం' అని, మనోవికాసాన్ని కలిగించేది కాబట్టి చిద్విలాసమయం అని సన్నుతి చేస్తూ, స్వామిని తలచే భక్తులకు ప్రతి ఉదయం అభయంగా నిలుస్తుందని చెప్పడం ఔచిత్యంగా వుంది.

..............................................................

**గుండె గుండెనూ గుడిగా చేసుకోరాదా?**
**నువ్వుండడాని కామాత్రం చోటు చాలదా?**
**మాటనే నిలుపలేని మనిషి గుండె కన్న**
**నీ కోట నిలుపుకున్న కొండ కోటి రెట్లు మిన్న**
**సిక్కుల్లో దిక్కైన సీనయ్య సామి**
**అయ్య బాబోయ్ నువ్విక్కడున్నావా?**

అని జానపద ధోరణిలో సాగిన గీతం కూడ హృద్యంగా వుంది. ఆ తర్వాత గీతంలో

**శివపాద మంజీర నాదం**
**నాల్గు వేదాలకే విపుల నాట్యానువాదం**
**ఆద్యంత మధురం! అత్యంత శుభదం**
**ఆర్యా మహాదేవి అనుదిన వినోదం**

అని శివుని పాద మంజీర నాదాన్ని నాల్గువేదాల 'నాట్యానువాదం'గా పార్వతీ దేవికి 'అనుదిన వినోదంగా' సృష్టియావత్తుకూ 'శుభదం'గా కీర్తించడం మధురంగా వుంది. అంత్యానుప్రాసం మనోహరంగా వుంది. ఇలా శివుణ్ని, శ్రీ వేంకటేశ్వరుణ్ని భక్తితో-అనురక్తితో కొలుస్తూ కొనసాగిన రోహిణీకుమార్ గీతాల

రచన 'భక్తి సుధ' క్యాసెట్‌లో మృదు మధురం కాగా. యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల గార్ల గానాలతో సుధామధురమై అలరించింది

శ్రీ జె. బాపురెడ్డిగారు కూడ శ్రీవేంకటేశ్వర స్వామిపై రచించిన భక్తి గీతాలను 'శ్రీకారశిఖరం' పేరున సాలూరి రాజేశ్వరరావు స్వరపరచి వెలువరించారు. ఇలా చాలావరకు భక్తిగీతాల క్యాసెట్లే ఎక్కువగా వెలువడ్డాయి. కాని భక్తిగీతాల మీద 'ఉస్మానియా'లో ప్రత్యేక పరిశోధన జరుగుతున్నందున కేవలం లలిత గీతాలుగా వెలువడిన క్యాసెట్లనే పరిశీలించనెంచి వాటిని వివరించడం లేదు.

1988లో యువ లలిత సంగీత దర్శకుడైన శ్రీ పి.వి.సాయిబాబా సమర్పణలో 'భావగీతాలు' అనే క్యాసెట్ విడుదలైంది. కావున అందలి లలిత గీతాల్ని పరిశీలిద్దాం!

ఇందులో మొదటి గీతంగా ఆర్. భద్రిరాజు గారు

**ఆగుమా జాబిలీ...సాగిపోయే వేళ**
**వీక్షించుమిా యీ మోము**
**ఒకసారి ఆగుమా!**
**ఏ తార పిలుపు విని ఏగుచున్నావో**
**దారిలో మేఘాలు దాగివున్నాయిలే!**

అని మొయిలు దారుల్లో సాగిపోయే చంద్రుని గూర్చి అల్లిన గీతాన్ని ఎమ్.విజయలక్ష్మి స్వరంలో వింటాం. ఆ తర్వాత గీతాన్ని ఆచార్య తిరుమల రచించగా జి. చంద్రశేఖర్ గళమెత్తి పాడారు.

**తొలిసారి నే పాడే పాట**
**పల్లవించి నీ హృదయంలో**
**పరిమళించి నీ కన్నులలో**
**నిలపాలి వెన్నెల పాట!**

అని వసంతాల మధురిమల్ని, లతాంతాల సరిగమల్ని దరిజేరే చెలిలో చూసి, తొల వలపు తలపులతో తొలిసారిగా పాడే తన పాట ఆమె హృదయంలో పల్లవించాలని, కన్నులలో పరిమళించి వెన్నెలగా నిలపాలని రచయిత ఆకాంక్షించాడు. ఆ తర్వాత డా.దమ్మ శ్రీనివాస బాబు

**ఒంటరిగ యీ దారి పక్కన**
**ఒదిగి నిలిచిన దానను**
**కంట కమ్మల నడుమ పెరిగిన**
**గడ్డి పువ్వును! దీనను!**

అని గడ్డిపువ్వు గూర్చి రచించగా విజయలక్ష్మీ శర్మ గానం చేశారు. కాని యీ గీతం సొంతం కృష్ణశాస్త్రి గారి 'గడ్డిపువ్వు' గీతానికి అనుకరణగా తోస్తుంది. ఆ తర్వాత శ్రీ ఎం.కె. రాము

**రావేల రసకేళికీ?**
**కమ్మని చెలియా.......**

రమ్మని పిలువా
జాగేల సరసానికీ?......

అని రచించిన గీతం 'జావళి' ఛాయల్లో సాగిపోగా వి. శశికళాస్వామి గళంలో తీగలా మోగింది. ఆ తర్వాత జి. బాలకృష్ణప్రసాద్

**నేనేది పాడినా....నీ కోసమే!**
**నా ఆశా...నా ధ్యాసా...నీ పైనే!**

అని సర్వం తన చెలిగానే భావించి రచించిన గీతాన్ని కె. రామాచారి పాడారు.

ఆ తర్వాత డా॥ కనకవల్లి

**కూయకే కోయిలా**
**వేధించకే యీ వేళ**
**నీ బేల నుడికించకే!**
**ఈ విరహిణి గుండె మండించకే!**

అని రచించిన విరహగీతాన్ని డి. సురేఖామూర్తి పాడారు.

ఆ తర్వాత ఏడిద కామేశ్వరరావు

**మాలతీ మధు కుంజంలో**
**మాధవీ సుధ మకరందంలో**
**మాధవుడేడే? నా ధవుడేడే?**
**మాలతీ! మల్లికా! చెప్పరేలనే?........**

అని రాధిక తన ధవుడైన మాధువుని అన్వేషణలో ఆర్తిగా ఎలుగెత్తిన వైనాన్ని రచించగా ఎ. శారదారెడ్డి గానం చేశారు. ఆ తర్వాత శారదా అశోకవర్ధన్

**ఓ నా ప్రియా! గుండెలో దాగిపో!**
**ఈ చక్కనీ...చుక్కనీ...ఏలుకో!**
**ప్రియురాలు పిలుచువేళా**
**కోపాలు-అలక లేలా?**

అని తన ప్రియుణ్ని అలకమాని ఆలింగనాలకు రమ్మంటూ రచించిన గీతాన్ని సి. ఇందిర గానం చేశారు. ఆ తర్వాత ఎం.కె. రాము

**నాట్యమాడవే నవమోహినీ!**
**నగు మోముతో నవభంగిమతో**
**నటరాజు మనములు రంజిల్లగా......**

అని నాట్యప్రధానమైన గీతాన్ని రచించగా కె. రామాచారి పాడారు. ఆ తర్వాత ఆచార్య తిరుమల

**నీవు లేని యీ రేయి**
**ఏమి తోచదోయి!**
**చూపు సోకి నా మేను**
**వెచ్చనాయెనోయి!**

అని ప్రేయసి తన ప్రియుడు లేని రేయి భారమై ఏమీ తోచదని వాపోయే గీతాన్ని రచించగా, వి. శశికళ వీనుల విందుగా గానం చేశారు ఆ తర్వాత కోడూరి దుర్గానాగరాజు

పండు వెన్నెలలోనా
పరవశించే వేళ
నీ కోసమే తపసు
ఇది నీకు తెలుసు

అని తన ఎదురుతెన్నులు ఎదలోని ప్రియుని కొరకేనంటూ రచించగా జి. చంద్రశేఖర్ గానం చేశారు. ఆ తర్వాత వై. రామకృష్ణారావు

ఎదురుగ కనిపించరా, కృష్ణా!...
నా ఎదలో నివసించరా!...
వెదకి వెదకి నా పదములు వాడేను
దయచూడ వదేమి? కృష్ణా!

అని ఒక గోపిక 'గాలి జోలలు పాడ-తీగ ఊయలలూగ' హాయిగ సుమబాలిక పవళించిందంటూ తాను మాత్రం కృష్ణుని మురళీగానం వినరాక నిదురకు దూరమయ్యానంటూ, దయతో సత్వరం ఎదురుగా సాక్షాత్కరించమంటూ రచించిన గీతాన్ని డి.సురేఖామూర్తి గానం చేశారు.

మార్చి 1991లో 'సంగీత రికార్డింగ్ కంపెనీ' ద్వారా రాగసుధ సుబ్రహ్మణ్యంగారి నేతృత్వంలో 'రాగసుధ' పేరుతో విడుదలైన క్యాసెట్‌లో అన్నీ భావప్రధానమైన లలితగీతాలే చోటుచేసుకోవడం, పైగా యీ వ్యాస పరిశోధకుడైన వడ్డేపల్లి కృష్ణ రచించిన గీతాలే కావడం గమనార్హం! సంగీత విదుషీమణియైన శ్రీమతి సి. ఇందిరామణి వడ్డేపల్లి చిక్కని భావాలకు చక్కని స్వరాలు కూర్చగా సుమధుర శ్రుతి పక్వంగా సి. పద్మజ గానం చేసినట్లుగా క్యాసెట్ ఆవిష్కరణోత్స వంలో డా.సి.నారాయణరెడ్డిగారు అభినందిస్తూ ప్రసంగించారు.

త్యాగరాజాయ నమో నమో!
మృదు రాగరాజాయ నమో నమో!

అని త్యాగరాజ గురువందనంతో ఆరంభమయ్యే యీ క్యాసెట్‌లో ద్వితీయ గీతంగా

నా మదిలో నటియించే
నవ్యభావ కవితా!
నవరాగం పలికించే
నా జీవన సరితా!

అని కవి తన భావరాశిని ఊహల ఊర్వశిగా సెలయేరుల గలగలల్ని నవ్వులలో, చుక్కల తళుకుల్ని చెక్కిలిలో, అరవిందాక్షులలో అనురాగాల్ని నింపుకొని కదలిరమ్మని స్వాగతం పలికాడు

వెన్నెలంత చల్లనిది స్నేహము
మల్లెయంత తెల్లనిది స్నేహము
మంచి నెపుడు కోరేదే స్నేహము
మనిషి మనిషి కవసరమీ స్నేహము

అని మైత్రిని మధురంగా నిర్వచించాడు.

మనిషి జీవమొకగాలి
మనిషి దేహమొక ధూళి
ఆదినుండి నరుని జన్మ
ఆ విధాత కొక కేళి!

అని జీవిత సత్యాన్ని - తత్వాన్ని వెల్లడించాడు.

పచ్చని పైరులతో - చక్కని పొరులతో
నా దేశం నవ్వాలిరా - నాకమ్మై పోవాలిరా

అని దేశ సౌభాగ్యాన్ని - సంక్షేమాన్ని ఆశించాడు.

మంచె మీద కాపున్న మావా!
మనసైన నేనున్న రావా?

అని పల్లెపడుచు ప్రణయ భావాన్ని వివరించాడు. ఇలా రకరకాల భావగీతాలతో 'రాగసుధ' క్యాసెట్ లలితరాగాల్ని సుధలుగా చిలికించింది.

'SSS క్యాసెట్స్' ద్వారా 1995లో గోపీరాధ సంగీతంలో డా.తిరుమల శ్రీనివాసా చార్య రచించిన లలితగీతాలు 'గంగా తరంగాలు' క్యాసెట్‌గా వెలువడింది. ఇందులో మొదటి గీతంగా

అధరాలన్నీ పాడనీ - మధురమైన పాట
హృదయాలన్నీ ఎదగనీ - హిమగిరులై యీ పూట!
..............................................................
మనస్సులన్నీ జలకాలాడని - మమతల పన్నీట!

అని అధరాలు మధురమైన పాటలుగా మారాలనీ, హృదయాలు హిమగిరులుగా ఎదగాలనీ, మనసులు మమతల పన్నీటిలో జలకాలాడాలని కవి ఆకాంక్షించాడు. ఆ అకాంక్షను మంగళం పల్లి రాజేశ్వరి, వినోద్ తమ శ్రావ్యగానంలో వినిపించారు. ద్వితీయ గీతంగా

ఎన్నో ఆశలు పెంచుకొంటినే
ఎండమావులేనా?
కన్నుల మెదిలిన వలపుల మేడ
గగన కుసుమమేనా?

అని ఒక పూబోణి తుంటరి తుమ్మెదలా తన ప్రియుడు వలపుతేనెల్ని తాగి మోసం చేసి వెళ్ళిపోయిన తీరును తలపోస్తూ - విలపిస్తూ మంగళం పల్లి రాజేశ్వరి గానం చేసిన యీ గీతం మధురంగా వుంది. ఆ తర్వాత

గగనంలా మనదేశం ఎంతో విపులం!
కావాలి జన హృదయం మరీ విశాలం!
అప్పుడే భాసించును నవభారతం
గొప్పగా వాసించును మన జీవితం

అని సమైక్యత, సమభావం వుంటే మన జీవితమే గాక అఖిల భారతమూ అందంగా ప్రకాశిస్తుందని రచించిన యీ గీతాన్ని గోపి ఆలపించారు. ఆ తర్వాత

అతడు : ఎదురుగ నీవుంటే చెలీ! ఎందుకు బృందావని?
ఆమె : ముందుగ నీవుంటే ప్రియా! ఎందుకు చందురుడు?
.......................................................................................
అతడు : మధురమైన నీ నవ్వులుండగా మల్లియలెందుకులే?
ఆమె : అమల మధురానురాగం వుంటే అమృతంఎందుకులే?

అని సాగిపోయే గీతం యుగళంగా గోపి, రాజేశ్వరి గళంలో మధురంగా రవళించింది. ఆ తర్వాత

ఒళ్లంత అలిసిపోయె - సల్లంగ సెమటలు వెట్టె
ఎంతసేపు మావా! నేనెదురు సూసేది
ఎన్నాళ్ల కొత్తావొ ఎట్టా యేగేది?

అని ఒక పల్లెపడుచు తన ప్రియుడు తనకు బెజవాడలోని వాడలన్నీ చూపి, చార్మినార్ గోలకొండ చూపిస్తానని హైదరాబాద్ తీసుకుపోయి నేయంత ఊరించి మేనంత కాజేసిన మేనమామ గూర్చి వాపోయే విషయం యీ గీతంలో వివరించబడింది. ఎం. రాజేశ్వరి గానం చేసింది. ఆ తర్వాత

ఓ జాబిల్లీ! చలువల తల్లీ!...
ఓ జాబిల్లీ! మమతల మల్లీ!...
..............................................
కలువమ్మ పిలిచేను నినుజూచి - నువు
కలువకున్నా వలచేను ఎదచాచి!

అని జాబిల్లి మీద అల్లిన గీతాన్ని గోపి, రాజేశ్వరి యుగళంగా ఆలపించారు. ఇలా 'గంగాతరంగాలు' క్యాసెట్ రసజ్ఞుల్ని రసగంగా తరంగాల్లో తేలిస్తుంది.

రాయలసీమ ఆర్ట్స్ క్రియేటివ్ కల్చరల్ అసోసియేషన్‌వారు, కడప వారు జూన్ 1996లో 'నేనూ-నాదేశం' పేరుతో ఒక దేశభక్తి గీతాల క్యాసెట్‌ను రూపొందించి విడుదల చేశారు. దానికి సంగీతం యన్.సుబ్బనరసయ్య సమకూర్చారు. శ్రీమతి వాణీజయరామ్, జె. గిరిజ, కె.శాంతకుమారి మరియు జి.వి.రమణ అండ్ బి.వి. నాగప్రసాద్‌లు గానం చేశారు. ఇందులో ముందుగా డా. పవని ఆర్. హరనాథ్ రచించిన

నేనూ నా దేశం - ఇది సస్యశ్యామల దేశం!
సుజలాం సుఫలాం మలయజ శీతలం! ॥ నే ॥
స్నేహమేదైనా - వాదమేదైనా

సోదరత్వమే మా ఆశయం!
నీతి ఏదైనా - జాతి ఏదైనా
ఐకమత్యమే మా ఆయుధం! ॥ నే ॥

అనే గీతం చోటుచేసుకున్నది. ఆ తర్వాత ఇంద్రగంటి శ్రీకాంత శర్మ రచించిన

తేనెల తేటల మాటలతో
మన దేశమాతనే కొలిచెదమా?
భావం భాగ్యం కూర్చుకొని ఒక
జీవన యానం చేయుదమా?...

అనే గీతం యుగళంగా పలికింది. మధురిమల్ని చిలికింది. శ్రీమతి జి. పద్మావతమ్మ రచించగా బృందగానంగా

భరతమాత పిలిచింది బిడ్డలందరినీ....
బిడ్డలందరినీ! తన బిడ్డలందరినీ....
రామన్న పిలుపదిగో! రహీంభాయి రవమదిగో!
రాబర్టూ వినిపిస్తోందా? కలిసిక విందుకు రమ్మంటోంది!

అనే గీతం కమనీయంగా సాగింది. 'B' వైపు మొదటి గీతంగా ఓలేటి పార్వతీశం రచించిన

వందనం వందనం ఓ త్రివర్ణకేతనం! మా సువర్ణకేతనం
వందనం వందనం! వందనం!
భరతకీర్తి సాగేలా దిగంతాలకూ
జ్వలిత దీప్తి వెలిగేలా యుగంతాలకు
రెపరెపమని ఎగురుతుంటె అంబరాన
మా మనసులు మురిసిపోవు సంబరాన ॥ వం ॥

అనే గీతం వాణీజయరాం స్వరంలో మృదుమధురంగా సాగింది. వ న మువ్వన్నెజెండా ప్రభవాన్ని రెపరెపలాడించింది. ఆ తర్వాత

ఆడుకుంటూ పాడుకుంటూ విశ్వమంతా తిరుగుదాం!
శాంతిజ్యోతి చేపట్టి చీకటులను తరిమేద్దాం!
భువనమంతా పంచుకుందాం పసిడి వెలుగు కాంతి!

అనే ఓలేటి గీతం పిల్లల బృందగానంగా చిందులు వేసింది. ఆ తర్వాత డా.నెల్లుట్ల వెంకటేశ్వరరావు రచించిన

నడిచింది నాదేశం వేదంతో, రాముని పాదంతో
తడిసింది నాదేశం నాదంతో, కార్మిక స్వేదంతో
నాదేశం ధర్మభూమి! నా దేశం కర్మభూమి!
నా ప్రాణం, నా జీవం, నా దైవం! నాదే యీ భారతభూమి!

అనే గీతం యుగళగీతంగా మోగి వీనుల విందు చేసింది.

'ప్రియధరిత్రి' పేరుతో పిల్లలకోసం అరుణ క్రియేషన్స్ వారు (మాధవాచారి)

కూడా ఇటీవల ఒక దేశభక్తి గీతాల క్యాసెట్‌ను విడుదల చేశారు. దీనికి సంగీతం స్నేహలతా మురళి సమకూర్చగా విజయకుమార్, మురళీకృష్ణ, ఉషారాణి, దివ్య, వాణి, తన్మయి తదితరులు గానం చేశారు. ఇందులో గిడుగు రాజేశ్వరరావుగారు కొరుప్రోలు మాధవరావుగారు రచించిన 8 గీతాలున్నాయి అయితే ప్రధానంగా చెప్పుకోతగిన గీతాలలో ముందుగా వినిపించే

**పాలమీగడ తరగలం! మురిపాల ముద్దుల మూటలం!**
**కల్ల లెరుగని పిల్లలం! మరుమల్లె పువ్వుల నవ్వులం ॥ మురి ॥**
**భావిభారత పౌరులం! సమభావమెరిగిన బాలలం!**
**ఆశలెన్నో రేపు తీయగపలికే మురిసే మువ్వలం! ॥ మురి ॥**

గిడుగు రాజేశ్వరరావుగారి గీతం ఆకట్టుకుంటుంది. అయితే పల్లవిలో పిల్లల్ని మరుమల్లె పువ్వులని గాక సిరిమల్లె పువ్వులంటే యుక్తంగా వుండేది మరులనే పదం బాలలకు ఉపయోగించరానిదని బహుశ రచయిత మరిచిపోయి వుంటారు. ఆ తర్వాత కొరుప్రోలు మాధవరావుగారు రచించిన

**వందనం వందనం! ప్రియధరిత్రికి!**
**వందనం వందనం దివ్యచరిత్రికి!**
**మాభారత సవిత్రికి-మహిమాన్విత**
**నాదసుధారసగాయత్రికి పాదాభివందనం ॥ వం ॥**

అనే గీతం 'టైటిల్‌సాంగ్'లా మధురంగా సాగింది. కాని పిల్లల కోసం రూపొందించిన యీ గీతాల్లో తత్సమ సమాస క్లిష్టత లేక తేటతెలుగు స్పష్టత గోచరిస్తే బాగుండేది. వెనుకవైపున గిడుగు రాజేశ్వరరావు రచించిన

**మనదేశం...మనదేశం!**
**భరతుడు మునుపాలించిన దేశం**
**పరమత సహనం నిలిపిన దేశం!**
**భరత మాతకు గౌతమ గాంధీ**
**పరమ హంసలుదయించిన దేశం!**

అనే మరో గీతం నదీనదాల సంస్కృత వర్ణనతో మధురంగా సాగింది. ఆ తర్వాత కొరుప్రోలు మాధవరావు రచించిన

**ఒక్కటై ఎల్లప్పుడు మనముందాం!**
**ఒకరికొకరు తోడై మనముందాం!**
**గాంధీ తాత నవ్వులమై**
**చాచా కోరిన పువ్వులమై**
**గాంధీ ఆశయ దివ్వెలమై**
**పటేలు పట్టిన తువ్వాలమై ॥ ఒక్కటై ॥**

అనే గీతం పిల్లలకు మానసికోల్లాసాన్ని కలిగించేలా మారుమ్రోగింది ఆ తర్వాత మాధవరావుగారు రచించిన

మేమంతా ఒక కేతనం!
మా భావనమే నవ చేతనం!
మా భారతమే నవనవలాడే
విశ్వశాంతి నికేతనం!

అనే మరోగీతంలో నవ్యత్వమేగాక దివ్యత్వం దీటుగా గోచరిస్తుంది. ఆ తర్వాత మాధవరావుగారి

దండాలు దండాలు మా భరతమాత
వేవేల దండాలు మా వేదమాత
లక్షాల దండాలు మా లక్ష్మీమాత
శతకోటి దండాలు మా శక్తి మాత

అనే గీతం హుషారైన బాణీలో ఉరకలు వేసింది. పిల్లలకోసం రూపొందించినా ఈ క్యాసెట్ అందర్నీ వినేలా చేసింది.

ఇలా క్యాసెట్ రూపంగా లలితగీతాలు, దేశభక్తి గీతాలే గాక సమాజ శ్రేయస్సు ప్రబోధించే పలు ప్రచార గీతాలూ వెలువడ్డాయి.

## ప్రచార గీతాలు:

మద్యపాన నిషేధ ప్రచారానికి కూడ ప్రభుత్వం 1995లో గాంధీ జయంతి నాడు 'మద్యనిషేధ ప్రచార గీతావళి' పేరున సమాచార పౌరసంబంధాల శాఖచే ఒక క్యాసెట్‌కు రూపకల్పన గావించింది. ఆ సందర్భంగా వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షతన ముఖ్యమంత్రి ఆధ్వర్యంలో రవీంద్రభారతిలో ఏర్పాటైన ప్రత్యేక సమావేశ వేదిక మీద గంగాధర్ అండ్ మిత్ర బృందంచే నదీరా, వడ్డెపల్లి కృష్ణ రచించిన గీతాల్ని జనరంజకంగా పాడడం జరిగింది. ముందుగా 'నదీరా' రచించిన

స్వాగతం ! స్వాగతం
స్వాగతం సుస్వాగతం!
జాతి నేతలకు స్వాగతం!
జ్ఞాన దాతలకు స్వాగతం!
మద్యాసురుని దునుముటకై
మహారణమ్మున దూకుటకై
కదలి వచ్చెడు గ్రామసీమలకు
కదం త్రొక్కు సంగ్రామ సీమలకు ॥ స్వా ॥

అనే గీతం స్వాగతంగా, మద్యాసుర సంహారానికి సమర భేరిగా గానం చేయబడింది. ఆ తర్వాత వడ్డెపల్లి కృష్ణ రచించిన

ఉండి ఉండి చండికలా ఉద్యమించె మహిళా!...
సారా మహిషాసురునే సంహరించె మహిళా!

..........................................................................

మద్యపాన గూండాలు మళ్లీ చెలరేగకుండ
ఇంటింటను తల్లి-చెల్లి-ఇల్లాలే పోలీస్సై
లాఠీ ఆడించాలి! సారా మాన్పించాలి!

అనే గీతాన్ని కర్తవ్య బోధకంగా ఆవేశ పూరితంగా గానం చేశారు. ఆ తర్వాత ఈ గీతాల్ని అదే బాణీలో రికార్డు చేసి క్యాసెట్‌గా విడుదల చేశారు.

'మద్యనిషేధ ప్రచార గీతావళి' క్యాసెట్‌లో నదీరా. కరుణశ్రీ రచించిన గీతాల్ని పి. సుశీల, వి. రామకృష్ణ, బి. వసంత, రేణుక, యస్.పి. శైలజ గానం చేయగా జి. ఆనంద్ సంగీతం సమకూర్చారు. ఇందులో మొదట

కాళివై లేచిరా తల్లీ!
నీ తాళినే కాచుకో చెల్లీ!
బారు మూయించావు కాని
భర్త నోరు మూయించావు కాదు!
భర్త చూస్తే ఇంజనీరు!
భార్యకుండదు గంజినీరు!

అనే గీతం వ్యంగ్యంగా సాగింది. ఆ తర్వాత

భారతదేశం సోదరా!
బారుల దేశం కాదురా!
పానశాల మనకొద్దురా!
పాఠశాల మరవద్దురా!

అనే గీతంలో కర్తవ్యం వెల్లడైంది. ఆ తర్వాత

నిధులను ఇమ్మని వేడం!
విధులను ఎన్నడు వీడం!
ఆడువారం మేము!
వెనుకాడు వారం కాము!

అనే గీతంలో మహిళల చైతన్యానికి మంచి రూపకల్పన జరిగింది.

మందినే ప్రేమించుమన్నా!
మందునూ మాన్పించుమన్నా!
తాగి చెడినా దగాపడినా
తమ్ములను ప్రేమించవోయ్
గాడి తప్పిన వారికి కర్తవ్యమును బోధించవోయ్!

అనే గీతంలో మందును గాక గాడి తప్పిన మందిని ప్రేమించి తక్షణ కర్తవ్యం బోధించమంటూ గళమెత్తడం జరిగింది.

పొదుపు చేయవమ్మా ఓ బంగారమ్మా!
పొదుపు చేయని బ్రతుకు కంగారమ్మా!

.......................................................

పాపాయి కోసం రూపాయి దాచు!
పాపాయిని రూపాయే కనుపాపై కాచు!

అని మరోగీతంలో రూపాయి విలువ తెలిపే. పొదుపు ఆవశ్యకత గూర్చి చక్కగా చెప్పబడింది.

తాగి బాధ పడతారో!
మాని బాగు పడతారో!
ఏరుకోండి! ఏరుకోండి!
ఎంచుకోండి! ఎన్నుకోండి!

అనే గీతంలో తాగి రకరకాల బాధల పాలయ్యేకన్నా, అది మాని అన్ని విధాలా బాగుపడడమే శ్రేయస్కరమని నొక్కి చెప్పబడింది.

చదువు నేర్చుకొని - శక్తి కూర్చుకొని
జాతి గౌరవం పెంచండోయ్!
జగతికి ప్రగతిని పెంచండోయ్!
ఈ జగతికి సుగతిని కలిగించండోయ్!

అనే గీతంలో చదువు విలువను విప్పి చెప్పడం జరిగింది. ఆ తర్వాత చివరి గీతంలో

కిరాయి కోరకు సోదరా! పరాయి దేశం కాదురా!
వరాల దేశమిది నీదేరా! నీ బాధ్యత మరచుట బాధేరా!

అని గ్రామసీమల్ని భాగ్యసీమలుగా మార్చుటకు పౌరులందరూ తమ బాధ్యతగా భావించి సహకరించాలంటూ ఎలుగెత్తి చాటడమైంది.

ఇటీవల శ్రమదానాల పేరుతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జన్మభూమికి తరలి రమ్మంటూ ప్రచారనిమిత్తమై 'జన్మభూమి' పేరుతోటే ఒక క్యాసెట్ రూపొందించి విడుదల చేసింది. సుద్దాల అశోక్‌తేజ, వేటూరి సుందరరామమూర్తి రచించిన గీతాల్ని వందేమాతరం శ్రీనివాస్ స్వీయ స్వరకల్పనలో ఎలుగెత్తి గానం చేశారు. ముందుగా

జన్మభూమి పిలుస్తోంది!
నీ పుణ్యభూమి పిలుస్తోంది!
తరలుదాం రండి మనం జన్మభూమికీ
తల్లిపాల ఋణం కొంత తీర్చడానికీ
కన్నతల్లి కన్న మిన్న కదా నేల తల్లీ?
కదలుదాం తెలుగుతల్లి కాళ్లకు ప్రణమిల్లి!
వందేమాతరం! వందేమాతరం!

అనే సుద్దాల అశోక్ తేజ గీతం ద్వారా పౌరులందర్నీ పుట్టిన మట్టిని సేవించడానికి తరలి రమ్మంటూ దండోరా వేసినట్లు ఆహ్వానించడమైంది. ఆ తర్వాత వేటూరి సుందర రామమూర్తి రచించిన

ఈ పాటకు పల్లవి శ్రమదానం!
ఈ పాటకు చరణం సహకారం!
మన జాతికి నేడు కల్యాణం
ఇంటింటికి పిలుపుల పేరంటం!
తిండి వుంది-కండ వుంది!
కొండలాంటి గుండె వుంది!
నీడనిచ్చు అండవుంది!
నీకు లేని దేముంది?
నీ స్వేదం గోదావరి వేదంలా పలికినప్పుడు
నీ త్యాగం కృష్ణవేణి వేణుగానమైనప్పుడు
మాటలతో ఎందుకురా తమ్ముడా?
ఇక చేతలతో ముందుకురా చెల్లెలా!

అనే గీతంలో శ్రమదానంకై అందరి సహకారం కావాలంటూ, తమ్ముళ్లు, చెల్లెళ్లు తరంగాల్లా తరలి రావాలంటూ స్వరమెత్తి ప్రేరేపించడం జరిగింది.

## కుటుంబ సంక్షేమ గీతాలు :

దినదినమే గాక క్షణక్షణమూ అంతులేకుండా పెరిగిపోతున్న జనాభాను అరికట్టడానికి ప్రభుత్వం పత్రికల్ని, ఆకాశవాణి, దూరదర్శన్‌లనూ అనేక విధాలుగా వినియోగించుకొని ప్రచారాన్ని కొనసాగిస్తోంది. ఆ ప్రచారంలో భాగంగా ఎందరో రచయితలు ప్రబోధగీతాల్ని పలికించారు. వాటిలో జె.బాపురెడ్డిగారు రచించిన

1. చక్కనైన శకుంతలకు - ఒక్కడే కుమారుడు
   ఈ దేశం తన పేరుననే వెల్గిన వీరుడు!
2. కుహూ కుహూ మని కూసే - కోకిల ఏమంటున్నది?
   ముద్దుల సంసారానికి ఇద్దరేను పిల్లలట![1]

వడ్డెపల్లి కృష్ణ రచించిన

1. ఇల్లుకూలి పోతున్నా - కళ్లు తెరవనంటావేం?
   ఇద్దరె చాలంటున్నా ఇంకా విననంటావేం?
   (దూరదర్శన్‌లో ప్రసారితం)
2. ఉండాలి ఉండాలి దేనికైన హద్దు!
   అది వుంటేనే అన్నిటికీ అందమైన ముద్దు
   (ఆకాశవాణిలో ప్రసారితం)

ఆచార్య తిరుమల రచించిన

1. ఎంత ఆవేశమో యీ గాలికి? ఎంత ఆవేగమో రసపాయికి?

... ............................................................... .............. . ...

1 నా దేశం నవ్వుతూంది - జె బాపురెడ్డి పుట 14,19

మూడు పూలు చాలునని, ఆరుకాయలెందుకని
(ఆకాశవాణిలోప్రసారితం)

2. తీగ మల్లెలు - తేనె జల్లులు
ఏ యింటికి - ఏ జంటకి చాలిద్దరు పిల్లలు[1]

శ్రీమతి శారదా అశోకవర్ధన్ రచించిన
నీతో సెప్పాలని ఎన్నిసార్లు అనుకున్నా
సెప్పలేకపోతున్నా-దాచలేకసత్తున్నా[2]

మలయశ్రీ రచించిన
వద్దు వద్దయ్యా బావా! పిల్లలు
హద్దు మీరితే ముప్పనీ తెలియలేవా?
ఒక్కరైతే మేలు - ఇద్దరైతే చాలు![3]

వై. హరేరామ మూర్తి రచించిన
మితమే మన మతమై- మమతే సమ్మతమై
మనమందరము కలకాలం కళ కళ లాడాలి[4]

డా. తిరుమల శ్రీనివాసాచార్య రచించిన
పువ్వులు రెండు కొమ్మకు అందం!
దివ్వెలు రెండు గూటికి అందం!
పాపలిద్దరూ అమ్మకు ఆందం![5]

మొదలగు గీతాలనేకం ప్రచురితమై, ప్రసారమై పరిమిత కుటుంబానికి తగిన ప్రచారాన్ని కలిగించాయి.

## వయోజన విద్యాగీతాలు :

'వయోజన విద్య' వ్యాప్తి చెందడానికి కూడ ఎన్నెన్నో గీతాలు వెలిశాయి. వాటిలో

1. ఓనమాలు దిద్దుతుంటె - ఒళ్లు పులకరిస్తోంది!
బాలశిక్ష పట్టుకుంటె బ్రతుకు పరిమళిస్తోంది! (జె. బాపురెడ్డి)

2. అక్షరమే మన బ్రతుకులకాచే ఆయుధం! పరమాయుధం!
అక్షరమే పలు ప్రగతుల కూర్చే సాధనం! జయసాధనం!
(వడ్డెపల్లి కృష్ణ)

3. వెలిగిద్దాం! ఈ అక్షర జ్యోతులను
తొలగిద్దాం! అజ్ఞానపు రీతులను (డా. తిరుమల శ్రీనివాసాచార్య)

---

1. గేయనందిని - ఆచార్య తిరుమల పుట 190
2. భావరాగిణి - శారదా అశోకవర్ధన్ పుట . 72
3. రాగవల్లరి - మలయశ్రీ పుట 28
4. స్వరలహరి - వై. హరేరామ మూర్తి పుట 16
5. గంగా తరంగాలు - డా.తిరుమల శ్రీనివాసా చార్య పుట · 49

4. నీ కెప్పుడు వస్తుందీ వేకువ?
చదువురాని వారంటే లోకువ! (పాలగుమ్మి విశ్వనాథం)
5. అక్షర దీపం వెలిగించు
నిరక్షరాస్యతను తొలగించు (మలయశ్రీ)
6. తెలుసుకుంటే మనిషి జన్మ ఎంచక్కని వరం!
చదువు సంధ్య నేర్వకుంటే ఎందుకది వ్యర్థం! (వోలేటి పార్వతీశం)

మొదలగు గీతాలు ప్రసారమై, క్యాసెట్‌లుగా కూడ రూపాంతరమై విస్తృత ప్రచారానికి దోహదం కలుగజేశాయి.

ప్రస్తుతం కలుషితమవుతున్న వాతావరణాన్ని దృష్టిలో వుంచుకొని తరువుల్ని పెంచడమే తరుణోపాయంగా భావించి అల్లిన గీతాలు కూడ వున్నాయి. వాటిలో

1. చెట్టే మనిషికి తోడురా! చెట్టే పుడమికి నీడరా!
చెట్టే మట్టికి ప్రాణంరా! చెట్టే గాలికి గానంరా!
(రచన : జె. బాపురెడ్డి)
2. అందంగా చెట్లను నాటండి!
ఆనంద వీణలను మీటండి!
చెట్లంటే ఆరోగ్యం! చెట్లంటే సౌభాగ్యం!
(రచన : డా. తిరుమల శ్రీనివాసాచార్య)
3. చెట్లే ప్రగతికి తొలిమెట్లు! చెట్లే జగతికి పనిముట్లు
అందుకె వాటిని పెంచాలి! ఆనందాలను పంచాలి!
(రచన : వడ్డెపల్లి కృష్ణ)
4. చెట్లే జగతికి చైతన్యం! లేదా నిండును కాలుష్యం!
అడుగొకయిడుమై కదలని పడవై
జీవిత మగునొక సుడిగుండం!
(రచన: శేషం లక్ష్మీనారాయణాచార్య)

మొదలగు గీతాలు ఆకాశవాణిలో ప్రసారమై చెట్లు నాటే కార్యక్రమాల ప్రచారానికి చేయూత నిచ్చాయి.

ఇలా లలితగీతాలు కూడ రకరకాల సాంఘిక ప్రయోజనాల ప్రచారానికి వివిధ ప్రచురణల, ప్రసారాల ద్వారా ఉపయోగానికి వచ్చాయి. ఇట్టి ప్రచార గీతాల మీద కూడా మరో ప్రత్యేక సిద్ధాంత వ్యాసం రావలసిన ఆవశ్యకత అగుపిస్తోంది. కావున ఇంతటితో యీ 'ప్రచారం' విభాగానికి తెరవేస్తున్నాను. తెరముందుకురాక, నా దృష్టికి అందక నేపథ్యంలో మరెన్నెన్నో గీతాలుండి పోయాయి. వాటిని భావి వ్యాసకర్తలు పరిశీలించి పరిశోధనా వ్యాసాల్ని సమర్పించి, సారస్వత లోకానికి సరికొత్త కాంతుల్ని ప్రసరింపజేస్తారని ఆశిస్తున్నాను

# 9. ముక్తాయింపు

విహంగ వీక్షణంగా చూస్తే 'లలిత సంగీత' మనేది శాస్త్రీయసంగీతం కంటె తేలికగా వుండి 20వ శతాబ్దపు ఉత్తరార్ధంలోనే విస్తృతంగా వ్యాప్తి చెందినట్లు రూఢి అవుతోంది. ముఖ్యంగా ఆకాశవాణిలో గాయనీ గాయకులు ఆధునిక కవులు వ్రాసిన దేశభక్తి గేయాల్ని, ప్రణయ, భక్తి, ప్రకృతి గేయాల్ని, జానపద, సినీ సంగీతపు వరుసలకు దగ్గరలో కూర్చి పాడడం చేత ప్రచారానికి వచ్చినట్లు స్పష్టమవుతోంది.

శాస్త్రీయ సంగీతం కంటె సరళమైనది, జానపద బాణీల మిళితమైనది 'లలితసంగీతం' అయితే, "పల్లవి-చరణాల గేయత్వం, లాలిత్యంతో తాళ-లయ సమన్వితమై, పరమార్థ లక్ష్యంగల ప్రతి భావగీతం ఒక లలిత గీతం" అని నిరూపితమవుతోంది.

పూర్వ పరిశోధకులంతా ప్రాచీన పద్య, జానపద గీతాలతో పాటు సినీగీతాల వరకే పరిమితమై అనేక పరిశోధనలు జరిపారు. కాని అనంతరాశిగా మిగిలిన లలిత గీతాల్ని అస్పృశ్యగానే వదలివేశారు. దాదాపు మూడు దశాబ్దాలుగా లలితగీత రచన చేస్తున్న నేను లలితగీతాలపై గల సహజమైన అభిమానంతో ఈ అంశాన్ని పరిశోధనకు ఎంచుకున్నాను. కాని తల్లివేరును శోధించాక గాని ఇది నా శక్తికి మించినదని తెలుసుకోలేకపోయాను. అయినా సాహసంతో ఈ సాగరాన్ని మథించడానికి పూనుకొని కాలక్రమాన్ని అనుసరించి కవులగీతాల్ని ఆధారంగా చేసుకున్నాను. నాటి గురజాడ నుండి నేటి ఆధునిక కవి వరకు అందర్నీ పరిశీలించాను. వారి గీతాల్ని కాలక్రమేణ వికసించిన పరిణామాల్ని పరిశోధించాను. లలితగీత లక్షణం, అవతరణం, వికాసం, విస్తారం, ప్రసారం, ప్రచారం విభాగాలుగా విభజించి విపులీకరించాను. తొలినాళ్లలోని ఆకాశవాణి, దూరదర్శన్ పుట్టు పూర్వోత్తరాల్ని వివరించాను. ప్రసారమైన ప్రథమగీతాల్ని తేల్చి చూపాను.

ప్రసార సాధనాలు లేని కాలంలోనే పత్రికాముఖంగా ప్రాచుర్యం పొందిన, గురజాడ 1910లో రచించిన

**దేశమును ప్రేమించుమన్నా**
**మంచి అన్నది పెంచుమన్నా**
**వొట్టి మాటలు కట్టిపెట్టోయ్!**
**గట్టి మేల్ తలపెట్టవోయ్!**

అనే దేశభక్తి గీతమే ప్రథమ లలితగీతంగా అవతరించినట్లు పరిగణించ బడింది. రాయప్రోలు రచించిన

ఏ దేశమేగినా ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

అనే మంజరీ ద్విపద ఖండగతిలో మలచిన ద్వితీయ గీతంగా అద్వితీయ ప్రచారం పొందింది.

అలా గురజాడ, రాయప్రోలు రచనలతో చిగురించిన లలితగీత లత బసవరాజు రచించిన

1. కోయిలా కోయిలా కూయబోకే
   గుండెలూ బద్ధలూ చేయబోకే
2. కొల్లాయి గట్టితేనేమి? మా గాంధి
   కోమటై పుట్టితే నేమి?....
3. గుత్తొంకాయ్ కూరోయ్ బావా!
   కోరివండి నానోయ్ బావా!

మొదలగు గీతాలతో, దేవులపల్లి కృష్ణశాస్త్రి రచించిన

1. ఆకులో ఆకునై - పూవులో పూవునై
   కొమ్మలో కొమ్మనై - నునులేత రెమ్మనై
2. రామ చరణం రామ చరణం!
   రామ చరణం మాకు శరణం!
3. జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి!
   జయ జయ జయ శత సహస్ర నరనారీ హృదయనేత్రి!

మొదలగు గీతాలతో పరిపూర్ణంగా వికసించింది. ఆ తర్వాత కవికొండల, నండూరి, బాపిరాజు, విశ్వేశ్వరరావు గీతాలతో వినూత్నంగా పరిమళించింది.

మొదట్లో గీతాలు పత్రికా ముఖంగా ప్రచారంలోకి రాగా, ఆ తర్వాత ఆకాశవాణి ప్రసారం ద్వారా వీనుల విందై విశేష వ్యాప్తి గాంచాయి. జూన్ 1938లో ఆకాశవాణి మద్రాస్ కేంద్రం ప్రారంభించబడిన వారం రోజుల్లో ప్రప్రథమంగా ఆచంట జానకీరామ్‌గారు ఆరుగురు కవుల పాటలతో రూపొందించిన 'అనార్కలి' రూపకం ద్వారా శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రచించిన

రారమ్మ రారమ్మ మందారమా! రక్తకరవీరమా!
మాలతీ మల్లికా! మాధవీ కన్యకా! శేఫాలికా!

అనే గీతం తొలిగీతంగా ప్రసారమైంది. 1935లో ఆర్. బాలసరస్వతీదేవి బాల గాయనిగా శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు రచించిన

పరమ పురుష పరంధామ
పతిత పావనా దేవ!

అనే గీతాన్ని రాగయుక్తంగా ఆలపించగా అది గ్రామఫోన్ రికార్డుగా వెలువడి ప్రచార గీతానికి శ్రీకారం చుట్టింది.

ఆ తర్వాత ఈ లలితగీత లత శ్రీయుతులు రజని, ఇంద్రగంటి, పైడిపాటి, శ్రీశ్రీ, కొనకళ్ల, వింజమూరి, బోయి భీమన్న, ఆరుద్ర, దాశరథి, డా.సి.నారాయణరెడ్డి, కందుకూరి రామభద్రరావు, శశాంక, జె బాపురెడ్డి గీతాలతో ఫలించింది. ఆధునికుల్లో కోపల్లె శివరాం, శ్రీకాంత శర్మ, వక్కలంక, వడ్డెపల్లి కృష్ణ, ఆచార్య తిరుమల, జొన్నవాడ రాఘవమ్మ, డా. ఎం. పద్మినీ దేవి గార్ల గీతాలతో విస్తరించింది. శాఖోపశాఖలుగా విస్తరిల్లి నేడొక మహావృక్షంగా అభివృద్ధి చెందిన లలితగీతం అనేక ప్రసార, ప్రచార గీత పత్రాలతో దినదినమూ మారాకు తొడుగుతూనే వుంది. వటవృక్షంగా ఊడలు వేస్తూనే వుంది. ఆ మారుకుల్నీ, ఊడల్నీ విశ్లేషించి వివరించే వీలును భావిపరిశోధకులకే, ఇప్పటికే నా పరిధి మించి పోయినందున, వదిలివేయాల్సి వచ్చింది.

లోతుగా, ఇంకా నిశిత పరిశీలనగా ఆవలోకిస్తే కేవలం ఆకాశవాణి, దూరదర్శన్‌లో ప్రసారమైన గీతాలనే అంశంగా ఎన్నుకొని 'తెలుగులో ప్రసార గీతాలు' గా పరిశోధించే వీలున్నది. అలాగే గ్రామఫోన్, క్యాసెట్, కుటుంబ సంక్షేమ, వయోజన విద్యాది ప్రచారగీతాల్ని అంశంగా ఎన్నుకొని, 'తెలుగులో ప్రచార గీతాలు'గా పరిశోధించే మార్గమున్నది. అంతేగాక కేవలం దేశభక్తి గీతాల్ని, ప్రణయ గీతాల్ని, ప్రకృతి గీతాల్ని, ప్రబోధ గీతాల్ని వేదికగా ఏర్పరచుకొని తులనాత్మకంగానూ పరిశోధించే వీలున్నది.

ఇలా భావి పరిశోధకులు లలితగీతాల్ని ఇంకా అనేక కోణాలలో పరిశీలించి పరిశోధించే వీలున్నదని ఘంటాపథంగా చెప్తూ, ముక్తాయింపు వేస్తూ ముగిస్తున్నాను.



# అనుబంధం - I

| క్ర.సం. | గీతిక పల్లవి ప్రథమపంక్తి | రచయిత పేరు |
|---|---|---|
| 1. | అదిగో మన జయపతాక | కరుణశ్రీ |
| 2. | జయము జయము భరతావని | కరుణశ్రీ |
| 3. | దారితప్పిన మానవుడా! | డా. దాశరథి |
| 4. | హృదయమున్న నరజాతి | డా.యస్వీ. సత్యనారాయణ |
| 5. | చిరంజీవి మానవుడా! | డా.సి.నారాయణరెడ్డి |
| 6. | జాతిపితా! ఓ జగతిహితా | వడ్డెపల్లి కృష్ణ |
| 7. | ఏరువాక సాగనీరా! రైతుసోదరా! | ఆర్.భద్రిరాజు |
| 8. | బాధ్యతతో బ్రతుక నేర్చుకో! | డా.ఏ. జైహింద్ రెడ్డి |
| 9. | వలపు నీవైనావే! | ఆచార్య తిరుమల |
| 10. | మానవుడే మహాత్ముడు! | డా. బోయి భీమన్న |
| 11. | మారాలీ! మారాలీ! మనిషి మారాలి | డా. బోయి భీమన్న |
| 12. | బాపూ! నీ జీవితం | డా.సి.నారాయణరెడ్డి |
| 13. | నీ చూపే మరుని బాణం | ఆచార్య తిరుమల |
| 14. | జాతిని జాగృతము చేయు | వడ్డెపల్లి కృష్ణ |
| 15. | అమ్మకన్న కమ్మనైన మాటేలేదు | పి.బి.శ్రీనివాస్ |
| 16. | తొలగిపోయె తమస్సులు | సాంధ్యశ్రీ |
| 17. | కొండంత నాసామి! కొండదిగి రావేమి? | డా.కె.రాజమల్లాచారి |
| 18. | నిన్న మొన్న మొలకెత్తిన | ఎ. సత్యవతీ దేవి |
| 19. | తెరువు మరుపుల | ఇంద్రగంటి శ్రీకాంతశర్మ |
| 20. | వియోగాల వానకారు | ఇంద్రగంటి శ్రీకాంతశర్మ |
| 21. | గగనవీధి చూడరా! | పైడిపాటి సుబ్బరామశాస్త్రి |
| 22. | ఎంతచక్కని దోయి యీ తెనుగుతోట | కందుకూరి రామభద్రారావు |
| 23. | ఎన్నాళ్ల కెన్నాళ్లకు | కందుకూరి రామభద్రారావు |
| 24. | బంగారు నావపైన | జంధ్యాల ఉమామహేశ్వరరావు |
| 25 | చీకట్లో చిరుదివ్వెను | తిరునగరి |
| 26. | ఈశ్వరానంద సంధాయిని | లొల్లా శ్రీనివాస్ |
| 27. | హాసంత వాసంతినే | ఇ శ్రీలక్ష్మి |

| | | |
|---|---|---|
| 28. | మనిషి జీవమొకగాలి | వడ్డేపల్లి కృష్ణ |
| 29 | ఎగరాలీ! ఎగరాలీ జెండా | నిమ్మల అర్జున గౌడ్ |
| 30. | భరత మాత చరణాలకు | ఎం.నిత్యానందరావు |
| 31. | పాటలన్నిట మేటియేది? | జె.బాపురెడ్డి |
| 32. | కిలకిల నవ్వ్వందినేడు -మన భారతావని చూడు | డా.కూటికుప్పల సూర్యారావు |
| 33. | మధుమధుర గీతాలు వినిపించనా | పింగళిసీత |
| 34. | ఎదలొకటైతే ఎక్కడ వున్నా దూరం కాదంటాను | డా.సి నారాయణరెడ్డి |
| 35. | సతత హరిత వని | గాలి ప్రభావతి |
| 36. | నవ్వే పెదవుల | జోస్యుల నాగభూషణరావు |
| 37. | రేయి గడిచె | అబ్బూరి రామకృష్ణారావు |
| 38. | రావే సంధ్యాకామిని | అబ్బూరి రామకృష్ణారావు |
| 39. | తెలుగుజగతికీ తొలిపొద్దు | డా.సి.నారాయణరెడ్డి |
| 40. | వచ్చెనూ వాసంత లక్ష్మీ! | వడ్డేపల్లి కృష్ణ |
| 41. | లేత వెన్నెల నేత | కోపల్లె శివరాం |
| 42. | ఎగిసి ఎగిసి విను వీధుల | ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి |
| 43. | మరుమల్లె పూవు నీవె! | డా.దాశరథి |
| 44. | భగవంతుడు సృష్టించిన మనిషి | కరుణశ్రీ |
| 45. | పాడేవారుంటే పాటలకే కొదువా? | డా.బోయి భీమన్న |
| 46. | ఏపూవు పూచినా | వక్కలంక లక్ష్మీపతిరావు |
| 47. | జయ జయ వేదకాల | విశ్వనాథ సత్యనారాయణ |
| 48. | మలిగిన జ్ఞాపకాలలో | కె.కృష్ణమోహన్ |
| 49. | భారతాంబ మాతల్లి | వై.హరేరామమూర్తి |
| 50. | నాదేశం, నవ్వుతోంది నందనవనంలా | జె.బాపురెడ్డి |
| 51. | ఈ వసంతుని రాకతో | కందుకూరి రామభద్రారావు |
| 52. | భారత భాగ్య సరస్వతికిదే! | ఇంద్రగంటి శ్రీకాంతశర్మ |
| 53. | మనసే భద్రాద్రిరా! | ఏ.లక్ష్మీరమణ |
| 54. | మనసు లేని వాడవు! | వక్కలంక లక్ష్మీపతిరావు |
| 55. | కదలకుమా చెలీ! | రజని |

# అనుబంధం - II

సాలూరు రాజేశ్వరరావుతో ఇంటర్వ్యూ (సితార : 25.7.1993)

## మధురస్వర సాగరం డా.సాలూరు రాజేశ్వరరావు

ప్రశ్న : మీ గురువుగారెవరు? మీరు మొదట్లో పాడిన లలితగీతాల వివరాలు చెప్తారా?

జవాబు : మా గురువుగారు ద్వారం వెంకటస్వామి నాయుడుగారు. ఆయన వద్ద గాత్రం నేర్చుకున్నాను. విజయనగరం మహారాజా సంగీత కళాశాలలో వారప్పుడు ప్రిన్సిపాల్‌గా వుండేవారు.

1945లో నేను పాడిన కొన్ని లలితగీతాలు ఎల్.పి.రికార్డ్స్‌గా వచ్చాయి. వాటిలో ముఖ్యమైనవి-

1. కలగంటి కలగంటి తుమ్మెదా!... (రచన:సాలూరి సన్యాసిరాజు)
2. ఓ విభావరీ! ఓహో విభావరీ!... (రచన : రజని)
3. చల్లగాలిలో యమునా తటిపై... (రచన : రజని)
4. యాత్రికుడా! ఓ యాత్రికుడా.... (రచన:మల్లవరపు విశ్వేశ్వరరావు)

రావు బాలసరస్వతి చేత పాడించిన పాటలు కూడా వున్నాయి. వాటిలో

1. ఆ తోటలో ఒకటి ఆరాధనాలయం (రచన : శ్రీనివాస్)
2. పొదరింటిలో నుండి పొంచి చూచెదవేల?

అనే గీతాలు ఆనాడే ప్రజాదరణ పొందాయి. పై రెండుగీతాలు కొత్తవారు రాసినట్టివే! నేను అందరి రచనల్ని సమానంగా గౌరవించి గానయోగ్యంగా స్వరపరిచేవాడిని.

ప్రశ్న : సినిమా సంగీతం, లలిత సంగీతంలకు గల తేడాలేమిటో చెప్తారా?

జవాబు : లలిత సంగీతమంటే భావగీతాలకు లలితంగా బాణీలు కూర్చడం, సినిమా సంగీతమంటే సన్నివేశ పాత్రానుగుణంగా రకరకాల బాణీలు కూర్చడమని నా అభిప్రాయం!



# అనుబంధం - III

## డా. బాలాంత్రపు రజనీకాంతరావుగారితో ముఖాముఖి (12.7.1997)

ప్రశ్న . రచయితగానే గాక లలితసంగీత ప్రయోక్తగా మీరు లలితగీత విస్తార, ప్రసారాలకై ఎంతో కృషి చేశారు. ఆకాశవాణిలో ప్రసారమైన ప్రథమ గీతమేదో ఖచ్చితంగా చెప్పగలరా?

జవాబు : నేను 1.7.1942 నుండి నెలసరి జీతం మీద తాత్కాలికంగా, 8.5.1944 నుండి ప్రయోక్తగా శాశ్వత ప్రాతిపదిక మీద మద్రాస్ ఆకాశవాణి కేంద్రంలో పనిచేశాను. 16వ జూన్ 1938లో ఆకాశవాణి మద్రాస్ కేంద్రం ప్రారంభించబడింది. ప్రారంభించిన మొదటి వారంలోనే అప్పటి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అయిన ఆచంట జానకీరామ్‌గారు శ్రీయుతులు దేవులపల్లి కృష్ణశాస్త్రి, ఊటుకూరి సత్యనారాయణ, విశ్వనాథ సత్యనారాయణ, ముద్దుకృష్ణ, పిలకా గణపతిశాస్త్రి, వింజమూరి వెంకటలక్ష్మీనరసింహారావు గార్ల గీతాల ఆధారంగా 'అనార్కలి' అనే సంగీత రూపకాన్ని రూపొందించి ప్రసారం చేశారు. అందులో కృష్ణశాస్త్రి గారు సలీంగా నటించారు. కృష్ణశాస్త్రిగారు రచించిన

**రారమ్మ రారమ్మ మందారమా!**<br>
**రక్తకర వీరమా!**<br>
**మాలతీ మల్లికా మాధవీ కన్యకా శేఫాలికా!**

అనే గీతం ఆ రూపకం ఆరంభంలో ప్రసారమైంది. అదే ప్రసార లలితగీతాలలో ప్రథమమని చెప్పాలి.

ప్రశ్న : ఆ గీతాన్ని ఎవరు పాడారో చెప్పగలరా?

జవాబు : 'రిహార్సల్స్'లో కృష్ణశాస్త్రి మేనకోడళ్లు అయిన వింజమూరి సీత, అనసూయ గీతాలకు వరుసలు కూర్చినా, రికార్డింగ్ రోజు ఏ కారణం చేతనో రాలేకపోయారు. కావున ఆ పాటలు నాకు వచ్చి వుండడంతో పన్యాల రంగనాథరావు భార్య సరస్వతి మరియు వావిలకొలను లీలకు నేర్పి పాడించడం జరిగింది.

ప్రశ్న : తొలినాళ్లలో లలితగీతాల్ని పాడి ప్రచారంలోకి తెచ్చిన గాయనీ గాయకు లెవరో చెప్పగలరా?

జవాబు : ఆర్.బాలసరస్వతి, టంగుటూరి సూర్యకుమారి, సాలూరు రాజేశ్వరరావు గార్లను ప్రథములుగా చెప్పవచ్చు!

ప్రశ్న : సంగీతం, సాహిత్యం రెంటినీ సమంగా జీర్ణించుకున్న మీ దృష్టిలో లలిత సంగీతానికి - గీతానికి సరియైన నిర్వచనమేదో చెప్పండి!

జవాబు : స్వరవిన్యాసంతో సశాస్త్రీయంగా పాడేది శాస్త్రీయ సంగీతం, సాహిత్య ప్రధానంగా సరళంగా పాడగలిగేది లలిత సంగీతం!

తాళగతి తప్పకుండా తేలికగా రాగయుక్తంగా రసభరితంగా పాడుకోగల భావగీతం లలితగీతం!



# అనుబంధం - IV

## ఆరుద్రతో ఇంటర్వ్యూ (సితార: 30.5.1993)

## అంత్యప్రాసల ముద్ర ఆరుద్ర

ప్రశ్న : అసలు లలితగీతమంటే మీ అర్థమేమిటి? సినిమా గీతాలనన్నీ లలిత గీతాలుగా పేర్కొనవచ్చా?

జవాబు: ఇటు జానపద బాణీగాక, అటు శుద్ధ శాస్త్రీయ సంగీతమూ కాక సలక్షణంగా శ్రావ్యంగా వుండే గీతాల్ని లలితగీతాలనవచ్చు! 1940 దశకంలో బాలాంత్రపు రజనీకాంతరావు, మల్లిక్ మొదలైన వారు ఎన్నో లలితగీతాల్ని రేడియోలో ప్రసారం చేశారు.

సాలూరి రాజేశ్వరరావు, రావుబాలసరస్వతి కలిసి యిచ్చిన ప్రయివేట్ రికార్డులు అన్నీ లలితగీతాలే! సాలూరు ఆలపించిన

1. ఆ తోటలో ఒకటి ఆరాధనాలయం...
2. తుమ్మెదా ఒకసారి...
3. యాత్రికుడా!...

అన్న పాటలు లలితగీతాల్లో ప్రధానమైనవి.

అలాగే ఘంటసాల గారి 'బహుదూరపు బాటసారి' కూడ ఈ కోవలోకే వస్తుంది.

ప్రశ్న : అన్నమయ్య పదాలు కూడా లలితగీతాలే అంటారా?

జవాబు: కాదు. అన్నమయ్యవి ప్రజల భాషలో రచించిన 'సంకీర్తనలు' అనే చెప్పాలి! బసవరాజు రచించిన పాటల్ని లలితగీతాలని చెప్పాలి.



# ఉపయుక్త గ్రంథసూచిక


అప్పారావు గురజాడ : ముత్యాల సరాలు
(1972 యం.శేషాచలం సికింద్రాబాద్ అండ్ కో.)

అప్పారావు గురజాడ : గురజాడ రచనలు
(1984 విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్)

అప్పారావు, బసవరాజు : బసవరాజు అప్పారావు గీతాలు (1955)

అలివేలుమంగ, మల్లాది : గేయమురళి (1974 వసంతా పబ్లికేషన్స్)

ఆచార్య తిరుమల : గేయనందిని (1992)

ఆదిశేషువు, హరి : జానపదగేయ వాఙ్మయము - పరిచయము
(1954 నవ్య విజ్ఞాన ప్రచురణ)

ఆరుద్ర : ఆరుద్ర రచన (1985 విపుల కవితా సంకలనం)

ఆరుద్ర : ఆరుద్ర సినిమా పాటలు (1975 ఎమెస్కో)

ఆరుద్ర : గాయాలూ-గేయాలు (1975, ఆరుద్ర ప్రచురణలు)

కామేశ్వరరావు డి : కృష్ణశాస్త్రిగేయాలు-కవితా తత్త్వం
(1993 దామరాజు ప్రచురణలు)

కృష్ణ వడ్డెపల్లి : కనరా నీదేశం
(1971 యువ సాహితీ సమితి, సిరిసిల్ల)

కృష్ణ వడ్డెపల్లి : రాగరథం
(1981 త్యాగరాజ కళాపరిషత్, కరీంనగర్ ప్రచురణ)

కృష్ణ వడ్డెపల్లి : వడ్డెపల్లి గేయవల్లి (1995 కలహంసి ఆర్ట్స్ ప్రచురణ)

కృష్ణశాస్త్రి, దేవులపల్లి : కృష్ణపక్షం (1975 స్వర్ణోత్సవ సంచిక)

కృష్ణశాస్త్రి, దేవులపల్లి : అమృత వీణ (1975 స్వర్ణోత్సవ సంచిక)

కృష్ణశాస్త్రి, దేవులపల్లి : మంగళ కాహళి (1975 స్వర్ణోత్సవ సంచిక)

గోపాలరావు చౌడూరి : మల్లి పాటలు (1969)

చలపతిరావు పి.వి. : సులభవ్యాకరణము (తిరుమల పబ్లికేషన్స్)

చిరంజీవి నార్ల : తెలుగుపూలు

చెన్నకేశవ రెడ్డి జి : ఆధునికాంధ్ర గేయకవిత్వం
(1988 జయమిత్ర పబ్లికేషన్స్)

జగన్నాథరావు మంచాళ : ఆధునిక సంగీతము (1962)

దాశరథి : రుద్రవీణ (1950. శ్రీరామా అండ్ కో తెనాలి)

దాశరథి : నవమంజరి
(1959 దాచేపల్లి కిష్టయ్య అండ్ సన్స్ - ప్రచురణ)

దాశరథి : దాశరథి కవితా సమాలోచన (1988 ఎలవర్తి ప్రచురణ)

నారాయణరావు, కాళోజి : నా గొడవ (1967 మిత్రమండలి హనుమకొండ)

నారాయణరెడ్డి. సి. : జలపాతం (1953 అరుణ గ్రంథమాల)

నారాయణరెడ్డి. సి. : నారాయణరెడ్డి గేయాలు
(1955 కొండా శంకరయ్య, సికింద్రాబాద్)

నారాయణరెడ్డి. సి. : ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు (1967)

నారాయణరెడ్డి. సి. : పగలే వెన్నెల (1976 యువభారతి ప్రచురణ)

నారాయణరెడ్డి. సి. : పాటలో ఏముంది? నా మాటలో ఏముంది?
(1996 మౌక్తిక ప్రచురణలు)

నారాయణాచార్యులు, పుట్టపర్తి : శివతాండవం (1961)

నారాయణాచార్యులు, పుట్టపర్తి : కావ్యద్వయి (1972 విస్డమ్ ఎడ్యుకేషనల్ బ్యూరో కడప ప్రచురణ)

నిర్మలాదేవి, ఎన్. : కృష్ణశాస్త్రి సాహిత్యావలోకనము
(1991 సుధాంశు ప్రచురణ)

పాపయ్యశాస్త్రి, జంధ్యాల: అరుణ కిరణాలు (రామాపబ్లిషర్స్, విజయవాడ)
(కరుణశ్రీ)

పాపయ్యశాస్త్రి, జంధ్యాల: విజయశ్రీ (1961 కరుణశ్రీ కావ్యమాల గుంటూరు)
(కరుణశ్రీ)

పద్మినీ దేవి. ఎం. : పారిజాతాలు (1988 స్వరసుధ)

పద్మినీ దేవి. ఎం. : స్పందన (1993)

ప్రసాద్, ఏటుకూరి . ఎర్రబాట (1975 ఆం.ప్ర. యువజన సమాఖ్య)

పార్వతీశం, వోలేటి : ఊహనుంచి ఊపిరికి (1997 నాగభైరవ పబ్లికేషన్స్)

పైడిపాల : తెలుగు సినిమాపాట (1992 స్నేహ ప్రచురణ)

బాపిరాజు అడవి : అడవి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం I

బాపిరాజు అడవి : అడవి బాపిరాజు సమగ్ర కవితా సంకలనం II (శత జయంతి ప్రచురణ)

బాపురెడ్డి, జె. : బాపురెడ్డి గేయాలు (1968 సుఖేలా ప్రచురణ)

బాపురెడ్డి, జె. : శ్రీకార శిఖరం (1985 రసమయి ప్రచురణ, హైదరాబాద్)

బాపురెడ్డి, జె. : ప్రేమారామం (1986 చేతన గుంటూరుప్రచురణ)

బాపురెడ్డి, జె. : నాదేశం నవ్వుతూంది (1986 చేతన గుంటూరుప్రచురణ)

భీమన్న,బోయి : రాభీలు (1971 సన్మానసంఘం హై.బా.ప్రచురణ)

మాధవరావు, కొరుప్రోలు : రాగధార (1993 సాధన ప్రచురణ)

మలయశ్రీ : రాగవల్లరి (1991 విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల)

రజనీకాంతరావు, బాలాంత్రపు : శతపత్ర సుందరి (1954 వావిళ్ల ప్రచురణ)

రాఘవమ్మ, జొన్నవాడ : రాధికాగీతాలు (1972 ప్రభావతీ పబ్లికేషన్స్ హై.బా.)

రాజేశ్వరరావు, గిడుగు : రాగవీచికలు (1992 స్నేహలతా ప్రచురణలు)

రామకృష్ణారావు అబ్బూరి : ఊహాగానము ఇతర కృతులు (1975)

రామకృష్ణారావు, వై. : రాగధుని (1985 వేదిక ప్రచురణ)

రామభద్రరావు,కందుకూరి : గేయమంజరి (1986)

రామరాజు, బి. : తెలుగు జానపదగేయ సాహిత్యము (1958 ఆంధ్ర రచయితల సంఘం)

రామస్వామి చౌదరి, త్రిపురనేని : సూతాశ్రమగీతాలు

రామిరెడ్డి దువ్వూరి : కవికోకిల గ్రంథావళి (1956 కవి కోకిల గ్రంథమాల నెల్లూరు)

రాము, ఎం.కె. : గీతారామం (1972 రసమయి)

రాము, ఎం.కె. : హృదయరాగం (1980 హిమబిందు)

లక్ష్మీనారాయణాచార్య శేషం : స్వరభారతి (1995)

లక్ష్మీపతిరావు, వక్కలంక : సుమాంజలి

లక్ష్మీపతిరావు, వక్కలంక : కవితాలోకము

విశ్వనాథం, పాలగుమ్మి : పాలగుమ్మి పాటలు (1991 నాదవినోదిని)

విశ్వసుందరమ్మ, తల్లా ప్రగడ. . కవితా కదంబము

విశ్వేశ్వరరావు, మల్లవరపు: మధుకీల (1937 నవ్యసాహిత్య పరిషత్తు రాజమండ్రి)

వెంకటరత్నం, కొనకళ్ల. : బంగారి మామ పాటలు (1980 జయంతి పబ్లికేషన్స్)

వేంకటసీతాపతి గిడుగు : తెలుగులో ఛందోరీతులు
(1961 విశాలాంధ్ర పబ్లికేషన్స్)

వేంకటరావు కవికొండల · కవి కొండల గేయాలు
(1960 కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ రాజమండ్రి)

శశాంక, వి. : నయాజమానా (1954 కళాకేళి ప్రచురణ)

శశాంక, వి. : స్వరలహరి
(1971 ఆం.ప్ర. సాహిత్య అకాడమీ- ప్రచురణ)

శారదా అశోకవర్ధన్ : భావరాగిణి (1980 వంశీఆర్ట్స్)

శివరామారావు,వింజమూరి: కల్పవల్లి

శ్రీకాంతశర్మ, ఇంద్రగంటి· పొగడపూలు (1986 నవోదయ పబ్లిషర్స్)

శ్రీశ్రీ
(శ్రీరంగం శ్రీనివాసరావు): మహాప్రస్థానం (1950 విశాలాంధ్ర ప్రచురణ)

శ్రీనివాసాచార్య, తిరుమల. గంగా తరంగాలు (1992 యువభారతి)

శ్రీనివాసాచార్య, తిరుమల: తెలుగులో గేయనాటికలు (1988 యువభారతి)

సత్యనారాయణ, విశ్వనాథ· కిన్నెరసాని పాటలు-కోకిలమ్మ పెండ్లి
(1980 వి యస్.ఎన్.అండ్ కో.)

సత్యనారాయణ, గరిమెళ్ల : స్వరాజ్య గీతములు

సత్యనారాయణ, యస్వీ : తెలుగులో ఉద్యమ గీతాలు
(1991 విశాలాంధ్ర ప్రచురణ)

సంపత్కుమారాచార్య కోవెల: తెలుగు ఛందోవికాసము
(1962 కులపతి సమితి, వరంగల్లు)

సంపత్కుమారాచార్య కోవెల: ఛందః పదకోశము
సుబ్బరామశాస్త్రి, పైడిపాటి : జాతీయ భారతి - జయభారతి (1957)
సుబ్బారావు నండూరి : యెంకి పాటలు (1953 ఉదయభాస్కర పబ్లిషర్స్)
సుబ్బారావు రాయప్రోలు : ఆంధ్రావళి (నవ్యసాహిత్య పరిషత్తు)
సోమసుందర్ ఆవంత్స : వెన్నెలలో కోనసీమ (1977 కళాకేళి ప్రచురణ)
హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి : మధువని
హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి : పాటల మంజరి
హనుమంతు సుద్దాల : సుద్దాల హనుమంతు పాటలు (1983 సాహితీ సర్కిల్, హైదారాబాదు)
హరేరామమూర్తి,వై : స్వరలహరి (1983)

## సంచికలు / సంకలన గ్రంథాలు

జననాట్యమండలి పాటలు (1979 క్రాంతి ప్రచురణ)
ప్రతిధ్వని (1982 ప్రజానాట్య మండలి)
మహతి (1972 యువభారతి)
వైతాళికులు (1935 ముద్దుకృష్ణ సంకలనం)
నవీన కావ్యమంజరి (1959 ముద్దుకృష్ణ సంకలనం)
స్వేచ్ఛా పథం (1961 విశాలాంధ్ర ప్రచురణ)
జాతీయ గీతాలు (గురజాడ రాఘవశర్మ సంకలనం)
జాతీయ గేయాలు (మిక్కిలినేని భగవంతరావు సంకలనం)
ఆంధ్రజాతీయ గీతాలు (ప్రజాశక్తి ప్రచురణ)
ఆంధ్రజ్వాల (జంపన చంద్రశేఖరరావు)
నవగీతాలు (జాస్తి వెంకట నర్సయ్య)
జయగీతి (సుంకర సత్యనారాయణ)
విజయాంధ్ర గీతాలు (దామరాజు పుండరీకాక్షుడు)
గేయాంజలి (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌరసంబంధ శాఖ)

సమైక్యభారతి (ఆంధ్రప్రదేశ్ సమాచారశాఖ)

గేయమాల (1980 అభ్యుదయ ప్రాథమిక విద్యాసంస్థ)

సితార (25.7.1993, 30.5.1993)

త్రివేణి (ఆంధ్రప్రదేశ్ జానపద గేయాలు)

ఆంధ్ర భారతి (శా.శ.1831)

భారతి (ఫిబ్రవరి 1963)

Golden Jubilee Souvenir, A.I.R. Madras (1938-1988)

ఆంధ్ర జ్యోతి దినపత్రిక (10.10.1987)

మాతృభూమి (8.5.1949)

ఈనాడు (వసుంధర 24.8.1993)

## సంస్కృతం :

అమరసింహుడు : అమరకోశము (1924 వావిళ్ల ప్రచురణ)

అమరసింహుడు : గురుబాల ప్రబోధిక (1962 వావిళ్ల ప్రచురణ)

## ఆంగ్లము :

Bowra C.M. : 1963 Primitive song, A Mentor Book (Published by the New American Library)

Nationalism - Its meaning and history (1965) Hanskohn Oxford Dictionary

Prabhakar Padhe : What is Rhythm (Essay) Indian Response to Poetry in English (Macmillan & Co 1970 Ed.)

